

# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి : 34 సంచిక : 3 మే-జూన్ 201

వెల : రు 20 (286) పేజీలు : 100

కామ్రేడ్ ఆర్.ఎస్.రావుకు
అరుణారుణ జోహార్లు!

## ప్రజాకళాకారులు జీతన్ మరాండీ,
## అనిల్ రామ్, ఛత్రపతి మండల్, మనోజ్ రాజ్వార్‌లకు
## విధించిన ఉరిశిక్షలు వెంటనే రద్దుచేయాలి!

కామ్రేడ్ మాధవస్వామికి
అరుణారుణ జోహార్లు!



KLVA10IM154







286 సంపుటి : 35 ◆ సంచిక : 3 ◆ మే-జూన్, 2011


సంపాదకుడు
**చలసాని ప్రసాద్**

❖ ❖ ❖

వర్కింగ్ ఎడిటర్
**డి.వి. రామకృష్ణా రావు**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500040
* **కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా**
రచనలు పై చిరునామాకూ,
* **ఇ-మెయిల్ ద్వారా**
arunatara1977@gmail.com
కూ రచనలు పంపవచ్చు

❖ ❖ ❖

**కొరియర్, రిజిస్టర్డ్ పోస్ట్ ల ద్వారా**
రచనలు పంపితే...
**టి. కృష్ణాబాయి**
9-19-3, సి.బి.ఎం. కాంపౌండ్
విశాఖపట్నం - 530 003

❖ ❖ ❖

**చందాలు పంపాల్సిన చిరునామ**
**మేనేజర్**
**ఎస్. రవికుమార్**
5-1307, దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360
సెల్ : 9866021257

❖ ❖ ❖

**విరసం కార్యదర్శి చిరునామా**
**పాణి**
50-348, L 19 B II,
అరోరా నగర్, బి క్యాంప్, కర్నూల్ - 2


ఈ సంచిక వెల : రు.20

## సంపాదక లేఖ...

కామ్రేడ్ ఆర్.ఎస్. రావు (రేగులగడ్డ సోమేశ్వరరావు) 17 జూన్, 2011న ఉదయం ఢిల్లీలో అనారోగ్యంతో చికిత్స పొందుతూ చనిపోయారు. తెలుగు నేల ఒక అరుదైన మార్క్సిస్టు మేధావిని కోల్పోయింది. నక్సల్బరీ ప్రేరణతో మార్క్సిస్టుగా, ఆ క్రమంలో మార్క్సిస్టు - లెనినిస్టుగా, మావోయిస్టు ఆలోచనాపరుడిగా ఆయన ప్రస్థానం కొనసాగింది. విరసం, విప్లవోద్యమం ఆయనపై పెట్టిన బాధ్యతను ఎప్పుడూ ఉత్సాహంగా తీసుకోవడమే కాదు, చాలా నిబద్ధతతో ఆ బాధ్యతను నిర్వహించేవారు. పరిశీలన, అధ్యయనం, చర్చ ఆయన జీవించినంతకాలం కొనసాగించారు. ఎవరినీ, దేనినీ విమర్శ లేకుండా అంగీకరించలేదు. 'ప్రతిదీ ప్రశ్నించు' అన్న మార్క్సిస్టు మౌలిక సూత్రాన్ని అక్షరాల ఇముడ్చుకున్నారు. మార్క్సిస్టు సంవిధానాన్ని చాలా లోతుగా అధ్యయనం చేసి ఆకళింపు చేసుకున్నారు. విప్లవోద్యమం భారతదేశ సమాజ స్వభావాన్ని అర్ధవలస, అర్ధభూస్వామ్యంగా విశ్లేషించుకొని నూతన ప్రజాస్వామిక విప్లవం కోసం ప్రణాళిక రూపొందించుకుంటే, ఆ చట్రాన్ని బలోపేతం చేస్తూ తన రచనలని, ఆలోచనలని, విశ్లేషణలని అందించారు. భారత సమాజ స్వభావాన్ని అర్థం చేసుకోవడానికి అనేక మౌలికమైన ప్రశ్నలు సంధించారు. తనదైన పద్ధతిలో జవాబులు వెతికారు. గ్రామాలని అధ్యయనం చేయమని, ప్రజల నుంచి జ్ఞానాన్ని గ్రహించమని, మార్పు ఎలా జరుగుతుందో పరిశీలించమని, తత్వశాస్త్రం, చరిత్ర, సాహిత్యాలు చదవమని, చర్చించమని ఆయన యువతరానికి ఎప్పుడూ సూచించేవారు. ఆయన రచనలను, ఆయన అందించిన అవగాహనలను అధ్యయనం చేయాల్సిన అవసరం తెలుగు నేలకు ఉంది.

ఇదే కాలంలో తెలుగు నేల కామ్రేడ్ మాధవస్వామి, కా. పత్తిపాటి వెంకటేశ్వర్లు, కా. కిట్టూ, ప్రొ. జయశంకర్ వంటి నిబద్ధత కలిగిన సామాజిక కార్యకర్తలనూ, నాయకులనూ కోల్పోయింది. ప్రముఖ నాట్యాచార్యులు నటరాజ రామకృష్ణ ఇదే కాలంలో కన్ను మూసారు. హిందూ మతోన్మాదశక్తులు దేశం నుంచి తరిమేస్తే ఎం.ఎఫ్. హుస్సేన్ ప్రవాసంలోనే తుదిశ్వాస విడిచారు. ఆయన శవాన్ని కూడా ఈ నేలకు తీసుకురానివ్వలేదు.

ఇక రాష్ట్రంలోనూ, దేశంలోనూ దళారీ, భూస్వామ్య, బూర్జువా పాలక వర్గాలు దేశ వనరులను, ఖనిజ సంపదలను సామ్రాజ్యవాదులకు అప్పజెప్పే క్రమంలో విస్థాపనకు, విధ్వంసానికి గురవుతున్న ప్రజలు ముఖ్యంగా ఆదివాసీలు, దళితులు, మహిళలు, ముస్లిం మైనారిటీలు జీవన్మరణ పోరాటాలు చేస్తున్నారు. అలాంటి పీడిత ప్రజల ఆకాంక్షలకు తమ ఆటను, పాటను జోడించి పనిచేస్తున్న ప్రజాకళాకారులైన జీతన్ మరాండీ, అనీల్ రాం, మనోజ్ రాజ్వర్, ఛత్రపతి మండల్ అనే ఆదివాసీ, దళిత కళాకారులకు ఝార్ఖండ్‌లోని గిరిది సెషన్స్ కోర్టు ఉరిశిక్షలు విధించింది. ఇదీ నడుస్తున్న చరిత్ర. ఈ దుర్మార్గాలకు, అణచివేతలకు వ్యతిరేకంగా మనమంతా సంఘటితంగా పెద్ద ఎత్తున ఉద్యమిద్దాం. బతుకు కోసం, స్వేచ్ఛ కోసం, దేశ విముక్తి కోసం పాటలు పాడుతున్న కళాకారులకు ఉరిశిక్షలు విధించడం ఈ దేశ పాలకుల రాజకీయ దివాళకోరుతనానికి నిదర్శనం. ఈ నలుగురు కళాకారులకు ఉరిశిక్షలు రద్దయ్యేదాకా మనమంతా పోరాడుదాం.



## ఈ సంచికలో...


సంస్మరణలు (5-22)
అమరులు ఆర్. ఎస్. రావు - సీతన్న - **వి. వి.**; మాధవస్వామి... మనమూ - **పాణి**; ప్రొ॥ జయశంకర్ - **సి. కాశీం**; ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు హక్కుల ఉద్యమ నిర్మాణంలో తొలిచాలు పెట్టినవాడు - **వరవరరావు**; కవి, గాయకుడు, విప్లవవాది కా॥ కిట్టుకు నివాళి - **పి. రాంమోహన్**; కాలం గీసిన చిత్రం.... ఎం. ఎఫ్. హుస్సేన్ - **పి. మోహన్**; పాశవిక చట్టం యు.ఎ.పి.ఎ. 2008 బలైన మొదటి ఖైదీ స్వపన్‌దాస్ గుప్తాకు విప్లవజోహార్లు! - **కె. నాగేశ్వరాచారి**

విజ్ఞప్తి (23-25)
బిర్సాముండా కేంద్రకారాగారం, రాంచీ నుంచి సాంస్కృతిక కళాకారుడు జీతన్ మరాండీ విజ్ఞప్తి!

వ్యాసం (25-39)
రాజ్యం ఆ 'సంథాలీ సిరింగ్' గొంతు నులమకుండా ఆపాల్సింది మనమే - **అమృత**; సామాజిక మార్పు - వర్గం, ఒక విశ్లేషణ - **ఆర్. ఎస్. రావు**; సామ్రాజ్యవాదం - అస్తిత్వాలు - **ఆర్. ఎస్. రావు**; పాణి వ్యాసాలు ఒక విమర్శ గాలి పటం - **ఆర్.ఎస్. రావు**

రిపోర్టు (40-45)
అస్తిత్వాలు - మార్క్సిజం సాహిత్య పాఠశాల రిపోర్టు

పుస్తక పరిచయం (46-50)
పడుపు కత్తెల వేదనపై కురిసిన కన్నీటి ధార అలెక్సాండ్ర్ కుప్రీన్ నవల 'యమకూపం' - **ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు**

పాట/కవిత్వం (51-70)
ఉద్యమమే నా ఊపిరన్న తెలంగాణ - **తంగెళ్ల సుదర్శనం**; స్వప్నాలు పంచినవాడు, కన్నీరుతో కవిత తడిసింది - **శశిధర్ రెండు కవితలు** ; ఉజ్వల భవిష్యత్ - **సితార**; ఆజాద్‌ను వెతుకుతుంటా! - **కబీర్ సుమన్**; వేచి చూస్తుంది కాలం - **అరసవిల్లి కృష్ణ**; వీరుడా! నీ మరణం!, ప్రజలు అజేయులు, బినాయక్ సేన్ కోసం - **సంపత్ మూడు కవితలు**; నెత్తుటి కాసారంలో నల్ల కలువ - **నెల్లిమర్ల శ్రీనివాస్**; శిలాక్షరాలు - **ముకుందాపురం పెద్దన**; ప్రకటన - **పెద్ది కృష్ణ**; సంఘర్షణే సారాంశం - **ఎం. రాఘవాచారి**; ఆమెతో ఉన్నప్పుడు - **దానక్క ఉదయ భాను**; అమ్మా గులాబీ జరభద్రం! - **చిత్తలూరి సత్యనారాయణ**; అస్తిత్వం....!? - శిఖా - **ఆకాష్**; మీ సిగ్గులేని తనాన్నీ... - **సి.ఎచ్. శిరోమణి బాబు**; గొల్లభామ - **పిన్నిక శ్రీనివాస్**; కరెంటు చీకటి - **ఏటూరి నాగేంద్రరావు**; ఉద్యమ కోడి - **ఎం. తిరుపతయ్య**; తెలంగాణ చంద్రుడు ఉదయించక మానడు - **నాగేశ్వర్**; శ్రామికులకే నాయకత్వం - **ఎస్. ఎస్. ఆర్**; మనిషిగా.... - **గిన్నె రాజు**; యుద్ధ మేఘం - **వి. వెంకటేష్**; తెలంగాణ రతనమయ్యే దినం - **ఎస్. చంద్రయ్య**; ఆవలికి పోదాం - **పాణి**; పాగల్ షాయర్ - పగ్లాపన్ - **మహమూద్**; నాలుగు పిట్టలు - **మహమూద్**; ఆలాపన - **ఎన్.డి.**; గంజాయి వనంలో తులసి మొక్క - **కొకొండ**; శ్యామల; నేటికీ మానని గాయమై - **బల్ల రవింద్రనాథ్**;

కథ (71-76)
దలాల్ స్ట్రీట్ - **పి. చిన్నయ్య**

ఒక అనుభవం (77-78)
నాకు "బుద్ధి" నేర్పుతారా! - **గురూజీల టీం**

అనువాదం (79-83)
గతితార్కిక భౌతికవాదం - **ఐరా గొలోబిన్**

దండకారణ్య డైరీ (84-88)
గ్రీన్‌హంట్ ఉత్పాతాలు - **సాధన**

కరపత్రాలు (89-93)
ముప్పై వసంతాల దండకారణ్య ఉద్యమానికి విప్లవ జేజేలు! - **విప్లవ రచయితల సంఘం**; యురేనియం - **ప్రజా సంఘాలు**

నవల సీరియల్ (94-98)
గుమ్మెటమోత (12) - **పాణి**



చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి. డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.

విడి సంచిక వెల : రు. 10

సంవత్సర చందా : రు. 100

జీవితచందా : రు. 1000


**కవర్‌పేజీ : కామ్రేడ్ ఆర్.ఎస్.రావు, కామ్రేడ్ మాధవస్వామి**

ఫొటోలు : కావలి, కర్నూలు విరసం యూనిట్లు, కె.వి. కూర్మనాథ్, గూగుల్ నెట్.

సంస్మరణ



# అమరులు ఆర్. ఎస్. రావు - సీతన్న

- వి. వి.

'సీతన్న ఆచూకీ కూడా ప్రభుత్వంతో చెప్పించలేక పోయామండీ' అన్నారు ఆర్.ఎస్.రావు గారిని ఒడిశా నుంచి తిరిగి రాగానే కలిసినపుడు. మనిషి పూర్తిగా డస్సి పోయి ఉన్నారు. ఇన్‌హేలర్‌తో శ్వాస తీసుకుంటున్నారు. ఆయాసపడుతున్నారు. ఎక్కువ మాట్లాడలేకపోతున్నారు. భారతిగారు, విజయ్ మళ్లీ ఆసుపత్రిలో చేర్చే ప్రయత్నాల్లో ఉన్నారు. వాళ్ల కళ్లు ఆయన విశ్రాంతిని కోరుతున్నాయి. మేమూ కేవలం పరామర్శించి పలకరించిపోదామని నిలబడే ఉన్నాం. ఆయన ఎప్పటి వలె ముకుళిత హస్తాలతో ఎదురొస్తూ అన్న మాటలివి. ఆయనకు చాలా మాట్లాడాలని ఉంది. సీతన్నల పట్ల అపరాధ భావంతో మాట్లాడాలని ఉంది.

"వినీల్‌కృష్ణ తల్లి దండ్రులు వచ్చిపోయారు. మేమేదో ఆయనకు ప్రాణభిక్ష పెట్టామన్నంత కృతజ్ఞతాభావంతో అదే పనిగా ధన్యవాదాలు చెప్పిపోయారు. వాళ్ల మొహాల వెనుక నాకు పరిచయం లేని సీతన్న భార్య నీడలా తారాడుతూ కనిపిస్తుంటే ఇబ్బంది పడిపోయాను."

"నా భర్తను తీసుకొచ్చారా? ఆయనకేమవుతోందో తెలుసు కున్నారా? ఎక్కడున్నాడట? బతికే ఉన్నాడా? ఎప్పుడు వదులుతారట? ఇంకా చంపెయ్యలేదంటారా? ఏం చేసారు?" ఇన్ని ప్రశ్నలు నేను ఊహించుకున్నవే కానీ, ఆమె ఏ ప్రశ్నా వేయలేదు. వేయదు. అట్లా మొహంలోకి ఏ భావం లేకుండా చూస్తుంది. చదువుకున్న వాళ్లకు, మాట్లాడేవాళ్లకు అదే ఎక్కువ ఇబ్బంది. ఆదివాసులు వాళ్లతో మాట్లాడరు. అట్లా మొహాల్లోకి చూస్తూ ఉంటారు. బోనులో నిలబడ్డ అపరాధిని చూసినట్లుగా.

ఆర్.ఎస్.రావు గారు సీతన్నవంటి ఆదివాసుల వైపు నుంచి ప్రపంచాన్ని చూసినవాడు. గురజాడ అప్పారావుగారి 'మధురవాణి' వైపు నుంచి ప్రపంచాన్ని చూడడం ప్రారంభించినవాడు. 'పోగొట్టుకోవడానికి సంకెళ్లు తప్ప ఏమీలేని కార్మికుని' వైపు నుంచి ప్రపంచాన్ని మార్చడం నేర్చుకున్నవాడు. ఆ ప్రాపంచిక దృక్పథాన్ని నలభై ఏళ్లు ప్రపంచానికి పంచినవాడు.

ఇంతకూ ఆర్.ఎస్.రావుకు సీతన్నకు ఏమిటి సంబంధం? ఎవరీ సీతన్న? ఏమిటా కథ?

ఒడిశాలోని మల్కన్‌గిరి జిల్లా చిత్రకొండ దగ్గర కలెక్టర్ వినీల్ కృష్ణను కిడ్నాప్ చేసిన మావోయిస్టు పార్టీ దళం - వెంటనే పెట్టిన డిమాండులలో - బార్డర్ సెక్యూరిటీ ఫోర్స్ నవంబరు 22, 2010న కిడ్నాప్ చేసిన సీతన్న ఆచూకి చెప్పాలన్నది ఒకటి - ప్రముఖమైనది. అతడు నారాయణపట్నానికి చెందిన ఆదివాసీ. నారాయణపట్నంలో ఆదివాసులు స్వాధీనం చేసుకున్న 2,500 ఎకరాల భూమిపై ఒడిశా ప్రభుత్వ 1956 భూక్రమబద్ధీకరణ చట్టం కింద ఆదివాసులకు పట్టాలివ్వాలని డిమాండు చేస్తూ ప్రదర్శనల్లో పాల్గొన్నవాడు. చేస్ముూలియా సంఘంలో ఆయన పనిచేసాడు. కనుక ప్రభుత్వం దృష్టిలో అతడు మావోయిస్టు.

కిడ్నాప్ చేయగానే మధ్య వర్తిత్వం కోసం దళం సూచించిన పెద్ద మనుషుల్లో ఆర్.ఎస్.రావుగారున్నారు. హైదరాబాదులో టెలిస్క్రోల్స్‌లో ఆ పేరు చూసిన నాబోటి వారికది ఆశ్చర్యమేకాని ఒడిశా అడవుల్లో ఆదివాసులకు, విప్లవకారులకు అది ఎంతో గౌరవనీయమైన పేరు. 1974 నుంచి 94 దాకా ఇరవయి ఏళ్లకు పైగా ఆయన సంబల్‌పూర్ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేస్తూ ఆదివాసుల మధ్యన గడిపాడు. వాళ్ల జీవితాలు, పోరాటాలు పంచుకున్నాడు. సంబల్‌పూర్ వదిలిన తర్వాత కూడా గత పద్నాలుగు సంవత్సరాలుగా మౌలికంగా ఆ సమస్యలపైననే కేంద్రీకరించి ఆలోచించాడు. రాసాడు. పనిచేసాడు. ప్రచారం చేసాడు. ఢిల్లీ గంగారామ్ ఆసుపత్రిలో అన్ని అవయవాలు శిథిలమై మేధస్సు ఒక్కటే చురుకుగా పనిచేస్తున్నదని మాకు అర్థమవుతున్న సమయంలో ఆయన కళ్లలో వెలుగు - సీతన్నల భవిష్యత్తును పంచుకునే - రాజీలేని పోరాటమొకటి విప్లవోద్యమం చేస్తున్నదనే ఆశతోనే.

'మావోయిస్టు పార్టీ ఆశించిన రాజకీయ ప్రచారం మధ్యవర్తుల ద్వారా జరిగిందని, ఎబిబి భాస్కర్ 'వీక్షణం'లో రాసిన వ్యాసంలో సంతృప్తి ప్రకటించాడని చెప్పినప్పుడు అద్దాలు తెప్పించుకొని చూసి తనదయిన ఒక చిరునవ్వును పెదవులపై నిలుపుకున్నాడు.

మరి మాకు ఆయన పేరు స్క్రోల్‌లో చూసి ఆశ్చర్యమెందుకు? అప్పటికి మూడు రోజుల ముందే అపోలో ఆసుపత్రి ఇంటెన్సివ్ కేర్ యూనిట్ నుండి డిస్చార్జ్ అయివచ్చాడు గనుక. పాపం వాళ్లకు తెలియదు కదా అనుకున్నాం. ఆయనేం పోతాడులే అనుకున్నాం. అందుకే స్క్రోల్ చూసి నా వరకు నేను ఆయనేం పోతాడులే అని ఊరుకున్నాను. పైగా మధ్యవర్తిత్వాలు కూడ ఆయన స్వభావానికి విరుద్ధం. ఆయన ప్రభుత్వాలనే కాదు, రాజ్యాన్ని కూడా పాలకవర్గాల చేతుల్లో అణచివేసే సాధనాలుగానే చూస్తాడు. చలంకు ఎస్టాబ్లిష్‌మెంట్ మీద ఉన్నంత అపనమ్మకం ఆయనకు అన్ని రకాల నిర్మాణాల మీద. హీరాకుడ్ డ్యాం మాత్రమే కాదు, అన్ని భారీ నిర్మాణాలు ప్రజల్ని ముంచడానికే అనేది ఆయన గతితార్కిక చారిత్రక భౌతిక వాద 'మూఢ' విశ్వాసం.

అందుకనే మర్నాడు మధ్యాహ్నం చాలా నింపాదిగా కేవలం ఆరోగ్య పరామర్శ కోసం ఫోన్ చేసాను. పెట్టేసే ముందు "స్క్రోల్‌లో మీ పేరు వస్తున్నది. పోతున్నారా?" అన్నాను! "వెళ్లాలి గదా - పార్టీ పెట్టిన బాధ్యత" అన్నారు. ఆశ్చర్యపోయాను. ఆయనకు విప్లవోద్యమం మీదనే కాదు, విప్లవ నిర్మాణాల పట్ల కూడా అంత గౌరవం. అవి స్ట్రక్చర్స్‌గా (వ్యవస్థలందామా?) మారకుండా చూసే అన్న సన్నటి విభజన రేఖల పట్ల విమర్శనాత్మక జాగ్రత్త. 1990లో మళ్లీ సృజనను హైదరాబాదు నుంచి ప్రారంభించాలనే ప్రయత్నంలో ఒక ట్రస్ట్ ఏర్పాటు చేయాలనే ప్రతిపాదన వస్తే 'సృజన వంటి పత్రికలకు జంఝూటాలు వద్దవండి' అన్నారు. ఆ ప్రయత్నాలు ప్రారంభించనే లేదు. కష్టంగా సృజన రెండేళ్లు ఎండాకాలం నదిలా ప్రవహించి 1992లో 200వ సంచిక ప్రచురించానని అనిపించుకొని ఆగిపోయింది.

ఆర్.ఎస్.రావు గారితో నా పరిచయం సృజన ద్వారానే. పరోక్షంగా ఆయనకు 66-68 నుంచే. ప్రత్యక్షంగా పరస్పరం 1978-80లలో 'జగిత్యాల జైత్రయాత్ర'తో పులకించి పోయినట్లున్నారు - ఏమనుకున్నాడో, ఏమయ్యేదో - కాకతీయ యూనివర్సిటీ ఎకనమిక్స్ డిపార్ట్‌మెంట్‌లో ఇంటర్వ్యూకి వచ్చి హనుమకొండ కుమార్ పల్లిలో మేమున్టున్న ఇంటికి వచ్చాడు. 'సృజన వర్క్ షాప్ చూడాలని వచ్చానండి' అన్నాడు. రాడికల్ విద్యార్థి సంఘం తొలి ఉపాధ్యక్షుడు, విరసం క్రియాశీల సభ్యుడు, '72 జై తెలంగాణ, జై ఆంధ్రా ఉద్యమ విద్యార్థి నాయకుడు, 75-77 ఎమర్జెన్సీలో విశాఖ జైలు నుంచి సంకెళ్లతో ఎకనమిక్స్ ఎం.ఎ. రాసి ఫస్ట్‌క్లాస్ తెచ్చుకొని ఢిల్లీ యూనివర్సిటీలో ఎకనమిక్స్ లెక్చరర్ అయిన సి.వి. సుబ్బారావు (సురా) ఏది చెప్పినా పురాణ గాథల వలె, వీర గాథల వలెనే చెప్పేవాడు. ప్రతి ఎండాకాలం సెలవులు సంబల్‌పూర్ మీదుగా హనుమకొండకు వచ్చి అక్కడ కొన్ని, ఇక్కడ కొన్ని నిద్రలేని చర్చల, పనుల రాత్రిళ్లు గడిపి మాకొక ఆర్.ఎస్.రావు 'విడుదల కాబోయే అపురూప చిత్రాన్ని' కూడ చూపి ఉన్నాడు. కనుక సృజనకు ఆయన ఎదురొచ్చిన, వెతుకపోయిన తీగ. 'ఇంటర్వ్యూ ఏమయింది?' అన్నాను. 'అది నిమిత్త మాత్రం - జగిత్యాల జైత్రయాత్ర సూదంటు రాయి వలె ఆకర్షించింది. సృజన కార్యంలో నిమగ్నమయ్యే సృజన సాహితీ మిత్రులను చూడొచ్చుగా అనుకున్నాను. ఇది కూడా విద్యారణ్యపురమే కదా - అడవిని గెలిచే చదువులా, అడవి గెలిచే చదువులా - ఏం చెప్తున్నారో చూద్దామని ఒడిశా అడవులు దాటి వచ్చాను. అయినా కాకతీయులకు రెండు అనుభవాలు ఉన్నాయి కదా' అన్నారు. అని 'మీరు తెలంగాణ విమోచనోద్యమంపైన పరిశోధన చేస్తున్నారట కదా? ఆరు శాతం అక్షరాస్యత కూడా లేని తెలంగాణలో గ్రంథాలయోద్యమాన్ని ఎట్లా చూస్తారండీ' - అని కొంటెనవ్వు నవ్వారు. 'ఊరకే కైట్ ఫ్లైయింగ్ - గాలి పటాలు ఎగిరేయడం సరదాలెండి' అన్నారు.

విన్నదాని కన్నా ఆసక్తిదాయకమైన మనిషి. కొత్త లేదు, మర్యాదలు లేవు. మనం చాయ్ ఇస్తాం. ఆయన సిగిరెటు వెలిగిస్తాడు. ఆయనే ఏదో విరిగిపోయిన కప్పును చూసి నుసి రాల్చడానికి వెతుక్కుని పక్కన పెట్టుకుంటాడు. అట్లా సంభాషణ సాగుతుంది. ఉపన్యాసం ఇవ్వడు. ఏకపక్షం కాదు. ప్రశ్నలు వేస్తాడు. రెచ్చగొడుతాడు. ఎక్కడా ఉద్రేకం ఉండదు. వైమనస్యం ఉండదు. అట్లని మొహమాటమూ ఉండదు. వర్గపోరాటానికి దోహదం చేసే మత్తడి స్థాయిలోనే ఉంటుంది తప్ప అంగుళం మందం కూడా తక్కువ ఉండదు. కాని ఏమాత్రం ఆవేశకావేశాలుండవు. కటువు మాట ఉండదు. కత్తులు దూయడం ఉండదు.

ఎక్కడెక్కడికో కనెక్ట్ చేస్తాడు. ఆనాటి సంభాషణ పొడిగింపుగానే నాకాయన తిరుపతి రాడికల్ విద్యార్థి సంఘం మహాసభల ప్రారంభోపన్యాసం (1983) అనిపించింది. ఆ తర్వాత ఐదేళ్లకు విన్నపుడు 'రాడికల్ విద్యార్థి, యువజన సంఘం గ్రామాలకు తరలండి' క్యాంపెయిన్ విశ్లేషిస్తూ శ్రీ శ్రీ 'జగన్నాథ రథ చక్రాలు భూమార్గం పట్టిస్తానన్నాడు. తెలంగాణలో అది జరిగింది. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట కాలంలో అది నలగొండలో జరిగింది. ఇప్పుడు కరీంనగర్‌లో జరిగింది. 'ఊరు మనది, వాడ మనది. దొర ఏందిరో, దొర పెత్తనమేందిరో' అని ప్రశ్నించింది. ధిక్కరించింది. భూమి మీద స్వాధీన అధికారాన్ని ప్రకటించింది. నారాయణపట్నం సీతన్న మీద కూడా ఆయనకు ప్రేమ అందుకే. ఈ దేశంలో ఎన్నటికయినా భూమిని స్వాధీనం చేసుకునే భూమి పుత్రులు రాజకీయాధికారానికి కూడా రావాలి.

నేను సంబల్‌పూర్‌కు ఒక్కసారే వెళ్లాను గానీ ఈ ముప్పై ఏళ్లలో ఆయన ఎన్నిసార్లు వరంగల్‌కు వచ్చాడో, కాకతీయ యూనివర్సిటీకి, కుమార్‌పల్లికి. మళ్లీ ఎన్నిసార్లు హైదరాబాదు, ఢిల్లీలలో కలుసుకున్నామో. కాకపోతే సంబల్‌పూర్‌లో కలిసిన నాటి నుంచి భారతిగారు కూడా ఆర్.ఎస్.రావని నాకర్థమయింది. సార్థక అర్థంలో ఆయన అర్థ నారీశ్వరుడని అర్థమయింది.

రేగులగడ్డ సోమేశ్వరరావు అట ఆయన. చంద్రుణ్ని జటాఝూటంలో పెట్టుకున్న చల్లటి మాటకు మూడోకంటి 'కొత్తచూపు' ఉన్న మనిషి.

సురా గానీ, హరగోపాల్‌గానీ ఎక్కువగా చెప్పే విషయం - ఆయనకు తెలిసినంతగా భారతిగారికి ఇంటిపని, వంటపని తెలియదని. కుటుంబం ఒక ప్రజాస్వామిక యూనిట్‌గా ఎంత ఆదర్శంగా ఉండాలని మనం కోరుకుంటామో. మనముందు వాళ్లు ఒక సహజమైన సాంస్కృతిక నమూనాగ ఉన్నారు. ఆలస్యంగా అర్థమైన విషయమేమిటంటే ఆర్.ఎస్.రావు గారు ఒక్కరు ఆలోచించరు. మొగవాడు ఎంత మేధావి అయి ఆలోచించినా, ఆచరించినా అది సగమే. మంచి సగంతో చర్చించి, ఆచరించకుండా అది అసంపూర్ణమే. భారతిగారు, ఆర్.ఎస్.రావు గారు కలిసి ఆలోచిస్తారు. చర్చిస్తారు. మొదట్లో ఆయన ఇంటిపని, వంటపని చేసినట్లుగానే రచన చేసారు. ఆలస్యంగా ఆమె రచనకు పూనుకున్నది. వేగంగా ముందుకు దూసుకుపోతున్నది. ఆయన 'కొత్తచూపు' చూద్దాం అంటాడు. ఆమె 'ఇట్లాకూడా ఆలోచిద్దాం' అంటుంది.

ఆర్.ఎస్.రావు గారు 'అభివృద్ధి వెలుగు నీడలు' మనముందు

పరిచాడు. భారతిగారు 'మిగులు మనుషుల'ను మనకు కొత్తగా పరిచయం చేసింది.

అప్పటి దాకా మన కళ్లు అభివృద్ధిని చూసే జిగేల్‌మన్నాయి. మనం మిగులు భూముల గురించీ మాట్లాడుతున్నాం. ఇద్దరు కలిసి మనకు దీపం కింద నీడలో తారట్లాడుతున్న, జీవన్మరణ పోరాటం చేస్తున్న 'మిగులు మనుషుల'ను చూపారు. వాళ్లే సీతన్నలు.

డెబ్భైలలోనే అనుకుంటాను - అప్పటికింకా న్యాయవాదిగా ఉన్న నా సహాధ్యాయి వై. భాస్కర్‌రావు ఇంటికి ఎప్పుడు హైదరాబాదు వచ్చినా పోయినట్లుగానే పోయాను. అమ్మ ఎప్పటి వలెనే ఎదురుచూస్తూ అన్నం వడ్డించింది. బర్కత్‌పురాలో ఇంటి వసారలోకి వెళ్ళి వచ్చి 'మూసీనది పొంగి, గండిపేట తెగిందట. జనమంతా నౌబత్ పహాడ్ మీదికి ఎక్కి ప్రాణాలు కాపాడుకోవడానికి పరుగెత్తుతున్నారు' అని చెప్పింది. మా గురించి నిష్కారణంగానే ఆందోళనచెందే అమ్మ నిమ్మళంగానే ఈ మాటలు చెప్పింది. భాస్కర్‌రావు 'నీ వాక్యం మొదలుపెట్టక ముందే మనం కొట్టుకుపోయేవాళ్లం' అని చమత్కరించాడు. అయితే ఇది అనుభవం, వివేకం. వీటిని విశ్లేషించి అన్వయించాలంటే ఆర్.ఎస్.రావు గారిని కవ్వించాలి.

సంబల్‌పూర్ యూనివర్సిటీ హీరాకుడ్ డ్యాం కింద ఉంటుంది. ఒక రోజు ఆనకట్ట తెగిపోతోందని యూనివర్సిటీ క్వార్టర్స్‌లో ఉన్న ప్రొఫెసర్లు, స్టాఫ్ అంతా పరుగులు పెట్టారట. బి.1 జ్యోతి విహార్‌లో ఎప్పటి వలెనే మార్క్సిజం డిస్కోర్స్‌లో ఉన్న ఆర్.ఎస్.రావు, నిశ్చలంగా చర్చలు కొనసాగిస్తూ - ఈ దృశ్యం చూసి తనకున్న ఎకనమెట్రిక్స్ అపార పరిజ్ఞానం సహాయంలో నిజంగానే ఆనకట్ట తెగిఉంటే దిగువన ఎన్ని గ్యాలన్ల నీళ్లు, ఎంత వేగంతో ప్రవహించి ఉండి ఎంత ప్రళయం జరిగి ఉండేదో నిక్కచ్చి లెక్కలతో వివరించాడట.

అయితే ఆర్.ఎస్.రావు గారు ఆందోళన చెందింది - ఆనకట్టలు తెగి జనం మునిగిపోతారని కాదు. ఆనకట్టలు నిర్మాణమయి జనం మునిగిపోతారని. వరదలు నివారించే భారీ ప్రాజెక్టులు వరదల కన్నా ఎక్కువగా గ్రామాలనూ, ప్రజలను ముంపునకు గురిచేస్తున్నాయని, హీరాకుడ్ అయినా పోలవరం అయినా - నెహ్రూ భారీ ప్రాజెక్టులను ఆధునిక దేవాలయాలని సరిగానే పోల్చాడు. మనమే పోల్చుకోలేకపోయాం! దేవాలయాలంటేనే నిర్మాణం చేసిన వారికి ప్రవేశం లేనివి. ఉత్పత్తిలో పాల్గొనని పూజారి వర్గానికి మాత్రమే ప్రయోజనం కూర్చేవి. భారీ ప్రాజెక్టుల విషయంలో పూజారి వర్గం పెట్టుబడిదారీ, భూస్వామ్య శక్తులే. సామ్రాజ్యవాద పూజారులు. ఇట్లా పూర్తి వాక్యాలుగా ఆయన పరిభాష వాడరు. ధ్వని పూర్వకంగా సూచించి వదిలేస్తారు. ట్యాంక్‌బండ్ మీద మిలియన్ మార్చ్ రోజు విగ్రహాలు కూల్చినపుడు అల్లూరి సీతారామరాజు, శ్రీశ్రీల పక్కనే కాటన్ దొర విగ్రహం ఉన్నట్లున్నది కదూ అని మాత్రం ఊరుకున్నారు.

శిశువుకు దక్కని స్తన్యంలా గోదావరి సముద్రం పాలవుతున్నదని శ్రీశ్రీ ఆవేదన చెందాడు. కానీ మన్నెపోరాటం, పీపుల్స్‌వార్ నాయకత్వంలో ఆదివాసీ రైతాంగ పోరాటం జరిగి లక్షలాది ఎకరాలు ఆదివాసులు స్వాధీనం చేసుకున్న ఖమ్మం, గోదావరి అడవుల్లో మూడువందల నాలుగు గ్రామాలు ముంపునకు గురయ్యే జలయజ్ఞాలు ఎవరి అభివృద్ధికి సంకేతాలు - ఎవరి విధ్వంసానికి, విస్థాపనకు కారణాలు. కాటన్ నాటికి కళ్లు తెరుచుకోకున్నా, హీరాకుడ్ నాటి నుంచి అదే పనిగా చెప్తున్నా, ఆర్.ఎస్. రావును తెలుగు నేల మీద ఎందరు బుద్ధి జీవులు సీరియస్‌గా విని ఆలోచించారు.

ఇవ్వాళ బస్తర్‌లో 2004, 2009లలో జరిగిన ఒప్పందాల ప్రకారం ఇరవై ఎనిమిది రకాల విలువయిన ఖనిజాలను తవ్వుకొని పోవడానికి వస్తున్న బహుళ జాతి కంపెనీలే కాదు, బడా కంపెనీలే కాదు సగం బస్తర్‌ను ముంచేసే బోధ్‌ఘాట్ ప్రాజెక్ట్ ఇంద్రావతి మీద నిర్మాణం అవుతున్నది. హైదరాబాదు నగరంలో ప్రజా జీవితాన్ని, సంస్కృతిని విచ్ఛిన్నం చేస్తున్న మెట్రోరైలు మార్గం వస్తున్నట్లుగానే దండకారణ్యంలో రావ్‌ఘాట్ రైలు మార్గం వస్తున్నది. ఈ వేగాలన్నీ మన వనరులను తరలించుకొని పోవడానికి. మన కాళ్ల మీద మనం నిలబడి కష్టం చేసి కలోగంజో తాగాలనుకుంటే నోటి ముందరి మట్టి పాత్రనో, రాతెండి కంచాన్నో వెనుకబాటు తనంగా విసిరేసి అన్నార్తులుగా విస్థాపితులను చేయడానికే.

అందుకే గ్రీన్‌హంట్ ఆపరేషన్ కేవలం ఆదివాసుల జల్ జంజల్ జమీన్‌లను దోచుకోవడానికే కాదు ప్రజల స్వాభిమాన, స్వావలంబన, స్వాధీన చైతన్యాన్ని ధ్వంసం చేసి పరాధీనుల్ని చేయడానికి. ప్రజల సార్వభౌమాధికారం ప్రమాదంలో ఉందంటే అర్థం అదే. ఆర్.ఎస్.రావు, భారతిగార్లు అభివృద్ధి వెలుగు నీడలు, మిగులు మనుషులు ప్రతిపాదనలను ప్రజల సంస్కృతికి సంబంధించిన ఆ లోతయిన విస్తృతార్థంలో వివరించారు.

ఆధునిక తెలుగు సాహిత్యాన్ని గోదావరి, కృష్ణానదులపై ఆనకట్టలు వచ్చిన సందర్భంలో అర్థం చేసుకుని మనకు వివరించడానికి చేసిన ప్రయత్నమే ఆర్.ఎస్.రావు, భారతిగార్లు విడిగా కన్యాశుల్కం మీద రాసిన వ్యాసాలు. విరివిగా అందులో నుంచి చేసిన ఉటంకింపులు. ఆనాటి నుంచి ఈనాటి వరకు వాళ్లు ఫ్యూడల్ భూస్వామ్య భావజాలాన్ని విశ్లేషించడానికే ప్రయత్నించారు. ప్రాజెక్టులు వచ్చిన నాటి నుంచీ, అంటే ఇంగ్లీషు వాని వ్యవస్థీకృత మార్కెటే వచ్చిన నాటి నుంచి ఈ భావజాలం పెట్టుబడికి ఎట్లా దాసోహమయిందో, ఒక దళారీవర్గం మన పాలకవర్గంగా రూపొందిన క్రమమేమిటో వివరించారు. స్వార్థ ప్రయోజనం దృష్టిలో శాస్త్రాలకు, ఇంగ్లీషు చదువులకు, చట్టాలకు సారాంశంలో ఉన్న సంబంధమేమిటో వివరించారు. అగ్నిహోత్రావధానుల ఇంట్లో తిష్ట వేయడమే కాదు బుచ్చమ్మను నమ్మించి లేపుకుపోవడం దాకా, వెంకటేశానికి ఇంగ్లీషు చదువుల గురువుగా ప్రవేశించిన గిరీశం ఏం చేయగలడో వివరించారు.

ఇవన్నీ మధురవాణి తెలివితేటలయినా, గురజాడ ఆమెకు ఆపాదించిన చైతన్యం అయినా ఆనాటి పరిస్థితులు అంత పరిణతిచెందాయా - మధురవాణిది పెడసరితనమేనేమో అని

బాలగోపాల్ అనుమానించినప్పుడు ఆర్.ఎస్.రావు ఆనాటి సామాజిక రాజకీయార్థిక పరిస్థితులను విశ్లేషించడానికి, అర్థం చేసుకోవడానికి కూడ మరో ప్రయత్నం చేసారు.

ఆధునిక స్త్రీ రేపటి చరిత్ర రచిస్తుందని గురజాడ దార్శనికతతో చెప్పినపుడుగానీ, ఈ వృత్తి మాని వంగతోటలో కాపు మహిళగా కష్టం చేసి బతకాలని మధురవాణి కలగన్నప్పుడు గానీ అది గురజాడ చైతన్యమయినా అవుతుందని ఆర్.ఎస్.రావు గారనుకున్నారు. ఒక వేశ్యగా ఏక కాలంలో గిరీశం, రామప్పంతులు, హెడ్డు, కరటకశాస్త్రి, మహేశం, పూటకూళ్ల పెద్దమ్మలను ప్రత్యక్షంగా, పరోక్షంగా కన్యాశుల్కంలోని అన్ని పాత్రలను చూసిన మధురవాణిదే ఆ చైతన్యం అని నేను వాదించాను. పతితులు, భ్రష్టులు, బాధా సర్పదష్టులు, దగాపడిన అధోజగత్ సహోదరుల కన్నా ప్రపంచాన్ని ఎక్స్‌రే కళ్లతో ఎవరు చదువగలరని.

ఆర్. ఎస్. రావుగారు అకడమిక్ ఆర్థిక శాస్త్రవేత్తల్లో అర్ధవలస - అర్ధ భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలను, అంటే ఈనాటికీ ఈ దేశంలో ఫ్యూడల్ భూస్వామ్యానికీ - అశేష ప్రజానీకానికీ ఉన్న వైరుధ్యమే ప్రధానమైందని వివరించే అటలమైన మేధావిగా గుర్తింపు పొందారు. అందువలన ఈ దేశంలో 1857లో ప్రారంభమైన ప్రజాస్వామిక విప్లవం అసంపూర్తిగానే మిగిలిందని, అది సాధించడానికి భూమి ఇరుసుగా వ్యవసాయ విప్లవం నిర్వహించాలని మావోయిస్టు అవగాహనను ఆయన ఆర్థికవేత్తల మధ్యన స్థిరంగా ప్రతిపాదించాడు. అందుకే విప్లవోద్యమ నాయకత్వంలో సాయుధ పోరాటం ప్రధాన పోరాటంగా సాగుతున్న ప్రజాయుద్ధాన్ని, నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని నక్సల్బరీ నాటి నుంచి బలపరుస్తున్నాడు. పరిభాష లేకుండా సులభంగా, సూటిగా విశ్లేషణాత్మకంగా వినూత్నంగా మావోయిస్టు సిద్ధాంతాన్నిగానీ, మావోయిస్టు పార్టీ రాజకీయార్థిక సామాజిక సాంస్కృతిక కార్యక్రమాన్ని గానీ శషభిషలు లేకుండా ఈ దేశంలో బలపరిచిన మేధావి ఆయన. అందుకే ఆయన అంత వినయంగా పార్టీ తన పేరు తనను సంప్రదించకుండానే సూచించినప్పటికీ, అనారోగ్యంతోనూ ఆ కర్తవ్యాన్ని స్వీకరించాడు.

సాహిత్యం నుంచి ఈ రాజకీయ అవగాహనను, విశ్లేషణను ప్రతిపాదించడంలో ఆర్.ఎస్.రావు అయినా భారతిగారయినా బయల్దేరిన కన్యాశుల్కం దగ్గరే ఆగిపోలేదు. ఎందుకంటే వాళ్లు ప్రతి మార్పును చలనంలోను, సంఘర్షణలోనూ చూస్తున్న వాళ్లు. మధుర వాణి నుంచి, కన్యక (గురజాడ గేయం) నుంచి సాధన రాగో దాకా సాహిత్యంలో సామాజిక వర్గ సంఘర్షణ ప్రతిఫలనాలను విశ్లేషించారు. భారతిగారయితే అల్లం రాజయ్య నవల వసంత గీతంలో సరెండర్ అయిన గట్టయ్య వదిన గంగమ్మ (నిర్మల) దాకా వర్గ పోరాటం పనిముట్టుగా మలిచే ఇనుమును గురించి విశ్లేషించింది.

ఆర్.ఎస్.రావు భారతిగార్లకు కన్యాశుల్కం, రాగో, వసంత గీతంల వలెనే శ్రీశ్రీ నుంచి జననాట్యమండలి పాటల దాకా చాలా ఇష్టం. ఆ ఇష్టం ఒక ప్రజాస్వామిక సంస్కృతి వర్గ పోరాటం ద్వారా మాత్రమే సాధ్యమనే శాస్త్రీయ విశ్లేషణ నుంచి వచ్చింది.

ఆర్.ఎస్.రావుగారికి వర్గ విశ్లేషణ - ఉత్పత్తి సంబంధాలు, వర్గపోరాటం - ఎప్పుడూ నలిగే చర్చనీయాంశాలు. ఆయనకు సమాజాన్ని సమూలంగా మార్చే తత్వశాస్త్రం మీద మాత్రమే గురి. ఇటీవల కొద్దిమందితో ఆ ఇద్దరూ నాలుగయిదు వారాలు వర్గం గురించి మాత్రమే చర్చ చేసినపుడు ఆయనతో కలకత్తాలో ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఎకనామెట్రిక్స్ (స్టాటిస్టిక్స్?)లో పనిచేసి, ఇప్పుడు టాటా ఫండమెంటల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్‌లో ఉన్నత పదవిలో ఉన్న ఒక పెద్ద మనిషి భోజన విరామంలో కలిసాడు. 'ఇక్కడ కూడా ఏదో ఇన్‌సర్జెన్సీ రచిస్తున్నట్లున్నావే' అన్నాడు. గోఖలే ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఎకనమిక్స్‌లో పని చేస్తున్నపుడు ఒక మార్క్సిస్టు స్టడీ గ్రూపు ఏర్పాటు చేసిన దగ్గర్నించీ, సంబల్‌పూర్‌లో బి 1 జ్యోతి విహార్ కావచ్చు, పదవీ విరమణ కాలంలో ఎక్కడున్నా ఆయనొక ఆలోచనల మందుపాతర. ఆయన మార్క్సిజం అనే మాంజీ పూసిన గాలిపటాలను అట్లా నలుగురి మధ్యన ఎగిరేస్తూ, రెచ్చగొడుతూనే ఉండేవాడు.

ఏమరుపాటు ఎప్పుడూ సహించేవాడు కాదు. 1991లో నూతన ఆర్థిక విధానం ప్రకటించిన కొత్తలో విరసం హైదరాబాదులో అవగాహన తరగతి పెట్టింది. కార్మికవర్గం తన ఎజెండా తాను రూపొందించుకుంటుంది. అది ప్రజలకు రాజ్యాధికారం ఇచ్చే కార్యక్రమం. 1970 నుంచి 85-90ల దాకా విరసం ఆ కార్మిక వర్గ ఎజెండాను, సాంస్కృతిక జెండాను ఎగిరేసిందని ఆయనకు తృప్తిగా ఉండేది. ఈ అవగాహన తరగతిలో ఆయన ప్రసంగం మ్యాన్ ఆఫ్ లిటిల్ ఫేత్ లాగా మొదలు పెట్టాడు. 91 నుంచయితే మన ఎజెండా ప్రపంచ బ్యాంకు నిర్ణయించడం లేదు గదా అని కొంటెగా నవ్వాడు.

1992లో కలకత్తాలో ఆల్ ఇండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం ఏర్పాటు చేసి, ఆవిర్భావ సభ నిర్వహించి, సిల్గురి, నక్సల్బరీ, డార్జిలింగులు కూడా చూసి తిరుగు ప్రయాణంలో నేను, నా సహచరి సంబల్‌పూర్‌కు పోయాం.

'భూస్వామ్య వ్యతిరేక పోరాటం ముగిసిందా? ఇంక మిగిలింది సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రతిఘటనయేనా?' అని నన్ను డిఫెన్స్‌లో పడేసారు. అంటే ఫ్యూడలిజంతో అశేష ప్రజానీకానికున్న వైరుధ్యానికి, వ్యవసాయ విప్లవాన్ని, దానికవసరమైన సాయుధ పోరాటాన్ని ఏమైనా సడలిస్తారేమోనని ఆయనకెక్కడో సందేహం. 'అదేం కాదండీ రైతు కూలీ సంఘం, రాడికల్ యువజన సంఘం వంటి ప్రజా సంఘాలు ఉండనే ఉన్నాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ నేపథ్యంలో సామ్రాజ్యవాద ప్రతిఘటనకొక సంస్థ కావాలని భావించాం' అని చెప్పాను.

మీకెందుకు ఏ సందేహాలు రావు. విప్లవం మీద ఇంత విశ్వాసంతో ఉంటారు. అంటే సంబల్‌పూర్‌లో మాకు పొద్దున్నే దినపత్రికలు రావు. మొదట్లో వారానికి ఒకసారి వచ్చేవి. నేను బయటి ప్రపంచాన్ని క్రాంతి, రాడికల్ మార్చ్, సృజన ద్వారా చదువుకుంటాను. వాటిని మార్క్సిస్టు క్లాసిక్స్ గీటురాయిగా

విశ్లేషించుకుంటాను. ప్రాణానికి హాయిగా ఉంటుంది. అయినా చరిత్ర ఒక నిరంతర చలనంలో ఉన్న సంఘర్షణాపూర్వక ప్రజల నిర్మాణం. అందులో దైనందిన సంఘటనలు, చర్యలు ప్రవాహంతో పాటు కొట్టుకపోయేవి. గులకారాళ్లు కావచ్చు. నీటి బుడగలు కావచ్చు. అట్లని ఆయనకు ఏ విమర్శా లేదని కాదు. ఏ ప్రశ్నలూ లేవని కాదు. ఆయన పనియే ప్రశ్నలు వేసి కవ్వించడం. అయితే ఆ పని బుద్ధిజీవుల విషయంలోనే గానీ ఆచరణలో ఉన్న విప్లవోద్యమం విషయంలో మాత్రం బహిరంగంగా కాదు. ఆయన ఐ.వి. సాంబశివరావుతో, శంకర్‌తో (చెరుకూరి రాజకుమార్ ఫోటో చూసి తనకాయన ఆ పేరుతో సుపరిచితుడని చెప్పాడు) కోబడ్ గాంధీతో అటువంటి చర్చలు గంటల తరబడి, రోజుల తరబడి ఎన్నో సందర్భాల్లో చేసే ఉంటాడు.

చర్చల సమయంలో నా రాతల్లో రాజ్యాంగం, ఆదేశిక సూత్రాలు, ఉపోద్ఘాతం (ప్రియాంబుల్) ప్రాథమిక హక్కుల ప్రస్తావన చాల వస్తున్నదే - అని చమత్కరించాడు. సంస్కరణ వాదం అంటే ఆయనకంత అనుమానం.

1981 ఏప్రిల్‌లో ఇంద్రవెల్లి మారణకాండ జరిగిన తర్వాత ఒక కవిత రాద్దామని ప్రారంభించాను. అది ఎంతకూ పూర్తి చేయలేకపోయాను. శివసాగర్‌తో ఎందుకు రాయలేకపోతున్నాను అని అడిగాను. 'మనమింకా పేరులేని, మొహంలేని మనుషుల గురించి రాయడం నేర్చుకోవాల్సే' ఉంది అన్నాడు. ఆ తర్వాత కవిత పూర్తి చేసాను. ఆయన పరిశీలన నాకెంతో నచ్చింది. దానికి తోడు రచయితలు, హక్కుల సంఘాల బాధ్యులు నోరు లేని వారికి నోరు ఇవ్వాలనే మాట కూడా నాకు నచ్చింది. ఇటీవల ఎక్కువగా ఆ మాటలు వాడుకున్నాను. జూన్ 18న జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీలో ఆర్.ఎస్.రావు సంస్మరణ సభలో ఆదివాసుల గురించి ప్రస్తావించి వాయిస్‌లెస్, ఫేస్‌లెస్, నేమ్‌లెస్, (నోరు, ముఖము, పేరు లేనివాళ్లు) ప్రజలన్నాను. అంత దుఃఖంలో భారతిగారు ఇంటికి పోగానే అడిగింది - 'అదేమిటండీ వాళ్ల మాట, మొహం మనమెక్కడ వ్యక్తం కానిచ్చామని. వాళ్లకే ముఖాలున్నాయి. వాళ్లవే నాభి నుంచి వచ్చే మాటలు' అన్నది.

అటువంటి ఆదివాసీ సీతన్న పట్ల ఆర్.ఎస్.రావు గారి అక్కర (కన్‌సర్న్)తోనే ముగిస్తాను. ఆర్.ఎస్.రావుగారిపుడు లేరుగానీ ఆయన పోయాక సీతన్న విషయంలో కొంత ఉత్తర రామాయణం నడిచింది. వినీల్ కృష్ణ విడుదల కాలం నుంచి నడిచింది. ఒడిశా ప్రభుత్వంతో చర్చల్లో మధ్యవర్తులు ఇది ప్రస్తావిస్తే బి.ఎస్.ఎఫ్. వాళ్లు తాము కిడ్నాప్ చేయలేదంటున్నారండి. అతడు మావోయిస్టుల నుంచి దూరమయ్యాడు గనుక వాళ్లకు తెలియదు గానీ భార్యతో సంబంధాల్లో ఉన్నట్లున్నారండీ అని ప్రభుత్వం చెప్పిందట. కాని వినీల్ కృష్ణ విడుదలయ్యాక, సీతన్న జాడ ఏమీ తెలియక ఆయన భార్య కటక్ హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటిషన్ వేసింది. తన కళ్ల ముందే తనను వేరు చేసి బి.ఎస్.ఎఫ్. వాళ్లు బలవంతంగా అతణ్ని ఎత్తుకుపోయారని చెప్పింది. ఇద్దరు సాక్షులను కూడా హాజరు పరచింది. బి.ఎస్.ఎఫ్. వాళ్లు మాత్రం మాకేమీ తెలియదు, మేం కిడ్నాప్ చేయలేదని జవాబు వేసారు. హైకోర్టు బి.ఎస్.ఎఫ్. మాటే నమ్మదలుచుకున్నది. మార్చ్ 22న పిటిషన్‌ను కొట్టి వేసింది హైకోర్టు. సీతన్న భార్య సుప్రీంకోర్టుకు అపీలు చేసింది.

సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సిడిఆర్‌సి) - వీక్షణం కలిసి జూన్ 30న హైదరాబాద్, బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో ఆర్.ఎస్.రావు గారి సంస్మరణ సభ ఏర్పాటు చేసారు. యాదృచ్ఛికమే కావచ్చు కానీ ఆ సాయంకాలానికే తెలిసిన వార్త ఏమిటంటే సీతన్న అంత్యక్రియలు ఆంధ్ర ఒడిశా సరిహద్దులో సిమ్లిగూడా వద్ద ఆయన భార్య సమక్షంలో జరిగాయి అని. అంటే సీతన్న జూన్ 29 దాకా సిమ్లిగూడ కేంద్ర బలగాల క్యాంపులో బందీగా ఉన్నాడు. మార్చ్ 22 నుంచి ఆయన భార్య కూడా వాళ్ల బందీగానే ఉన్నది. సీతన్న ఒక యాక్సిడెంట్‌లో గాయపడినాడని, విశాఖపట్నం ఆసుపత్రిలో చేర్చారని, జూన్ 29న ఆ గాయాలతోనే మరణించాడనీ, ఆ రోజు సిమ్లిగూడలో అంత్యక్రియలు జరిగాయని ఒడిషా మీడియా కథనం. బహుశా ఒడిశా ప్రభుత్వం కొంత దాచి కొంత చెప్పిన అర్ధ సత్యం.

ఆనాటికింకా గంటి ప్రసాదం విడుదల కాలేదు గానీ మిగతా నలుగురు విడుదలయ్యారు. సిమ్లిగూడ కేసు మాత్రమే ప్రభుత్వం ఉపసంహరించుకున్నది కనుక ఆ మర్నాడు ఆయన విడుదలయ్యాడు. మూడు నెలల్లోనే, అంటే మే 24 నాటికి విడుదల చేస్తామన్న, మరో ఆరు వందల మంది ఆదివాసుల్లో ఒక్కరు కూడా ఈనాటికీ విడుదల కాలేదు. మే 24న ముఖ్యమంత్రి, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, హోంశాఖ కార్యదర్శి హామీపడిన 230 మంది కూడా ఇప్పటికీ విడుదల కాలేదు. నిన్నా, ఇవ్వాళ ప్రభుత్వం చూపుతున్న సాకు ఏమిటంటే మావోయిస్టు పార్టీ ఒప్పందం ఉల్లంఘించింది గనుక తాము కూడా ఒప్పందం అమలు చేయం అని. ఒప్పందం ప్రకారం ప్రభుత్వం ఆదివాసుల విడుదల కోసం ఏర్పాటు చేసిన రాధా మోహన్ కమిటీని రద్దు చేస్తున్నాం అని.

వినీల్ కృష్ణను విడుదల చేశాక ముఖ్యమంత్రిని కలిసినపుడు ఆర్.ఎస్.రావు గారు అర గంట సేపు అభివృద్ధి నమూనా గురించి, అది ఆదివాసుల విస్థాపనకు, విధ్వంసానికి ఎట్లా కారణమవుతున్నదో చెప్పారట. ఈ డిమాండులు వాళ్లు పోరాడి సాధించుకుంటారు. ముఖ్యంగా భూమి, వనరులు. మీరు ఆదివాసులను మాత్రం విడుదల చేయండి. అదొక్కటే నేను కోరుతున్నది అన్నారట. ప్రభుత్వం ఆ పెద్ద మనిషి హితవును పాటించి గౌరవం నిలుపుకోలేదు. ఆయనకు భ్రమలు లేవు.

నేను కోరాపుట్‌కు వెళ్లలేదు. నా అనారోగ్యం వల్ల వద్దన్నారు. ఒడిశా సచివాలయం నుంచే తిరిగివచ్చాను. కోరాపుట్ వెళ్లి ఉంటే ఆదివాసీ స్త్రీల ప్రతి ఒక్కరి మొహంలోను సీతన్న భార్య ప్రశ్నయే నన్ను విలదీసేదేమో' అన్నారు హైదరాబాదులో కలిసినప్పుడు. చరిత్ర నిర్మాతలయిన ప్రజల పట్ల అపరాధ భావమే బుద్ధిజీవుల మంచి ప్రజా మేధావులను వేరు పరచి ఆచరణకు పురికొల్పుతుంది.



సంస్మరణ



# మాధవస్వామి... మనమూ

- పాణి

ప్రగతిశీల విప్లవ విద్యార్థి ఉద్యమంలోకి 1980లలో వచ్చిన మాధవస్వామి చివరంటా వివిధ ప్రజా సంఘాల్లో కొనసాగారు. కొన్నిటికి నాయకత్వ బాధ్యతలు కూడా చేపట్టారు. కర్నూలు జిల్లా నందికొట్కూరు దగ్గర వీపనగండ్లలోని బహుజన కులంలో పుట్టిన మాధవస్వామి హోమియో వైద్యం చదవడానికి హైదరాబాదు వెళ్లారు. అక్కడ విప్లవ రచయితల సంఘం, ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘంతో పరిచయాలు కలిగాయి. కేవలం పరిచయాల్లోనే ఉండిపోకుండా ఆ సంస్థల్లో భాగస్వామి అయ్యారు. ఆయన రాజకీయ, సాహిత్య జీవితం అట్లా మొదలైంది.

విద్యార్థి ఉద్యమంలో కొనసాగిన ఆ రోజుల గురించి మాధవస్వామి చాలా పారవశ్యంగా చెప్పేవారు. చాలా స్థిమితంగా ఉండే మనిషి ఒకింత ఉద్వేగంగా తలచుకొనే రోజులవి. హైదరాబాదు జీవితంలో పీడీఎస్‌యూ కార్యక్రమాలు, విరసం సాహిత్య కార్యక్రమాలు ఆయన రాజకీయ, సాహిత్య వ్యక్తిత్వాన్ని రూపొందించాయి. అక్కడొక బలమైన పునాది పడింది. సుమారుగా ఆయన కర్నూలు రావడం, ఇక్కడ బాలగోపాల్ నేతృత్వంలో పౌరహక్కుల సంఘం కమిటీ ఏర్పాటుకు సన్నాహాలు ఒకేసారి జరిగాయి. సహజంగానే ఆయన పౌరహక్కుల సంఘంలో క్రియాశీలంగా పని చేస్తూ వచ్చారు. ఆ తర్వాత సారా వ్యతిరేక ఉద్యమంలో ఆయన భాగస్వామి అయిన విప్లవ నిర్మాణం కార్యక్రమాలు ముమ్మరం చేశాక వాటన్నిటిలో తాను పౌరహక్కుల సంఘం ప్రతినిధిగా పాల్గొనేవారు. అప్పటికాయనకు ఉద్యోగం కూడా లేదు. మద్దూరునగర్‌లో, నరసింగరావుపేటలో ప్రైవేట్ ప్రాక్టీసు చేస్తూనే కార్యకలాపాలు కొనసాగించారు.

భూస్వామ్య సాయుధ ముఠాల వ్యతిరేక ఉద్యమం ప్రారంభమయ్యాక రాయలసీమ స్థానిక సామాజిక స్థితిగతులపై లోతైన ఆలోచన బయల్దేరింది. రాయలసీమలో జరిగిన ప్రజాస్వామిక ఉద్యమాల్లో దానికి విశిష్టమైన స్థానం ఉన్నది. బహుశా మొదటిసారి సాయుధ ముఠాల రాజకీయార్థిక, సాంస్కృతిక విషయాలపై విశ్లేషణ మొదలైంది. అంతకు మించి సాధారణ ప్రజల్లో కూడా... సాయుధ ముఠాలను వ్యతిరేకించ వచ్చుని, ఆ వ్యవస్థకు వ్యతిరేకంగా బహిరంగంగా మాట్లాడవచ్చనే విశ్వాసాన్ని ఆ ఉద్యమం ఇచ్చింది. ఆ వేదిక నడచినంత కాలం మాధవస్వామి అందులో క్రియాశీలంగా పని చేశారు. సాయుధ ముఠాల వ్యవస్థపై ఆయన మంచి అధ్యయనం చేసి ఆ ఉద్యమానికి అవసరమైన విశ్లేషణ అందించారు.

ఈ క్రమంలోనే ఆయనలో కుల వ్యవస్థ గురించిన అన్వేషణ మొదలైంది. సాయుధ ముఠాల దోపిడీ, పీడనలకు, దౌర్జన్య కాండకు గ్రామస్థాయిలో కులవ్యవస్థ దోహదపడుతోందనే విషయాన్ని బాగా పట్టించుకున్నారు. అగ్రవర్ణ రెడ్డి భూస్వాముల దుర్మార్గాలకు, వారి పరస్పర దాడులకు దళిత బహుజనులే ప్రధానంగా బలైపోవడం గురించి, వారి దగ్గర సైన్యంగా పీడిత కులాలే కొనసాగడం గురించి కింది స్థాయి సమాచారంతో ప్రసంగాలు చేసేవారు.

విప్లవోద్యమంలో కుల సమస్యపై చర్చ మొదలయ్యాక అంబేద్కర్, ఫూలే రచనలపట్ల మాధవస్వామికి ఆసక్తి పెరిగిపోయింది. చరిత్రలో బ్రాహ్మణేతర, సమాంతర తాత్విక, సాంస్కృతిక సాంప్రదాయాల అధ్యయనంలోకి వెళ్లిపోయారు. డఫోడం సన్నాహాలు, ఏర్పాటు, అది పని చేసిన కొద్ది కాలంలో దాని కార్యక్రమాల గురించి కనిపించిన వాళ్లందరితో ఎడతెరపి లేకుండా మాట్లాడేవారు.

మళ్లీ డఫోడం అనే సంస్థ ఏర్పడే రోజుల్లో దానికి సంబంధించిన సన్నాహాలు, దాని కోసం చేసిన చర్చలు, అధ్యయనం అందరితో పంచుకునేవారు. ఆ ప్రయోగం అర్థాంతరంగా ముగిసిపోయిందని అంతే వ్యథ కూడా ఉండేది. మొదట అన్నట్లు - ఆయన హైదరాబాదు విద్యార్థి ఉద్యమ జీవితం తర్వాత మళ్లీ అట్లా ఈ అనుభవం గురించి ఒకింత ఉద్వేగంగా మాట్లాడేవారు. ఒక కల చెదిరిపోయినట్లు విచారపడేవారు. ఆ సంస్థకు ఆయన బహుశా రాష్ట్ర స్థాయిలో ఏదో బాధ్యతలో కూడా ఉండేవాడు. మాధవస్వామికి నిర్మాణాల్లో పై స్థాయి నాయకత్వం వహించగల దక్షత, అవగాహన ఉన్నా వ్యక్తిగత కారణాలతోసహా మరే కారణాలైనా ఉండవచ్చుగాని ఈ ప్రయత్నం మాత్రమే బైటి ప్రాంతాల్లో కూడా బాగా తిరిగారు.

దీనికి కొనసాగింపుగా- ఆయన ఉన్న రాజకీయ నిర్మాణంలో కులం విషయంలో విభేదాలు పొడసూపి చీలికదాకా వచ్చినప్పుడు ఆయన తన అవగాహన రీత్యా వీరన్న పక్షం తీసుకున్నారు. ఆ ఆంతరంగిక వివాదం గురించి ఆయన చెప్పగలిగిన విషయాలన్నీ మిత్రులకు చెప్తుండేవారు. అందులో శషబిషలు లేకుండా ఆయన ఒక మార్గం తీసుకున్నారని అనిపించేది. మామూలుగానైతే అంత నిక్కచ్చిగా, కఠినమైన వైఖరితో ఆయన మాట్లాడతారని అప్పటిదాకా తెలియదు. ప్రజల సమస్యలపై స్థూలమైన సిద్ధాంత వైఖరితో, ఎక్కువగా రాజకీయ అవగాహనే ఆయనగా మాట్లాడగా విన్న వాళ్లకు మొదటిసారి ఎక్కువగా సిద్ధాంత నొక్కుతో మాట్లాడుతున్నారనిపించేది. మార్క్సిజాన్ని... అంబేద్కరిజాన్ని కలపాలనే విషయంలోగాని, నక్సల్బరీ రివిజనిజంతో తెగతెంపులు చేసుకున్నదిగాని బ్రాహ్మణిజంతో తెగతెంపులు చేసుకోలేనే సూత్రీకరణ విషయంలో మా మధ్య తీవ్రమైన చర్చలు

జరుగుతుండేవి. సామాజిక శాస్త్రకారుడిగా అంబేద్కర్ పరిశీలనలను, సూత్రీకరణలను తప్పక తీసుకోవలసిందేగాని మార్క్సిజంలో కలపడం ఎలా సాధ్యమవుతుందో ఆలోచించండని నా అభిప్రాయాలు చెప్పేవాణ్ని. మార్క్సిజంలో కలపడమంటే చారిత్రక భౌతికవాదంలో కలపడం అనే కదా. అంబేద్కర్ ఆలోచనల ఆధారంగా చారిత్రక భౌతికవాద పద్ధతిని ఎట్లా అభివృద్ధి చేస్తారు? కులవ్యవస్థ గురించి ఎంత పట్టించుకున్నాం అనే విషయం చర్చించవలసిందేగాని ఇప్పటికైనా పట్టించుకోవడం అంటే చారిత్రక భౌతికవాద పద్ధతిలో విశ్లేషించడమే. ముందు కుల వ్యవస్థను వివరించడానికి ఆ పద్ధతి సరిపోదని నిరూపిస్తే అప్పుడు మీరు చెప్తున్నదాని గురించి ఆలోచించవచ్చు.. అనే నా అభిప్రాయాలు ఆయనకు సంతృప్తినిచ్చేవి కావు. ప్రజలను కదిలించడానికి, వాస్తవికమైన గడ్డు సమస్యలపై పోరాడడానికి అవసరమైన రాజకీయ నినాదాలను, నిర్మాణరూపాలను తప్పక తీసుకోవాల్సిందే. అయితే సిద్ధాంతం విషయంలో మాత్రం శాస్త్రీయంగా తప్ప మరోలా వ్యవహరించడం కుదరదనే నా వాదనతో ఆయనకు చివరి రోజుల్లో కూడా సమ్మతి ఉండేది కాదు. అయితే మొదట్లో లాగా దాని గురించి మాట్లాడుకోవాల్సిన అవసరం కలగలేదు.

అయినా మాధవస్వామిలోని నెమ్మదితనం వల్ల గంటల కొద్దీ చర్చ నడిచేదేగాని తెగిపోయేది కాదు. పైగా ఎదుటివాళ్ల మీద ముద్రలు వేసి మాట్లాడే తత్వం కూడా లేదుకాబట్టి చాలా హాయిగా సంభాషణ సాగేది.

ఆయన అంతగా నిమగ్నమైన ఆ ప్రయోగానికి నాయకుడైన వీరన్న బూటకపు ఎన్‌కౌంటర్లో అమరుడు కావడం మాధవస్వామిని తీవ్రంగా కలిచివేసింది. ఆ కాలమంతా ఒంటరితనంలో కూరుకపోయారు. పెద్దగా కార్యక్రమాల్లో పాల్గొనేవారు కాదు. వీరన్న మరణం ఆయనను ఎంత దుఃఖపెట్టిందో అరుణతారలో రాసిన ఓ దీర్ఘ స్మృతి కవితలో మనకు కనిపిస్తుంది.

రెండు మూడేళ్లపాటు అట్లా ఉండిపోయేవారు. ఆ తర్వాత మెల్లగా తేరుకున్నారు. మళ్లీ మొదటిలాగే మాట్లాడటం మొదలుపెట్టారు. అప్పుడు కూడా కులం గురించిన ఆలోచనలే. 'చర్చ' పత్రికలో మాదిగ రిజర్వేషన్ పోరాటం గురించి, కులం-అంబేద్కర్ గురించి వ్యాసాలు రాశారు. ఆ సందర్భంగా కులం విషయంలో మావోయిస్టుపార్టీ ఆచరణ, అవగాహనల గురించి కూడా చర్చకు వచ్చేవి. వాటిపట్ల ఆయనకు పూర్తి సంతృప్తి లేకపోయినా ఒక మేరకు ఆమోదం పెంచుకున్నారు. ముఖ్యంగా కాంగ్రెస్ ప్రభుత్వంతో చర్చలు జరిగిన రోజుల్లో మావోయిస్టు ఉద్యమం గురించి పునరాలోచనలో పడ్డారా? అనిపించేది. ముఖ్యంగా విప్లవోద్యమానికి, నిర్మాణానికి బైట ఉండడం ఆయనకు నచ్చినట్లు లేదు. ఉద్యోగక్రాంతి బాధ్యతలు తీసుకోమన్నప్పుడు ఆ రంగం తనకు కొత్త అనేదానితోపాటు రాజకీయంగా ఆ సంస్థ అవగాహనతో ఏకీభావం గురించి ఆలోచిస్తున్నానని అన్నారు. అర్ధమనస్సుతోనే బాధ్యతలు తీసుకున్నా ఉద్యోగక్రాంతి తనకు పునర్జీవితం ఇచ్చిందనేదాకా ఆయన దానితో మమేకం అయ్యారు.

ఆ తర్వాతర్వాత ఎంత క్రియాశీలమయ్యారంటే కామ్రేడ్ పటేల్ సుధాకరరెడ్డి ఎన్‌కౌంటర్ అయినప్పుడు ఏదో పని మీద హైదరాబాదులో ఉన్నారు. మృతదేహం హైదరాబాదుకు ఎప్పుడు వస్తుందో, ఎక్కడకి వస్తుందో తెలుసుకొని వెళ్లి చూసి వచ్చారు. అజాద్ అంత్యక్రియలకు కర్నూలు నుంచి కొంత మంది మిత్రులను తానే కదిలించి బయల్దేరారు. ఆ తర్వాత అజాద్ స్మృతిలో జరిగిన గ్రీన్‌హంట్ సభకు కూడా పది మందిని కదిలించి హాజరయ్యారు. కర్నూల్లో కొత్తగా పరిచయాల్లోకి వస్తున్న ఉద్యోగులకు, యువకులకు రెండు మూడు సార్లు రాజకీయ తరగతులు నిర్వహించారు. అసలు ఆయన దగ్గర ఎప్పుడూ రెండు మూడు కార్యక్రమాలు ఉండేవి. నలుగురిని కదిలించే పని ఏదైనా ఆయన కేంద్రంగా, ఆయన మీద ఆధారపడాల్సి వచ్చేది.

తెలంగాణ ఉద్యమం ఊపందుకొన్నాక రాయలసీమ బూర్జువా వర్గం తెలంగాణకు వ్యతిరేకంగా సమైక్యవాదాన్ని లేవదీసినప్పుడు దీన్ని ప్రతిఘటించాల్సి ఉన్నదని తీవ్రంగా మధన పడ్డారు. సమైక్యవాదం తెలంగాణకు వ్యతిరేకమేగాక రాయలసీమకు కూడా వ్యతిరేకమైనదని, చరిత్రలో ఒకనాడు వినిపించిన ప్రత్యేక రాయలసీమ నినాదాన్ని తెలంగాణ స్ఫూర్తితో తిరిగి అందుకోవలసిన తరుణం వచ్చిందని ఆలోచించారు. అట్లా పదిమంది ఆలోచనల నుంచే రాయలసీమ విద్యావంతుల వేదిక ఆవిర్భవించింది. ఆ వేదికకు చాలా సహజంగానే మాధవస్వామి కో కన్వీనర్‌గా ఎన్నికయ్యారు. సమైక్య ఉద్యమం ఉధృతంగా ఉన్న కాలంలో కర్నూల్లో , రాయలసీమ జిల్లాల్లో వేదిక అవగాహనను తీసుకెళ్లడానికి ప్రయత్నించారు.

ఆయన చేసిన పనుల్లో నలుగురికి ప్రముఖంగా తెలిసేవీ, తెలియనివీ చాలా ఉండవచ్చు. ఎన్ని చేసినా, ఉద్యమ నిర్మాణ ఆచరణలో ఆటుపోట్లు ఎదుర్కొన్నా , కొత్త ఆవిష్కరణల కోసం ప్రయత్నించినా ఆయన అవగాహనలోని మౌలికాంశం మార్క్సిజం, లెనినిజం మాత్రమే. కుల సమస్య, రాయలసీమ, అంబేద్కర్ ఆలోచనలు ..ఏవైనా నూతన ప్రజాస్వామిక విప్లవంలో భాగంగా చూశారు. మామూలుగా కొత్త సమస్యలు, కొత్త ఆలోచనలు రాగానే విప్లవాన్నీ, మార్క్సిజాన్నీ అటకెక్కించే ఒరవడి కూడా ఉంది. ఆయన చేసిన చాలా ఆలోచనలు మార్క్సిజంలో ఒదుగుతాయా లేదా అనే సంగతి ఎటున్నా ఆయన మేధా, కాళ్లూ మార్క్సిజంలోనే స్థిరంగా ఉన్నాయి. అంటే- సమాజంలోని ప్రబల సమస్యలపట్ల పట్టింపుతో వాటికి అర్థవంతమైన పరిష్కారాలు వెతకాలనే బాధ్యతాయుతమైన అన్వేషణ సాగించడం... ఆ పని మార్క్సిజం అనే సామాజిక సిద్ధాంతం ద్వారా, వర్గపోరాట ఆచరణ ద్వారా సాధించాలనుకోడం ఆయనలో ఉన్న విశిష్టమైన అంశం. ఆ పని చేసే క్రమంలో మార్క్సిస్టు సిద్ధాంత చట్రంలో ఒదగని కొన్ని ఆలోచనలు చేశారనే అభిప్రాయం నాకున్నా మార్క్సిజం కేంద్రంగా ఉండాలనే ఆయన నిశ్చయ వైఖరి మనకు స్ఫూర్తిని ఇస్తుంది.

చాలా మందిలాగే మాధవస్వామికి కూడా వ్యక్తిగా అనేక పరిమితులు ఉండవచ్చుగాని తనకంటూ కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. జీవితాన్ని పూర్తి సామాజికంగా మలుచుకున్నవాళ్ల నుంచి ఏమైనా నేర్చుకోడానికి, వాళ్ల నుంచి స్వీకరించడానికి మనకు భయం

కలగవచ్చు. ఎందుకంటే అందరికీ సాధ్యంకాని జీవిత ప్రయోగాలు కొందరే చేయగలరు. కానీ మన మధ్యనే ఉంటూ సుమారుగా మనలాగే జీవిస్తూ కొన్ని అరుదైన నమూనాలను వదిలేసిపోయినవారి నుంచి చాలా తీసుకోవచ్చు. బహుశా చాలా మందిలాగే మాధవస్వామి కూడా కుటుంబ వ్యవస్థలో, ఉద్యోగంలో, సమాజంలో అనేక వొత్తిళ్లకు లోనై ఉండవచ్చు. కానీ ఆయనలో కొనసాగింపు అనే మరో లక్షణం ఉన్నది. మార్క్సిజం లెనినిజాన్ని, విప్లవాన్నీ అంటిపెట్టుకొని ఒడుదొడుకులన్నిటి మధ్యనే కొనసాగడం, అది పురాగామి దిశలో ఉండడం ఆయనలోని విశిష్టత. ఈ మాట చివరి రోజుల్లో మావోయిస్టు ఉద్యమంపట్ల అనురక్తి పెంచుకోవడం వల్లే అనడం లేదు. సమాజంలోని చాలా భిన్నమైన, వైవిధ్యమైన వాస్తవికతలతో ఆయన వ్యవహరించినందు వల్ల అనగలుగు తున్నాను. అవి ఉద్యోగ వర్గం గురించి అయినా కావచ్చు, రాయలసీమ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష గురించి కావచ్చు. మరేదైనా కావచ్చు.

ఈ పనులన్నీ వ్యక్తిగా చేయడానికి కూడా మాధవస్వామికి చాలా అవకాశం ఉంది. కానీ ఆయన ఆ పద్ధతికి విరుద్ధం. ఆయన సామాజిక రాజకీయ జీవితం ప్రజా సంఘాల నుంచి, రాజకీయ పార్టీ నుంచి వికసించింది కాబట్టి నిర్మాణాలకు బైట ఆలోచించే పద్ధతి అలవాటు కాలేదు. నిర్మాణమంటే చాలా యాతన ఉంటుంది. అందరిలాగే ఆయనా నిర్మాణాల్లో వొత్తిడికి గురై ఉంటారు. అయినా ఒక పని చేయాలంటే నిర్మాణయుతంగా, నలుగురు కలిసి చేయాల్సిందేనని, నిర్మాణాలు లేకుండా ఏ పనీ చేయలేమని, చేసినా అదొక నమూనా కాజాలదని ఆయనకు దృఢంగా ఉండేది.

ఆయనలోని ఇంకో ముఖ్యమైన సుగుణం సంయమనం. వ్యక్తిగతంగా ఆయన సౌమ్యుడని చెప్పుకుంటే సరిపోదు. ఆయన ఆలోచనా సంస్కృతిలోనే ఈ లక్షణం ఉన్నది. తీవ్రంగా వ్యతిరేకించే విషయంతోనైనా, అంగీకరించే విషయంతోనైనా ఆయన భావోద్వేగరహితంగా వ్యవహరించేవారు. ఆయనతో ఆలోచనాత్మక సంభాషణ చేసిన అనుభవమేగాని, ఆవేశపూరిత సంవాదం చేసిన అనుభవం బహుశా ఎవరికీ ఉండదేమో. తన నిశ్చయ వైఖరిని నిలుపుకుంటూనే ఇతరులతో సంభాషణ, ఆలోచన పంచుకోగలిగే వారు. ఇవ్వాల్టి ఉద్యమ ప్రపంచంలో ఇది కరువు కావడం వల్ల అందరూ ఉక్కబోతకు గురవుతున్నారు. స్థిమితంగా, నిలకడగా తరచి చూసుకోకపోతే ఒక్క అడుగు కూడా ముందుకు పోలేని ప్రత్యేక సామాజిక సందర్భంలో మనం ఉన్నామనే ఎరుక ఇప్పుడు చాలా అవసరం. మాధవస్వామిలోని కొన్ని నిశ్చయవైఖరులు కొంచెం ఇబ్బంది అనిపించినా స్థిమితంగా ఉండడం చాలా అపురూపము అనిపించేది.

ఆలోచనాజీవులకు కూడా కరువు ఉన్న రాయలసీమలో మాధవస్వామి అర్థాంతర మరణం వల్ల ఈ ప్రాంత ప్రజల హక్కుల ఉద్యమానికి తీరని వెలితి అని ఆయన అంత్యక్రియల సందర్భంగా మాట్లాడుతూ ప్రొ. శేషయ్య అన్నారు. ఆ మాట పూర్తి నిజం.

ఇలాంటి వెలితికి గురవుతూ, అధిగమిస్తూ ఉద్యమాలు సాగుతూ ఉంటాయి. కష్టనష్టాల మధ్యనే పురోగమిస్తాయి. కానీ ఇలాంటి మరణ సన్నివేశం మనకు ఏం నేర్పిస్తుంది? అనే ప్రశ్న ఎదురుకావడం అసమంజసం ఏమీ కాదనుకుంటాను. బహుశా మరణ సన్నివేశంలోలాగా జీవితం గురించిన ఆలోచనలు మరెన్నడూ కలగకపోవచ్చు. అయినా మనిషికి మరణం గురించి తెలిసినంతగా జీవితం గురించి తెలియనట్టే. ఈ మాట అతి అనిపించవచ్చుగాని, తరచూ మనం చాలా హృదయభారంతో, అంతర్ముఖత్వంతో, ఏదో తరుముకపోయినట్లు మృత్యు సన్నివేశంలో తచ్చాడుతూ ఉంటాం. అప్పుడు మాత్రం నిస్సందేహంగా మామూలు మనిషిగా ఉండం. లోపలిదంతా పెళ్లగిస్తుంది. ఏమిటిదంతా? జీవితమంటే ఏమిటి? అనే ప్రశ్నలు తలెత్తుతాయి. పాత రోజుల్లో కూడా ఇలాంటి ప్రశ్నలే తలెత్తి దాని నుంచి బోలెడు వేదాంతాన్ని తయారు చేసుకున్నారు. నిజమైన జీవితాన్వేషణకు తలుపులు మూసేసుకున్నారు.

ఒకసారి త్రిపురనేని మధుసూదనరావుగారు బాగా అనారోగ్యంతో బాధపడుతున్నప్పుడు పలకరింపుగా ఎలా ఉన్నారండీ అని అని అడిగితే 'ఏమున్నదయ్యా.. మరణమంటే ఒక పదార్థం మరో పదార్థంగా మారిపోవడమే గదా..? ' అన్నారు. 'మొండి' భౌతికవాది అయిన మధుసూదనరావు తప్పక అలాగే అనగలరు. కానీ మరణం అంటే అంతేనా? అదే అయితే జీవితం అంటే ఏమిటి? అనే ప్రశ్నకు కూడా గంభీరమైన సమాధానం కూడా ఏమీ ఉండదేమో అని ఆ రోజుల్లో భయమేసింది. అంతకుమించి మరణాన్ని మరీ అంత సింపుల్‌గా తీసేసుకుంటే జీవితం గురించిన అంతర్మథన లోపిస్తుందేమో అని దిగులేసింది.

ఇదంతా ఎందుకంటే - మరణం గురించిన చింతన, వ్యథ, దు:ఖం మనకేమైనా జీవితం గురించిన పాఠం నేర్పిస్తాయా? లేదా? మిత్రుడు కా. మాధవస్వామి మరణించినప్పుడు దేనికో ఇలా అనిపించింది. ఈమాటలకు సందర్భ ఔచిత్యం ఉన్నదో లేదో గాని - ఇటీవల ప్రియమైన, గౌరవనీయమైన వ్యక్తుల మరణాల వరుస క్రమం చూస్తుంటే ఈ మరణాలు మనకేమైనా జీవితం గురించి నేర్పించాయా? అనే విచికిత్స కూడా కలిగింది.

జీవితం గురించిన అంతర్మథనకు, ఎవరిలోకి వాళ్లు తొంగి చూసుకోడానికి మరణ సన్నివేశానికి మించిన సందర్భం ఏముంటుంది? ఉద్యమానికి సంబంధించిన కర్తవ్య దీక్షలు తప్పనిసరిగా ఉంటాయి. రకరకాల రూపంలో దూరమైపోతున్న ఉద్యమకారుల మరణాలు పాత కర్తవ్యాలను గుర్తు చేస్తాయి. కొత్త కర్తవ్యాలను భుజం మీదికి ఎత్తుతాయి. వాటి వల్ల తప్పనిసరిగా సమాజమనే వస్తుగతంలోని మార్పుకు దోహదపడతాయి. కానీ మనపక్క నిన్నటిదాకా కలిసి నడిచిన మనిషి అర్థాంతరంగా మాయమైపోతే, మనతో కలిసి ఆలోచించిన మేధ ఆగిపోతే.. సుదీర్ఘమైన కాల అవధిలో జరగాల్సిన మానవీయ ప్రయాణం గురించి మనలో చెలరేగే గాఢమైన ఆలోచనలే మనల్ని సజీవంగా నిలబెడతాయి. అయితే రోజువారీ సామాజిక జీవితంలో ఈ ఎరుకతో, సంయమనంతో ఉన్నామా? అనే అంతర్మథనమే ఉద్యమ నిర్వహణకు అవసరమైన వ్యక్తిత్వాలను అందిస్తుంది.



సంస్మరణ



# కొత్తపల్లి జయశంకర్ జ్ఞాపకాలు!

- సి. కాశీం

ప్రజాస్వామ్య తెలంగాణ రాష్ట్ర సాధన లక్ష్యంగా తెలంగాణ స్టూడెంట్స్ ఫ్రంట్(టి.ఎస్.ఎఫ్.) ఏర్పడి మూడు నెలలు గడిచింది(1998 అక్టోబర్ 13). నిజామాబాద్ జిల్లాలోని పోచంపాడు గ్రామంలో గోదావరి నది ఒడ్డున టి.ఎస్.ఎఫ్. మొదటి రాజకీయ శిక్షణా తరగతులు జరిగాయి. ఆ తరగతులకు మొదటి రోజు టీచర్‌గా ప్రొఫెసర్ జయశంకర్ వచ్చాడు. రోజంతా క్లాస్ చెప్పాడు. అనుభవం, ఆచరణను కలగలిపి తెలంగాణ జీవితాన్ని పూసగుచ్చినట్లు చెప్పాడు. సుమారు ఎనిమిది గంటలు చెప్పిన పాఠంలో తెలంగాణ గుండె సొదను విన్పించాడు. నీళ్ళు, నిధులు, కొలువులు ఏవిధంగా దోపిడికి గురయ్యాయో వివరించాడు. రెండు వందల మంది విద్యార్థులతో పాటు నేను కూడా తెలంగాణకు జరుగుతున్న వివక్ష విషయంలో ప్రాథమిక జ్ఞానమున్న వాడినే. కాని సార్ పాఠం విన్న తర్వాత నెలవంక వెలుగులో విచ్చుకున్న తామరపువ్వుల్లా మారిపోయాం. గోదావరినది ఒడ్డున కూర్చున్న మాకు ఆ నీళ్ళు పోచంపాడుకు దక్కకుండా రాజమండ్రికి తరలిపోతున్న తీరును ఆశ్చర్యం గొలిపేటట్లు చెప్పాడు.

నాగార్జునసాగర్ విజయపురిలో ఉండే ఓపెన్ యూనివర్శిటీ, ఆర్ఇసి వరంగల్‌లో ఉండే జెఎన్‌టియును ఎన్.టి. రామారావు ముఖ్యమంత్రి అయ్యాక హైదరాబాద్‌కు తరలించి విద్యారంగంలో తెలంగాణకు చేసిన అన్యాయాన్ని మొదటిసారి ఆయన నోటి నుంచే విన్నాం. విద్యారంగంలో తెలంగాణకు జరిగిన మోసాన్ని ఒక టీచర్‌గా జయశంకర్ చెబుతుంటే చదువు అందని తెలంగాణ పిల్లలు ఆయన ముఖంలో స్క్రోల్ అవుతున్నట్టే ఉండేది. ఆ ఎనిమిది గంటలు ఇట్లాంటి అద్భుతమైన, ఆశ్చర్యం గొలిపే అనేక సత్యాలను చరిత్ర పుటల్లో నుంచి మా మెదళ్లలోకి పంపించాడు. చివరికి పాఠం ముగిస్తూ "తెలంగాణ వస్తుందనే నమ్మకం రోజురోజుకూ తగ్గుతూ వస్తోంది... కాని... మిమ్మల్ని చూసాక తెలంగాణ రాష్ట్రం వస్తుందనే నమ్మకం ఏర్పడింది. ఎందుకంటే ఏ పనిని మొదలుపెట్టిన మిమ్మల్ని నడిపించేవాళ్ళు తుదకంటూ కొనసాగిస్తారు. లక్ష్యాన్ని సాధిస్తారని" చెప్పాడు.

ఆయన ఆశించినట్టే తెలంగాణ స్టూడెంట్స్ ఫ్రంట్ (టి.ఎస్.ఎఫ్.), తెలంగాణ జనసభలు తెలంగాణ వ్యాపితంగా విస్తృతమైన భావజాల ప్రచారం చేసాయి. విద్యార్థులను, ప్రజలను ఉద్యమంలో కదిలించాయి. ఐదు సంవత్సరాలు ఈ రెండు సంస్థలు శక్తివంచన లేకుండా పనిచేసాయి. దాడులు చేసి తలలు పగులగొట్టినా, జైళ్ళలో బంధించినా, బెల్లిలలితను, ఐలన్నను రాజ్యం చంపేసినా ధైర్యాన్ని కూడదీసుకొని, కన్నీళ్లను ఒత్తుకుంటూ ముందుకే నడిచాం. కాలం కత్తుల వంతెనపై నెత్తురు చిందించడానికి ఏనాడు వెనుదిరుగలేదు. లక్షలాది మందిని కదిలించి నిజాం కళాశాల మైదానంలో తెలంగాణ పొలికేక వినిపించాం. కోస్తాంధ్ర పెట్టుబడిదారులను, భూస్వాములను కరీంనగర్, పాలమూర్ జిల్లాల్లో తరిమికొట్టాం. ఇట్లా తెలంగాణ నినాదాన్ని పాఠశాల గదులలో, కళాశాల గోడల నిండా, గ్రామ పునాదుల నిండా నింపాం.

తెలంగాణలో బలపడిన ఈ పునాదిపైననే టిఆర్ఎస్ అనే ఒక రాజకీయ పార్టీ 2001లో పుట్టిందని అదే జయశంకర్ కనకాచారి సంస్మరణ సభ(2006)లో చెప్పాడు. నిర్బంధం పెరిగి పనితగ్గించామే తప్ప, ఎన్నడూ కూడా ఆగిపోలేదు. కనుక జయశంకర్ ఏదైతే ఆశించాడో దానిని నెరవేర్చే క్రమంలోనే ఆయన అనుకున్నవాళ్ళం ఉన్నాం. తెలంగాణ రాష్ట్ర సాధన కోసం పనిచేసిన కనకాచారిని కోస్తాంధ్ర ప్రభుత్వం పెంచి పోషించిన కోబ్రాలు చంపేస్తే తెలంగాణ నేలపై ఇంకెన్ని నెత్తుటి బొట్లు చిందాలే? అని బాధపడ్డాడు. అనారోగ్యంతో ఉండి కూడా కనకాచారి సంస్మరణ సభకు వచ్చి తన అభిప్రాయాలను పంచుకున్నాడు. ప్రజాస్వామ్య ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన కోసం ప్రాణాలర్పించిన వారి ఆశను నెరవేర్చడమే వారికి మనమిచ్చే నివాళని చెప్పాడు.

ఇంకొక విషయంలో ఆయనకు క్షమాపణ చెప్పుకునే అవకాశం లభించలేదు. కనీసం ఇప్పుడైనా చెప్పాలి. మా విరసం సభకు ఆయనను వక్తగా పిలిచాం. అప్పటికే బాగా నీరసించి ఉన్నారు. మా సభ్యులు ఒకరు ఆయన్ని ఉద్దేశించి వ్యంగ్యంగా, అవమానకరంగా మాట్లాడారు. కాని ఆయన ఎక్కడ నొచ్చుకోకుండా, సౌమ్యంగా మాట్లాడి ఆయన్ని తిట్టిన విషయాన్ని పట్టించుకోకుండా వెళ్ళిపోయాడు. ఇది ఆయన ఔన్నత్యానికి నిదర్శనం. ఇది సంస్థ కార్యక్రమమైనా ఒక సభ్యుడిగా నేను కూడా బాధ్యత వహించి మనిషి చనిపోయాక కూడా చెప్పకపోతే గుండె బరువు దిగిపోదు. అది వెంటాడుతుంటది.

జయశంకర్ ఆచరణతో, ఆలోచనలతో పాక్షిక సమ్మతమే ఉంది. ఇది తెలంగాణ విషయంలో కూడా వర్తిస్తుంది. కాకపోతే ఒక మనిషి తాను నమ్మిన విలువ కోసం ఆశయం కోసం జీవితాంతం కట్టుబడి, దాని కోసమే మరణించడమనే చిత్తశుద్ధి విషయంలో తిరస్కారం ఉండవల్సిన అవసరం లేదు. తెలంగాణ సాధన కోసం జయశంకర్ అందరితో కలిసి నడిచాడు. వరంగల్ డిక్లరేషన్ వేదికతో పాటు అదే వరంగల్‌లో టిఆర్ఎస్ వేదికపై కూడా మాట్లాడాడు. ఒక ప్రజాస్వామిక ఆకాంక్షను సాధించడానికి

సంస్మరణ



# ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు
# హక్కుల ఉద్యమ నిర్మాణంలో తొలిచాలు పెట్టినవాడు

\- వరవరరావు

పౌరహక్కుల ఉద్యమంపై ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు గారి ముద్ర చెరిగిపోయింది! ఈ తరానికి ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు తెలుసా? కన్నబిరాన్ సంస్మరణ సభలో ప్రత్తిపాటిని చూసి, విన్నవారికి గానీ, ప్రత్తిపాటి అంత్యక్రియల్లో ప్రతిస్పందన చూసిన వారికి గానీ ఆయనది చెరగని స్మృతి అని మళ్లా ఒకసారి విశ్వాసం కలిగింది.

ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు అయినా, ఆయన ముందుండి నిర్మాణం చేసిన పౌరహక్కుల సంఘమైనా శ్రీకాకుళ ఆదివాసీ ఉద్యమంపై, రైతాంగ సాయుధ పోరాటంపై రాజ్యహింసను ప్రశ్నించడానికి తలఎత్తిన నూతన శక్తులు. అందులో ఐక్య కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావం నుంచి వచ్చిన ఎం.టి. ఖాన్ వంటి వాళ్లు ఉండవచ్చు. నక్సల్బరీ శ్రీకాకుళాల నుంచే విప్లవోద్యమం వైపు ఆకర్షితులైన జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజు వంటి వాళ్లు ఉండవచ్చు. శ్రీకాకుళ ఉద్యమ నిర్మాణంలో భాగమైన కమ్యూనిస్టు నాయకత్వం వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం మొదలు ఆ ఉద్యమ స్ఫూర్తితోనే శాసనసభకు రాజీనామా ఇచ్చిన తరిమెల నాగిరెడ్డి వరకు ఉండవచ్చు. దగ్గరగా హైదరాబాదులో కొండపల్లి సీతారామయ్య, నీలం రామచంద్రయ్య, కొల్లా వెంకయ్యల కృషి ఉండవచ్చు. కాని కార్యకర్తలుగా కాడి ఎత్తుకున్న వాళ్లు ఎవరంటే మాత్రం వేళ్ల మీద లెక్కపెట్టదగిన నాటి యువకులు ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు వంటి వాళ్లే కనిపిస్తారు. అందుకే ఆయన 'వన్ మాన్ ఆర్మీ' ఆ రోజుల్లో.

'1969లో హైదరాబాద్‌లో పురానాపూల్ దగ్గర మొదటి పౌరహక్కుల సభ అడ్వొకేట్ శ్రీ మోటూరి అప్పల నర్సయ్య చౌదరి గారి అధ్యక్షతన జరిగింది. ఎన్‌కౌంటర్లు బూటకమని, న్యాయ విచారణ జరపాలని కోరాం. ఈ సభలో ఎం.టి. ఖాన్, జ్వాలాముఖి పాల్గొన్నారు.' (ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు - 'నా జీవితం - కృషి - జ్ఞాపకాలు')

'కొందరం ఆంధ్ర సారస్వత పరిషత్ హాల్‌లో కలిసి, హైదరాబాద్ - సికింద్రాబాద్ జంటనగరాల పౌరహక్కుల కమిటీ ఏర్పాటు చేసాం. ఆ కమిటీకి నేను కన్వీనర్‌గా ఉన్నాను.'

ఆ జంటనగరాల పౌరహక్కుల కమిటీ కన్వీనర్‌గానే ప్రత్తిపాటితో నా ప్రత్యక్ష పరిచయం. ఇప్పటికీ ఆయన పేరుతో చేయించిన ఒక రబ్బర్ స్టాంపు నా కళ్లలో ఆడుతున్నది. అది ప్రభుత్వ రాజముద్రను ప్రశ్నించిన హక్కుల ముద్ర. అట్లా ప్రారంభమైంది ప్రత్తిపాటి ప్రస్థానం. ఎమర్జెన్సీ ప్రకటించిన రోజు దాకానే కాదు, ఆయనను జైల్లో కూడా పెట్టాక, ఆయనను దృష్టిలో పెట్టుకునే, ఆయన నోరు మూయించడానికే ప్రత్యేకంగా ప్రభుత్వ ఉత్తర్వులు విడుదలయ్యే దాకా కూడా ఆయన ప్రస్థానం అప్రతిహతంగా కొనసాగింది. అందుకే ఆయనను ఎమర్జెన్సీ దాకా కూడా 'ఫైర్‌బ్రాండ్' అంటున్నారు.

హైదరాబాద్ ఇసామియా బజారులో ఒక సందులో చిన్నపాటి పట్టణంలో కనిపించే ఒక పాత భవనం లాంటి ఇల్లు. దర్వాజకు ఎదురుగానే ఆజానుబాహుడు, తాలింఖాన్ నుంచి వచ్చి కాగితాల మీద బుసకొడుతున్న పహిల్వాన్ వలె కనిపించే నల్లటివాడు. అడుగుపెట్టగానే, ఎవరినైనా సరే నిలబడి సాదరంగా, సౌమ్యంగా, నమస్కరిస్తూ ఆహ్వానించే మృదుస్వరం. ఆయనకు ముద్దాయిలతో కాగితాల, డాకెట్ల సంబంధం కాదు. కబుర్ల సంబంధం. కమ్యూనిస్టు కలల సంబంధం. కలిసి తినే, నడిచే, చాయ్‌లు తాగే సంబంధం. ఎంతో కలివిడి మనిషి. భోళాశంకరుడు.

న్యాయవాదిగా సరే హక్కుల న్యాయవాదిగా కూడా అదే టైపు మిషను, అదే పలచటి కాగితాలు. ఆయన జేబు నుంచి ఖర్చు. అదే ఇసామియా బజార్లో బట్టలు ఇస్త్రీ చేస్తూ, పాటలు చెప్తూ, స్టేట్ టీచర్స్ యూనియన్‌లో క్రియాశీలంగా పని చేస్తూ విప్లవ రహస్యోద్యమానికి చేయూతనిచ్చే జంగయ్య మాస్టారు జట్టు. విద్యుత్ శాఖలో పనిచేసే టైపిస్టు కుర్రవాడు సాయంకాలాలు పౌరహక్కుల ప్రకటనలు టైపు చేసి సైకిల్‌పై పత్రికలకిచ్చే సంచాలకుడు. ఎం.టి. ఖాన్, ఎం. రంగనాథంల సలహా, సహాయ సహకారాలు. ఇంకా ఏర్పడని సంఘం తాలూకు రాడికల్ విద్యార్థులొకరిద్దరు.

ఇసామియా బజార్‌లో ఈ మూసీ నది మనం చూస్తున్న మూసీ నది వలె ఎండిపోలేదు. గుంటూరులో 73లో ప్రథమ మహాసభలు జరిగే నాటికే జిల్లా కమిటీలు ఏర్పాటు చేసుకున్నది.

---

సైద్ధాంతిక విభేదాలను పక్కకుపెట్టి కలిసి నడవాలనే భావనను తప్పు పట్టలేమేమో? ఒక బుద్ధిజీవిగా జయశంకర్ తెలంగాణ భావజాలాన్ని నలభై సంవత్సరాలుగా ప్రచారం చేయడంలో ఆయనకు ఆయననే అన్నట్లు తిరిగాడు. వేదికలను బట్టి మాట్లాడే మేధావులున్న ఈ రోజులలో, ఏ సంస్థ వేదిక నెక్కినా తాను నమ్మిందే చెప్పాడు తప్పా అవకాశ వాదంగా వ్యవహరించలేదు. ఇట్లాంటి ప్రజాస్వామిక లక్షణాలు ఎవరిలో ఉన్నా స్వీకరించడానికి సందేహించవల్సిన అవసరం లేదు.

జయశంకర్‌తో నాకున్న పరిచయం చాలా తక్కువ. ఈ చిన్న వ్యాసంలో ఆయన వ్యక్తిత్వాన్ని అంచనా వేసే పరిచయం, అనుభవం కూడా నాకు లేవు. కొన్ని జ్ఞాపకాలను మాత్రమే పంచుకున్నాను..



వరంగల్‌లో తోకల లక్ష్మారెడ్డి, నల్లగొండలో పులిజాల రాఘువరంగారావు, వనపర్తిలో డాక్టర్ బాలకృష్ణయ్య, నిజామాబాద్‌లో బొజ్జాతారకం, గుంటూరులో గణేశుని కోటేశ్వరరావు, విశాఖపట్నంలో రాచకొండ విశ్వనాథ శాస్త్రి, ఖమ్మంలో వాసిరెడ్డి రంగయ్య ఇట్లా ప్రతి చోట రాష్ట్రం నలమూలల.

ఈ పేర్లెందుకు ఇంత వివరంగా రాసానంటే ప్రారంభించిన నాడు మోటూరు అప్పల నర్సయ్య చౌదరి మొదలు - ఆ తర్వాత కాలంలో ఆయన నక్సలైటు డిఫెన్స్ కమిటీలోకి తెచ్చినవాళ్లు, కోర్టుల్లో కేసులు వాదించడానికి తెచ్చిన రావి సుబ్బారావు వంటి వాళ్లు - అందరూ తాముగా సామాజిక కార్యకర్తలుగా, ప్రజాస్వామ్యవాదులుగా ఆయా జిల్లాల్లోను, రాష్ట్రంలోను కూడా లబ్ధ ప్రతిష్ఠులు. వీరిలో చాలా ఎక్కువ మందికి కమ్యూనిస్టు రాజకీయాల పట్ల అభిమానం. నక్సలైటు ఉద్యమం పట్ల అది న్యాయం కోసం చేస్తున్న పోరాటం అనే సానుకూలత ఉండవచ్చు. కాని వీళ్లలో చాలామంది వైద్యులుగా ప్రజా వైద్యులు. న్యాయవాదులుగా ప్రజా న్యాయవాదులు. మొత్తంగా అణగారిన ప్రజల పోరాడే హక్కును గుర్తించి, గౌరవించి ఆ హక్కుల కోసం పోరాడాలని తహతహలాడిన వారు.

1973 డిసెంబర్ 26న గుంటూరులో ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం రాష్ట్ర మహాసభలు జరుపుకునే నాటికే 'వీరందరూ ఎన్నియో యుద్ధము'ల ఆరితేరిన వారు. వాళ్లకు కేంద్ర బిందువు ప్రత్తిపాటి.

అటు శ్రీకాకుళంలో తరిమెల నాగిరెడ్డి పూనికతో శ్రీశ్రీ, జ్వాలాముఖి, చెరబండరాజులు 'కల్లోలిత ప్రాంతాల' చట్టాన్ని రద్దు చేయాలని, పోలీసు క్యాంపులు ఎత్తివేయాలని, ఎన్‌కౌంటర్లన్నీ ప్రభుత్వ హత్యలేనని విస్తృత ప్రచారం చేసారు. ఇటు ప్రత్తిపాటి నాయకత్వంలో పౌరహక్కుల ఉద్యమం బయటనే కాకుండా హైకోర్టులో, హైదరాబాద్‌లోనే కాకుండా ముఖ్య నగరాల్లో నక్సలైటు డిఫెన్సు కమిటీలు ఏర్పాటు చేసింది. హైకోర్టులో తర్వాత కాలంలో న్యాయమూర్తులైన జీవన్‌రెడ్డి, గంగాధరరావులు మొదలు పద్నాలుగు మంది సుప్రసిద్ధ న్యాయవాదులు ఈ డిఫెన్స్ కమిటీలో సమష్టిగా నక్సలైటు కేసులు వాదించారు.

మొట్టమొదటి కుట్రకేసు జంటనగరాల కుట్ర కేసు వాదించినవాడు ప్రత్తిపాటియే. అందులో ముద్దాయి అయిన ఎజి ఆఫీసు ఉద్యోగి శ్యాంసుందర్ ఆయనకు జీవితాంతం సన్నిహిత మిత్రుడుగా మసలుకున్నాడు. అలాగే ఇంగువ మల్లికార్జున శర్మపై కేసులు 1975 దాకా ఆయనే వాదించాడు.

1971లో మార్చ్, ఝుంఝు కవితా సంకలనాలను నిషేధింపబడినపుడు జ్వాలాముఖి పిటిషనర్‌గా ప్రత్తిపాటి వాదించాడు. 'లే' కవితా సంకలన నిషేధంపై కన్నబిరాన్ వాదించాడు. మొదటి రెండు పుస్తకాలపై నిషేధాన్ని హైకోర్టు ధ్రువపరిచింది. ముగ్గురు న్యాయమూర్తుల్లో జస్టిస్ కొండా మాధవరెడ్డి మాత్రం 80 పేజీల డిసెంటు రాశాడు. '71 ఆగస్టులో ముగ్గురు విప్లవ రచయితల (జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజు)ను పిడి చట్టం కింద అరెస్టు చేసినపుడు ప్రత్తిపాటి సమన్వయంతో జరిపిన కృషి వల్లనే జస్టిస్ చిన్నపరెడ్డి 'విశ్వాసాల గురించి ఎవరినీ శిక్షించడానికి వీలు లేద'ని వీరిని విడుదల చేయడమే కాకుండా పిడి చట్టాన్నే కొట్టివేసాడు.

ఇంతా రమణారెడ్డి, పులి రామకృష్ణ, శంకరరెడ్డిలపై ఉరిశిక్షను హైకోర్టు యావజ్జీవ శిక్షగా మార్చే విషయంలో గానీ, నాగభూషణ పట్నాయక్ ఉరిశిక్ష 1972లో రద్దయ్యే విషయంలో గానీ కోర్టులో, బయట ఉద్యమంగా డిఫెన్స్ కమిటీ నిర్వహించిన పాత్రను సమన్వయం చేసినవాడు ప్రత్తిపాటి. అప్పటి నుంచీ నక్సలైట్లపై ఉరిశిక్షల కేసులన్నీ సి. పద్మనాభ రెడ్డి గారు వాదించి ఎమర్జెన్సీలో బర్ల యాదగిరి రాజుపై ఉరిశిక్షను రద్దుచేసి నిర్దోషిగా కూడ ప్రకటింప జేసారు. ప్రత్తిపాటి కవితలకు ముందుమాట రాస్తూ హైకోర్టు సీనియర్ న్యాయవాది సి. పద్మనాభ రెడ్డిగారు స్వయంగా 'మేమిద్దరం కలిసి ఎన్నో కేసులు చేసాం. అన్యాయం మీద ఆయన చేసే పోరాటం రోజూ చూస్తున్నాం. ఆయనకు భయమంటే ఏమిటో తెలియదు. అట్టి ధైర్యవంతుల వల్లనే ఇంకా న్యాయం నిలుస్తూ ఉంది' అని రాసారు.

పార్వతీపురం కుట్ర కేసు కాలం నుంచి నాగభూషణ్ పట్నాయక్‌పై ఉరిశిక్ష రద్దు అయ్యే దాకా కూడా నక్సలైట్లు వారుగా కోర్టుల్లో డిఫెన్సు పెట్టుకోలేదని, కోర్టులను బహిష్కరించే వైఖరి తీసుకున్నారని, నాగభూషణ్ పట్నాయక్ తన ఉరిశిక్ష రద్దు చేయాలని కోర్టుకు గానీ, రాష్ట్రపతిని గానీ కోరలేదని మనం గుర్తుపెట్టుకుంటే తాముగా ఈ ప్రజాస్వామిక న్యాయవాదులు, జస్టిస్ చిన్నపరెడ్డి వంటి న్యాయమూర్తులు రాజ్యాంగాన్ని నిర్వచించి, నక్సలైట్ల కోసం కూడా న్యాయాన్ని అన్వయించే బాధ్యత తమదని భావించారని మనకు వాళ్లపై గౌరవం పెరుగుతుంది.

గుంటూరు మహాసభల నాటికి విప్లవ పార్టీల ప్రభావం తక్కువేమీ కాదనడానికి ఆ సభలు జరిగిన తీరు, బహిరంగ సభలో ఆయా ఎం.ఎల్. పార్టీల ప్రతినిధులుగా నిర్ణయమైన వక్తలు, ఆ సభలు మావో జయంతి అయిన డిసెంబర్ 26న జరగడం, ఏర్పడిన రాష్ట్ర కమిటీలో ప్రాతినిధ్యం చూస్తే అర్థమవుతుంది. కాని

'.. బహిరంగసభలో నేను మాట్లాడితే నాగిరెడ్డిగారు మాట్లాడనన్నారు. ఆయన మాట్లాడడమే ముఖ్యమని నేను మాట్లాడలేదు... ఐక్య ఉద్యమ ఆవశ్యకతను, ప్రాముఖ్యతను గమనించకపోవడం మంచిది కాదని నేను నీలం రామచంద్రయ్యతో చర్చిస్తే ఐక్య కమిటీకి ప్రయత్నించమన్నాడు' అని ప్రత్తిపాటి గారు రాసుకున్నది మాత్రమే కాదు, ఆయన 75 దాకా ఏపిసిఎల్‌సి ప్రథమ ప్రధాన కార్యదర్శిగానే కాదు జీవితమంతా ప్రజాస్వామ్యవాదుల, సామాజిక మార్పు వాదుల, కమ్యూనిస్టుల ఐక్యత ఆకాంక్షించారు. 'పని హక్కు'ను ప్రాథమిక హక్కుగా సాధించుకోవాలనే ఉద్యమంలో వీళ్లందరినీ ఏకం చేసే కృషి చివరిదాకా చేసారు. 'ప్రజా సమస్యలపై పనిచేసేవాళ్లం, మన సమస్యల కారణంగా విడిపోతే ఎట్లా' అనేవాడాయన.

విప్లవ రచయితల సంఘంకు ప్రత్తిపాటి చాలా ఆత్మీయుడు.

విరసం కూ, ఎపిసిఎల్‌సి కి కూడా ఎమర్జెన్సీ దాకా శ్రీశ్రీయే అధ్యక్షుడు కావడం కూడా ఈ గాఢానుబంధానికి కారణమైనవి. ఎమర్జెన్సీ దాకా ఈ రెండు సంస్థలూ హక్కుల సాధన ఉద్యమంలో చేతిలో చెయ్యేసి పనిచేసాయి. విరసం కార్యవర్గ సభ్యులు అరడజను దాకా ఎపిసిఎల్‌సి రాష్ట్ర కార్యవర్గ సభ్యులుగా కూడా ఉండేవాళ్లు. కాశీపతి, రంగనాథం ప్రత్తిపాటి తర్వాత 1978లో ప్రధాన కార్యదర్శిగా బి. ప్రదీప్ ఎన్నికయ్యే దాకా ఎపిసిఎల్‌సి కన్వీనర్లుగా కూడా పని చేసారు. కనుక పుస్తక నిషేధాలు, నిర్బంధాలే కాదు ప్రత్తిపాటి సహజంగానే విరసంపైనే కేంద్రీకరించిన సికింద్రాబాద్ కుట్రకేసు (మే 1974)ను కూడా చేపట్టి ఎమర్జెన్సీ దాకా మెజిస్ట్రేట్ కోర్టులో రావిశాస్త్రి, కె.వి. సుబ్బారావు, బొజ్జాతారకంలను కూడా పిలిపించి వాదింప జేసారు. రావి సుబ్బారావు గారి మరణంతో ఎమర్జెన్సీ దాకా ఆ కేసు విచారణ భారమంతా తానే మోసాడు. సికింద్రాబాదు కుట్ర కేసులో ముద్దాయిగానే ఆయనతో మా అనుబంధం మరింత గాఢమైంది. సికింద్రాబాద్ జైల్లో మమ్మలను తరచు కలుస్తూ ఉండేవాడు. ఒకరకంగా 75 దాకా సికింద్రాబాద్ కుట్ర కేసు ముద్దాయిల్లో ఆయన ఒకడనిపించేవాడు.

అప్పటికే ఆయన భూమయ్య, కిష్టాగౌడ్‌లపై మోపబడిన హత్య కేసుల్లో ఉరిశిక్షను రద్దు చేయాలని హైకోర్టులో వాదించి ఉన్నాడు. కాని వారిపై హైకోర్టు ఉరిశిక్షను ఖాయం చేసింది. సుప్రీంకోర్టులో గార్గ్‌ను న్యాయవాదిగా కూడా ఏర్పాటు చేశాడు. మేమంతా సికింద్రాబాద్ జెయిల్లో ఉండగానే మొదటిసారి 74 నవంబర్‌లో భూమయ్య, కిష్టాగౌడ్‌లకు ఉరిశిక్ష వేసే నిర్ణయమై వచ్చింది. ప్రత్తిపాటిని జైలుకు పిలిపించాం. ఆయన వాళ్లను స్వయంగా కలిసి వారి ఉరిశిక్షను ఆపడానికి చేసిన కృషి, చొరవ ఏ హక్కుల కార్యకర్తనయినా ఉత్తేజపరచేవనుకుంటాను. పాట్నాలో సిపిఐ జాతీయ కౌన్సిల్ సమావేశంలో ఉన్న ప్రధాన కార్యదర్శి చంద్ర రాజేశ్వరరావును బయటికి పిలిపించి భూపేష్ గుప్తాను (అప్పటి సిపిఐ రాజ్యసభ సభ్యుడు) రాష్ట్రపతి దగ్గరికి పంపించాడు. ఆ ప్రయత్నమటు చేస్తూనే స్వయంగా తాను రాష్ట్రపతికి ఫోన్ చేయడానికి ప్రయత్నించాడు. ఆ మధ్యాహ్నం రాష్ట్రపతి నిద్రపోతున్నాడని ఆయన సిబ్బంది చెప్తే 'ఇక్కడ ఇద్దరి పౌరుల ప్రాణాలు ప్రమాదంలో ఉంటే దేశ ప్రథమ పౌరుడు నిద్రెట్లా పోతాడు. లేవండి' అన్నాడు. ఆ రాత్రికి వాళ్ల ఉరిశిక్షలు తాత్కాలికంగా ఆగిపోయినవి. (ఈ సందర్భంగా అప్పటి జైలు సూపరింటెండెంట్, టెండుల్కర్ మరాఠీ నాటకాలు ప్రదర్శించే కురు దూర్కర్ సహకారాన్ని, చంద్ర రాజేశ్వరరావు, భూపేశ్ గుప్తాల కృషిని కూడా తప్పక గుర్తు చేసుకోవాలి.)

1973-75 మధ్యకాలంలో భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలు రద్దు చేయాలని విస్తృతంగా సభలు జరిగాయి. హుజూరాబాద్, బెల్లంపల్లి, మందమర్రి - ఎక్కడైనా కావచ్చు - శ్రీశ్రీ, ప్రత్తిపాటి లేకుండా ఆ సభలు లేవు. అట్లాగే ఎన్‌కౌంటర్ల పై, అరెస్టులపై, రాజ్యహింసపై జరిగిన సభలు కూడ.

11 మే 1975న రెండోసారి భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలు ఖాయం చేస్తూ ప్రభుత్వ ఉత్తర్వులు వెలువడినవి. జైలు ముందరి సెంట్రీ ఆ విషయం సికింద్రాబాద్ జెయిలు ముందునుంచి సైకిల్‌పై పోతున్న అప్పటి పిడిఎస్‌యు నాయకుడు (ఆ తర్వాత కాలంలో సిపిఐ ఎంఎల్ (ప్రతిఘటన - రాష్ట్ర కార్యదర్శి) మధుసూదన్ రాజ్‌కు చెప్పాడు. అదే సైకిల్‌పై మధుసూదన్ రాజ్ ఇసామియా బజార్‌లో ప్రత్తిపాటి ఇంటికి చెప్పడానికి వెళ్లాడు. వేసవి సెలవులు గనుక ఆయన ఊళ్లో లేడు. ఆ తర్వాత కన్నబిరాన్ గారు పిటిషన్ వేసి, ముగ్గురు యువ న్యాయవాదులను జస్టిస్ చిన్నపరెడ్డి, గంగాధర రావుల ఇళ్లకు పంపాడు. ఆ రాత్రికి హైకోర్టు స్టే ఆర్డర్ వచ్చింది.

ఇంక 1975 మే నుంచి జూన్ 26న ఎమర్జెన్సీ ప్రకటించే దాక 'భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్ష రద్దు కమిటీ' కన్వీనర్‌గా ప్రత్తిపాటి ఉద్యమాన్ని దేశవ్యాప్తం కాదు, ప్రపంచవ్యాప్తం చేసాడంటే అతిశయోక్తి కాదు. జయప్రకాశ్ నారాయణ్, ఎ.బి. వాజపేయి మొదలు, జయపాల్ రెడ్డి దాక, జార్జి ఫెర్నాండెజ్ మొదలు జీన్‌పాల్ సార్త్ దాకా భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్ష రద్దు కోసం డిమాండ్ చేసారు. తారిక్ అలీ నాయకత్వంలో ప్యారిస్ భారత రాయబార కార్యాలయం ముందు నిరసన ప్రదర్శనలు జరిగాయి. ఢిల్లీలో బోట్‌క్లబ్ ముందు కాగడాల ప్రదర్శన ఏర్పాటు చేసి ప్రత్తిపాటితో ఢిల్లీ నుంచి జార్జి ఫెర్నాండెస్ దేశవ్యాప్త సమన్వయం చేయాలని నిర్ణయం జరిగింది.

ఇంతలో జూన్ 25 అర్ధరాత్రి ఆంతరంగిక అత్యయిక స్థితి (ఎమర్జెన్సీ) ప్రకటించబడింది. మొట్టమొదటి వేటు ప్రత్తిపాటి మీదనే పడింది.

ఇసామియా బజార్‌కు సుల్తాన్ బజార్ పోలీసు స్టేషన్ చాలా దగ్గర. ఆ అర్ధరాత్రి రాష్ట్రంలో మొదటి డిటెన్యూ ప్రత్తిపాటియే. అయితే మర్నాడు చంచల్‌గూడకు పంపేవరకు కూడా ఆయన సుల్తాన్‌బజార్ పోలీసు స్టేషన్ నుంచి జార్జి ఫెర్నాండెస్‌కు బోట్ క్లబ్ మీటింగు ఏర్పాట్ల కోసం ఫోన్‌లో ప్రయత్నిస్తూనే ఉన్నాడు. జైలుకు తీసుకు వచ్చాక కూడా టెలిగ్రాంలు పంపుతూనే ఉన్నాడు. డిటెన్యూలకు ఏ ప్రాథమిక హక్కులు లేవని, ఆమోదించిన కుటుంబ సభ్యులతో తప్ప ఎవరితోనూ ఏ రకమైన సంబంధాలు పెట్టుకోరాదని ఉత్తర్వులు వచ్చే దాకా ప్రత్తిపాటి ఎపిసిఎల్‌సి ప్రధాన కార్యదర్శి కర్తవ్యాలు జైలు నుంచి కూడ నిర్వహించే ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు.

1975 డిసెంబర్ 1 చీకటి వేకువ భూమయ్య, కిష్టాగౌడ్‌లను సికింద్రాబాద్ జెయిల్లో ఉరితీసిన సమయంలో ప్రత్తిపాటి చెంచల్‌గూడ (హైదరాబాద్) జైల్లో తన సహచరులతో అసహాయ సమష్టి, నిర్బంధంలోను నిరసనలోను ఉన్నాడు.

విప్లవోద్యమంలో ఉన్న యానాల మల్లారెడ్డి, పులి రామకృష్ణ వంటి వాళ్లు 'ఎన్‌కౌంటర్ల'కు గురి కాకుండా వెంటనే హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటిషన్ వేయడంలోను, టాన్యా, ముక్కు సుబ్బారెడ్డి వంటి వాళ్లు మళ్లీ కోర్టు బయటే అరెస్టు కాకుండా కాపాడడంలో ప్రత్తిపాటి ఎంతో చొరవ, మెలకువ చూపాడు. ఎంతమంది నిర్బంధం నుంచి స్వేచ్ఛ పొందడానికి, అన్యాయానికి

గురికాకుండా కాపాడడానికి కారణమయ్యాడో లెక్కేలేదు.

అయితే కాగితాల ఖర్చులు, కోర్టు ఖర్చులు తప్ప ఆయన ఎన్నడూ ఎక్కువ ఫీజు తీసుకున్నది లేదు. పైగా ముద్దాయిలు, కార్యకర్తలు రోజుల తరబడి ఆయన ఇంట్లో ఉండే వాళ్లు. మాబోటి మిత్రులు ఆయన ఇంట్లోనే తినేవాళ్లు. ఇసామియా బజార్‌లో ఆయన ఇల్లు ఒక సత్రం. 'శేషూ, మన వాళ్లకు చాయ్ పోస్తావా, ఇవ్వాళ మన వాళ్లు ఇక్కడే తింటారు. ఏది ఉంటే అదే' అని ఆయన ఆత్మీయ ఆతిథ్యం చెవుల్లో ఇప్పటికీ వినిపిస్తున్నది. ఆయనది చాలా నిరాడంబరమైన జీవితం.

అన్యాయం జరిగిన వాళ్లకు ఇరవై నాలుగు గంటలూ అందుబాటులో ఉండే న్యాయవాది ఆయన. ఎమర్జెన్సీలో ఆయన అరెస్టయ్యే నాటికి ఉన్న కేసులన్నీ కన్నబిరాన్ గారు నిర్వహించి, ఆయన కోర్టు గుమస్తాకు కూడా తన దగ్గర ఉద్యోగమిచ్చి ఆయన కుటుంబానికి అండగా ఉన్నప్పటికీ ప్రత్తిపాటి కుటుంబం ఎమర్జెన్సీలో చాల ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొన్నది. చాలా కష్టాలు అనుభవించింది. అనారోగ్యంతో ఆయన భార్య రెండు సంవత్సరాల ముందే మరణించింది.

వీటికి తోడు ప్రత్తిపాటికి ఎమర్జెన్సీ తర్వాత మధుమేహ వ్యాధి బయటపడింది. ఎంతో దృఢకాయుడు కట్టెపుల్ల వలె తయారయ్యాడు. డెబ్బై అయిదవ ఏట జూన్ 11 సాయంత్రం నిమ్స్ ఆసుపత్రిలో శ్వాసకోశ సంబంధమైన వ్యాధితో మరణించాడు.

శ్రీశ్రీ పట్ల ఉన్న గాఢాభిమానం గురించి రాయకుంటే ప్రత్తిపాటి గురించి కొంత కొరతే ఉంటుంది. 'సమ సమాజ లక్ష్య సాధనకు జనావళిని కదిలించ సమర శంఖాన్ని కవితలతో పూరించిన' శ్రీశ్రీ ప్రభావం మా తరంపై విచిత్రం కాదు గానీ, ఐదేళ్లు ఆయనతో అంతగా కలిసి క్రియాశీలంగా ఎపిసిఎల్‌సిలో పని చేయడం వల్ల శ్రీశ్రీ అంటే ఆయనకు ఎనలేని అభిమానం.

శ్రీశ్రీ ప్రభావంతో ఆయన కవిత్వం కూడా రాసి శ్రీశ్రీ శతజయంతి సంవత్సరం (2010)లో అచ్చేసి 'శతవత్సరాల మహాకవి శ్రీశ్రీకి అంకితం' చేసాడు. 'ప్రత్తిపాటి కవితలు' పేరుతో వెలువడిన ఆ పుస్తకంలో 'శ్రీశ్రీ ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం అధ్యక్షుడుగా నిర్బంధానికి, హింసకు గురియైన జనులను మారుమూల గ్రామాలకు వెళ్లి కలిసి, బహిరంగ సభలు నిర్వహించి మేమున్నామని మీ వెంట అందరం ఎదుర్కొందాం పాలకుల హింసను అని చెప్తూ ప్రజలతో కలిసి పోరాడవలెనని మేధావులకు చెప్పిన ఆదర్శవాది మహాకవి శ్రీశ్రీ' అంటూ పౌరహక్కుల సంఘం అప్పటి ప్రధాన కార్యదర్శిగా ప్రజాకవి శ్రీశ్రీకి 'నా జోహార్లు' అని ఆఖర్న రాసాడు.

శ్రీశ్రీ ఇల్లు మార్ట్‌గేజ్ అయి శ్రీశ్రీ నిరాశ్రయుడయ్యే పరిస్థితి వచ్చిందంటే ప్రత్తిపాటి విరాళాలు వసూలు చేసి శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో సభ ఏర్పాటు చేసి ఆయనకు అందజేసాడు. ఎపిసిఎల్‌సి మరో రాష్ట్ర నాయకుడు డాక్టర్ బాలకృష్ణయ్య వనపర్తిలో కూడా అటువంటి కృషి ఇంకా పెద్ద ఎత్తున చేసాడు.

ఆయన శ్రీశ్రీ కవిత్వ లాలసుడు. 'నక్సలైటు పొంచినాడురా, నీ నెత్తిన నాటు బాంబు విసురుతాడురా' అని జలగం వెంగళరావుపై శ్రీశ్రీ రాసిన గీతానికి మందమర్రి సభలో పరవశుడై 'మహాకవి ఏమన్నాడో విన్నారు కదా' అన్నందుకు మర్నాడు జలగం వెంగళరావు కన్నెర్రకు గురయ్యాడు. పౌరహక్కుల కార్యకర్తలకు పారవశ్యం పనికిరాదు. అందుకే ఆయన స్వభావానికి విరుద్ధంగా గుంటూరు మహాసభల నాటికి ఆయనకు అతివాద ముద్రపడింది. ఆయన 'నా జీవితం కృషి, జ్ఞాపకాలు' పుస్తకావిష్కరణ సభ నిర్వహించిన వారు ఆ గతం తుడిచేయడానికా అన్నట్లు ఆ సభలో ఆయన ఆరంభ సహచరుడు ఎం.టి. ఖాన్‌ను కూడా మాట్లాడమని కోరలేదు. ఆయన మాత్రం ఎర్రజెండా అభిమానిగా పిడికిలెత్తి కామ్రేడ్స్ అని సంబోధిస్తూ నినాదాలిచ్చేవాడు.

పౌరహక్కుల సంఘం, పౌర ప్రజాస్వామిక హక్కుల ఉద్యమం, ప్రత్తిపాటి నుంచి ఈనాటికి చాలా విస్తృతమైనది. వైవిధ్యాన్ని, లోతును, సైద్ధాంతిక అవగాహనను పెంపొందించుకున్నది. అందుకు ఎపిసిఎల్‌సిలో ఆరుగురు ప్రాణాలే అర్పించారు. ఎందరో జీవితమంతా అహర్నిశలు కృషి చేసారు. ఆ కృషిలో తొలిపాదముద్రలు మాత్రం తప్పకుండా శ్రీశ్రీ, ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు వేసినవే. అవి ఎప్పుడైనా ఒకవేళ తప్పటడుగులు అయినా తప్పకుండా హక్కుల ఉద్యమానికి ఆగకుండా సాగిపోయే నడక నేర్పినవే.



సంస్మరణ

# కవి, గాయకుడు, విప్లవవాది కా. కిట్టుకు నివాళి

- సి. రాంమోహన్

పాలమూరు జిల్లాలో విప్లవ సాంస్కృతిక ఉద్యమానికి పునాదులు వేసి, విప్లవ రాజకీయాల ప్రచారానికి తెరలేపిన తొలి తరం విప్లవ కార్యకర్త, కవి, గాయకుడు కిట్టుమామ (68) సోమవారం తేది 21-3-2011 నాడు హైదరాబాద్‌లోని ఇందిరానగర్‌లోని తన స్వగృహంలో కన్నుమూశారు. కొంతకాలంగా తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్నాడు. గుండెపోటుతో మరణించాడు. వివేకానంద నగర్‌లోని స్మశానవాటికలో జరిగిన అంత్యక్రియలకు బంధువులతో పాటు విరసం నేత వరవరరావు, రాఘవాచారి, జనజ్వాల, రాజేంద్రబాబు, క్రాంతి చైతన్య, మధు, ఇంకా ఇతర మిత్రులు హాజరై, కిట్టు మామకు నివాళి ఘటించారు.

అయోధ్య ప్రాంతం నుండి గద్వాలకు వచ్చి స్థిరపడిన శ్రీ వైష్ణవ కుటుంబం. తర్వాతికాలంలో వనపర్తి పట్టణంలో హోటలు నడుపుకుంటూ జీవనం సాగించేది. జీవనం సాగించేది. స్థానిక ఉన్నత పాఠశాలలో చదువుకుంటూనే హోటల్ నడుపుకునేవారు. ముగ్గురు అన్నదమ్ములూ చిన్న చిన్న ఉద్యోగాలలో స్థిరపడినా, కిట్టు హై స్కూలు విద్య కూడా పూర్తి కాకుండానే మార్క్సిస్టు పార్టీ కార్యకర్తగా పనిచేశాడు. ఆ పార్టీలో జిల్లా స్థాయిలో విద్యార్థి, యువజన, ఇతర ప్రజా సంఘాలలో పనిచేసేవారు. ఆ తర్వాత ప్రజా పక్షపాతి, భారత్ - చైనా మిత్ర మండలి, పౌరహక్కుల సంఘం నాయకుడుగా ఉండిన డా. బాలక్రిష్ణయ్య దగ్గర కారుడ్రైవరుగా పనిచేస్తూ నగర ప్రజా సంఘాలతో కలిసి పనిచేసేవాడు. వనపర్తి పట్టణంలో ప్రగతిశీల రాజకీయ ఉద్యమాలకు పెద్ద దిక్కుగా ఉన్న డాక్టర్ గార్కి, కిట్టూ సలహాలనిస్తూ అతనికి, ప్రజలకు వారధిగా పట్టణ అభివృద్ధి కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనేవాడు.

శ్రీకాకుళ ఉద్యమ ప్రభావం పాలమూరు జిల్లాను ప్రభావితం చేసిన కాలంలో కిట్టూ మార్క్సిస్టు పార్టీ నుండి విడిపోయి మిత్రబృందంతో విప్లవరాజకీయాల వైపు ఆకర్షితుడైనాడు. మంచి గాయకుడు, కవియైన కిట్టు వనపర్తి పట్టణంలో 1972లో పాలిటెక్నిక్ కళాశాలలో దిగంబర కవుల సభలను ఏర్పాటు చేసి విద్యార్థి, యువజనుల్లో ప్రశ్నల కొడవళ్ళను విసిరాడు.

1974లో కర్నూలు విరసం సభలకు వనపర్తి పట్టణం నుండి యువమిత్రులను సమీకరించాడు. గద్వాల సాహితి మిత్రులతో, మహబూబ్‌నగర్ సాహితి ప్రియులతో సంబంధాలు ఏర్పరచుకొని పాలమూరు జిల్లాలో విరసం వ్యవస్థాపక సభ్యుడైనాడు. వనపర్తి పట్టణంలో గ్రామపంచాయితీ అధ్యక్షునిగా డా. బాలక్రిష్ణ గ్రామసభను ఏర్పాటు చేయగా, ఆ సభకు ఆనాటి విరసం కవులందరిని ఆహ్వానించారు. ఇందులో కిట్టు కృషి చాలా గొప్పది. మహాకవి శ్రీశ్రీ, చెరబండరాజు, వరవరరావు, ఎం.టి.ఖాన్, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, శివారెడ్డి తదితరులు పాల్గొన్న కవి సమ్మేళనానికి జిల్లా అన్ని ప్రాంతాల నుండి సాహిత్య అభిమానులు, వసంత మేఘ గర్జనకు ఆకర్షితులైన వేలమంది ఆ సభలో పాల్గొన్నారు. ఆ సభకు ముందే డా. బాలక్రిష్ణ సహాయ సహకారంతో వనపర్తి పట్టణానికి సమీపంలో మొదటి రాజకీయ తరగతులు నిర్వహించడంలో కిట్టు విప్లవ రాజకీయ, సాంస్కృతిక నిర్మాణానికి పునాదులు వేశాడు. అదే క్రమంలో వనపర్తిలో పౌరహక్కుల సభ, కొల్లాపూర్‌లో భారత-చైనా మిత్ర మండలి సభలు జరిగినవి. ఆ సభకు శ్రీశ్రీ, కాశీపతి, జ్వాలాముఖులతో పాటు జననాట్యమండలి కళాకారులు పాల్గొన్నారు.

మహాకవి శ్రీశ్రీ ఇల్లు కుదువు పెట్టబడినపుడు పత్రికల్లో "ప్రజా కవిని ప్రజలు రక్షించుకోలేరా", అని ప్రశ్నించినపుడు అదే రోజు డా. బాలక్రిష్ణ అధ్యక్షతన ఒక కమిటీ ఏర్పడి శ్రీశ్రీ సన్మానానికి ఏర్పాట్లు చేయబడినవి. మహాకవి శ్రీశ్రీకి జరిగిన ఆ సన్మాన సభ చారిత్రాత్మకమైనది. ఆ సభలోనూ విప్లవ కవులు పాల్గొన్నారు. కిట్టు క్రియాశీలత, నిబద్ధత, విద్యార్థులను, యువజనులను సమీకరించడంలో చూపిన చొరవ చాలా గొప్పవి.

అత్యవసర పరిస్థితి తర్వాత కిట్టూ అప్పుడు జరిగిన అక్రమ చర్యలను ప్రజల దృష్టికి తెచ్చేందుకు నడుం కట్టాడు. తార్కుండే కమీటి రిపోర్టులు, భార్గవ కమిటీ నివేదికలు, పిలుపు, సృజన పత్రికలను సంచిలో వేసుకొని జిల్లా అంతటా తిరిగి విప్లవ అభిమానులను సమీకరించడం, పునఃచైతన్యవంతులను చేయడంలో పాల్గొన్నాడు.

మొట్టమొదటగా విప్లవ భావజాలం కల మిత్రులతో కలిసి జరిగిన హోటల్ వర్కర్స్ యూనియన్, ఎవర్ గ్రీన్ బస్సు కార్మికుల, జిల్లా ప్రెస్ కార్మికుల ఉద్యమాల వెనుక కిట్టు. చాలా క్రియాశీల పాత్ర వహించాడు. ఆ ఉద్యమాలలో పాల్గొన్న కార్మికులలో తర్వాత కొందరు విప్లవ రాజకీయాల్లోకి వచ్చి, జిల్లాలో విప్లవ రాజకీయ నిర్మాణానికి దోహదం జరిగింది. 1962 నుండి 1976 వరకు పాలమూరు జిల్లాలో వచ్చిన ప్రతి ప్రజా ఉద్యమం వెనుక కిట్టు పాత్ర ఉంది.

కిట్టు కవిగా, గాయకుడిగా ఆ రోజుల్లో యువజన, విద్యార్థులకు ప్రేరణనిచ్చేవాడు. సుబ్బారావు పాణిగ్రాహి రాసిన పాట "సుత్తీ కొడవలి గుర్తుగ ఉన్న ఎర్రని జెండా" పాటను చాలా ఉద్వేగంతో, శ్రావ్యంగా పాడేవాడు. ఆ పాటను రాష్ట్రంలో జరిగిన చాలా విరసం సభల్లో తాను పాడగా, ఆయన పాడిన బాణీయే రూఢిగా వాడుకలోకి వచ్చింది. జిల్లాలో జరిగే ప్రతి సభలో పాణిగ్రాహి, శివసాగర్ పాటలను తాను పాడి, సాంస్కృతిక కార్యకర్తలకు నేర్పేవాడు.

జీవితకాలమూ ఎలాంటి ప్రభుత్వ ఉద్యోగం లేకుండా, డాక్టరు

సంస్మరణ



# కాలం గీసిన చిత్రం.. ఎం. ఎఫ్. హుస్సేన్

- పి. మోహన్

ఎం.ఎఫ్. హుసేన్‌ను, అతని బొమ్మలను ఇక ఏ కాషాయ, ఆకుపచ్చి విషాలూ ఏమీ చేయలేవు. తొంభై ఐదేళ్ల ఆ రంగుల సెలయేట్లో సాగిపోయిన అపురూప సజీవ ఆకృతులను ఇక ఎవరూ ఏ నెపంతోనూ తిట్టలేరు. ఆధునిక భారతీయ చిత్రకళకు సంక్లిష్ట ప్రతీకయిన ఆ మనిషి నిండు జీవితపు సారాంశాన్ని ఇక త్రిశూలాలు, ఫత్వాలూ ఛిద్రం చేయలేవు. పుట్టిన గడ్డపై కనుమూసే భాగ్యానికి నోచుకోని ఆ దౌర్భాగ్య వృద్ధుడు మన కళా చరిత్రలో ఆకాశమంత ఎత్తయిన మనిషిగా నిలిచిపోవడానికి ఇక ఏ అడ్డంకులూ లేవు. అతని రంగురేఖల శ్వాసవిశ్వాసాలు పరాయిగడ్డపై శాశ్వతంగా మూగబోయాయి. ఇప్పుడు అందరూ ప్రశాంతంగా ఉండొచ్చు!

వైష్ణవ భక్తిగీతాలతో మేల్కొనే పండరీపురంలో 1915 సెప్టెంబర్ 17న ప్రారంభమై... ఒక అమానవీయ శకానికి బీజం వేసిన బ్రిటిష్ సామ్రాజ్యవాదం పురుడుపోసుకున్న లండన్ నగరంలో ఈ ఏడాది జూన్ 9న ముగిసిన హుస్సేన్ జీవిత కళాయానంలో బోలెడన్ని సంక్లిష్టతలు, వైరుధ్యాలు కళ్లకు కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి. అభ్యుదయ కళాకారుడుగా, హైందవ దేవతాగణపు రూపశిల్పిగా, ఒట్టికాళ్ల పాదచారిగా, విలాసవంతమైన కార్లలో జల్సాగా తిరిగిన సెలెబ్రిటీగా హుస్సేన్ తన చిత్రాల్లో మాదిరే బహురూపి! కళాస్వాదకులకే కాక కళావిమర్శకులకూ కొరకరాని కొయ్య!

పొట్టకూటి కోసం హిందీ సినిమాల హోర్డింగులు రూపొందించిన హుసేన్ తన సమకాలీన భారతీయ చిత్రకారుల్లో ఎవరూ అందుకోలేని పేరు ప్రతిష్టలు, సంపదలు ఆర్జించాడు. భూస్వామ్యం, సామ్రాజ్యవాదుల కలగాపులగపు వ్యవస్థలోని వైరుధ్యాలు సాంస్కృతిక రంగంలో చూపిన ప్రతిఫలనాలకు అతడు చక్కని ఉదాహరణ!

హుసేన్ భారతీయ చిత్రకళకు అంతర్జాతీయ పరిమళం అద్దాడు. ప్రాచ్య, పాశ్చాత్య కళాశైలులను, సిద్ధాంతలను జీర్ణం చేసుకున్నాడు. తన, తన చుట్టూ ఉన్న మనుషుల సుఖదుఃఖాలను నిత్యప్రయోగాలతో వర్ణమయం చేశాడు. ఉద్వేగాలను బలంగా వ్యక్తీకరించడానికి మనుషులను, గుర్రాలను భయంకరంగా బాధపెట్టాడు. సౌందర్యాలను కుప్పబోయడానికి దేవతల బట్టలూ విప్పేశాడు. పికాసో మాదిరే హుసేన్ కూడా విగ్రహ విధ్వంసకుడు. ప్రతిదానితో పేచీపెట్టుకున్నాడు. కానీ ప్రతిదానితో రాజీపడ్డాడు. పికాసోను అతడు కళలో మాత్రమే అనుసరించాడు. జీవితంలో పక్కా ప్రాక్టికల్ మనిషిగా వ్యవహరించాడు. అయితే ఇవేవీ అతని సృజనను మదింపువేయడానికి పనికిరాకపోవచ్చు. ఎందుకంటే అతని కుంచెకు రెండు వైపులా పదును ఉంది కనుక. హుసేన్ ఎక్కడైనా ఒదిగిపోగలడు. అదే అతని కళా రహస్యం! వినాయకుడి లాగే హుసేన్ కూడా ఒక వింత జీవి!

పుట్టిన రెండేళ్లలోనే తల్లిని కోల్పోయిన అతడు ముఖం తెలియని తన మాతృమూర్తిని వందల చిత్రాల్లో రూపుగట్టాడు. ఆమెను పార్వతీదేవిగా కొలిచాడు. ఆమె ఒడిలో బాలగణేశుడిలా ఒదిగిపోయాడు. అతని కుంచె ప్రసవించిన పార్వతి, వినాయకుడు, కృష్ణుడు, సరస్వతి... వగైరా దేవతలందరూ ఓ ముస్లిం కళాకారుడి సృజన అంటే నమ్మశక్యం కాదు. అది పండరీపురమైనా, బరోడా అయినా, ఇండోర్ అయినా బాంబే అయినా హుసేన్ అచ్చమైన హిందూ-ముస్లింగా బతికాడు. అతని హృదయానికి రంగులే కానీ మతం రంగులు తెలియవు. రామాయణ గాథలను, కర్బాలా కథలను ఒకే చూపుతో చూశాడు, ఆవిష్కరించాడు, ఆనందించాడు.

సర్రియలిజం, క్యూబిజం తదితర పాశ్చాత్య కళాధోరణులను హుసేన్ భారతీయీకరించాడు అందించాడు. భారతీయ కళ అన్నీ సాధించిందని చెప్పిన అతడు ఆ భ్రమలో చిత్తయిపోయాడు. తనపై పికాసో, లెగర్, గ్రిజ్‌ల ప్రభావమున్నా ఒప్పుకోవడానికి నిరాకరించాడు. కానీ హుసేన్ ఎక్కడా ఆగిపోలేదు. అదే అతని గొప్పతనం. అతడు తొలినాళ్లలో వాస్తవికతావాదంపై మొగ్గు చూపాడు. కమ్యూనిస్టుల ప్రభావంతో మొదలైన అభ్యుదయ కళా ఉద్యమం వైపు చూపు

---

గారి దగ్గర డ్రైవరుగా పనిచేస్తూ ఇన్ని కార్యక్రమాల్లో పాల్గొన్న కిట్టును అందరూ కా. కిట్టూ మామా అని పిలిచేవారు. డాక్టరు మరణం తరువాత ఆయన హైదరాబాద్‌కు మకాం మార్చాడు. బతుకు దెరువు కోసం చిన్న చిన్న పనులు చేశాడు. జీవితకాలం బాధించే కొడుకు అనారోగ్యం కోసం మందులకై ఎన్నెన్నో అవస్థలు పడినాడు. తన అనారోగ్యం, కొడుకు అనారోగ్యంతో పేదరికంతో అనేక సమస్యలతో సతమతమైనాడు. కాని తన నిబద్ధతను, విశ్వాసాన్ని వదులుకోలేదు. విప్లవం కోసం పరితపించాడు. మొదటి దశలో ఒక కొరియర్‌గా విప్లవ నాయకులను జాగ్రత్తగా ఒక ప్రాంతం నుండి మరొ ప్రాంతానికి చేరవేసిన కిట్టూ సాహస చర్యలను మిత్రులు ఇప్పటికి జ్ఞాపకాలుగా చెప్పుకుంటారు. చివరి శ్వాస వరకు నూతన ప్రజాస్వామిక విప్లవ ఆకాంక్షతో జీవించిన కిట్టు జీవితం చాలా విశిష్టమైనది అనేక మందికి ప్రేరణనిచ్చింది. కిట్టు మామ కుటుంబాన్ని ఆదుకోనేందుకు వనపర్తిలో మిత్రులతో ఒక సభ జరిగింది. కాని దాని ఫలితాలు ఇంకా ఆచరణలోకి రాలేదు. ఒక పూటకు తిండి లేని సమయంలో కూడా విప్లవాన్ని ఆకాంక్షించిన కిట్టూమామకు విప్లవ నివాళి ఘటిస్తున్నాం.



సారించాడు. 1947లో ఎఫ్.ఎన్. సౌజా తదితరులతో కలిసి బాంబే అభ్యుదయ కళాకారుల సంఘాన్ని స్థాపించాడు. పేరుకు అభ్యుదయమైనా ఈ సంఘంలోని కళాకారులకు దానిపై పెద్ద పట్టింపేమీ లేదు. అందుకే 1956 కల్లా సంఘం రద్దయింది. హుసేన్ స్వేచ్ఛా పిపాసి. గుంపులో ఒకటిగా ఉన్నా తన వ్యక్తీకరణ తనదే.

భారతీయ కళలోని రేఖను హుసేన్ క్యూబిజంలో కలిపేశాడు. విరూపం, వక్రీకరణ, పాక్షిక నైరూప్యం.... ఇవీ అతని రేఖా విన్యాసాలు. వీటికి కళ్లు మిరుమిట్లు గొలిపే రంగులను జోడించాడు. హుసేన్ చిత్రాల్లోని రంగులను చాలా సులభంగా తారుమారు చేయొచ్చు. వాటికి ఒక రూపానితో ప్రత్యేక అనుబంధమేదీ ఉండదు. నేపథ్య వర్ణాన్ని జంతువులకు, మనుషులకు అన్వయించవచ్చు. వాటి రంగులను నేపథ్యానికి పూయొచ్చు. హుసేన్ చిత్రాల్లో చాలా వాటిలో మానవులకు కళ్లు, ముక్కు, నోరు, చెవులు ఉండవు. అంతా చిదంబర రహస్యం!

హుసేన్ 'బెంగాల్ స్కూల్'లో మట్టిగొట్టుకుపోతున్న భారతీయ రూపాలకు కొత్త జవసత్వాలు ఇచ్చాడు. సీత, ద్రౌపది, కృష్ణుడు, అభిసారిక, పల్లెటూరు పిల్లి, హోలి కేళీలను బ్రిటిష్ అకడమిక్ కళకు విరుగుడుగా బెంగాల్ స్కూల్ వాడుకుంది. కళ్లముందున్న వాస్తవ జీవితాన్ని నిరాకరించింది. కాలం కన్ను తెరిచింది. అటు కలకత్తా అభ్యుదయ కళాకారుల సంఘం, ఇటు బాంబే అభ్యుదయ కళాకారుల సంఘం రంగంలోకి దూకాయి. ఎన్. ఎస్. బెంద్రే, హుసేన్, హెబ్బార్, బీబీ ముఖర్జీ, బి.సి. సన్యాల్‌లు కళ్లముందటి జీవితానికి పెద్ద పీట వేశారు. అమృతాషేర్ గిల్ తన కుంచెకు మట్టివాసనలు అద్దుకుంది. ఆమె మార్గం అనితర సాధ్యమైపోయింది. బెంగాల్ స్కూల్‌పై తిరుగుబాటు కళ్లను మిరుమిట్లు గొలిపించి ఆరిపోయింది.

ఆధునిక భారతీయ కళ సహజంగా ఎదిగింది కాకపోవడం వల్ల దాని ప్రతి దశలో బోలెడన్ని వైరుధ్యాలు తొంగిచూశాయి. బెంగాల్ స్కూల్‌ను ధిక్కరించిన కళాకారులు బ్రిటిష్ అకడమిక్ కళకు దూరంగా, యూరప్ కళకు దగ్గరగా వెళ్లారు. 1950ల తర్వాత యూరప్, అమెరికాలలో వచ్చిన కళావాదాలు భారతీయ కళాకారులను ఆకర్షించాయి. మన ఆధునిక కళ చివరకు 'శంకరాచార్ల మాయావాదం'లా మారిపోయింది. హుసేన్ ఈ పరిణామాలకు ప్రత్యక్ష సాక్షి. పురాణగాథలను ఆర్తిగా చిత్రించిన హుసేన్ అభాగ్య జీవులపై శీత కన్ను వేశాడు. 'జమీన్'లాంటి చిత్రాలు వేసినా అవి అతని రంగుల పోషలింపు ముందు దిష్టిబొమ్మలయ్యాయి. కాలపరీక్షకు తట్టుకోవడానికి అతడు చాలా మూసల్లో సులభంగా ఒదిగిపోయాడు. 'భారతీయ పికాసో' ఒక్క 'భారతీయ గుయేర్నికా'ను కూడా వేయలేకపోయాడు! కానీ '20వ శతాబ్ది ముఖ చిత్రం' పేరుతో వేసిన చిత్రంలో 'ప్రపంచ గుయేర్నికా'ను చూపాడు. హుసేన్ ఈ చిత్రంలో గీతాంజలి, దాస్ కేపిటల్, గాంధీ, మావో, హిట్లర్, మార్లిన్ మన్రో నరెన్స్టీన్‌లను రూపుగట్టాడు. 20వ శతాబ్దికి వీరు చేసిన సేవలు, ద్రోహాలూ ఇందులో చక్కగా ఇమిడాయి.

హుస్సేన్ అందర్నీ, అన్నింటినీ ప్రేమించినందువల్లే అంతకాలం కళను పదునుపెట్టుకోగలిగాడు. మదర్ థెరిసా, మమతాబెనర్జీ, మాధురీ దీక్షిత్, మార్లిన్ మన్రో, గాంధీ, అనుష్క శర్మ, లగ్జరీ కార్లు, రాజ్యసభ సభ్యత్వం, పద్మ పురస్కారాలు... అందరూ, అన్నీ అతనికి కావలసినవే. అందుకే అతన్ని ఖతార్ పాలకులు, భారతీయ కార్పొరేట్ కంపెనీలు పెట్టుబడిదారులు తమ ఆస్థాన చిత్రకారుడిగా నియమించుకున్నారు. అతని జేబుల్లో డబ్బులు కుక్కి ఒప్పందాల కింద రోజుకో చిత్రం వేయించుకున్నారు. అయినా అతని కళ వసివాడలేదని, నిత్యశోభయమానంగా వెలుగొందిందని కొంత మంది కళాప్రియులు అంటుంటారు!

హుసేన్ చివరి దశలో తన చిత్రాలను తానే అనుకరించి, ప్రచారం కోసం పాకులాడిన సందర్భాలున్నాయి. వేలం వెర్రిగా వచ్చిపడే కమిషన్లను అతడు కాదనలేకపోయాడు. అతని కళ చివరకు ధనవంతుల ఇళ్లలో అలంకారప్రాయంగా మారిపోయిన ఉదాహరణలూ ఉన్నాయి.

హుసేన్ చిత్రకారుడే కాదు చలన చిత్రకారుడు కూడా. 'చిత్రకారుడి కళ్ల నుంచి', 'గజగామిని', 'మీనాక్షి - మూడు నగరాల కథ' సినిమాలు అతని కళా ప్రతిభకు అద్దం పడతాయి. అవార్డుల గొడవ పక్కన పెడితే 'చిత్రకారుడిగా కళ్ల నుంచి' చిత్రంలో అపూర్వమైన దృశ్యాలు అతని చిత్రాల్లాగే ఉంటాయి. కళ గురించి ఏమి తెలియని మతోన్మాదులు 'మీనాక్షి - మూడు నగరాల కథ'లోని 'నూరున్ అలా నూర్' పాటపై మండి పడ్డారు. అది దైవ దూషణ కిందికి వస్తుందని జమాతే ఉలేమా, ఇస్లామీలు విమర్శించాయి. దీంతో హుసేన్ ఆ సినిమాను ఉపసంహరించుకున్నాడు. మరోవైపు హిందూమతోన్మాదులూ రెచ్చిపోయారు. హుసేన్ 1970లలో వేసిన సరస్వతి, సీత, దుర్గల నగ్నచిత్రాలపై 1990లలో గొడవ చేశారు. చంపుతామని బెదిరించారు. అతని కళా ప్రదర్శనపై దాడి చేసి, చిత్రాలను చింపేశారు. 2006లో అతని 'నగ్న భరతమాత'పై మళ్లీ గొడవలు రేగాయి. కోర్టుల్లో పిటిషన్లు, వాద వివాదాలు... హుసేన్ ఉక్కిరిబిక్కిరయ్యాడు. తట్టుకోలేక ప్రవాసానికి వెళ్లిపోయాడు.

తాను 60 వేల చిత్రాలు వేశానని హుసేన్ చెప్పుకున్నాడు. ఇది గొప్ప కాదు కానీ అతని అవిశ్రాంత కళాయానానికి మచ్చుతునక. భారతీయుడుగా పుట్టి, భారతకళను ప్రపంచ యవనికపై సగర్వంగా నిలిపిన ఆ కళాయోధుడు జీవితచరమాంకంలో ఖతార్ పౌరసత్వాన్ని పుచ్చుకున్నాడు. భారత్‌కు తిరిగి రావాలనుకుంటున్నానని, తానెక్కడున్నా భారతీయుడునేనని చాలాసార్లు చెప్పాడు.

"ఓ దేశనాగరికతలో గొప్ప మార్పు అనేది మొదట సాంస్కృతిక రంగంలోనే మొదలవుతుంది" అని హుసేన్ తన చివరి ఇంటర్వ్యూలో అన్నాడు. భారతీయ సంస్కృతి గొప్పతనాన్ని తన కళలో చాటానని చెప్పుకున్న హుసేన్‌ను భారతీయులు సరిగా అర్థం చేసుకోలేకపోయారేమో! లేక భారతీయుల అవసరాలు అతనికర్థం కాలేదేమో? అమృతాషేర్‌గిల్ అర్థమైనట్లుగా హుసేన్ అర్థంకాడు. ఆమెది స్వచ్ఛమైన వ్యక్తీకరణ, నిజాయితీ, సహానుభూతి, వాస్తవికత దాని మూల ధాతువులు. హుసేన్‌ది మేధావిత్వపు వ్యక్తీకరణ. ప్రహేళిక,

సంస్మరణ

# పాశవిక చట్టం యు.ఎ.పి.ఎ. 2008 బలైన మొదటి ఖైదీ స్వపన్‌దాస్ గుప్తాకు విప్లవజోహార్లు!

- కె. నాగేశ్వరాచారి

'అనారోగ్య పీడితుణ్ణే అయిత్తేనేం యోధుణ్ణే' అన్న చెరబండ రాజు అక్షరాలకు రూపమైన వారు స్వపన్‌దాస్ గుప్తా. అనారోగ్యం, ఆర్థిక ఇబ్బందులు, కుటుంబంలోని ఇబ్బందులు అన్నిటినీ విప్లవోద్యమంలో భాగంగానే ఎదుర్కొంటూ తుదిశ్వాస వరకు ఉద్యమం కోసం బతికినవారు స్వపన్‌దాస్ గుప్తా. దేశంలో అనేక విభిన్న విప్లవధోరణులు కొనసాగుతున్నా విప్లవ సారాంశం వైపు నిలబడ్డ బుద్ధిజీవి స్వపన్‌దాస్ గుప్తా. 2004 సంవత్సరంలో ప్రారంభమైన బెంగాల్ పీపుల్స్‌మార్చ్ అనే పత్రికకు తన అంతిమ శ్వాస వరకు ఆయన సంపాదకులుగా పనిచేశారు. కలకత్తాలోని ఎస్.ఎస్.కె.ఎం. ఆసుపత్రిలోని ముఖర్జీవార్డులో, యు.ఎ.పి.ఎ. ఖైదీగా పోలీసుల చిత్రహింసలకు గురి అయి 2010 ఫిబ్రవరి 12న అమరుడైనాడు. అనేక శారీరక మానసిక చిత్రహింసలకు గురి అయి, ఆస్తమా జబ్బు కారణంగా పోలీసుల నిర్లక్ష్యానికి గురి అయి, సరైన వైద్య సహాయం అందక చనిపోయాడనడం కంటే పోలీసులు చంపేశారనడం వాస్తవం. ఉద్దేశ్య పూర్వకంగా ప్రభుత్వం అక్రమ కేసులు ఆయనపై బనాయించి ఆసుపత్రిలో హింసించి చంపింది.

ఇంగ్లిషులో వెలువడుతున్న పీపుల్స్ మార్చ్ పత్రికను ప్రభుత్వం నిషేదించినపుడు బెంగాల్ పీపుల్స్ మార్చ్‌ను మాత్రం ఆపి వేయలేదు. దేశవ్యాప్తంగా నడుస్తున్న విప్లవ పోరాటాల్ని, పోరాట వార్తల్ని, విప్లవ దృక్పథాన్ని తన బెంగాల్ పీపుల్స్ మార్చ్ ద్వారా ప్రచారం చేసిన కలం యోధుడు. ఎన్నో విధాలుగా ప్రభుత్వం నుంచి బెదిరింపులు వచ్చినా ఆయన దృష్టిని కదల్చలేక పోయింది. దేశంలో కమ్యూనిస్టు పార్టీ ఎన్నిసార్లు చీలినా విప్లవ సారాంశం వైపే ఆయన తుదిశ్వాస వరకు నిలిచారు. ఆయన జీవితమే పోరాటం, పోరాటమే ఆయన జీవితం.

స్వపన్‌దాస్ గుప్తాకు విప్లవ రాజకీయాలు కుటుంబం నుంచే పరిచయమయినాయి. ఆయన తండ్రి బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నడుస్తున్న "అనుశీలన్ సమితి"లో పనిచేశాడు. స్వపన్‌దాస్ గుప్త తండ్రి సిసిర్‌దాస్ గుప్తా ఢిల్లీలో బ్రిటిష్ ప్రభుత్వంలో ఉద్యోగిగా కొంతకాలం పనిచేశారు. తల్లి మనికాదాస్ గుప్తా గృహిణి. స్వపన్‌దాస్ గుప్తాకు ఒక అన్న, ఒక తమ్ముడు, మానసిక వికలాంగురాలైన చెల్లెలు ఉన్నారు. అన్న చాలాకాలం కిందటే చనిపోయాడు. కుటుంబ భారమంతా స్వపన్‌దాస్ గుప్తాదే. ఢిల్లీ కలకత్తాల్లో హైయర్ సెకండరీ పాఠశాలల్లో చదువుకుని 1972లో కేంద్ర ప్రభుత్వోద్యోగి దగ్గర ఒడిశాలో ప్రభుత్వోద్యోగం సంపాదించుకున్నాడు. అప్పటికే అలవడిన విప్లవ రాజకీయాల వల్ల 1974లో ఉద్యోగం వదలివేసి పార్టీ పిలుపు మేరకు రహస్య జీవితంలోకి పార్టీ కార్యకర్తగా వెళ్ళాడు. రాజకీయాలు వదలి వేస్తే మళ్ళీ ప్రభుత్వోద్యోగం ఇస్తామన్నా ఆయన మనసు మార్చుకోలేదు. 1980లో తన తండ్రి సిసిర్‌దాస్ గుప్తా మరణించిన తరువాత స్వపన్‌దాస్ గుప్తా కలకత్తా చేరుకున్నాడు. అత్యంత తక్కువ వేతనాలకు ఉద్యోగం చేయాల్సి వచ్చింది. మానసిక వికలాంగురాలైన చెల్లెలు, తమ్ముని బాగోగులు అన్నీ ఈయన బాధ్యతే అయినాయి. హైకోర్టు ప్రాంగణంలో టైప్ మిషన్ ఉంచుకుని లాయర్లు ఇచ్చిన

---

ప్రయోగం, వ్యాపారసూత్రం దాని మూల ధాతువులు. హుసేన్‌ను పికాసోతో పోల్చడంలో ఈ వ్యాపార సూత్రమే పనిచేసింది. ఫోర్బ్స్ పత్రిక తీసుకొచ్చిన ఈ పోలిక హుసేన్ చిత్రాలకు ప్రపంచ మార్కెట్లో కనకవర్షం కురిపించింది. మతోన్మాదుల ఆగడాలు కూడా అతనికి విశేష ప్రచారం తెచ్చిపెట్టాయి. లేనిది ఉన్నట్లు, ఉన్నది లేనట్లు చూపే మీడియా కూడా హుసేన్‌కు లేనిపోని కీర్తికిరీటాలు తగిలించింది. కానీ అతడు మాత్రం అన్నీ తెలిసిన మర్మయోగిలా హాయిగా కాలం వెళ్లబుచ్చాడు. పికాసో మాదిరే యుద్ధాన్ని ద్వేషించాడు. ప్రవాసంలో కన్ను మూశాడు.

"నేను సమకాలీన భారతీయ కళలో ఇమడను. అది మన సంస్కృతికి దూరమైపోతోంది. దాన్నుంచి నేర్చుకోవాల్సిందేమీలేదు. అది పాశ్చాత్యం. నేటి భారతీయ కళతో పెద్ద సమస్య ఉంది. చారిత్రక దృక్పథం లోపించడమే ఆ సమస్య. భారతీయులు తమ సంస్కృతితో సంబంధాలు కోల్పోయారు. సినిమా ఒక్కటే వారికి బాగా ఎక్కుతోంది" అని హుసేన్ ఓ ఇంటర్వ్యూలో చెప్పాడు. అతనికి అన్నీ తెలుసు. సమకాలీన భారతీయ కళ హుసేన్‌ను కోల్పోయి మరిన్ని కష్టాల్లో పడింది. కళాకారుల గొప్పతనం గురించి వారి సమకాలికులు సరైన అంచనా వేయలేరని ఓ నానుడి ఉంది. హుసేన్‌కు కూడా ఇది వర్తిస్తుంది. పొగడ్తలు, విమర్శలతో సంబంధం లేకుండా అతని కళ వర్తమానానికి, భవిష్యత్తుకు వారధిలా నిలుస్తుంది. లౌకిక విలువలకు గొప్ప ఆశ్వాసన అందిస్తుంది. ప్రయోగాలకు ప్రేరణగా నిలుస్తుంది. హుసేన్ కారు చీకట్లో దీపధారి. అతడు పట్టుకున్న దీపం కింద నీడలను మరిచిపోకూడదు.



పిటిషన్‌లను టైప్ చేసేవారు. మరికొంత కాలం స్టెనోగ్రాఫర్‌గా పనిచేశాడు. 1992 వరకు బాంబేడైయింగ్ బ్రాంచ్ ఆఫీసులో ఉద్యోగం చేశాడు. ఇక్కడ ఆఫీస్ వర్కర్ యూనియన్ కార్యకలాపాలు చేపడుతున్నాడని ఉద్యోగం ఊడదీశారు. మళ్ళీ లాయర్ల దగ్గరే స్టెనో గ్రాఫర్ పనిచేశాడు. ఈ మధ్యకాలంలో జీవితంలో ఎన్ని ఒడుదొడుకులు వచ్చినా ఉద్యమాలకు దూరం కాలేదు.

విద్యార్థి దశలోనే సిపిఐ సభ్యునిగా పనిచేశాడు. అక్కడ నుంచి సిపిఎం మీదుగా ఆశుమజుందార్ పరిచయంతో, నక్సల్‌బరీ పిలుపుతో ఉద్యమ కార్యకర్త అయినాడు. ఒడిశాలోని కిషోర్ శాంతో మహేంద్రవర్గంతో కలిసి పనిచేసినా 1992 నుంచి ఎం.సి.సి. నాయకత్వంలోని ఉద్యమంలో పాల్గొన్నాడు. అఖిల భారత ప్రజా ప్రతిఘటన సభలో విరసం కార్యవర్గ సభ్యులైన వి.వి.తో స్వపన్‌దాస్ గుప్తాకు పరిచయమైనాడు. అలాగా మన రాష్ట్రంలోని ఉద్యమాలకు కూడా దగ్గరైనాడు. మన రాష్ట్రానికి సంబంధించిన ఉద్యమ వార్తల్ని, వ్యాసాల్ని బెంగాల్ పీపుల్స్ మార్చ్‌లో ప్రచురించారని తెలుస్తూ ఉంది. వైయక్తిక జీవితం పట్టి కుదిపినా, రాజకీయ అనిశ్చిత ఉన్నా విప్లవ సారాంశం వెంటే ఆయన నడవడంలో ఉన్న బొల్షివిక్ చైతన్యం చావలేదు. తనను తాను పునర్నిర్వచించుకుంటూ మన ముందుకే ఆయనను నడిపిన విప్లవ ఆకాంక్ష బలీయమైంది.

చిత్రహింసల కొలిమి పోలీసు స్టేషనులోనూ, తనను మానసికంగా హింసిస్తూ వైద్యులు నిర్లక్ష్యం చేస్తున్న సందర్భంలోనూ ఆయన దృఢ సంకల్పం చెక్కుచెదరలేదు. 2009 అక్టోబరు 6వ తేదీన లాల్‌ఘర్ మంచ్ గురించి కలకత్తాలో నగరంలో ప్రెస్ మీట్ జరుగుతున్న సమయంలో ఆయనకు మధ్యాహ్నం మూడు గంటల సమయంలో స్పెషల్ బ్రాంచ్ పోలీసుల నుంచి ఫోన్ వచ్చింది. విషయం అర్థమై తన అరెస్టు ఖాయమని తన పక్కనున్న మిత్రులకు అప్పుడే తెలియజేశాడు. ఈ విషయం తన మిత్రులకు తెలియజేస్తుండగానే మరో ఫోను వచ్చింది. కలకత్తా నగరంలోని గరియా ప్రాంతంలో ఉన్న తన ఇంటిపై పోలీసులు దాడి చేసి సోదాలు నిర్వహించారని తెలిసింది. అదే రోజు రాత్రి గరియా ప్రాంతంలో ఒక హోటల్‌లో టీ తాగుతుంటే స్వపన్‌దాస్ గుప్తాను అరెస్టు చేశారు. కేంద్ర ప్రభుత్వం అనుమతించిన మాసపత్రిక నిర్వహించే ఒక సంపాదకుణ్ణి దాదాపు 28 రోజులు వివిధ పోలీసు స్టేషన్‌లలో అక్రమంగా నిర్బంధించారు. రోజుల తరబడి నిద్రకు అనుమతించకుండా రాత్రింబవళ్ళు మానసిక హింసతో ఇంటరాగేషన్ చేస్తూనే ఉన్నారు. తాను ఆస్త్మా వ్యాధి గ్రస్తుణ్ణని, తనకు కప్పుకోవడానికి దుప్పట్లు కావాలని ఎంతగా ఎన్నిసార్లు విన్నవించినా పట్టించుకోకుండా బలవంతంగా జైల్లో కటిక నేలపై బలంవంతంగా తోసేశారు. అది అక్టోబర్ నెల కావడంతో చల్లగాలి, చలి ఎక్కువగా ఉంటుంది. సాధారణ వ్యక్తులకే ఇబ్బందిగా ఉంటుంది. అలాంటిది డెబ్బై ఏళ్ల స్వపన్‌దాస్ గుప్తా ఆస్త్మా జబ్బుతో బాధపడుతూ చిత్రహింసలు అనుభవించాడు.

గుప్తాను కుట్రలు పన్నాడని, టెర్రరిస్టు క్యాంపులు నిర్వహించాడని, మరికొన్ని టెర్రరిస్టు గ్రూపులకు సహకరించాడని యు.ఎ.పి.ఎ. 1967-121/ఎ/124ఎ చట్టాల కింద కేసులు నమోదు చేసి పోలీసులు టెర్రరైజ్ చేస్తున్నారు. 2009 నవంబర్ 3న గుప్తాను ప్రెసిడెన్సీ జైలుకు పంపారు. మిత్రులు జైలు దగ్గర కలవడానికి వచ్చినపుడు తాను ఆసుపత్రిలో పడిన ఇబ్బందుల్ని వివరించారు. డిసెంబర్ 9 తేదీన ప్రొస్టేట్ సమస్యల వల్ల బంగూర్ ఆసుపత్రికి తరలించబడ్డాడు. ఆస్త్మా, లెప్రసీ వ్యాధులకు గురైనట్లు అక్కడే తెలిసింది. వాటి నుంచి రక్తం నిత్యం స్రవిస్తూనే ఉండేది. తనకు తోడు ఎవ్వరూ లేరు. ఎవ్వరైనా గుప్తాకు కాలకృత్యాలకు సహకరించినా ఆయన వెంట పోలీసులుండేవారట. ఒక రోజు ఆయన మిత్రులు, కొందరు స్త్రీలు పలకరించడానికి వస్తే పోలీసులు అశ్లీలంగా తిట్టి పంపారట. ప్రభుత్వ ఆసుపత్రి మందులు ఇవ్వరు సరికదా, మిత్రులు తెచ్చియిచ్చే బిస్కెట్లు, మందులు, హార్లిక్స్ వంటి వాటిని ఆయనకు ఇచ్చేవారు కాదు. రక్తం శరీరంలో క్షీణించిపోయింది. వైద్యులు కొత్త రక్తం ఎక్కించాలన్నారు. మరి ఎక్కడ తేవాలి? వైద్య సిబ్బంది చేతులెత్తేసింది! మేమేం చేయలేని స్థితిలో ఉన్నామని వైద్యులు తమ నిస్సహాయ స్థితిని ప్రకటించారు. డిసెంబరు 15వ తేదీన మధుపమదాస్ భారత ప్రజాస్వామ్య నిర్వ్యాపకాన్ని ఎక్స్‌ప్రెస్ ఇండియాలో పతాక శీర్షికలో ప్రకటించింది. 2009 జనవరి 17న దాదాపు పదకొండు ప్రజా సంఘాలు రాజకీయ ఖైదీల కిచ్చే అన్ని సౌకర్యాలను, వైద్య సహాయాన్ని అందించాలని పత్రికా ముఖంగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేసినా ఫలితం లేకపోయింది. మిత్రుల సహకారం నుంచే రక్తం లభించింది. ప్రజలు జైళ్ల శాఖామంత్రిపై గుప్తా విషయంలో జోక్యం చేసుకోవాలని వత్తిడి పెంచారు. జైళ్ళ ఇన్స్‌పెక్టర్ జనరల్ ఆసుపత్రికి వెళ్లి పరిస్థితిని సమీక్షించి ప్రత్యేక వైద్య బృందాన్ని ఏర్పాటు చేశాడు. అప్పటికే గుప్తా పరిస్థితి విషమించింది. 2010 ఫిబ్రవరి ఉదయం 5 గంటలకు గుప్తా తుది శ్వాస విడిచారు. అనేక మంది ప్రజా ప్రతినిధులు, కబీర్ సుమన్ టిఎంసి పార్టీ ఎం.పి., విహాస్ చక్రవర్తి (నాటక రచయిత), నవారుణ్ భట్టాచార్య, హక్కుల సంఘానికి సంబంధించిన సుజాత భాద్రా వంటి ప్రముఖులతో అంతిమ యాత్ర కియోరతాలా శ్మశాన వాటిక వరకు కొనసాగింది.

ఉద్యమకారులను హింసించి, చిత్రహింసల పాల్జేసి, భయోత్పాతాల వల్ల ఉద్యమాన్ని అణచివేయాలని చేసే ప్రయత్నం ఈనాటిది కాదు. అవసాన దశ సమీపిస్తున్న ఈ వ్యవస్థ అంతిమ ప్రేలాపనలివి అని ఉద్యమకారులకు తెలుసు. స్వప్నసేన్‌దాస్‌ను ప్రభుత్వమే హత్య చేసింది.



# బిర్సాముండా కేంద్రకారాగారం, రాంచీ నుంచి సాంస్కృతిక కళాకారుడు జీతన్ మరాండీ విజ్ఞప్తి!

ప్రగతి శీల రచయితలు, కళాకారులు, బుద్ధిజీవులు, సాంస్కృతిక, సామాజిక కార్యకర్తలు మానవహక్కుల సంఘాలు, ప్రజా సంఘాలు, రాజకీయ చైతన్యం గల పౌరులు, కార్మికులు, రైతులు, విద్యార్థి యువజనులు, శ్రేయోభిలాషులందరికీ -

మిత్రులారా,

నేను 1980లలో ఒక పేద రైతు కుటుంబంలో పుట్టాను. మా ఊరు సుదూర్ అనే ఒక మారుమూల గ్రామం. ఝార్ఖండ్ రాష్ట్రం గిరిధి జిల్లా పిర్టాండ్ పోలీసు స్టేషన్ పరిధిలో ఉంటుంది. మా గ్రామంలో ప్రభుత్వం కల్పించిన సంక్షేమం అంటూ ఏమీ లేదు. నాకు బాల్యంలో చెప్పుకునే ఘట్టాలేమీ లేవు. మా కుటుంబంలో ఎవరికీ చదువు రాదు. పేదరికం వల్ల కుటుంబ పోషణ భారం అందరం భుజాల మీద మోయాల్సి వచ్చేది. పశువులను మేతకు తీసుకుపోవడం బాలునిగా నా బాధ్యత. అందువల్ల బాల్యంలో కలమో, పుస్తకమో కాక నా చేతిలో కర్ర ఉండేది. పశువులను లెక్కపెట్టడానికి కూడ నేను గులకరాళ్ల సహాయం తీసుకునే వాణ్ని. ప్రతి రోజూ 'రేపటి'కోసం నిరీక్షణలోనే గడిచేది. కష్టంమీద మూడో తరగతి దాకా చదివాననిపించాను. ఇది నా విజ్ఞాన సర్వస్వ సంపద. అంటే (రాజ్యాంగం ఆదేశిక సూత్రాల్లో హామీ పడిన నిర్బంధ ప్రాథమిక విద్య) బడి చదువు.



కాలం గడిచిన కొద్దీ నా దృష్టి 'విపులాచ పృథ్వీ' వైపు ప్రసరించింది. ఈ సమాజపు లోతులు తరచి చూడాలని నాకు ఆకాంక్ష కలిగింది. నేను నా కళ్లముందు ఈ సామాజిక వ్యవస్థ శిథిలమై పోవడం పసిగట్టగలిగాను. ఇతరులతో కలిసి దీనిని మార్చాలని నాకు కోరిక బలీయమైంది. మొదట్లో ప్రవక్తల వలె ఆదర్శవాద సంస్కరణ వాదం ఎంచుకున్నాను. చెడు వినకు, చెడు మాట్లాడకు, చెడు చేయకు. చెడు గుర్తించి మంచిగా మార్చు. ఒక అందమైన, సమానత్వం గల సమాజాన్ని నిర్మించు ఇట్లా...

ఈ చైతన్యాన్ని కలిగించడానికి మేము పాటలు, జానపద గీతాలు, నాటకాలు ఎంచుకున్నాం. మా గ్రామ ప్రజల సామాజిక చైతన్యం పెరిగింది. మాకు ప్రజాదరణ పెరిగింది. ఆ ఆదరణకు కారణం ప్రజల్లో పెరిగిన చైతన్యమే. మేము ఆదివాసీ సంప్రదాయాలను, సంస్కృతిని పరిరక్షించి పెంపొందించడానికి పాటు పడినాం.

మేం గ్రామం నుంచి పట్టణాలకు బయల్దేరాం. ఇతర ప్రగతి శీల ప్రజలతో, బృందాలతో కలుసుకుని మా భావాలు పంచుకున్నాం. మావి, వాళ్లవి ఆలోచనలు, భావోద్వేగాలు మాలలో పూలవలె అల్లుకు పోయాయి. వైవిధ్యం గల లక్ష్యాలు, మార్గాల పుర్షణ నుంచి మా ప్రాపంచిక దృక్పథం నిర్మాణ మయింది. కాలం ప్రవహించి మా అనుభవం పెరిగిన క్రమంలో మా తాత్వికతయే మా జ్ఞానానికి ఆధారమైంది. ఈ విధంగా మేము వేలాదిమంది ప్రజల ప్రేమను, మద్దతును పొందగలిగాం. నేను రచయితలు, కళాకారులు, సాహిత్యవేత్తలు, సామాజిక కార్యకర్తల నుంచి కూడా ప్రోత్సాహాన్ని, మార్గదర్శకత్వాన్ని పొందాను. నేనిప్పటిదాకా కలిసిన ఆ శ్రేయోభిలాషులందరికీ నేను కృతజ్ఞుణ్ని.

నేను అందరికి ప్రజల చైతన్యాన్ని మేల్కొల్పిన ప్రజా కళాకారునిగా, ప్రగతి భావాలు గల సామాజిక కార్యకర్తగా తెలుసు. నన్ను చూసిన ఎవరైనా నన్ను ఆయుధాలతో, ఆయుధ సామగ్రితో చూడలేదని తప్పక చెప్పగలరు. ఎల్లప్పుడు నగారా, ఢోలక్, హార్మోనియమ్ వంటి సంగీత పనిముట్లతో మాత్రమే చూసామని చెప్పగలరు. వాళ్లు నన్ను పంచె, గాంజీ, ఘుంఘ్రు (కాలిగజ్జెలు) వంటి జానపద కళాకారుని వేషంలో తప్ప మరో ఆహార్యంలో ఎప్పుడూ చూడలేదు. నా స్వరమూ, నా సంస్కృతియే నా ఆయుధాలు. వాళ్లు నన్నెప్పుడూ నా సాంస్కృతిక బృందం మధ్యలో, బాల కళాకారులతో పాటు భయ సంకోచాలు లేకుండా గ్రామాల నుంచి పట్టణాల దాకా ప్రజా సంస్కృతిని ప్రచారం చేస్తుండగానే చూసారు. నేనెప్పుడూ ఒక మారుపేరుగానీ, మరో పేరు (అలియాస్) గానీ పెట్టుకోలేదు. అందరికీ నేను జీతన్ మరాండీగానే తెలుసు. ఖోత్తా, సంతాలీ, నాగ్‌పురీ, హిందీ పాటలు నా స్వరంతో ఆడియో క్యాసెట్లుగా జీతన్ మరాండీ పేరుతోనే రికార్డయ్యాయి. ఈ పాటల్లో బూతుగానీ, అసభ్యతగానీ, అనర్థంగానీ ఎక్కడా కనిపించదు. వాటిల్లో ఉన్నదంతా సామాజిక చైతన్యం, నగరాల్లో, పల్లెల్లో అమ్మకమై అవి ప్రజా బాహుళ్యంలో ప్రచారాన్ని పొందాయి. అవి

వినోదం కన్నా ఉత్తేజానికి ప్రేరకాలయ్యాయి. నేను రాజ్యాంగ చట్రానికి వెలుపల ఏమీ ఆచరించనప్పటికీ, అహింసామార్గాన్ని భగ్నం చేయనప్పటికీ నన్నివ్వాళ కారాగారంలో బంధించారు.

జీతన్ మరాండీ చేసిన నేరమేమిటి?

నేనొక కుట్రకు గురి అయ్యాను. నన్ను ఒక ఏడాదికి పైగా గిరిధిలోని ఒక జైల్లో బంధించారు. నా మీద చేసిన నేరారోపణలన్నీ చాలా తీవ్రమైనవి. కొత్త కొత్త సంఘటనలు జరుగుతున్నాయి. నా మీద గిరిధి పోలీసు పన్నుతున్న కుట్ర పథకం క్రమంగా బయటపడుతున్నది. నేనొక విషయం ముందుగానే స్పష్టం చేయదల్చుకున్నాను. నేనెవరో, నేనేమిటో పోలీసులకు, అధికార యంత్రాంగానికి తెలుసు. కాని వాళ్లు నన్ను తమ కుట్రకు గురి చేయదలుచుకున్నారు. ప్రత్యేకించి మాజీ ముఖ్యమంత్రి బాబూలాల్ మరాండీ జెవిఎం. (ఝార్ఖండ్ వికాస్ మోర్చా)కు పోలీసుకు ఉన్న అపవిత్ర బంధం నా ఈ దుస్థితికి కారణం. ఒక వైపేమో బాబూ లాల్ మరాండీ లంచగొండితనం లేని, భయంలేని రాజ్యపాలనను నెలకొల్పానని ప్రగల్భాలు పలికాడు. మరొకవైపేమో పోలీసుల మిలాఖతుతో నా వంటి అమాయకుల మీద తీవ్రమైన అణచివేతను ప్రయోగించాడు. దీనికి ఒక నిదర్శనాన్ని కింద వివరిస్తున్నాను:

ఈ వాస్తవాలను గమనించండి : చిల్ఖారీ హత్యల (బాబూలాల్ మరాండీ కొడుకు, జె.వి.ఎం. నాయకుడు అనూప్ మరాండీ మరి పద్దెనిమిది మంది ఒక బహిరంగ ప్రదేశంలో కాల్పుల్లో మరణించారు. మావోయిస్టుల చర్యగా భావిస్తున్నారు - అను) తర్వాత దేవ్రీ పోలీసు స్టేషన్‌లో 167-07 నెంబర్‌తో ఒక ప్రాథమిక దర్యాప్తు నివేదిక నమోదయింది. నేరశిక్షాస్మృతి సెక్షన్ 164 కింద జుడిషియల్ మెజిస్ట్రేట్ ముందు ఒక వాఙ్మూలం కూడా నమోదయింది. అందులో పేర్కొన్న చాలామంది ముద్దాయిల పేర్లలో ఒక పేరు జీతన్.

ఈ జీతన్ ఎవరు? అతనిదే ఊరు? అందులో ఈ వివరాలేమీ లేవు.

ఆశ్చర్యకరంగా పత్రికల్లో (ప్రభాత్ ఖబర్) నా ఫోటో, నా వివరాలు ఒక పెద్ద వార్తా కథనంగా అచ్చయ్యాయి. ఈ వార్తా కథనంలో ఈ హత్యాకాండలో నన్ను ప్రధాన ముద్దాయిగా చిత్రించారు. ఇది చూసిన తర్వాత నేను దీనిని తీవ్రంగా ఖండించాను. నా ఈ నిరసన పత్రికల్లో ప్రచురించబడింది. సంపాదకులు ఈ వార్తా కథనం ప్రచురణ తాము చేసిన తప్పని అంగీకరించారు. పోలీసు యంత్రాంగంలో ఉన్నత స్థాయిలో ఉన్నవాళ్లు కూడా ఈ జీతన్ జీతన్ మరాండీ కాదని గ్రహించారు. ఈ వాస్తవాలు వెలుగు చూడడంతో నా మీంచి పెద్ద బరువు దిగిపోయినట్లయింది.

హఠాత్తుగా, ఐదు నెలల తర్వాత 2008 ఏప్రిల్ 5న మఫ్టీ దుస్తుల్లో ఉన్న పోలీసులు నన్ను రాంచీ - రాటు రోడ్లపై అరెస్టు చేసారు. నన్నొక రహస్య స్థలంలో ప్రశ్నించారు. నన్ను చిల్ఖారి సంఘటనలో ఇరికించే ఆధారాలేవీ నా వద్ద వాళ్లకు దొరకలేదు. ఆ తర్వాత వాళ్లు నా మీద ఒక ప్రాథమిక దర్యాప్తు నివేదిక నమోదు చేసినట్లు చెప్పారు. అయితే అందులో ముఖ్యమంత్రి నివాసం ముందు (ఆదివాసీ ప్రజల విస్థాపనకు వ్యతిరేకంగా) ఒకటి అక్టోబర్ 2007న 'రాస్తా రోకో' సందర్భంగా నేను చేసినట్లు చెప్తున్న 'పేలుడు స్వభావం' గల ప్రసంగానికి సంబంధించిన నేరారోపణ మాత్రమే ఉన్నదన్నారు. ఆ తర్వాత నన్ను రాంచీ, హత్వాయిలో ఉన్న బిర్సాముండా కేంద్ర కారాగారానికి పంపించారు. నేను పోలీసుల అక్రమ ఆధీనంలో ఉన్న పది రోజులు కూడ నన్ను ప్రశ్నించిన పోలీసులకు నేను జీతన్ మరాండీనే కానీ ఆ హత్యాకాండలో పాల్గొన్నాడని చెప్తున్న జీతన్ మరాండీని మాత్రం కాదని చెప్తూనే ఉన్నాను. ఉన్నత స్థాయి పోలీసు అధికారులు కూడ నా మాటలు విశ్వసించినట్లే కనిపించారు. పోలీసుల అక్రమ నిర్బంధకాలంలో నా మీద, నా పట్ల జరిగిన చాలా విషయాలు నేనిక్కడ చెప్పబోవడం లేదు. ఏమయితేనేం నేను చెప్పిన ఏ విషయాలూ పోలీసు డైరీలో నమోదు కాలేదు. ఈ డైరీలో మరో ముగ్గురు సాక్షుల వాఙ్మూలాలు నమోదయ్యాయి. ఈ సాక్ష్యాల ప్రకారం ఈ హత్యాకాండలో ఇద్దరు జీతన్ మరాండీలు పాల్గొన్నారు. వివరాల్లో ఒక జీతన్ మరాండీది నిమియా ఘాట్ పోలీసు థానా కింది థేసోపుల్లి గ్రామం. మరొక జీతన్ మరాండీది పిర్తాండ్ కింది కరాండన్‌గ్రామం. ఇతడే ఝార్ఖండ్ ఎబాన్ (నా సాంస్కృతిక బృందం)ను నడుపుతున్నాడు. మరొక ముఖ్యమైన అంశం ఏమిటంటే హత్యచేయబడిన వారి కుటుంబ సభ్యుల వాఙ్మూలాలు ఒకటి కూడ నమోదు చేసుకోలేదు. చిల్ఖారీ - దేవ్రీ నుంచి కూడ ఒక సాక్ష్యమూ లేదు. ఇదంతా ఎంత ఆశ్చర్యంగా ఉందంటే నా కన్నాముందు అరెస్టయిన ఏ ఒక్కరూ నా పేరు చెప్పలేదు. అంతేకాదు, నా అరెస్టు తర్వాత, నవంబర్‌లో ఒక ప్రకటన వచ్చింది. నిమియా ఘాట్ థానా కించి థేసోపుల్లి గ్రామానికి చెందిన జీతన్ మరాండీ ఉరఫ్ శ్యాంలాల్‌ను పట్టిచ్చిన వాళ్లకు లక్షల రూపాయల పారితోషకం ఇస్తామని. నా అరెస్టు తర్వాత వచ్చిన ఈ ప్రకటన, నా పేరు జీతన్ మరాండీ అయినందుకు మాత్రమే నన్ను గురి చేసారని స్పష్టంగా సూచిస్తున్నది. ఈ విధంగా నా మీద చాలా తప్పుడు కేసులు బనాయించారు. కొన్ని కేసుల్లో ఆ నేరాలు నేను జైల్లో ఉన్న సమయంలో జరిగినవి. కొన్ని కేసుల్లో ఇతర ముద్దాయిలు అప్పటికే నిర్దోషులని రుజువయి విడుదలయ్యారు. ఒక కేసులో (తీసేరీ పోలీసు స్టేషన్ కేసు నెం. 9 / 2004) ఆరోపణ చేసిన సమయంలో నేను మధుబనిలో అంతర్జాతీయ మహిళా దినోత్సవంలో పాల్గొంటున్నాను. ఆయా స్థలాల్లో, సమయాల్లో నేను ఉండే అవకాశమే లేని సందర్భాల్లో జరిగినట్లు చెప్తున్నా నేరాల్లో నేనెట్లా ముద్దాయినవుతానో ఊహకందని విషయం.

ఈ కుట్ర వెనుక దాచేస్తే దాగని సత్యం :

2009 మార్చ్ 24న క్రైం. నెం. 167/07 కేసులో ఉన్న

మేమందరమూ కోర్టుకు వెళ్లినప్పుడు ఈ కుట్ర వెనుక ఉన్న జె.వి.ఎం., గిరిధి పోలీసుల మిలాఖత్ వైఖరి బట్ట బయలైంది. నిందితులందరూ సెషన్స్ కోర్టులో నిరీక్షిస్తున్నారు. గిరిధి పోలీసు స్టేషన్ ఇన్‌చార్జి నన్ను పక్కకు పిలిచాడు. తాను పట్టణ (టౌన్) థానా ఇన్‌చార్జినని చెప్పాడు. కాని ఆయన సాధారణ దుస్తుల్లో ఉన్నాడు. పేరు, పదవి సూచించే చిహ్నాలేమీ లేవు. ఎందుకో మరి, జడ్జి ముందు హాజరు పరచడానికి నిందితుల్లోంచి నన్నొక్కణ్నే తీసుకువెళ్లారు. ఇట్లా ఎందుకు చేస్తున్నారని నేను ప్రశ్నిస్తే, నా ఎస్కార్టు పోలీసులు నన్ను ప్రశ్నలు వేయొద్దని దబాయించారు. మేం నిరీక్షిస్తున్న చోటు నుంచి నన్ను తీసుకవెళ్లేప్పుడు, టౌన్ - థానా ఇన్‌చార్జి కొంతమందికి నన్ను చూపి 'ఇతడే జీతన్ మరాండీ, ఇతణ్ని మీరు గుర్తించాల్సి ఉంటుంది' అని చెప్పడం నేను చెవులారా విన్నాను. నా సంతకం తీసుకోకుండానే నన్ను మళ్లీ వెనక్కి తీసుకపోతున్నప్పుడు 'నన్నెందుకు తీసుకవచ్చారు?' అని బిగ్గరగా అడిగాను. గౌరవనీయ న్యాయమూర్తి నన్ను హెచ్చరించాడు. నేను క్షమాపణలు కోరాను. ఇది జరిగిన తర్వాత మిగతా ముద్దాయిలను కూడా గౌరవనీయ న్యాయమూర్తి కాసిం అన్సారీ కోర్టు హాల్లోకి తీసుకువచ్చారు. సంతకాలు చేసిన తర్వాత, మేమప్పటి దాకా నిరీక్షిస్తున్న స్థలానికి తీసుకపోయారు. మళ్లీ అక్కడ నిరీక్షిస్తున్నపుడు వేరే ముద్దాయిలు నాతో చెప్పారు. పోలీసు థానా ఇన్‌చార్జి నన్ను చూపి మాట్లాడిన వ్యక్తులు 170/08 కేసులో సాక్షులు అని. వాళ్లలో కొందరు నా సహ ముద్దాయిల ఇరుగు పొరుగు ఇళ్ల వాళ్లు గనుక వాళ్లు వాళ్లను గుర్తుపట్టారు. ఇది ఎంత అన్యాయం! పోలీసు అధికారి ముద్దాయి సాక్షులకు చూపిగుర్తు పెట్టుకొని గుర్తు పెట్టమని చెప్పడు. నేను ఈ అన్యాయాన్ని ఎత్తి చూపుతూ కోర్టుకు, సంబంధిత పరిపాలనా శాఖలకు లిఖిత పూర్వకంగా దరఖాస్తులు పంపాను.

ఈ కుట్ర ఫలితమేమిటంటే :

2009 ఏప్రిల్ 1న కోర్టులో ఈ నేరానికి సంబంధించిన సాక్షుల వాఙ్మూలాలు పరిశీలింపబడాల్సి ఉన్నది. ఇద్దరు సాక్షులు - మోతీ సావూ, సుభోధ్ సావూ హాజరయ్యారు. మోతీ తాను కాల్పులు జరిపిన జీతన్ మరాండీని గుర్తు పడతానని చెప్పి నా వైపు చూపించాడు. చిల్ఖారీ హత్యాకాండలో పాల్గొన్న జీతన్ మరాండీ ఇతడేనని చెప్పాడు. నేను చర్యలో పాల్గొనకుండా, నేనెన్నడూ అసలు దేవ్రి ప్రాంతానికి గానీ, తీసే గ్రామానికి గానీ వెళ్లకుండా ఇది ఎట్లా నిజమవుతుంది? నా న్యాయవాది సరియైన వాస్తవాల నన్నిటినీ చురుకైన వాదనలతో ఎంతో సమర్థంగా కోర్టు ముందుంచాడు.

నేను మొదటి నుంచీ కూడా నాకు వ్యతిరేకంగా జరుగుతున్న ఈ కుట్ర గురించీ, ఈ అక్రమ కేసుల గురించీ, ఈ తప్పుడు విచారణా పద్ధతుల గురించీ జైలు సూపరింటెండెంట్ ద్వారా గిరిధిలోని చీఫ్ జుడిషియల్ మెజిస్ట్రేట్, జిల్లా జడ్జి, జైళ్ల ఐజి మొదలుకొని న్యూఢిల్లీలోని జాతీయ మానవహక్కుల కమిషన్ వరకు దరఖాస్తుల ద్వారా దృష్టికి తెస్తూనే ఉన్నాను. కాని అత్యంత విషాదమేమిటంటే వీరిలో ఏ ఒక్కరూ ఉచితమైన చర్యలు తీసుకోలేదు. కేవలం కోర్టు ప్రొసీడింగ్స్‌తోనే నా కేసులు జరుగుతున్నాయి. ఇందుకు చాలా డబ్బు కావాలి. ఇపుడున్న పరిస్థితుల్లో నా కుటుంబం ఈ భారం మోయజాలదు. నాకు బెయిల్ రావడం లేదు. నాకెంతో సహాయం కావాలి. నాకు కోర్టు మీద పూర్తి విశ్వాసం ఉంది. నా మీద చేసిన నేరారోపణలను నిశితంగా పరిశీలించి, నిష్పాక్షికంగా విశ్లేషించి న్యాయహితంగా తీర్పు చెప్తుందనే నమ్మకం నాకుంది.

ప్రగతిశీల మేధావులకు, రచయితలకు, క్రియాశీల కార్యకర్తలకు - ముందుకు వచ్చి నన్ను తప్పుడు ఆరోపణల నుంచి నిర్దోషిగా ప్రకటించే తీర్పు వచ్చేలా సహకరించి, నన్ను జైలు నుంచి విముక్తం చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఎందుకంటే నేను ప్రజా సంస్కృతిని, ఆదివాసీ సంప్రదాయాలను సంరక్షించే క్రియలో మళ్లీ నిమగ్నం కాగలగాలి.

ఝార్ఖండీ జోహార్లతో

జీతన్ మరాండీ

(జీతన్ మరాండీ తనకింకా కోర్టు మరణ శిక్ష విధించక ముందు న్యాయంపై అపార విశ్వాసంతో కేవలం బెయిలు ఆశించి రాసిన విజ్ఞప్తి ఇది. మరో రెండేళ్లు గడిచిపోయినవి. ఆయన తన ముగ్గురి సహచరులతోపాటు ఉరికంబంపై నిలిచి మనల్ని పిలుస్తున్నాడు. ఆవాహన చేసుకుందాం కదలిరండి)



## రచయితలకు విజ్ఞప్తి !

అరుణతారకు రచనలు పంపండి. కథలు, కవిత్వం, పుస్తక సమీక్షలు, విమర్శా వ్యాసాలు, సామాజిక రాజకీయ సిద్ధాంత వ్యాసాలు, యితర భాషల్లోనుండి తెలుగు పాఠకులకు అవసరమైన అనువాదాలు పంపించండి. అరుణతారలో అచ్చవుతున్న రచనలపై ఉత్తరాలు రాయండి. రచనలను మెచ్చుకునే ఉత్తరాలకంటే గుణదోషచర్చలు చేయగల ఉత్తరాలు పత్రిక ప్రమాణాలు పెంచుతాయి. పాఠకుల విమర్శనాత్మక ఉత్తరాలు పత్రికా నిర్వహణకూ తోడ్పడుతాయి. మీ రచనలు అరుణతార సాహిత్య, సిద్ధాంత స్థాయిని పెంచుతాయని నమ్ముతూ -

- సం

వ్యాసం

# రాజ్యం ఆ 'సంథాలీ సిరింగ్' గొంతు నులమకుండా ఆపాల్సింది మనమే

- అమృత

జీతన్ మరాండీని నేను చూడలేదు. అనిల్‌రామ్, మనోజ్ రాజ్‌వర్, ఛత్రపతి మండల్‌ల గురించిన వివరాలు నాకు తెలీవు. కానీ జూన్ 23 డేట్‌లైన్‌తో వచ్చిన వార్తను (పదిరోజుల తర్వాత) చదివాక మరణదండన విధించబడిన ఈ అపరిచితులతో నాకు గల ఏదో అవినాభవ, అనిర్వచనీయమైన సంబంధం పరిచిత అపర్ణ ద్వారా ఒక్కసారిగా అనుభూతమైనట్లయ్యింది. దట్టమైన ఝార్ఖండ్ హరితవనాల్లో, ఎత్తైన ఆ పర్వతసానువుల్లో, ఆదివాసీ గుండెలోతుల్ని సూచించగల ఆ లోయల్లో, సంథాలీ, ముండా ఆదివాసీ యువతుల నవ్వుల్ని లోభంగా లాక్కుని వాటిని గలగలా పారించే యేరుల ఒడ్డెమ్మడి సరిగ్గా ఎనిమిదేళ్ల క్రితం ప్రకృతి ఒక రుతువు నుండి మరో రుతువుకు పచ్చపచ్చగా మారే కాలంలో, భారత విప్లవోద్యమ చరిత్ర 'చీకటి అధ్యాయం' నుండి ఉజ్వలమైన భవిష్యత్తుకు మారబోతున్న ఆ మునివాకిట గడిపిన ఆ అపూర్వమైన రోజులు గుర్తుకువచ్చి మనసంతా ఎగసిన పాలనురుగుల కెరటాలు - ఇంతలోనే ఆ స్వచ్ఛమైన ప్రకృతినీ, మానవ ప్రవృత్తుల్నీ హరించేయడానికి నిప్పులు చిమ్ముతూ మీదికొస్తున్న ఆపరేషన్ గ్రీన్‌హంట్ డ్రాగన్ ధాటికి అవి చప్పున చల్లారినట్లయ్యి అణువణువునా పరుచుకుంటున్న ఓ మూగవేదన. కానీ వెన్వెంటనే సరిగ్గా జీతన్, జీతన్ లాంటి వందలాది, వేలాది ఆదివాసీ, ఆదివాసేతర కామ్రేడ్స్ అక్కడ ఎత్తిపట్టిన తిరుగుబాటు బావుటాలలో రెపరెపలాడుతున్నది మన ఆకాంక్షలే అనీ తోచి గొప్ప ఆశ్వాసన.

జీతన్ మరాండీ గురించి నేను మొదటిసారి విన్నదప్పుడే. ఝార్ఖండ్ అభేన్ (ఝార్ఖండ్ జాగృతి అని అర్థం) యుద్ధనృత్యానికి కాలు కదిపి, నా జీవితంలో నేను విన్న పాటల్లోకెల్లా మృదుమధురంగా తోచిన సంథాలీ 'సిరింగ్'లను పలవరించి, ఝార్ఖండీ జనజీవనంలో దాని పాత్రను అవగాహన చేసుకునే ప్రయత్నం చేసిందీ అప్పుడే. అపర్ణ జీతన్ సహచరిగా తర్వాత పరిచయమైంది. ముందుగా ఆమెతో నా పరిచయం నారీ ముక్తి సంఘం కార్యకర్తగా, నాయకురాలిగా, మాకు ఎన్‌ఎంఎస్‌నీ, ఝార్ఖండ్ అభియాన్‌నీ పరిచయం చేసిన అనేకమందిలో ఒకరిగా, అక్కడి గ్రామాల్లో పర్యటించినప్పుడు మాతో తిరిగిన గైడ్‌గా, యుద్ధనృత్యంలో నాట్యకత్తెగా, ఝర్ఖండ్ కార్యకర్తల్లో కొట్టొచ్చినట్టుగా కనిపించే ఓ అపురూపమైన ప్రేమా, అక్కర, ఆదరణలను ధారాళంగా పంచి యిచ్చి అక్కడున్నన్ని రోజులూ మమ్మల్ని తన రెక్కల కిందకి చేర్చేసుకున్న నెచ్చెలుల్లో ఒకరిగా - అన్నిటికంటే ఎక్కువగా ఎన్‌ఎంఎస్ కార్యకర్తలందరితో పాటు దేశవ్యాప్త విప్లవ మహిళోద్యమ భవిష్యత్తుకూ, ఝార్ఖండ్ అభేన్ కార్యకర్తలందరితో పాటు దేశవ్యాప్త విప్లవ సాంస్కృతికోద్యమ భవిష్యత్తుకూ ఒకానొక సూచికగా! ఝార్ఖండ్‌లో వివిధ నిర్మాణాల్లో పని చేసే కార్యకర్తలందరికీ వుండే సాధారణ నేపథ్యమే అపర్ణకూ ఉండింది, అంటే ఆమె కూడా చిన్నప్పుడు ఝార్ఖండ్ అభేన్‌లో పని చేసి ఎన్‌ఎంఎస్ ఆర్గనైజర్‌గా రూపాంతరం చెందింది.

జీతన్ మరాండీ గురించి ఆ తర్వాత చాలాసార్లే విన్నాను. ఆయన అనేకసార్లు అరెస్టులు అవ్వడం, రక్తాలు కారేలా ఆయన్ను కొట్టడం, అక్కడి మావోయిస్టు పార్టీ ఏదైనా మిలటరీ చర్య చేసినప్పుడు ఆయన పేరూ, ఆయనతో పాటు వుండే సాంస్కృతిక బృందం సభ్యుల పేర్లూ భవిష్యత్తులో వారిని తప్పుడు కేసుల్లో ఇరికించే ఓ పాలకవర్గ కుట్రలో భాగంగా పేపర్లో వస్తూ వుండడం, 2007లో రాంచీలో రాజకీయ ఖైదీల విడుదలకై ఆయన చేసిన 'నిప్పులు కక్కే' ఉపన్యాసంకై ఆయన్ని అరెస్టు చేయడం, తప్పుడు కేసుల్లో ఇరికించడం...చివరిగా ఇప్పుడీ మరణదండన వార్త. 2008లో అనుకుంటా ఝార్ఖండ్ ఎన్‌ఎంఎస్ కార్యకర్తల ద్వారా అపర్ణ ఎలా వుందో కనుకున్నప్పుడు ఆమె గర్భంతో ఉన్న విషయం తెలిసింది. 2011లో తెలుసుకున్నప్పుడు జీతన్ జైలులో ఉన్నాడు కనుక పిల్లాడ్ని పెట్టుకుని ఆయన విడుదల కోసం ప్రయత్నం చేస్తూ తిరుగుతున్నదని తెలిసింది. చివరిగా పేపర్లో జీతన్‌కు సెషన్స్ కోర్టు మరణదండన విధించాక ఆయనకు వ్యాన్ ఎక్కేముందు పిల్లాడ్ని అందించిందనీ, ఆయన పిల్లాడ్ని ఎత్తుకుని ఆమెను ఓదార్చాడనీ, ఈ కోర్టు తీర్పుకు వ్యతిరేకంగా కోర్టులోనే కాక బైటా పోరాడుతామనీ, మానవ హక్కుల కమిషన్‌కూ నివేదిస్తామనీ ఆమె అన్నదన్న వార్త.

జీతన్ మరాండీ గురించి నేను చాలాసార్లే ఊహించుకున్నాను. బుడిబుడి అడుగుల పిల్లల నుండీ టీనేజీ దాకా అన్ని వయస్సుల పిల్లలూ ఝార్ఖండ్ అభేన్ సభ్యులుగా, ఎన్‌ఎంఎస్ అక్కల సంరక్షణలో, వారి మార్గదర్శకత్వంలో మాతోపాటే గ్రామాలు తిరుగుతూ ప్రదర్శనలు ఇస్తూ ప్రజల కళ్ల వెలుగులుగా భాసిస్తున్నప్పుడు జీతన్ ఇలాగే మొదలయ్యి వుంటాడని ఊహించాను. వారిలాగే ఆయన కళల్నీ, రాజకీయాల్నీ జమిలిగా నేర్చుకుని ఒక ఉత్తమ ప్రజాకళాకారుడిగా ఝర్ఖండ్ ప్రజల, దేశంలోని మొత్తం పీడిత ప్రజల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే విప్లవ కళా, సంస్కృతులను తన గానం ద్వారా, నాటకాల ద్వారా ప్రచారం చేసే కార్యకర్తగా ఎదగడాన్ని ఊహించాను. ఆ పిల్లల నోళ్లలో నిరంతరం నానుతున్న ఆయన పేరును వింటూ ఆయన రోజువారీగా వాళ్లకు అన్నీ నేర్పే గురువుగా ఎలా పరిణామం చెంది ఉంటాడో ఊహించాను. భారత దేశ విప్లవోద్యమానికి ఝార్ఖండ్ విప్లవోద్యమం చేసిన అత్యుత్తమ చేర్పుల్లో ఒకటిగా అనేకమంది ఆదివాసీ నేపథ్యం నుండి వచ్చిన

కామ్రేడ్స్ వేర్వేరు నిర్మాణాల్లో అత్యున్నత నాయకత్వ స్థానాల్లోకి రావడం అనేది వెలుగులు చిమ్మే సత్యంగా గోచరించినప్పుడు (సిపిఐ (మావోయిస్టు) కేంద్రకమిటీలోకి వచ్చిన మొదటి మహిళ ఆదివాసీ కావడం ఆ పార్టీకి, ఈ దేశ విప్లవోద్యమానికి ఎంత గర్వకారణం! ఆ చేర్పు చేసినది ఝార్ఖండ్ విప్లవోద్యమమే) అందులో భాగంగా సాంస్కృతికోద్యమ నాయకుడిగా జీతన్ మరాండీ ఎదుగుదలను ఓ 'సహజ పరిణామం'గా ఊహించాను. దాదాపుగా అపవాదు లేకుండా ఈ నాయకులంతా చిన్నపిల్లలుగా ఉన్నప్పటినుండీ తీర్చిదిద్దబడినవారే, తమను తాము తీర్చిదిద్దుకున్నవారే. ఇది దేశంలోని నలుమూలలా ఉద్యమాలు తమ ప్రాంతాలకు అన్వయించుకుని పదే పదే తీర్చిదిద్దాల్సిన నమూనా అనేది నా మనసులో గాఢంగా ముద్రవేసుకున్నది. చివరిగా ఆయనకు మరణదండన విధించిన వార్త చదువుతూ "వినగానే ఏం చేసి ఉంటాడు?" అని ఊహించుకోబోయాను. కానీ నిజానికి ఇది మాత్రం ఊహించనవసరం లేదు. ఒక కళాకారుడు అందునా ఒక ఆదివాసీ కళాకారుడు, ఒక విప్లవ సాంస్కృతికోద్యమ కార్యకర్త/నాయకుడు ఏం చేస్తాడు? ఆయనా అదే చేశాడు, ఆయన సంస్థ చెప్పే రాజకీయాల్ని, వాటికి సాధనమైన ఝార్ఖండీ కళల్నీ అభిమానిస్తూ కోర్టు హాలులో నిండిపోయిన ప్రజలందరూ ఆయన్ను అనుసరించారు. వాళ్లు పాడారు. ఈ దేశాన్ని సామ్రాజ్యవాద కోరల నుండీ, భూస్వామ్య సంకెళ్ల నుండీ, దళారీ నిరంకుశ బూర్జువా పంజాల నుండీ విడిపించి తీరుతామనీ 'వో సుబహ్ కభీ తో ఆయేగీ' (ఆ ఉదయం ఎప్పటికైనా వస్తుంది) అనే గొప్ప ఆత్మవిశ్వాసాన్ని వారు గానం చేశారు. చెరసాలలు, ఉరికొయ్యలు తమ విప్లవ చేవనూ, తమ ప్రజల విముక్తి కోసం పోరాడే తమ సంకల్పాన్నీ దెబ్బ తీయలేవని ఆలాపించారు.

ఆపరేషన్ గ్రీన్‌హంట్ దురాగతాలు బీహార్-ఝార్ఖండ్‌లలో ఎంత పాశవికమైన రూపాల్లో కొనసాగుతున్నాయనేది ఇంకా చాలా నమోదు కావల్సే వున్నది. బీహార్‌లో కరడు గట్టిన భూస్వామ్యానికి వ్యతిరేకంగా దశాబ్దాలుగా జరుగుతున్న వర్గపోరు చాలా భీకరంగానే సాగింది. అక్కడి రాజ్యం ఎంచుకున్న అణచివేత పద్ధతుల్లో విప్లవ రైతాంగ కార్యకర్తలకు ఉరిశిక్షలు వేయడం ప్రముఖమైన అణచివేత రూపంగానే ఉంటూ వస్తోంది. ఇక 2004లో సిపిఐ (మావోయిస్టు) పార్టీ ఏర్పడి, మన్మోహన్ సింగ్ దాన్ని 'భారతదేశ అంతర్గత భద్రతకు అతి పెద్ద ముప్పు'గా ప్రకటించాక బీహార్-ఝార్ఖండ్‌లలో అత్యధిక సంఖ్యలో సిపిఐ (మావోయిస్టు) నాయకుల్ని, అంటే పొలిట్‌బ్యూరో మొదలుకొని, రాష్ట్రస్థాయి, జిల్లాస్థాయి, ఏరియా స్థాయి నాయకుల వరకు అరెస్టులు చేసి ఎక్కడెక్కడి కేసులో (ఆంధ్రప్రదేశ్ నుండి అస్సాం దాకా) వారి మీద బనాయించి, బెయిల్స్ ఇవ్వక, వయసు మీరిన, అనారోగ్యంతో ఉన్న వారికి సరిగా వైద్య సదుపాయాలు ఇవ్వక రకరకాలుగా వేధిస్తున్నారు. నారీ ముక్తి సంఘం అధ్యక్షురాలు, మన దేశం సగర్వంగా మొదటి వరుసలో చెప్పుకోవాల్సిన విప్లవ మహిళా ఉద్యమ నాయకురాలు కామ్రేడ్ షీలాదీదీని అరెస్టు చేసినప్పుడు, జైల్లో వున్నప్పుడూ కూడా రకరకాలుగా వేధించారు. అనారోగ్యం పాలయినా సరిగా వైద్య సహాయం అందివ్వడం లేదు. బెయిల్స్ వచ్చినా గేటు ముందే తిరిగి అరెస్టు చేసి తిరిగి లోపల పడేశారు. కామ్రేడ్ భూపేష్‌దా, కామ్రేడ్ జనార్ధన్‌జీలు దక్షిణ, ఉత్తర బీహార్‌లలో భూస్వామ్య విధానాన్ని నడ్డి విరిచి రైతాంగాన్ని ఆత్మవిశ్వాసంతో తలెత్తేలా చేసిన వ్యవసాయ విప్లవోద్యమ నిర్మాతలు. కామ్రేడ్ భూపేష్‌దా వయసు 72 సం॥లు, అనేక సంవత్సరాలుగా అనారోగ్య పీడితుడు. జనార్ధన్‌జీ 60వ పడిలోకి అడుగు పెడుతున్న మనిషి. నేడు పదుల సంఖ్యలో విప్లవోద్యమ వివిధ స్థాయిల నాయకులు జైళ్లలో మగ్గిపోతున్నారు. ఫాస్ట్ ట్రాక్ కోర్టుల పేరుతో వీరికి కఠిన శిక్షలు విధిస్తూ వారిని శాశ్వతంగా జైళ్లలోనే సమాధి చేసే కుట్రను సోనియా-మన్మోహన్-చిదంబరం ముఠా పన్నుతూ దేశప్రజల్ని తప్పుదోవ పట్టించడానికి మాత్రం చర్చల చిలకపలుకులు వల్లిస్తోంది. రాష్ట్రపతితోనూ వల్లింపజేస్తోంది.

ఝార్ఖండ్‌లో ఆపరేషన్ గ్రీన్‌హంట్ గానీ, అంతకు ముందు నుండీ కొనసాగుతున్న 'సేంద్ర' అనే పేరుగల విప్లవ ప్రతీఘాతుక హంతక క్యాంపెయిన్ గానీ అక్కడున్న అక్కడ గల అపారమైన ఖనిజ సంపదను కొల్లగొట్టడానికే అనేది నేడు స్కూలు పిల్లలకు కూడా అర్థమైన విషయమే. అక్కడ వారి 'దోపిడీకి ఉన్న అతి పెద్ద అడ్డంకి' మావోయిస్టు ఉద్యమం బలంగా వుండడం, విస్థాపన వ్యతిరేక ఉద్యమం బలంగా వుండడం. బీహార్ (ఇప్పటి ఝార్ఖండ్‌ని కలుపుకొని) బ్రిటిష్ పాలనకూ, 'దికూ'ల (బయటివారి) దోపిడీకీ వ్యతిరేకంగా గొప్ప ఆదివాసీ తిరుగుబాట్లకు నెలవైన ప్రాంతం. సంథాలీ ఆదివాసులు ఒకటి కాదు అనేక సాయుధ తిరుగుబాట్లు లేవనెత్తారు. బీర్సా ముండా 'ఉల్‌గులాన్' గురించి మహాశ్వేతాదేవి పుస్తకం ద్వారా, ఇతరత్రా ఆంధ్రప్రదేశ్‌లోని సీరియస్ పాఠకుల్లో తెలవని వారు వుండరు. ఆ విప్లవవీరుల వారసులు ఇవ్వాళ అక్కడ బరిగీసి నిలిచారు. వారు సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీల్నీ, వారి తొత్తుల్నీ తమ సహజ వనరుల్నీ, తమ అరుదైన, అపారమైన ఖనిజ సంపదనూ, తమ అద్వితీయమైన ప్రాచీన కళా, సంస్కృతుల్నీ, తమ జీవన విధానాన్నీ, తమ పిల్లల భవిష్యత్తునూ ధ్వంసం చేయనివ్వకుండా తమ గుండెలనొడ్డి అక్కడ నిలబడ్డారు. అక్కడి ఝార్ఖండ్ అభేన్ వంటి కళా, సాహిత్య సంస్థలు తమ ప్రజల పోరాటాలకూ, ఆకాంక్షలకూ కళారూపాన్నిస్తూ వారికి గట్టి సాంస్కృతిక దన్నుగా నిలుస్తున్నారు. విస్థాపన వ్యతిరేక పోరాటంలో ఆదివాసులకు ఊపిరి అయిన ఆట, పాట, నాటకం ఆయుధాలుగా మారిపోయాయి. జీతన్ మరాండీ గానీ, మిగతా సాంస్కృతిక కార్యకర్తలు గానీ నిజంగా తాము బనాయించిన తప్పుడు కేసుల్లో నిందితులు కారని రాజ్యానికి తెలియనిది కాదు. జీతన్ మరాండీని వాళ్లే అరెస్టు చేసి జైల్లో బంధించినప్పుడు జరిగిన కొన్ని యాక్షన్ల కేసులను కూడా వారు ఆయన మీద బనాయించడాన్ని ఏమనాలి? ప్రజాపక్షం వహించే కళాకారులను వేధించి, లొంగదీసుకోవడానికి ఇవన్నీ చేస్తున్నదనేది ఒక వాస్తవమైతే ఈ 'పాటల తూటా'లకూ, 'ఆటల మందుపాతర'లకూ రాజ్యం తక్కువ భయపడ్డం లేదనేదీ మరొక వాస్తవం. కళకుండే శక్తే అటువంటిది కదా. (దండకారణ్యానికి వెళ్లినప్పుడు ఒక కామ్రేడ్‌ను పేరు అడిగితే 'జీతన్' అన్నాడు. 'అరే, ఝార్ఖండ్‌లో సాంస్కృతికోద్యమ నాయకుడి పేరు కూడా జీతన్ తెలుసా?' అన్నా. ఆయన మెత్తగా నవ్వి, 'ఆయన పేరే పెట్టుకున్నా' అన్నాడు. 'ఆయన్ని చూశావా' అంటే

'లేదు, ఆయన్ని చూసిన ఒకాయన ఇష్టంగా నాకీ పేరు పెట్టుకున్నాడు' అన్నాడు. ఇన్ని రకాలుగా వుండచ్చన్నమాట (ప్రభావం అనుకున్నా). ఇప్పుడా శక్తినే మళ్లీ తమను తాము పరిరక్షించుకోవడానికి కూడా ఆ కళలు, కళా సంస్థలు, కళాకారులూ ఉపయోగించాల్సిన తరుణమిది. సుబ్బారావు పాణిగ్రాహి, చినబాబు, పద్మ, దివాకర్‌లను భారత ఫాసిస్టు రాజ్యం బలిగొంది. పధులమంది ఎపి, ఎన్‌టి, ఏఓబి జెఎన్నెం, పితూరి ఏందన దళం, దండకారణ్య చేతనా నాట్యమంచ్ కళాకారులను బూటకపు ఎన్‌కౌంటర్లు, ఎన్‌కౌంటర్లలో ప్రభుత్వ బలగాలు చంపేశాయి. కళాకారిణులను అత్యాచారాలు చేసి చంపిన ఘటనలున్నాయి. కుమారి, దాసూరాం మలేకాలను కూడా రాజ్యమే మలేరియా రూపంలో మింగింది. సల్వాజుడుంను ఎండగడుతూ దేశమంతా సాంస్కృతిక ప్రదర్శనలు ఇస్తూ (ఎపిలోనూ) ప్రచారం చేసిన సాంస్కృతిక బృందం నాయకుడు ప్రమోద్ కిడ్నీ సమస్యతో చనిపోయాడు. రాజ్య నిర్బంధం లేకుంటే వీరూ చనిపోయేవారు కాదు, జెఎన్నెం భాస్కర్ కృష్ణానదిలో మునిగిపోయేవాడూ కాదు. ఇప్పుడు జీతన్ మారండీని, ఇతర కళాకారులనూ మింగాలని రాజ్యం అనే కొండచిలువ నోరు తెరుచుకుని ముందుకొస్తోంది. ఆ సంథాలీ సిరింగ్‌ను రాజ్యం మింగేయకుండా కాపాడుకోవాల్సిన బాధ్యత మనందరిదీ.

జీతన్ మరాండీ అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమాఖ్యలో కూడా నాయకత్వ కామ్రేడ్. ఆయనతో పాటు శిక్ష పడినవారిలో దళిత, ఆదివాసీ కళాకారులున్నారని వార్తాపత్రికల కథనం. వీరి ఉరిశిక్షలకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా ప్రచారాందోళనలు చేపట్టాల్సిన అవసరం విప్లవ కళా, సాహిత్య సంస్థలన్నిటిపైనా మరింతగా వున్నది. వీటి నేపథ్యంలో బీహార్-ఝార్ఖండ్‌లలో ఆపరేషన్ గ్రీన్‌హంట్ వికృత రూపాలను మరింతగా వెలుగులోకి తీసుకురావడానికి ఓ పనిగా పూనుకోవాల్సిన అవసరమూ వున్నది. కెజి కన్నాబిరాన్, పత్తిపాటిల స్ఫూర్తితో మొత్తంగానే ఉరిశిక్షల రద్దుకు వ్యతిరేకంగా విశాల ఉద్యమంగా దీనిని మలచాల్సిన అవసరమూ వుంది. ఇటీవల బీహార్‌లోని కటిహార్‌లో అరెస్టయిన ముగ్గురు సిపిఐ (మావోయిస్టు) నాయకుల్లో ఒకరైన విజయ్ కుమార్ ఆర్య కన్నాబిరాన్ చనిపోయినప్పుడు ఆయన్ను గుర్తు చేసుకుంటూ బీహార్ విప్లవ రైతాంగ కార్యకర్తలకు ఉరిశిక్షలు విధించినప్పుడు ఆయన వాటిని రద్దు చేయించడానికి చేసిన కృషిని ఎంతగానో కొనియాడాడు అనీ, తాను అప్పుడు ఈ పని మీద ఆయన వద్దకు హైదరాబాద్ వెళ్లి కలిసినప్పుడు ఆయన నుండి పొందిన ఆదరణను హృదయపూర్వకంగా గుర్తు చేసుకున్నాడనీ, బీహార్ సాయుధ వ్యవసాయక విప్లవోద్యమం ఆయన సేవలను ఎన్నడూ మరువదంటూ నివాళి అర్పించాడనీ ఆయన ఉపన్యాసం విన్నవారు చెప్పారు. బీహార్, ఆంధ్రప్రదేశ్ విప్లవోద్యమాలు, విప్లవ ప్రజాసంఘాలు, పౌరహక్కుల పోరాటాలు అన్నీ ఇటువంటి ఎన్నో విడదీయరాని బంధాలతో పెనవేసుకుని దశాబ్దాలుగా కొనసాగుతూనే ఉన్నాయి. ఈ ఉరిశిక్షలు మళ్లీ అటువంటి ఒక సందర్భాన్ని ముందుకు తెచ్చినట్టుంది.

2003లో బీహార్-ఝార్ఖండ్‌లలోని విశాల మైదాన, అటవీ ప్రాంతాల్లో చురుగ్గా పని చేస్తూ బలమైన విప్లవ మహిళా సంఘంగా ఎదిగిన నారీ ముక్తి సంఘంతో ఇతర ప్రాంతాల్లోని మహిళా ఉద్యమ అనుభవాలు కలబోసుకుని, ఒకరి నుండి ఒకరం నేర్చుకోవడానికని నేనూ, మరొక సీనియర్ మహిళా ఉద్యమ నేత రాజశ్రీ ఝార్ఖండ్ వెళ్లాము. ఒక నెల పైగా వారితో కలిసి వున్నాం, వారితో గ్రామాలు తిరిగాం, వర్క్‌షాపులు నిర్వహించుకున్నాం. నా జీవితంలోకెల్లా అత్యంత విలువైన అనుభవాల్లో 1991లో మొదటిసారిగా దండకారణ్యంలో అడుగుపెట్టి క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘం గడ్చిరోలి డివిజన్ మొదటి మహాసభలకు హాజరై వారితో అక్కడి గ్రామాల్లో వారితో పాటు తిరిగిన రెండు నెలల కాలాన్నీ (అమరురాలు కామ్రేడ్ ఎల్లంకి అరుణ ఆధ్వర్యంలో), 2003లో నారీ ముక్తి సంఘం వారితో కలిసి కా. షీలాదీదీ ఆధ్వర్యంలో గడిపిన ఈ నెల కాలాన్నీ నేను తప్పక లెక్కవేస్తాను. నేటి ఈ రెండు బలమైన విప్లవ మహిళా ఉద్యమాలూ ప్రధానంగా ఆదివాసీ ప్రాంతాల ఉద్యమాలే కావడం యాదృచ్ఛికం కాదు, అనివార్యమే అనిపిస్తుంది - అక్కడి పోరాట చరిత్రలను వలస వ్యతిరేక ఉద్యమాల కాలం నుండి కూడా పరిశీలించినప్పుడు. అప్పటివరకూ స్థానికంగా తప్ప ఎన్ఎంఎస్ గురించి ఎక్కువగా మనకెవరికీ తెలీదనేది అర్థమై ఆ ఉద్యమాన్ని పరిచయం చేస్తూ ఒక వ్యాసాన్నీ, ఎన్ఎంఎస్ అధ్యక్షురాలు కా. షీలాదీదీని ఇంటర్వ్యూ చేసి దాన్నీ ఇంగ్లీషులో ప్రచురించగా తర్వాత అవి తెలుగు, హిందీ భాషల్లోకి అనువాదమై వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డాయి. (బహుశా గోండీలో కూడా అయ్యాయేమో). ఆ కాలంలోనే ఝార్ఖండ్ అభేన్ నాయకులు, సభ్యులు కలిసినప్పుడు (ఎన్ఎంఎస్ అంటే ఝార్ఖండ్ ఎభేన్ పిల్లలూ కలిసే వుంటారు దాదాపుగా) వారి నుండి తెలుసుకున్న విషయాలు కూడా స్థానికంగా తప్ప ఎక్కువగా మనకెవరికీ తెలీదు అని అర్థమై అప్పుడు తూర్పు కనుమల్లో జెఎన్నెం బాధ్యతలను నిర్వహిస్తున్న కామ్రేడ్ బద్రికి ఒక లేఖ రూపంలో రాశాను. అక్కడి 'తూర్పు కనుమ' పత్రికలో ప్రచురణ కోసం పంపాను. కానీ ఏవో కారణాల చేత అది ప్రచురణ కాలేదని తెలిసింది. జీతన్ మరాండీకీ, ఇతరులకూ ఉరిశిక్ష పడిన నేపథ్యంలో ఈ వ్యాసంతో పాటు దానినీ దుమ్ము దులిపి 'అరుణతార'కు పంపిస్తున్నాను. 2003కీ, ఆ తర్వాతకీ చాలా మార్పులే వచ్చి వుంటాయి ఆ సంస్థలో, దాని ఎదుగుదలలో. అయినప్పటికీ ఆ సంస్థ కృషిని ఒక మేరకు పరిచయం చేసేదిగా, ఉరిశిక్షల వంటి రూపంలో అక్కడ కొనసాగుతున్న ఆపరేషన్ గ్రీన్‌హంట్ దురాగతాలకి వ్యతిరేకంగా క్యాంపెయిన్లు నిర్మించాల్సిన అవసరం ఉన్న తరుణంలో ఏ మేరకైనా ఉపయోగపడుతుందనే దానితోనే పంపిస్తున్నాను. ఎఐఎల్ఆర్‌సీ సభ్యసంస్థగా ఝార్ఖండ్ అభేన్ గురించి గానీ, ఈ రెంటికీ నాయకుడిగా జీతన్ మరాండీ, ఇతర కళాకరుల గురించి గానీ విరసం, ఎఐఎల్ఆర్‌సీ తమ పద్ధతిలో తాము ప్రచారంగానీ, ఉరిశిక్షల వ్యతిరేక క్యాంపెయిన్‌ను గానీ చేపట్టే వుంటాయని ఆశిస్తున్నాను. ఆ సంస్థలు ప్రజలకు చేస్తున్న మంచీ-మేలూ, వారిపై రాజ్యం చేస్తున్న ఘోరాలూ వెలికి రావాలి. వాటిని తెలుసుకుని జనం ప్రభంజనం అవ్వాలి. అసలు విషయం అదీ.



వ్యాసం

(కామ్రేడ్ ఆర్.ఎస్.రావు ఇటీవల వర్గం, అస్తిత్వాలపై చర్చిస్తూ, ఇంకా మరింత వివరంగా వివరించాలని, విస్తరించాలని, చర్చించాలని అనుకుంటూ పంచుకున్న నోట్సును ఇక్కడ అందిస్తున్నాం - సం.)

# సామాజిక మార్పు - వర్గం, ఒక విశ్లేషణ

- ఆర్. ఎస్. రావు

మార్క్స్ అవగాహనలో మారుతూ ఉన్న మనిషి కాని సమాజం కాని ఆ మార్పును రెండు ప్రత్యేక అర్థాలలో వాడడం జరుగుతుంది. అందులో ఒకటి గుణాత్మకమైన మార్పు. ఇది దీర్ఘకాలికంగా వచ్చే మార్పు. వాటినే వ్యవస్థాగత మార్పులుగా, వ్యవస్థలో మౌలికమైన మార్పుగా చూడడం ఒక అవగాహన. ఈ అవగాహననే కమ్యూనిస్టు మానిఫెస్టోలో "all hither to known history is a history of class struggle" అని చెప్పి విప్లవాల అవశ్యకత మీద, అటువంటి విప్లవాల చివరిదశగా కమ్యూనిజంని పేర్కొంటూ "All pre history comes to a close" అని కూడా చెప్పడం జరిగింది. అంటే ఒక దానినే చరిత్రగానూ, చరిత్ర ముందు దశగానూ చెప్పడం ఒక ప్రత్యేకత. ఈ అవగాహనను తాత్వికంగాగానూ చూస్తే మూలం species survival గానూ enhanced survival గాను చెప్పవచ్చును. Survival అనగా species బతికిబట్ట కట్టడంగా చెప్పుకోవచ్చును. Enhanced survival అంటే ఇంకా తక్కువ శ్రమ చేసి మెరుగైన బతుకు తెరువుని సాధించుకోవడం అని అనవచ్చును. ఈ మెరుగైన బతుకు తెరువు మనిషి ప్రకృతి నియమాలను, సూత్రాలను అర్థం చేసుకుని దానిని తన అవసరాల రీత్యా వాడుకోవడం అని అనుకోవచ్చును. దీనినే ఉత్పత్తి శక్తుల అభివృద్ధిగా గ్రహించి ఆ శక్తులను ఉపయోగించి ఉత్పత్తి సంబంధాలలో మార్పులు తీసుకురావడంగా చూడవచ్చును.

ఉత్పత్తి శక్తులు చాలా పెరిగిన ప్రస్తుత కాలంలో కూడా మానవ సమాజంలో అంటే అది ఆమెరికాలో అవవచ్చును, ఫ్రాన్సులో అవచ్చును, చైనాలో అవవచ్చును, జపాన్‌లో అవవచ్చును - ఆ దేశాలలో కూడా మనిషి బతుకు తెరువు గురించి అనిశ్చలతకు గురి అవుతున్న మనుష్యులు చాలా మందే ఉంటారు. వారిది నిరుద్యోగమవవచ్చును, ఆత్మహత్యలవవచ్చును. ఇక మనలాంటి దేశాలలో విశ్లేషించవలసిన అవసరము లేదు. ఎందుకంటే అది మనం నిత్యం చూస్తూనే ఉంటాం. ఇది వ్యవస్థలో మౌలికమైన, గుణాత్మకమైన, వ్యవస్థాగతమైన మార్పులు అవసరమని చూపెట్టే సంకేతం. ఆ మార్పులు వర్గసమీకరణ ద్వారా, వర్గ రాజకీయాల ద్వారానే సాధ్యమని మార్క్స్ అవగాహన.

దీనికి ఆయన ఆలోచన రీతిలో ఉత్పత్తిశక్తుల కేంద్రీకరణ, అందులో సగటు మనిషికి తన వంతు మార్పు చేయగల స్థితి లేకపోవడం, ఉత్పత్తి సంబంధాల ద్వారా సమాజపు మిగులు కొన్ని ఆధిపత్యవర్గాలు చేతిలో ఉండిపోవడం, ఆ మిగులు ఉత్పత్తి సగటు మనిషి శ్రేయస్సుకాని, నిశ్చలత లేని బతుకు తెరువు కాని లేకుండా చేస్తే, వర్గసమీకరణ ద్వారా, ఒక సామాజిక విప్లవం ద్వారా సమాజం పునర్ నిర్మాణం, మౌలికమైన వ్యవస్థాగత మార్పులు చేయవలసిన అవశ్యకత గురించి మార్క్స్ చెప్పాడు. ఈ గుణాత్మకమైన మార్పును వర్గాల ద్వారా చూడటంలో ఆర్థికం, ఆర్థిక సంబంధాలు ఒక ప్రధానమైన పాత్ర వర్గ విశ్లేషణలో ఉన్నా, ఉత్పత్తి శక్తుల పెరుగుదల కూడా ఈ వర్గ విశ్లేషణలో ఒక భాగం.

ఇక మార్క్స్ చెప్పిన రెండో రకమైన మార్పు quantitative మార్పు. అది ఒక సమాజపు వ్యవస్థలో, స్థలకాలపరిమితులలో మనిషి తీసుకుని వచ్చే మార్పు. సమాజం అనగానే ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు కాకుండా ఆ సమాజపు గతిని నిర్దేశించే ఆర్థికేతర ఉపరితలాంశాలు కూడా ఉంటాయి. అంటే ఉత్పత్తి శక్తుల సంబంధాలు, ఉత్పత్తి సంబంధాలే కాకుండా మిగిలిన సామాజిక సంబంధాలు కూడా మనిషి ఆచరణకు, ఆలోచనకు తద్వారా వచ్చే మార్పులకు మూలమౌతుంది. ఈ సామాజిన సంబంధాలు ఒక చారిత్రక, సాంస్కృతిక, రాజకీయ పరిస్థితులతో ముడిపడి ఉంటాయి. మార్పుకు వీటిని అధిగమించే కార్యక్రమం కూడా ప్రధానమౌతుంది. మనిషి తన తక్షణ కర్తవ్యం (immediacy)గా సామాజిక సంబంధాలలో పేను మార్పుల గురించి చేసే ప్రయత్నాలు quantitative changes గా కన్పిస్తాయి. ప్రధానమైన సమస్య ఒకటి మనకెదురు అవుతుంది. ఈ సామాజిక సంబంధాలు ఆర్థిక సంబంధాల ప్రతిబింబాలా లేక చారిత్రక, సాంస్కృతిక ప్రేరేపితాలా? దీర్ఘకాలికంగా చూసినపుడు ఆర్థిక సంబంధాల ప్రతిబింబాలుగా కనిపించినా, ఒక స్థల కాల పరిస్థితులలో చూసినపుడు ఆర్థికంతో పాటు చారిత్రక, సాంస్కృతిక, రాజకీయ ప్రేరేపితాలుగా కూడా ఉంటాయి. తక్షణ కర్తవ్యం, రాజకీయ ప్రేరేపితాలుగా కూడా ఉంటాయి. తక్షణ కర్తవ్యం చూసినపుడు ఇవే ప్రధానంగా కన్పిస్తాయి. మనిషి ఇందులో మార్పులు కోరడం సహజంగా కనిపిస్తుంది.

కమ్యూనిస్టు మానిఫెస్టోకాని దాని ద్వారా పుట్టిన కమ్యూనిస్టు పార్టీలు కాని ఈ దీర్ఘకాలిక మౌలిక మార్పులు (qualitative changes) ను సమకాలీన quantitative మార్పులను, పై రెండిటిని, సమీకరించే క్రమంలో వర్గం, వర్గ రాజకీయాల ప్రాధాన్యతను ముఖ్యతరం చేస్తాయి. అంటే వర్గం, మార్క్స్ పరిభాషలో వర్గం, అంటే ఏమిటి? అనే దానిని కొంత వివరించవలసి ఉంటుంది. ఆయన దృష్టిలో వర్గం అనేది శ్రమ, శ్రమశక్తి వాటి రూపాన్ని బట్టి వర్గ విశ్లేషణ జరుగుతుంది. ఆయన చేసిన పెట్టుబడిదారీ వ్యవస్థ విశ్లేషణలో శ్రమశక్తిని తను స్వతంత్ర్యంగా అమ్ముకోగలిగే ప్రజలంతా శ్రామికులుగానూ, ఆ శ్రమశక్తిని కొనుగోలు చేసే ప్రజలంతా పెట్టుబడిదారులుగానూ రెండు ప్రధాన వర్గాలుగా విశ్లేషించడం జరిగింది. వాటి మధ్య సంఘర్షణే పెట్టుబడిదారీ వ్యవస్థ చలనానికి ఒక మూలం. ఆ వ్యవస్థలో మౌలికమైన మార్పు సోషలిజం

ఆవిర్భావం. ఆ శ్రామికుల మీదే వారు ఒక వర్గంగా సమీకరించుకున్నప్పుడే అది జరుగుతుంది. శ్రామికులు ఉండడం వేరు, శ్రామికులు ఒక వర్గంగా ఎదగడం వేరు. శ్రామికులు తక్షణ కర్తవ్యంగా కొన్ని రాయతీల గురించి, ఉదాహరణకు తమ కూలీ రేట్లు పెంచుకోవడం గురించి కాని, ఇతర సదుపాయాల గురించి పోరాటాలు చేయడం కాని, పని చేసే పరిస్థితులు మెరుగుపరుచుకోవడం గురించి కాని పోరాటాలు చేయడం, దీని ద్వారా కొన్ని మార్పులు సాధించుకోవడం జరుగుతుంది. అదే శ్రామికులు తమను తాము ఒక వర్గంగా చూసుకునే క్రమంలో సమాజంలో మౌలికమైన మార్పులు రావడానికి దోహదం చేస్తుంది. 'class in itself' అనే స్థితి నుండి 'class for itself' మారే దశ ఇది. ఈ దశ పారిస్ కమ్యూన్‌లో చూడవచ్చు. అక్టోబర్ రెవెల్యూషన్‌లోనూ చుడవచ్చు, చైనా విప్లవంలోనూ చూడవచ్చును. అంటే వర్గం తనను తానుగా గుర్తించుకున్నప్పుడు తక్షణ కర్తవ్యానికి మౌలికమైన మార్పుల వైపు ప్రయాణం చేస్తుంది. ఈ వర్గ సమీకరణే కమ్యూనిస్టు పార్టీకి కేంద్ర బిందువు.

సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారీ వ్యవస్థలో చేరిన మనలాంటి దేశాలలో వర్గ విశ్లేషణ కొంత క్లిష్టతరంగా ఉంటుంది. ఈ దశలో దేశీయమైన ఉత్పత్తిశక్తుల విధ్వంసం ఒక పక్క జరుగుతుండగా, ఉత్పత్తి సంబంధాల మార్పులలో శ్రమ శక్తిని స్వేచ్ఛగా అమ్ముకోగలిగే శ్రామికులు అంత త్వరగా ఉద్భవించరు. దేశీయ artisans నేత పనివాళ్ళు, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి మొదలైన వృత్తులలో గల ఉత్పత్తి శక్తులు విధ్వంసం కాగా, ఆ ఉత్పత్తిశక్తులు కల మనుష్యులంతా నిరుద్యోగులుగానూ, వ్యవసాయ కూలీలుగానూ మారడం జరుగుతుంది. పట్టణాల విషయంలో చూస్తే, ఉత్పత్తి శక్తుల ఆధిపత్యం సామ్రాజ్యవాదం చేతిలో, ప్రభుత్వ పెట్టుబడిచేతిలో కేంద్రీకృతమౌతుంది. శ్రామికులు, అసంఘటిత శ్రామికులు పెద్ద మొత్తంలో ఉండి అటు వ్యవసాయానికి దూరంగా పారిపోలేక, పట్టణాలలో తమ తక్షణ సదుపాయాలు తీర్చుకోలేక ఒక వర్గంగా తమని తాము చూసుకునే దశకు ఎదగలేకపోతారు.

ఇక వ్యవసాయరంగానికొస్తే, ఆ రంగంలో ఉత్పత్తిశక్తులు విధ్వంసం, వాటి కేంద్రీకరణ జరిగింది. అది రసాయనిక ఎరువులు, రసాయనిక క్రిమి సంహారకాదులు, జన్యుమార్పిడి విత్తనాలు ఇత్యాది మార్పులు చాలా జరిగాయి. దీనికి తోడు మారకపు విలువలు కేంద్రంగా ఉండే సామ్రాజ్యవాద పెట్టుబడి ఉపయోగపు విలువలు మూలంగా ఉండే ఉత్పత్తి సంబంధాలను మార్చే సుదీర్ఘ ప్రయత్నం. ఒక ఘర్షణ చోటు చేసుకుంటుంది. ఇక్కడ... సామ్రాజ్యవాదం బలోపేతముకి కావలసిన కొత్త సంబంధాలు వ్యవసాయరంగంలో రెండు వర్గాలుగా విభజన కోరుకుంటుంది. అది ధనిక రైతాంగం, రైతు కూలీలు. (ఇందులో భాగంగానే కార్పొరేటు వ్యవసాయం కూడా పెట్టాలని ప్రయత్నం జరుగుతోంది.) కాని పెట్టుబడిదారీ వ్యవస్థకు, భూస్వామ్య వ్యవస్థకు మధ్య నుండే ఘర్షణలో వ్యవసాయరంగం కొన్ని వర్గాలుగా విభజనకు లోనవుతుంది. ఈ వర్గ విభజన, వాటి మధ్య సంబంధాలు వ్యవసాయ రంగంలో మార్పును చదవడానికి ఉపయోగపడతాయి. శ్రమ, శ్రమశక్తి కేంద్రంగా ఈ వర్గాలను చూస్తే మనకు ఒక వర్గీకరణ కన్పించవచ్చును.

శ్రమశక్తితో సంబంధం లేకుండా, భూమి మీద యాజమాన్యంతో వ్యవసాయోత్పత్తిని స్వంతం చేసుకునే వర్గం ఒక భూస్వామ్య వర్గమనుకోవచ్చును. ఇతరుల శ్రమశక్తి కొనుగోలు చేసి మారకపు విలువలు ఉత్పత్తి చేసే ఒక వర్గాన్ని ధనిక రైతాంగంగా చూడవచ్చును. తమ శ్రమశక్తి మీదే ముఖ్యంగా ఆధారపడుతూ ఉపయోగపు విలువలు తయారుచేసే ఒక వర్గము మధ్య తరగతి రైతాంగం. ఇక తమకున్న కొద్దిపాటి భూమిలో తమ శ్రమశక్తిని వాడి మిగిలిన శ్రమ శక్తిని అమ్ముకునే వర్గం పేద రైతాంగవర్గం. ఇక మిగిలినది భూమిలేని, శ్రమ శక్తిని అమ్ముకోవడం ద్వారానే బతుకు తెరువు చూసే రైతు కూలీ వర్గం. ఈ వర్గ సమాజంలో భూస్వామ్యం నేతృత్వం వహిస్తే, సమాజంలో వచ్చే మార్పులు ఒక రకంగా ఉంటే, ధనిక రైతు వర్గం నేతృత్వంలో జరిగితే మార్పులు మరొక దిశ. మధ్య తరగతి వర్గం నేతృత్వంలో జరిగితే మార్పులు మరొక దిశలో ఉంటాయి. రైతుకూలీ, పేద్ద రైతు నేతృత్వం తీసుకుంటే మార్పులు మౌలికంగా, శ్రమశక్తి కేంద్రంగా సమాజం విప్లవీకరించడం జరుగుతుంది. ఏ గ్రామం ఏ నేతృత్వంలో ఉన్నది క్షేత్రపరిశోధనలో తెలుసుకోవలసిన విషయం. అర్ధవలస, అర్ధ భూస్వామ్యంలో ఏక కాలంలో అన్ని నేతృత్వాలు కనబడే అవకాశం ఉంది. అది కొంత వరకు సామ్రాజ్యవాదం మీద, భూస్వామ్యం మీద, విప్లవశక్తుల మీద ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు, కొంతకాలం కృష్ణా గోదావరి జిల్లాలు ధనిక రైతాంగం నేతృత్వంలో ఉంటే, ఇతర ప్రాంతాలలో భూస్వామ్య నేతృత్వం కనిపిస్తుంది. విప్లవ కార్యాచరణ ఉన్న ప్రదేశాలలో పేద రైతాంగం, రైతు కూలీల నేతృత్వము కనిపించవచ్చును. ఇది క్షేత్ర పరిశోధనలోనే తేలవలసిన విషయం. అధికార మార్పిడి ధనిక రైతాంగం నుంచి ఒక కొత్త తరహా భూస్వామ్యంలోకి చేరవచ్చును. ఒక భూస్వామ్యం రైతుకూలీ నేతృత్వంలోకి మారవచ్చును. అది correlation of class forces మీద ఆధారపడుతుంది. ఇది వర్గ దృక్పథం ద్వారా చేసే సామాజిక అధ్యయానికి మూలం.

మార్పు ఒక తక్షణ కర్తవ్యంగా చూసినప్పుడు వర్గమే కాకుండా, వర్గేతర సమాజిక సంబంధాలు కూడా ప్రాధాన్యత వహిస్తాయి. ఆ వర్గేతర సంబంధాలు స్త్రీ సమస్య అవవచ్చును, కుల సమస్య అవవచ్చును, మత సమస్య అవవచ్చును, ప్రాంతీయ సమస్య అవవచ్చును. మార్పుకు ఇవి కూడా దోహదం చేస్తాయి. ఇక్కడ మనం ప్రధానంగా గమనించవలసిన విషయం వర్గేతర సంబంధాలు ఒక వర్గం తను ఒక వర్గంగా చూసుకోవడానికి వర్గేతర సంబంధాలు ఎంత వరకు దోహదపడతాయి. అనే ప్రశ్న ప్రధానం. అంటే మౌలిక మార్పులు కోరుకునే వర్గ విశ్లేషణ వర్గంలో వర్గేతర సంబంధాలను సమన్వయపరుచుకునే పద్ధతులను అన్వేషించాలి. ఎంత ఆచరణసాధ్యమో, ఆచరణ ద్వారా గ్రహించాలి. అలాగే అందుకు సహాయపడే విధంగా వర్గేతర సంబంధాలలో వర్గ విశ్లేషణ, వర్గం పాత్ర కూడా నిర్దేశించుకోవాలి. ఇది ఒక ఆచరణాత్మకంగా జరుగవలసిన పని. ఆ ఆచరణ వర్గ సమీకరణకు సంబంధించినది.



వ్యాసం

# సామ్రాజ్యవాదం - అస్తిత్వాలు

- ఆర్. ఎస్. రావు

1. అభివృద్ధి పథకాల ద్వారా అభివృద్ధి సాధించగలం అనే అవగాహన మనకి చాలా కాలం నుండి ఉంది. పంచవర్ష ప్రణాళికలలో ఇది ఒక భాగం. మిషిన్లు తయారు చేసే మిషన్ల ఫ్యాక్టరీలు పెడితే, దానికి కావలసిన ఉక్కు కర్మాగారాలను పెడితే, పారిశ్రామిక అభివృద్ధి దానంతటదే వచ్చేస్తుంది. అనే నమ్మకం మహల్‌నోబిస్ గారికి, ఆయనతో పాటే నెహ్రూగారికి ఉన్న ఆశ. వ్యవసాయరంగానికి పోతే, పెద్ద డ్యాంలు, కొత్త పంటలు, కొత్త విత్తనాలు, కొత్త ఎరువులు ద్వారా వ్యవసాయాభివృద్ధి తనంతటదే జరుగుతుందనేది కూడా ఒక ఆశ. కొత్త బడులు, కొత్త పాఠ్యాంశాలు పెడితే అందులో చదువుకుని గొప్ప అభివృద్ధి సాధించగలరని అనేది కూడా ఆశలో భాగమే. మంచిరోడ్లు, రవాణాసౌకర్యాలు తయారు చేస్తే అభివృద్ధి నిరవధికంగా సాగుతుందనేది కూడా ఆశే. ఈ ఆశల కలగూర గంపే చంద్రబాబు నాయుడి విజన్ 2020. ఈ ఆశలకు పునాది అభివృద్ధి చెందిన దేశాలలో, అభివృద్ధి నిర్దేశించిన క్రమంలో పుట్టిన పథకాలు మనకి కూడా ఉంటే మనం కూడా అభివృద్ధి చెందుతాం అనేది పునాది. ఆ క్రమంలో అభివృద్ధి పథకాలే అభివృద్ధిగా భావజాలంలో చోటు చేసుకున్నాయి. అభివృద్ధి ఆ సమాజ ఆచరణలోని మార్పుల ద్వారా కావలసిన మార్పులు ఉత్పత్తి శక్తులలో అవవచ్చును, ఉత్పత్తి సంబంధాలలో అవవచ్చును, ఉపరితల అంశాలలో అవవచ్చును - ద్వారా ఆ సమాజ అభివృద్ధిని చూస్తాం. సమాజం తన అవసరాల ద్వారా చూడడమనేది ఒక ప్రత్యేకత. ఈ ప్రత్యేకత మావో ఆలోచనా విధానానికి మూలం. అభివృద్ధి పథకాల ద్వారా అభివృద్ధిని చూసిన క్రమం, యజ్ఞం కథలో మనం చూసినట్లు, వర్గకులాలకు నిష్పక్షపాతంగా, అతీతంగా (Neutralగా) ఉండకుండా కొన్ని వర్గాలను, కులాలను విధ్వంసం చేసింది. సుదీర్ఘంగా ప్రస్తుతం Development-Displacement మీద జరుగుతున్న చర్చ ఈ విధ్వంసాన్నే సూచిస్తుంది.

2. ఈ ఆశలకు ప్రలోభాలు తోడైతే అభివృద్ధి పథకాల ద్వారా అభివృద్ధి అనే మాయాజాలంలో, ఒక సుడిగుండంలో ఇరుక్కుపోయే పరిస్థితి మనం ప్రస్తుతం అనుభవించే దుస్థితి. ఈ ప్రలోభాలే మీకు ఉక్కు కర్మాగారాలు కావాలి. అది మేము ఇస్తాం, అప్పుగానైనా ఇస్తాం, పెట్టుబడి రూపంలోనైనా ఇస్తాం. ఉక్కు కాకపోతే డ్యాంలైనా కడుతాం, ఫ్యాక్టరీలైనా పెడతాం, మీకు ఏం కావాలంటే అది చేస్తాం, అప్పు కావాలంటే అప్పు, పెట్టుబడి కావాలంటే పెట్టుబడి ఇస్తాం. అది ప్రపంచ బ్యాంకు ద్వారా అవవచ్చును, ఎ.డి.బి. అవవచ్చును. ప్రైవేటు పెట్టుబడిదారులవవచ్చును. అంతే కాకుండా ఈ పథకాల ద్వారా వచ్చే పేదరికం, దాని నిర్మూలనానికి కూడా మేం కాని, మా ఎన్.జి.వో.లు కాని సహాయం చేస్తాం. ఏ పథకాలు కావాలి, అవి మీరు ఎక్కడ నుంచి తెచ్చుకోవచ్చును, దానిని ఎలా అమలు చేసుకోవచ్చును అనేది కూడా మా నిపుణులు వచ్చి మీకు సలహాలు ఇస్తారు. (మెకెంజీగారి రిపోర్టు, ప్రపంచ బ్యాంకు రిపోర్టు). మార్క్సిస్టు పరిభాషలో ఈ ప్రలోభాలకు మూలం సామ్రాజ్యవాదం. సామ్రాజ్యవాదం ప్రవేశం సమాజంలోకి పెట్టుబడిని తీసుకుని వస్తుంది. అది టీ తోటలు, కాఫీ తోటలు, రబ్బరు తోటలలోనే కాకుండా జనుము పరిశ్రమ, నూలు పరిశ్రమ, రైల్వేలు, విమానాలు ఇత్యాది అనేక రంగాలలో పెట్టుబడి ప్రవేశించింది. దాని అవసరాల రీత్యా భారత సమాజాన్ని, వ్యవసాయ రంగాన్ని కూడా మలుచుకుంటుంది. లేదా కబ్జా చేసుకుంటుంది.

3. సామ్రాజ్యవాదం ఒక పెట్టుబడి దారీ విధానం. ఆ విధానంలో అది చరమ దశ. పెట్టుబడికి ఎన్నో రూపాలు. అందులో ఒక రూపము Productive Capital. అంటే శ్రమ ద్వారా మిగులు ఉత్పత్తిని, తయారు చేసే క్రమం. ఇది ఫ్యాక్టరీ అవవచ్చును, ధనిక రైతు అవవచ్చును. రెండవది Trading Capital, ఈ రూపంలో సరుకుల మారకం జరుగుతుంది. ఈ రూపంలో మిగులు ఉత్పత్తిని మిగులు విలువలుగా మార్చే క్రమం ఇమిడి ఉంటుంది. ఇంక మూడవది Finance Capital. డబ్బు రూపంలో Productive Capitalని చలనంలోకి మార్చేది, సరుకుల మారకం జరగడానికి ఉపయోగపడేది ఈ Finance Capital. పెట్టుబడి మొదటి రూపం, రెండవ రూపం ప్రధానంగా ఉండే దశ నుండి Finance Capital రూపంలోకి మారడం అనే దశని సామ్రాజ్యవాద దశ అనవచ్చును. ఈ దశలో పెట్టుబడిని ఎగుమతులు చేసే క్రమం కూడా పుడుతుంది. Finance Capital సామ్రాజ్యవాద దశలో పెట్టుబడికి ఉండే లక్షణాలలో ఉత్పత్తి శక్తుల పెరుగుదల ఆగిపోదు. తద్వారా రావలసిన ఉత్పత్తి సంబంధాలలో కూడా మార్పులు వస్తాయి. కాని ఉపరితల అంశాలలో కావలసిన మార్పులు రావడం బహు అరుదు. Racism, Religion అనే దానికి వ్యతిరేకంగా ఉపరితల అంశాన్ని మార్చుకోవడం చిందరవందరగా ఉంటుంది. Equality, Liberty and

వ్యాసం

(పాణి అచ్చువేయబోతున్న తన వ్యాససంకలనాన్ని చదివి విమర్శ రాయమని అడిగినప్పుడు ఆర్.ఎస్.రావుగారు రాసిన విమర్శ, ముదునూరి భారతిగారి విమర్శతో కలుపుకొని - సం.)

# పాణి వ్యాసాలు ఒక విమర్శ గాలి పటం

- ఆర్.ఎస్. రావు, ముదునూరి భారతి

పాణి తన వ్యాసాలను ఒక చోట ఒక పుస్తకంగా తీసుకుని వస్తున్నానని, ఆ పుస్తకంలో ఆ వ్యాసాలను విమర్శనాత్మకంగా చూసి ఒక వ్యాసం రాయమని నన్ను, అలాగే ఇతరులను అడుగుతున్నాననీ చెప్పినప్పుడు కొంత ఆశ్చర్యం కలిగింది. ఎందుకంటే ఇటువంటి వ్యాస రచయితలు అప్పుడప్పుడు ముందు మాట రాయాలనో, పరిచయ వాక్యాలు రాయాలనో అడగడం పరిపాటి. కాని తను విమర్శని కోరడం, అటువంటి విమర్శలకు తన పుస్తకంలో చోటు కల్పిస్తాననడం నాకు తెలిసినంతవరకూ ఒక వింత ప్రవృత్తి. ఆయన నన్ను అడగడంలో ఆయన ఉద్దేశంలో నాకు మార్క్సు రచనలతో పరిచయం అవవచ్చు, ప్రస్తుత సమాజం మీద నాకున్న అవగాహన అయి ఉండవచ్చు, నా ఉపన్యాసాలలో, రచనల్లో ఒక కొత్త సమాజం ఆవిర్భావం గురించి నా కలలవవచ్చు. మార్పుని చూసి నాకు కలిగే ఆనందాన్ని చూసి ఆయనకు ప్రేరేపణ కలిగి ఉండవచ్చు. కారణమేదయినా పాణి నన్ను ఒక విమర్శనాత్మక వ్యాసం రాయమని అడగడం జరిగింది.

ఎవరీ పాణి? వ్యక్తిగతంగా కాకుండా ఆయన రచనల ద్వారానే ఆయన నాకు మొదట పరిచయం. ఆయన శ్రీశ్రీ మీద రాసింది చదివినప్పుడు శ్రీశ్రీని పెట్టుబడిదారీ విధానం, సోషలిజం మధ్య ప్రయాణం చేసిన కవిగా చూడడం, ఒక నగర కవిగా చిత్రించడం నాకెందుకో నచ్చాయి. అలాగే బాలగోపాల్ మీద రాసిన రచనలో ఆయన లోపాలను సమాజంలో ఉండే లోపాలుగానూ, సమాజంలో మార్పు ఆశించే నిర్మాణ పద్ధతులలో ఉండే లోపాలుగా గుర్తించడం నాకు నచ్చింది. అలాగే సెజ్‌ల మీద ఆయన రాసిన వ్యాసం నిర్దిష్టత నుంచి అమూర్తతకి వెళ్ళే ప్రయత్నం నాకెంతో

---

Freternity అనే భావజాలం ఒక్క అడుగు వెనక్కి వేస్తుంది. దీనికి ముఖ్యమైన కారణాలు రెండు. అందులో మొదటిది శ్రమశక్తి. ఇది మిగులు ఉత్పత్తి మిగులు విలువలకు కేంద్ర బిందువుగా కాకుండా డబ్బు Finance Capital ద్వారానే మిగులు విలువలు వస్తాయి అనే భావజాలం ప్రబలంగా ఉంటుంది. ఇంక రెండవది సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారి పూర్వ సమాజాలలో, పెట్టుబడి ఎగుమతుల ద్వారా వచ్చిన వైరుధ్య సంబంధాలలో ఐక్యతను ప్రధానంగా చూడడంలో ఆ పూర్వ సమాజాలలో ఉన్న ఉపరితల అంశాలను మార్చలేకపోవడం ఒక వంతు అయితే, ఆ ఉపరితలం అంశాలు సామ్రాజ్యవాద ఉపరితల అంశాలను కూడా ప్రభావితం చెయ్యడం రెండవ అంశం. సామ్రాజ్యవాదం ద్వారా వచ్చిన అభివృద్ధి పథకాలలో ఈ అంశాలన్నీ ఇమిడి ఉంటాయి. డబ్బు, డబ్బు రూపంలో పెట్టుబడి, స్థానిక ఉత్పత్తి శక్తులకు విలువ లేకపోవడం, శ్రమశక్తి ద్వారా అభివృద్ధిని చూడలేకపోవడం, ఉపరితలాంశాల జోలికి పోకపోవడం అన్నీ కూడా అభివృద్ధి పథకాలలో భాగమే. యజ్ఞం కథలోనూ అదే కన్పిస్తుంది. సెజ్‌లలోను అదే కన్పిస్తుంది.

4. సామ్రాజ్యవాద దశలో పెట్టుబడి ప్రపంచంలోనికి ప్రవేశించిన మనలాంటి దేశాలకు ఆ ప్రభావం, దాని మీద వ్యతిరేకత కొన్ని Identity సమస్యలను ముందుకు తెస్తుంది. అందులో ప్రథమంగా కన్పించే వ్యతిరేకత దేశం, జాతులు, స్వతంత్రం, విముక్తి అనే భావాలు. మన freedom struggle కాని, ఒరియా, తెలుగు, బెంగాలి, తమిళం లాంటి భాష ప్రాతిపదిక మీద వచ్చే Identity ఉద్యమాలు ఒక పక్క అయితే, హిందూ ముస్లిం Identityలు కూడా అందులో భాగంగానే ముందుకు వచ్చాయి. తిలక్‌గారి గణేశ్ ఉత్సవాలయినా, ముస్లిం లీగ్ పాకిస్థాన్ నినాదమైన అందులో భాగమే. కులపరంగా పెరియార్‌కాని, జ్యోతిరావ్‌ఫులే కాని, రామస్వామి చౌదరికాని అంబేద్కర్‌కాని వేరు వేరు అస్తిత్వాల మీద వచ్చిన క్రమం కూడా పై కోణం నుంచి చూడవచ్చును. అస్తిత్వ ఉద్యమాలను సామ్రాజ్యవాదం నుంచి వేరు చేసి చూడడం కొంచెం తప్పిదమేమో. కులాలు కాని మతాలు కాని ప్రాంతీయోద్యమాలు కాని సమాజంలో అంతర్లీనమైన భాగమే. సామ్రాజ్యవాద విధ్వంసంలో దానిని ఎదుర్కొనే క్రమంలో ఒక రూపం తీసుకుంటాయి. ఉద్యమ రూపం కూడా తీసుకోవచ్చును. సామ్రాజ్యవాద దశలో శ్రమశక్తికి గుర్తింపు తగ్గిన కాలంలో ఈ గుర్తింపును ఒక ideological frame లో చూడడం, sualtern studies అని కాని, post-modernism అని కాని చూడటము కొన్ని రూపకల్పనలు. ఈ ఉద్యమాల రూపాలు ఎటువంటివైనా, వాటి ప్రధాన లక్ష్యాలు ఎటువంటివైనా, వాటిని కల్పితాలుగా కాకుండా వాస్తవాలుగా గ్రహించి ఒక ప్రత్యామ్నాయ సామాజిక పునర్ నిర్మాణంలో భాగంగా చూసి ఆర్థిక విధానాలు మన ఉత్పత్తి శక్తులు, మన అవసరాలు కేంద్రంగా తీసుకునే క్రమంలో ఈ అస్తిత్వ ఉద్యమాలకు సమాధానమే కాకుండా ఒక నూతన సమాజ ప్రతి రూపం కల్పించుకోగలం. ఈ నూతన సమాజ ఆవిష్కరణకు విరసం తన కథల ద్వారా, వ్యాసాల ద్వారా, పాటల ద్వారా కొత్త చైతన్యాన్ని ఇవ్వగలదని నేను ఆశిస్తున్నాను.



వచ్చింది. ఇవన్నీ పుస్తక రూపంలో వ్యాసాలుగా చూడడానికి ముందు నాకు పాణిమీద ఉండే అవగాహన ఇది. తెలుగు సాహిత్యం మీద కాని, తెలుగు సమాజం మీది చర్చతోకాని అంతగా పరిచయం లేని నేను, వాటిమీద కొన్ని స్వంత అభిప్రాయాలు లేని నేను వీటిని విమర్శనాత్మకంగా చూడలేను. ఏ వ్యాసాన్ని చూసినా అందులో కొత్తదనం... అంటే నాకు తెలియంది చెప్పినప్పుడు నాకు ఆ వ్యాసం మీద, ఆ వ్యాస రచయిత మీద ఎంతో గొప్ప అభిప్రాయం కలుగుతుంది. అలాంటి అభిప్రాయమే పాణి మీద కలిగింది.

ఈ రచనల ద్వారా నేను చూసిన పాణికి, వ్యక్తిగతంగా నేను చూసిన పాణికి ఎంతో తేడా ఉంది. రచనలలో ఒక స్థిరత్వం కన్పించినా, ఒక మేధావి పాణిని వ్యక్తిగతంగా చూసినప్పుడు పాణిలో చాలా అస్థిరత్వం కన్పిస్తుంది. ఆ అస్థిరత్వానికి కారణం ఆయన ఒంట్లో బాగుండకపోవడం ఒక కారణమవవచ్చు, అంతకంటే ముఖ్యమైన కారణం పాణిలో ఉండే వందలకొద్దీ ప్రశ్నలకు సమాధానం వెతుక్కునే క్రమంలో కూడా కావచ్చును. ఆ ప్రశ్నలు ఆయన చదివిన పుస్తకాల ద్వారా, ఆయన సన్నిహితుల ఆలోచనల ద్వారా వచ్చి ఉండవచ్చు. తను బతుకుతున్న సమాజంలో ఆయన జరిపే క్షేత్ర పరిశోధనలకు, ఆయన ఆలోచించే రీతికి ఉండే వైరుధ్యం వలన తలెత్తి ఉండవచ్చును. కాని మొండిగా కనిపించే పాణిలో అస్థిరత్వపు ఛాయలు ఒక మంచి విశేషంగా నాకు కనిపించాయి. ఆలోచనలకు, వాస్తవంలో ఉండే ఆచరణకు మధ్య ఉండే వైరుధ్యం లేకపోతే మనిషి ఒక ఉత్పత్తి శక్తి అయ్యే అవకాశం ఉండదు. ఏ వ్యాసరచన అయినా నైపుణ్యంతో చెయ్యవచ్చు. ఆలోచనకి, ఆచరణకి ఉండే వైరుధ్యాన్ని నైపుణ్యంతో కప్పిపుచ్చుకోవచ్చును. కాని ఆ వైరుధ్యాన్ని ఒక సమస్యగా, సవాలుగా తీసుకుని కొత్త ఆలోచనల గురించి చేసే ప్రయత్నంలో ఉండే అస్థిరత్వం ఉత్పత్తి శక్తుల పెరుగుదలకి దారి తీయవచ్చును. నైపుణ్యమనేది.. చేసిన పనిని పదేపదే చేస్తే, అందులో సులువులు, మెలకువలు కనుక్కోవడం జరుగుతుంది. ఉత్పత్తి శక్తి అనేది ఒక కొత్త ఆలోచన, ఒక కొత్త ఆచరణ వైపు దారి తీసే క్రమం. పాణిలో కన్పించిన అస్థిరత్వం ఈ ఉత్పత్తి శక్తుల పెరుగుదలలోగల అస్థిరత్వాన్ని చూపిస్తుందని నా నమ్మకం.

పాణి చదివిన పుస్తకాలు, నా ఉద్దేశంలో, ఆధునికత మీద మార్క్సేతరులు జరుపుతున్న సుదీర్ఘమైన చర్చ గురించి.. అందులో భాగంగానే కాకపోయినా, భారత సమాజాన్ని పట్టి పీడిస్తున్న కుల సమస్య మీద కూడా విస్తృతమైన చర్చ. దానిమీద వచ్చిన సిద్ధాంతాలు, ఆ సిద్ధాంతాల మధ్య చర్చ కూడా పాణిని ఆకర్షించాయి. ఇకపోతే ఆయన నమ్మిన రాజకీయ సిద్ధాంతం మార్క్సిస్టు సిద్ధాంతం. ఆ సిద్ధాంతం ద్వారా వచ్చిన ప్రశ్నలు కొన్ని. అవి ప్రధానంగా పెట్టుబడిదారీ వ్యవస్థ గురించి, అది మనదేశంలో తీసుకొచ్చే మార్పుల గురించి ఒక వైపయితే, భూస్వామ్యం మీద వచ్చే ప్రశ్నలు కొన్ని. పుస్తకాలపరంగానూ, సిద్ధాంతపరంగానూ వచ్చిన ప్రశ్నలకి క్షేత్రపరిశోధన ద్వారా సమాధానాలు వెతుక్కొనే ప్రయత్నం చేసే పాణిలో అస్థిరత్వం నాకు కన్పిస్తూ ఉంటుంది. ఈ అస్థిరత్వం, దానికి సమాధానం వెతుక్కోవడం మనిషి నైజంగా గుర్తించే నేను పాణి అంటే కొంత గౌరవం పెరిగి నా ఈ విమర్శను సహృదయంతో తీసుకుంటాడని, ఆయన అస్థిరత్వానికి కొంత సమాధానం వెతుక్కోవచ్చని ఆశతో ఈ వ్యాసం రాస్తున్నాను. ఈ అస్థిరత్వం నాలోనూ ఒక భాగమే. అందుకే ఆనందంతో రాస్తున్నాను.

నా ఈ వ్యాసంలో పాణి రాసిన మూడు, నాలుగు వ్యాసాలను తీసుకొని పాణిలో ఉన్న అస్థిరత్వంను ఉదహరించడానికి ప్రయత్నిస్తాను. అందులో మొదటిది ఆధునికత- వలస వాదం అనే వ్యాసం. వృత్తిరీత్యా, నాకుండే జ్ఞానం రీత్యా, ఆధునికత అనేది మార్క్సేతరులు ప్రవేశపెట్టిన ఒక ప్రక్రియ. అర్థశాస్త్రంలో పాఠాలు చెప్పే నేను - అభివృద్ధి మన దేశంలో ఎందుకు జరగడం లేదు అనే విషయాన్ని అర్థం చేసుకోవడానికి ఒక ప్రఖ్యాతి గాంచిన అర్థశాస్త్రవేత్త ప్రవేశపెట్టిన పదజాలం. ఆయన పేరు ఆర్థర్‌లూయిస్. ఆయన మనలాంటి దేశాలను రెండు వ్యవస్థల మిశ్రమంగా చూసి అందులో ఒక వ్యవస్థ సాంప్రదాయ వ్యవస్థ అని, రెండవ వ్యవస్థ ఆధునికవ్యవస్థ అని, సాంప్రదాయ వ్యవస్థలో మార్పులు ఉండవనీ, మార్పు అనేది ఆధునిక వ్యవస్థలోనే ఉంటుందనీ, ఆధునిక వ్యవస్థ పెంపుదలలోనే సాంప్రదాయ వ్యవస్థ క్షీణిస్తుందని అని ఒక ప్రతిపాదన 1950ల మొదటి భాగంలో చేసాడు. దాని మీద Dual Economy Models అనే పేరుతో చాలా పరిశోధనలు జరిగాయి. అదే మన రాష్ట్రానికొస్తే CESS అనే పరిశోధనా సంస్థ మన రాష్ట్రంలో జరిగిన మార్పుల గురించి ఒక పుస్తకం తెస్తూ, మనది ఒక Dual Economy అని చెప్పడం జరిగింది. ఆ పుస్తకాన్ని సమీక్షిస్తూ, మన రాష్ట్రాన్ని Dual Economy లా చూడకుండా ఒక అర్ధవలస, అర్ధభూస్వామ్యంగా చూడడం ఉపయోగం, అది విశ్లేషణా చట్రం కింద పనికి వస్తుందని చెప్పడం జరిగింది. సాంప్రదాయం ఆధునిక అనేవి ఒక వర్ణన (Descriptive)కి ఉపయోగపడుతుందేమో కాని ఒక విశ్లేషణకి ఉపయోగపడే నిర్వచనం కాదు. ఈ మధ్య గ్లోబలైజేషన్‌ను ప్రపంచ బ్యాంకు దేశాల అభివృద్ధికి ఏకైక మార్గంగా చూసే పద్ధతిని వ్యతిరేకిస్తూ, ఆంధ్రప్రదేశ్‌లో కూడా కొంత ప్రజాదరణ పొందిన ప్రపంచబ్యాంకు పాత వైస్‌ప్రెసిడెంట్ జోసఫ్‌స్టిగ్‌లిజ్ సాంప్రదాయం, ఆధునికం అనేదాన్ని ఒక విశ్లేషణా చట్రంగా చూడడానికి ఒక ప్రయత్నం చేసాడు. ప్రతిదేశాన్ని తనదైన పద్ధతిలో ప్రపంచీకరణ చెయ్యడం సాధ్యం అని, ప్రపంచబ్యాంకు ఏకశిలా మార్గం పనికి రాదనీ చెబుతూ, వెనుకబడిన ప్రతిదేశంలోనూ అంతర్గతంగా సాంప్రదాయం, ఆధునికత అనేవి అనే వేరువేరు పాళ్ళలో ఉంటాయనీ చెప్పాడు. ఆయన ఉద్దేశంలో సాంప్రదాయం అనేది ఒక వ్యవస్థకి సంబంధించినది, ఆవ్యవస్థలోని మనుషులు వ్యవస్థని, దానిలో ఉండే ఇన్‌స్టిట్యూషన్లను ఎక్కడినుంచో వచ్చినవనీ, వ్యక్తులుగా వాటిని మార్చలేరని, దాని ద్వారా ఒక స్థిరత్వం ఏర్పడుతుందని చెబుతాడు. దీనికి వ్యతిరేకంగా ఉండే ఆధునిక వ్యవస్థలోని వ్యక్తులు దీనిని కూడా ఎక్కడి నుంచో వచ్చినవిగా కాకుండా, దానిలో మార్పులు చేయగలమని సూచించే వ్యవస్థ. ఆ మార్పులు ప్రకృతి మీద అవవచ్చు. సామాజిక సంబంధాలవ వచ్చును. అటువంటి సమాజాన్ని మార్చే క్రమం,

గ్లోబలైజేషన్ తీసుకువచ్చే క్రమం ప్రపంచబ్యాంకు లాగా బయటి ప్రపంచాన్నించి రాకుండా, దేశంలో అంతర్గతంగా ఉండే వ్యక్తులు తమదిగా గ్లోబలైజేషన్‌ని ప్రతిపాదిస్తే, దానికి సామాజిక అనుమతి ఉంటుంది, అప్పుడు అది విజయవంతమౌతుంది అని ప్రతిపాదించాడు. మన మన్మోహన్‌సింగ్‌గారు, మన మాంటెక్‌సింగుగారు, మన చంద్రబాబునాయుడుగారు మన దేశానికి ప్రపంచీకరణ తప్పమరే మార్గం లేదని చెప్పడం స్టిగ్‌లిజ్‌గారి ప్రతిపాదనల ద్వారా వచ్చిన ఫలితమే. మార్క్స్‌తో కొద్దిపాటి పరిచయం ఉన్న నాకు మనిషిని ఏమీ ప్రశ్నించని వాడిగా, మార్పుని కోరేవాడుగా కాకుండా ఒక వ్యవస్థకు బానిసగా ఉండే మనిషిని ఊహించడం కష్టం. మార్పుని కోరే మనిషి ఒక ఆధునిక మానవుడేనని అనుకుంటే కొంత అపహాస్యమవుతుంది. చరిత్రలో జరిగిన మనిషి ప్రయాణం గుర్తించకపోవడం ఈ చట్రంలో ఉండే అపహాస్యం. ఇది ఆర్థిక శాస్త్రానికే సంబంధించిన విషయం కాదు. చరిత్ర పుస్తకాలలో కూడా మోడ్రన్ ఇండియా అంటాం. సోషియాలజీ సబ్జెక్టులో కూడా సాంప్రదాయం, ఆధునీకతల మీద చాలా చర్చ జరుగుతూ ఉంటుంది.

పాణి రాసిన వ్యాసం ప్రస్తుతం ఆధునికత మీద చర్చలో భాగంగానే రాసింది. కాని ఆయన ఈ ఆధునికతకు గల మూలం వలస పాలన నుంచి, వలస పాలన ద్వారా వచ్చినవిగా గ్రహించడం ఆయన ప్రత్యేకత. వలస పాలన అంటే బ్రిటిష్ రాజ్యాధికారం మన దేశాన్ని కబ్జా చేసుకుని తనదైన రీతిలో ఇక్కడ రాజ్యం, రాజ్యాంగం ఏర్పరచిన స్థితి గురించి మనం చెప్పుకుంటాం. ఆ స్థితి ఒక చారిత్రక క్రమంలో పుట్టినది. సరుకుల వ్యాపారంలో మొదలైన బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ భారతదేశాన్ని ఒక వలసగా తయారుచెయ్యడం, బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ నుంచి బ్రిటిష్ రాజ్యం భారతదేశాన్ని కైవసం చేసుకోవడం, ఆ చేసుకునే క్రమంలో ఈ దేశానికి పెట్టుబడులను ఎగుమతులు చెయ్యడం, ఆ ఎగుమతులు లాభాలు ఆర్జించే కెనాల్ ఇరిగేషన్, (కాటన్ ఈ దొరగారి ధవళేశ్వరం గురించి గుర్తుచేసుకోవాలి) ఆ లాభాల వేటలో రైలుమార్గాలు వెయ్యడం, పత్తి పరిశ్రమలు, జనుము పరిశ్రమలు ప్రవేశపెట్టడం, కాఫీ, తేయాకు రబ్బరు వంటి ప్లాంటేషన్లు ప్రవేశపెట్టడం కూడా జరిగింది.

సరుకుల వ్యాపారం కోసం మన దేశానికి ఒక్క బ్రిటిష్ వాళ్ళేకాదు. ఫ్రెంచివాళ్లూ ఈస్ట్‌ఇండియా కంపెనీని పెట్టారు. డచ్‌వాళ్ళు అలాగే పెట్టారు. (వీళ్ళందరి నమూనాలు రేఖామాత్రంగా చూడాలంటే బందరు అనబడే మచిలీపట్టణం వెళితే తెలుస్తుంది) ఐరోపా ఖండం నుంచి భారతదేశానికి సరుకుల వ్యాపార నిమిత్తం ఇన్ని దేశాలు ప్రయత్నించడం గమనించాల్సిన విషయం. అవన్నీ సంపన్న దేశాలా? భారతదేశం అప్పటికి ఒక సంపన్న దేశమా? అనే ప్రశ్న వేసుకుంటే అప్పటి ఐరోపా ఖండం ఒక విపరీతమైన సంక్షోభంలో పడి ఉంది అని గ్రహించాల్సి ఉంటుంది. అవి సంపన్న దేశాలు కావు, అవి ఒక చీకటి కాలంలో స్తంభించిపోయిన దేశాలని ఒక గుర్తింపు ఉంది. ఆ దేశాలను పట్టి పీడిస్తున్నవి భూస్వామ్యం, దానితో తోడైన క్రైస్తవ మతం. కొంత క్రైస్తవ మతం గురించి ఆలోచిస్తే, హిబ్రూ భాషలో ఉన్న బైబిల్ గ్రంథాన్ని విశ్లేషించే అధికారం ఒక్క చర్చికే ఉంది. దానిని సామాన్యప్రజలు శిరసావహించవలసిందే, సామాన్య ప్రజల భాషకాని హిబ్రూలో ఉన్న బైబిల్ చదవడానికి, విశ్లేషించడానికి వీల్లేని పరిస్థితి. అన్యాయాలు, అక్రమాలను ప్రశ్నించే హక్కు ప్రజలకు లేకపోవడం సామాన్య ప్రజలను ఒక సంక్షోభంలోకి నెట్టివేస్తుంది. ఈ పద్ధతిని వ్యతిరేకించడం ఒక మార్టిన్ లూథర్ కింగ్ ద్వారా వచ్చిన ప్రొటెస్టెంట్ ఉద్యమం... ఇంగ్లిష్ భాషలోకి బైబిలును అనువదించడంతో బ్రిటిష్ చర్చి ఉద్భవించింది. సామాన్యుల జన జీవితాన్ని నిర్దేశించే ఈ రాజ్యం, చర్చి కూడా మనిషి ఆలోచన మీద, ఆచరణ మీద విపరీతమైన ప్రభావాన్ని కలిగించాయి. భూమి గుండ్రంగా ఉంది అని శాస్త్రయుక్తంగా చెప్పడం కూడా అప్పటికాలంలో ఒక నేరమే. అంత పటిష్టమైన సమాజం, సమాజ నియంత్రణ సామాన్య ప్రజలను సంక్షోభంలోకి నెట్టివేస్తుంది. దాన్ని వ్యతిరేకించిన ప్రజలే లియోనార్డో డావిన్సీ లాంటివాళ్ళు. పునర్జీవనం(రినైజాన్స్) ప్రతినిధిగా నిలబడే డావిన్సీ మనిషి ఎన్నో విషయాల మీద ఆలోచించగలడు, ఎన్నో విషయాలు చెయ్యగలడు, అవి అందరు మనుషులు కూడా చెయ్యగలరు ... అనే విషయాన్ని మనకు చెబుతాడు. అదే కాలంలో కొంచెం ఇటూ అటుగా కొలంబస్ లాంటివారు ఒక పదిమంది ఖైదీలను తీసుకుని ఒక నావమీద 'ఇండియా ఎక్కడ ఉంది? అని బయలుదేరిన ఉదంతం కూడా జరిగింది. సముద్రయానం, తద్వారా పుట్టిన పిండారీలు ఒక పక్క అయితే, సరుకుల మారకం గురించి వచ్చిన కంపెనీలు కొన్ని. అదే ఈస్ట్ ఇండియా కంపెనీ.

ఈ సంక్షోభంలో ప్రజలు చూపించే వ్యతిరేకతలోంచి, ప్రజా సమూహాలు చేపట్టిన ప్రతిఘటన పోరాటాలలోంచి పుట్టిన వ్యవస్థే పెట్టుబడిదారీ విధానం.

ఆ విధానం సమాజాన్ని పునర్ నిర్మించే క్రమంలో ఒక కొత్త రాజ్యం, రాజ్యాంగం పుట్టుకొచ్చాయి. ఆ క్రమంలో కొంత ఉత్పత్తి శక్తులను అంటే మనిషి ఆలోచన, ఆచరణ కొత్త ఆలోచన క్రమాన్ని వ్యవస్థీకరించడం, ఆ శక్తులను పాత రాజ్యం, రాజ్యాధికారం, చర్చి చేతులలోంచి విముక్తి చెయ్యడం జరిగింది. తద్వారా కావలసిన ఉత్పత్తి సంబంధాలలో మార్పులు...అవి ఫ్యాక్టరీలవవచ్చు, పట్టణీకరణ అవవచ్చు, వ్యవసాయాన్ని పెట్టుబడి అధీనంలోకి తీసుకోవడం కావచ్చును. ఈ మార్పులు కూడా త్వరితంగా జరిగాయి. ఈ మార్పులు అంటే ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలలో వచ్చే మార్పులు దోహదపరిచే విధంగా రాజ్యం, రాజ్యాంగం పునర్వ్యవస్థీ కరించబడ్డాయి. ఒక డెమాక్రసీ, దానికి అవసరమైన సమానత్వం, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం కీలక అంశాలుగా పుట్టాయి. ఆధునికత్వంగా చెప్పబడే సమాజం ఒక పెట్టుబడిదారీ సమాజం. ఈ సమాజంలో ఉత్పత్తి శక్తుల పెరుగుదల కడుమెండుగా ఉంటుంది. అలాగే తలసరి ఆదాయం పెరుగుదల కూడా హెచ్చుగానే ఉంటుంది. ఈ రెండు అంశాలు మనుషుల సమానత్వం, స్వేచ్ఛతో పెట్టుబడి దారీ విధానం మిరుమిట్లుగొలిపే గొప్ప వెలుగు. ఇదే ఆధునిక వ్యవస్థగా చెప్పుకుంటూ, దీని

మూలాలను పునరుజ్జీవనంలో చూడడం ఒక ideological abberation. abberation అని ఎందుకన్నానంటే దాని మూలాలను చూడకపోవటం. దాని మూలాలుగా చూడకపోతే "ఆధునికత"గా కన్పించే పెట్టుబడిలో ఉన్న నీడలు చూడటం కష్టం. ఒక వేళ చూసినా అది అనివార్యం అని కూడా అన్పించవచ్చును. పెట్టుబడుల ద్వారా వచ్చిన నీడలు సమానత్వం, స్వేచ్ఛని కొంత అపహాస్యం చేస్తాయి. పెట్టుబడి ఒక సామ్రాజ్యవాదంగా మారిన కాలంలో ఈ నీడలు బాగాపెరిగి సమానత్వం, స్వేచ్ఛ అనే అంశాలను .అభాసు చేస్తాయి.

వలసపాలన దశలో ఈస్ట్ ఇండియా కంపెనీ నుంచి బ్రిటిష్ రాజ్యం చేతిలోకి భారతదేశం వెళ్లే క్రమంలో రాజ్య నిర్మాణం, రాజ్యాంగ నిర్మాణం చేయవలసిన అవసరం ఉంది. భాషాపరంగా చూస్తే, ఆ రాజ్యం భాష ఇంగ్లీషు. కాగా ఆ సామ్రాజ్యపు సాంఘిక నియమాలు, సంస్కృతిని నియంత్రించే క్రైస్తవ మతం ఒకటి ఉంది. ఉత్పత్తి శక్తులను పెంపుదల చేసే వ్యవస్థలు కొన్ని ఉన్నాయి. పెట్టుబడికి, శ్రామికులకు ఉండే వైరుధ్యం, అలాగే మిగిలిన వైరుధ్యాలు, సమీకరించే వ్యవస్థలు కొన్ని ఉన్నాయి. భారతదేశంలో రాజ్యనిర్మాణం, రాజ్యాంగ నిర్మాణం చేసే క్రమంలో, ఆ క్రమాన్ని, కొంత బలాన్ని ఉపయోగించినా, మన సమాజంలో రాజ్యం, రాజ్యాంగాన్ని ఆమోదించే తీరుకు ఈ సమాజంలో భాషలు, సంస్కృతి, ఇక్కడున్న మతాలను అవగాహనలోకి తీసుకొనే ప్రయత్నం కొంత చేయవలసి వచ్చింది. ఆ ప్రయత్నంలో అప్పటి రాజ్యాలు, రాజ్యాంగాలలోఉన్న పెద్దలతో చేయవలసిన అవసరం ఉంది. హిందూమతం గురించి తెలుసుకోవాలంటే కొంత వేదపండితులతో సంపర్కం కావలసి ఉంటుంది. అలాగే ముస్లిం ముల్లాలతో కూడా సంపర్కం కావాలి. అలాగే భాషల గురించి తెలుసుకోవాలంటే ఆ భాషా పండితుల ద్వారానే జరగాలి. వలస పాలకులకు ఇది ఎంత అవసరమో దేశీయపాలకులకు కూడా ఈ క్రమం అంత ఉపయోగం. దేశీయ పాలకులకు ఇంగ్లీషు నేర్చుకోవడం, క్రిస్టియన్ మతంలో మంచి, చెడులను గ్రహించడం, ఇంగ్లీషు చదువుల ద్వారా పొందే వికాసాన్ని గ్రహించడం, బ్రిటిష్ వ్యవస్థ నిర్మాణ పద్ధతులలో ఉండే మంచిని గ్రహించడం స్థానీయపాలకులు నేర్చుకునే క్రమం. ఆ క్రమంలో తమ మతం, ఆచారం, వ్యవహారం, సంస్కృతులలో ఉండే లోపాలను కూడా గ్రహించడం జరుగుతుంది. వలస పాలకులతో ఈ సంపర్కంవల్ల రాజ్యాంగ యంత్రంలో స్థానికులకు కొంత చోటు కూడా సంక్రమిస్తుంది. మొదటి విడతలో వచ్చిన సంస్కరణోద్యమాలు.. అవి రాజారామమోహన్‌రాయ్ అవవచ్చును, కందుకూరి వీరేశలింగం అవవచ్చును. ఈ నేపథ్యంలో పుట్టినవని నా అనుమానం.

వలస పాలనకు రాజ్యం, రాజ్యాంగం నిర్మించడం ఒక క్రమమైతే, మన ఆర్థిక విధానాలు పెట్టుబడిని ప్రవేశపెట్టడం, అవి ఫ్యాక్టరీల రూపంలోనూ, వ్యవసాయరంగంలో కొత్త పంటలు పండించడంలోనూ, అలా జరిగే అనేక కార్యక్రమాలలో దేశీయ ఉత్పత్తి శక్తుల విధ్వంసం, ఉత్పత్తి సంబంధాల విధ్వంసం దాని స్థలంలో కొత్త ఉత్పత్తి సంబంధాలు ప్రవేశపెట్టడం జరిగింది. ఈ క్రమంలో ఉత్పాదక శ్రమ చేసే రైతు కుటుంబాలు, దళిత కుటుంబాలు, చేతివృత్తి కులాల కుటుంబాలు ఓ సంక్షోభంలోకి నెట్టబడ్డాయి. ఆ సంక్షోభం లోంచి వచ్చిన రెండో విడత ఉద్యమాలు, నా ఉద్దేశంలో, ఈ నేపథ్యంలో పుట్టినవి. వీటి రూపాలు మీద చర్చకంటే నేపథ్యం మీద అవగాహన ఉపయోగమేమో. అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీలో రామస్వామి నాయకర్ ద్వారా వచ్చిన anti brahmin movement ఒక తరహాదయితే, కేరళలో గోపాల్‌గురు ద్వారా వచ్చిన ఆలోచనాక్రమం మరొక రూపమైతే, మహారాష్ట్రలో ముందుగా జ్యోతిరావ్ పూలే తర్వాతగా అంబేద్కర్ స్ఫూర్తితో వచ్చిన ఉద్యమాలు మరికొన్ని... ఈ ఉద్యమాలన్నీ ఉత్పాదక శ్రమ చేసిన మనుషులు ఎదుర్కొంటున్న సంక్షోభానికి వచ్చిన సంకేతాలు.

మొదటి విడత సంస్కరణలయినా, రెండో విడత సంస్కరణలయినా ఏమి సాధించాయి? ఏమి సాధించలేదు అనే ప్రశ్న కన్నా మన సమాజం ముందు ఆ సమాజంలో ఉన్న లోపాల మీద ఏ ప్రశ్నలు వేసుకుంటోంది అనేది గమనించాల్సిన విషయం. అది మన సమాజాన్ని అర్థం చేసుకునే క్రమం, దాని నేపథ్యం తెలిస్తే సమాజపు నిర్మాణం గురించి ఒక శాస్త్రీయ దృక్పథం వస్తుంది. దీనికి మార్క్సిస్టు ఆలోచనారీతి చాలా ఉపయోగ పడుతుంది అని నా ఊహ. ఆధునికత, సాంప్రదాయం చట్రం విశ్లేషణాత్మకంగా ఉపయోగపడకపోవచ్చును.

ఇక రెండో వ్యాసం ఒక ఊరి కథ. ఆ వ్యాసం ఏమి చెప్పదలచుకున్నదో, ఎలా చెప్పదలచుకున్నదో, ఎందుకు చెప్పదలచుకున్నదో నా అవగాహనికి అందని విషయం. నాకు ఆ వ్యాసంలో ఉన్న అంశాలతో పూర్తి ఏకీ భావముంటుంది. నా ఆలోచనలో ఉండే చాలా విషయాలు పాణి వ్యాసంలో కూడా ఉంటాయి. నేను చూసిన గ్రామాలలో కొన్ని గ్రామాలలో ఒక ఊరికథలో చెప్పినటువంటి విషయాలు కన్పిస్తాయి. ఉదాహరణకు 1950లలో నేను చూసిన పశ్చిమగోదావరి గ్రామాలు పశుసంపద, మానవ శ్రమ కేంద్రితంగా ఉండే పాడి పంటలతో ఉండేవి. అవి 2009లో చూసినప్పుడు మానవ శ్రమకి బదులు ట్రాక్టర్లు, పశుసంపద బదులు పాలపాకెట్లు దర్శనమిచ్చాయి. చిన్న చిన్న పట్టణాలలో మంగలి, చాకలి కుటుంబాలు గ్రామాన్ని వదిలి సెలూన్లు, లాండ్రీలు పెట్టుకోవడం కూడా కన్పిస్తాయి. అప్పుడు లేని చదువులు దళిత కుటుంబాలలో కన్పించాయి. దళిత కుటుంబాలలో పట్నవాసం వెళ్ళిన వాళ్ళూ ఉన్నారు. గ్రామంలోనే ఉండి కౌలుకి పొలం తీసుకున్న వాళ్ళూ ఉన్నారు. అంతవరకు ఉండే పెద్ద రైతులు సినిమా, వ్యాపారం, కాంట్రాక్టరుగా పట్టణాలకు వెళ్ళిపోయినవాళ్ళు ఉన్నారు. వాళ్ళలో కూడా భూములను కౌలుకి ఇచ్చివేసిన వాళ్ళు కూడా ఉన్నారు. అంత వరకు పొలంలో పనిపాటలు చేసుకునే కొన్ని కుటుంబాల మహిళలు పనిమానేసి ఇంట్లో ఉండిపోయిన వాళ్ళు ఉన్నారు. ఆడపిల్లలు చదువుకొని దేశ, విదేశాలకు వెళ్ళిన వాళ్ళు కూడా ఉన్నారు. అది పశ్చిమ గోదావరి జిల్లాలోనే కాదు, కరీంనగర్‌లో ఒక గ్రామంలో కూడా చూసాం. అలాగే శ్రీకాకుళం జిల్లాలో కూడా కన్పిస్తాయి. అది గత 50

సంవత్సరాలనుకోవచ్చు, 100 సంవత్సరాలనుకోవచ్చును. గ్రామం అనేది ఏమార్పు లేని స్తబ్ద సమాజంగా చూడకుండా కొన్ని మార్పులు జరిగే సమాజంగా చూస్తే, ఆ మార్పులు ఎలా వచ్చాయి? అనే ప్రశ్నలు ప్రధానమౌతాయి. దానికి సమాధానాలు వెతుక్కోవడం ఒక నిర్దిష్టత (Particular) నుంచి ఓ అమూర్తత (Universal)కి వెళ్ళే క్రమం పరిశోధనలో మనకి ఉపయోగపడుతుంది.

గ్రామం అనేది ఒక సామాజిక వ్యవస్థ. దాని పునరుత్పత్తి చాలా వరకు దానిమీదే ఆధారపడుతుంది. అంటే పునరుత్పత్తికి కావలసిన ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలూ, సామాజిక విలువలు చాలావరకు ఆ గ్రామానికి సంబంధించినవే. అంటే ఉత్పత్తి శక్తులలో మార్పులు లేవనీ కాదు ప్రక్క గ్రామాలనుంచి నేర్చుకోవచ్చును. ఆ గ్రామంలోనే చిన్న చిన్న మార్పులు కూడా రావచ్చును. అలాగే ఉత్పత్తి సంబంధాలు, సామాజిక విలువలు, కట్టుబాట్లు కూడా. వాటిలో ఉండే మార్పులు ఆ గ్రామంలో ఉండే వైరుధ్యాలు, ఆ వైరుధ్యాల నెదుర్కొనే పద్ధతుల మీద ఉంటుంది. అంటే ఆ గ్రామంకి మిగిలిన ప్రపంచంతో సంబంధం లేదని కాదు. ఆ మిగిలిన ప్రపంచం ద్వారా వచ్చే మార్పులు ఒక రకంగా చూస్తే గ్రామం ఒక జ్ఞాపకంగా చరిత్రలో కలిసిపోయే పరిస్థితి ఉంటుంది. ఇది చాలా వరకు పెట్టుబడిదారీ దేశాలలో జరిగిందే. అలా కాకుండా బయట ప్రపంచం నుంచి వచ్చిన మార్పులు గ్రామంలో చిన్నవిగా కాని పెద్దవిగా కాని జరగవచ్చును. బయటి ప్రపంచంలో పెట్టుబడి పెట్టుకుని లాభాల వేటకు కొంతమంది గ్రామాన్ని విడిచి పట్టణాలకు వెళ్ళడం జరుగవచ్చు. ఉద్యోగవకాశాలు - ప్రభుత్వంవి అవవచ్చు. ఫ్యాక్టరీలవవచ్చు - దానితో ఆకర్షితులై కూడా కొంతమంది గ్రామాన్ని విడిచిపెట్టి వెళ్ళవచ్చును. కొంతమంది సేవారంగంలో చాకలి, మంగలి వగైరాలతోపాటు స్వశక్తిని అమ్ముకుని చిన్న చిన్న వ్యాపారాల గురించి వెళ్ళినవాళ్ళు కూడా ఉండవచ్చును. ఇది కాక గ్రామంలోకి ప్రభుత్వం కాని ప్రభుత్వేతర సంస్థలు కాని వచ్చి పెనుమార్పులు చెయ్యవచ్చును. ఈ క్రమాలన్నిటిలో గ్రామం తన సామాజిక వ్యవస్థ అనే గుర్తింపును పోగొట్టుకుందా? పోగొట్టుకుంటోందా? అనేది ప్రశ్న. ఆ గుర్తింపే పోతే ఆ గ్రామం అనేది ఒక జ్ఞాపకంగా, పెట్టుబడిదారీ దేశాల్లోలాగా, చరిత్రలోకి కలిసిపోతుందా?

ఏ సమాజాన్ని చదవాలన్నా ఆ సమాజంలోని మనుష్యుల మధ్య సంబంధాలుగా చూడడం, ఆ సంబంధాలు ఆర్థికమవచ్చును, సాంఘికమవచ్చును. ఆ సంబంధాలను ఒక విశ్లేషణగా చూస్తే, ఒక మనిషికి మరొక మనిషికి మధ్య ఉండే భూమి సంబంధాల వచ్చును, ఒక మనిషి మరొక మనిషికి కౌలుకి భూమి ఇవ్వవచ్చును. అది శాశ్వతమవచ్చును, తాత్కాలిక మవవచ్చును. అందులో ఇచ్చేవాడు ఎందుకు ఇస్తున్నాడు, తనకు పండించడం చేతకాక ఇస్తున్నాడా? లేక తను ఊరిలో ఉండకపోవడం మూలన ఇస్తున్నాడా? కౌలు ఎంత? అనే ప్రశ్నలు ఒక పక్కన ఉంటే; కౌలుకి భూమిని తీసుకునేవారు ఎందుకు తీసుకుంటున్నారు? తన తిండి గురించా? ఎక్కువ వ్యవసాయం చేసి లాభాలు ఆర్జించడానికా? అనే ప్రశ్నలు మరో ప్రక్క. ఈ కౌలు అనే ప్రతిపాదనలో కులం పాత్ర ఏమిటి? అనే ప్రశ్నలు కూడా ఉంటాయి. అలాగే వ్యవసాయంలో పనిచెయ్యడానికి కూలీకి పెట్టుకున్న మనిషికి, కూలీకి వచ్చిన మనిషికి ఉండేది ఒక సంబంధం. తను శ్రమ చెయ్యలేక పెట్టుకుంటున్నాడా? చెయ్యగలిగి సకాలంలో పనులు జరగాలని పెట్టుకుంటున్నాడా? ఇకపోతే, కూలీకి వచ్చే మనిషి తనకు వేరే ఉపాధి లేక వస్తున్నాడా? లేక తన అవసరార్థం అప్పులు చేసి ఆ అప్పులు తీర్చే క్రమంలో ఆ అప్పు ఇచ్చిన వ్యక్తి వద్దే కూలీకి చేరాడా? అనేవి సామాజిక సంబంధాలకు సంబంధించిన ప్రశ్నలు. ఈ కూలీకి పెట్టుకున్నవాడు, కూలీకి వచ్చినవాడు వీరి సంబంధాలలో కులం పాత్ర ఏమిటి? ఆ గ్రామంలో పెట్టుబడికి కాని, తిండికి కాని అప్పులిచ్చే వడ్డీ వ్యాపారులు లాంటివాళ్ళు ఉన్నారా? ఉంటే వారికి - అప్పులు తీసుకునే వారికి గల సంబంధం ఏమిటి? వ్యవస్థీకృతమైన బ్యాంకులను వదిలేస్తే అప్పులనేవి కొన్ని చేతిబదుళ్ళుగా ఒకరికొకరు చేసే సహకారంలో భాగమా. అలా కాక వడ్డీ వ్యాపారం ఒక వృత్తిగా తీసుకున్న వ్యక్తులు ఆ గ్రామంలో ఉంటే ఆ వడ్డీ వ్యాపారాన్ని పంటల వ్యాపారంతో ముడి పెట్టుకుంటున్నారా? వాళ్ళకి భూమి మీద ఆసక్తి ఉందా? వడ్డీ రేట్లు కుల ప్రాతిపదిక మీద ఉంటాయా?తాకట్టు పెట్టుకునే వస్తువు మీద ఆధారపడుతుందా? ఇలాంటి ప్రశ్నలే సంబంధాల గురించి పంటల వ్యాపారస్తుల మీద కూడా ఉంటుంది. ఈ సంబంధాలు చూసే పద్ధతి వర్గ ప్రాతిపదిక మీద జరగవచ్చు, కుల ప్రాతిపదిక మీద కూడా జరుగవచ్చును. ఆర్థికేతర సంబంధాల కొస్తే, ఆ ఊరిలో ఒక గుడికాని, ఒక మసీదుకాని, ఒక చర్చికాని ఉన్నాయా? మత పరమైన, కులపరమైన వైరుధ్యాలు ఏమైనా గ్రామంలో వచ్చాయా? వివాహవ్యవస్థలో ఏమైనా Sanskritisatian process ఏమన్నా చోటు చేసుకుందా? కుల సమీకరణాలు ఏమైనా వచ్చాయా? ఉదాహరణకు అంబేద్కర్ అసోషియేషన్స్ ఏమైనా వచ్చాయి? పార్లమెంటరీ రాజకీయాల ప్రభావం ఉందా? అది కులపరంగా కాని మరే ఇతర కారణాల వల్లకాని గ్రామాన్ని విభజించిందా? అనేటువంటి చాలా మౌలికమైన ప్రశ్నలు సంబంధాల గురించి వేసుకుంటే, ఆ గ్రామం ఒక సమాజంగా ఉందా, సమూహంగా ఉందా, విచ్ఛిన్నమౌతోందా అనేది అర్థమవుతుంది. ఆ గ్రామానికి నేతృత్వం ఏ వ్యక్తి, ఏ కులం, ఏ వర్గం చేతిలో ఉంది? పాత నేతృత్వమేమైనా ఉందా? అది ఏమైంది? అలాంటి ప్రశ్నలు కూడ ముఖ్యమౌతాయి.

పాణి ఒక ఊరి కథ వ్యాసంలో కులాన్ని ప్రధానంగా చూడడం ఒక గొప్ప విశేషం. అలా చూడడంలో గ్రామానికి కులపరమైన విశ్లేషణ ఇవ్వడంలో కొంత అపరిపూర్ణత ఉంది. ఆ ఊళ్ళో ఎన్ని కులాలు ఉన్నాయి? ఎన్ని కుటుంబాలున్నాయి? ఒక్కొక్క కులం ఆర్థిక పరిస్థితి ఏమిటి? విద్యపరంగా ఒక్కొక్క కులం ఎంత వరకు విద్యాధికులయ్యారు? అది ఎటువంటి విద్య? వైద్యపరంగా ఒక్కొక్క కులం పరిస్థితి ఏమిటి? ఏకులం ప్రభుత్వ పథకాలు... అవి ఇల్లు అవవచ్చు, White Cards అవవచ్చు, గ్రామీణ ఉపాధి పథకం అవవచ్చు, జెర్సీ ఆవులు ఇచ్చే క్రమం ఎంత ఉపయోగించుకున్నారు? ఇలాంటి అంశాల విశ్లేషణ కులపరంగా

వ్యాసం ఒక సంపూర్ణతని ఇవ్వలేదు. ఏ కులానికి ఏకుల దేవత ఉంది? అది ఆ కులసమీకరణకి ఉపయోగపడుతోందా? కులసమీకరణ జరుగుతోందా? అది ఏ ప్రాతిపదిక మీద జరుగుతోంది? కులాల మధ్య వైరుధ్యం ఉందా? అది ఎటువంటి వైరుధ్యం? ఆ వైరుధ్యాలను సమాధానపరచే ఆ ఊరి యంత్రాంగమేమైనా ఉందా? అలాగే ఒక కులంలో ఉండగలిగే వైరుధ్యాలను ఎదుర్కొని సమాధానపరచే యంత్రాంగం - కుల పంచాయితీ అలాంటిది ఉందా? కుల పంచాయితీలు, గ్రామ పంచాయితీలు పాతవి కాని, కొత్తవికాని ఉన్నాయా? ఒకే కులంలో అసమానతలు ఎటువంటివి? ప్రతి కులంలోనూ మహిళలకుండే స్థానం ఏమిటి? శ్రమ చేసి బతికే మహిళలు ఏ కులంలో ఉన్నారు? శ్రమను కుటుంబానికే పరిమితం చేసే స్త్రీలు ఉన్నారా? వివాహ వ్యవస్థ కట్నం, కన్యాశుల్కం, మారు మనువులు లాంటి విషయాలలో కులపరంగా ప్రత్యేకతలున్నాయా? ఇలాంటి వెన్నో ప్రశ్నలు కులపరంగా విశ్లేషణ చేసినప్పుడు మనం చూడవలసిన విషయాలు. పాణి దీనిని కొంత అసంపూర్ణంగా ఒదిలివేసాడు. కాని కులం విషయం లేవనెత్తడం ఆ వ్యాసంలో ప్రత్యేకత.

కులం గురించి చెప్పడమే కాకుండా ఆ ఊరిలోంచి పట్టణాలకు ఆ ఊరి ప్రజలు వెళ్ళే ప్రక్రియ మీద కూడా వ్యాసం కేంద్రీకరిస్తుంది. అది ఆ గ్రామంలో వచ్చే మార్పును చూపించడంలో ఒక ప్రయత్నం. అలా పట్టణానికి వెళ్ళేవాళ్ళు తమ వృత్తిని కొనసాగిస్తూ కొంత "ఆధునీకరణ" చెంది అవే వృత్తులను పెద్దస్థాయిలో చేపట్టిన కులాలు కొన్ని అయితే చిన్న చిన్న వ్యాపారాలు, చిన్న చిన్న ఫ్యాక్టరీలలోనూ శ్రామికులుగా వెళ్ళే కొన్ని కుటుంబాలయితే, కొంత చదువుకొని ప్రభుత్వోద్యోగాల కోసం వెళ్ళినవాళ్ళు కొందరు. వీరందరి మీద వ్యాసం చెప్పే ప్రయత్నం చేసింది. ఇక్కడ కొన్ని ప్రశ్నలు వస్తాయి. గ్రామాన్ని వదిలి పట్టణం వెళ్ళిపోయిన ఈ మనుష్యులు, కుటుంబాలు శాశ్వతంగా ఊరు విడిచి వెళ్ళిపోయారా? ఊరితో వారికి సంబంధాలు ఏమీ లేవా? లేక ఏవో రకమైన సంబంధాలు ఆ ఊరితో పెట్టుకుంటారా? పండుగకి, పబ్బానికి ఊరు వెళ్ళడం ఒక రకం. ఊళ్ళో ఇల్లు, తల్లిదండ్రులుండడం, పెళ్ళాం పిల్లలు ఉండడం. వారి సహాయార్థం అప్పుడప్పుడు డబ్బు పంపించటం, తనూ వెళ్ళుతూ ఉండటం అంటే ఊరితో సంబంధాలు తెగతెంపులు చేసుకొన్న మనుష్యులా లేక ఏదో ఒక స్థాయిలో సంబంధాలు ఉంచుకునే పద్ధతా? పూర్తిగా సంబంధాలు తెంచుకుని వెళ్ళిపోతే ఆ ఊరి కథలో వాళ్ళు భాగం కాదు. కాని ఆ ఊరి చరిత్రలో భాగం. ఆ ఊరి చరిత్ర ఒక ఊరి కథలో ఆ ఊరి చరిత్రలో భాగం. ఆ ఊరి చరిత్ర ఒక ఊరి కథలో కేంద్రీకరించలేదు.

ఆ ఊరిలో నుండి బయటికి వెళ్ళిన వాళ్ళలో రెండు తరహాల మనుష్యులు ఆ ఊరితో సంబంధం ఉన్నవాళ్ళు. మొదటి తరహా మనుష్యులు పట్టణంలో ఏదో ఒక ఫ్యాక్టరీలో పగలు, రాత్రి కష్టపడి పనిచేసి 500 రూపాయలు సంపాదించుకుని మర్నాడు ఇంట్లో విశ్రాంతి తీసుకుంటారు. ఇక రెండో తరహా మనుష్యులు పట్టణంలో ఉంటూ గ్రామంలో ఉండే భూమిని ఉంచుకుంటూ, బహుశా ఇల్లు కూడా ఉంచుకుంటూ భూమిని కౌలుదారీ పద్ధతిలో సాగు చేయించుకుంటారు. వీరికి ఊరిలో సంబంధాలు ఉన్నా, అవి ఒక రకంగా ఆధిపత్య సంబంధాలు. భూమిని సరుకుగా గుర్తించే పాణి వ్యాసం పట్టణం వెళ్ళిపోయిన మనుష్యులు తమ భూమిని ఎందుకు అమ్మలేదు? ఆ అమ్మిన డబ్బుతో పెట్టుబడి పెట్టి ఒక వ్యాపారం చేసుకోవచ్చును. ఆ డబ్బుని వడ్డీ వ్యాపారంలో పెట్టుకోవచ్చు. అది బ్యాంకుల ద్వారా చెయ్యవచ్చు. ఇవేవీ కాకుండా ఆ భూమి మీద యాజమాన్యం బహుశా మిగిలిన వ్యాపారాలు, పెట్టుబడులకంటె ఖచ్చితంగా ఎక్కువ నికరాదాయం ఇచ్చే పరిస్థితి కావచ్చును. పట్టణంలో ఉండే ఇటువంటి తరహా మనుష్యులు ఆ ఊరి సామాజిక సంబంధాలను నిర్దేశించే పరిస్థితి. ఆ కౌలుదారుడు ఎవరు? పేద ప్రజానీకమా, ఒక పెద్ద రైతా అనే దాని మీద ఆ సామాజిక సంబంధాలు నిర్దేశించబడతాయి.

వ్యాసంలో ఇటువంటి కుటుంబాలు 7-8 మంది 5-10 ఎకరాల వాళ్ళు పట్టణంలో స్థిరపడిపోయి, తమ భూమిని కౌలు ద్వారా సాగుచేయించుకుంటున్నారు. ఆ ఊరిలో సాగుభూమి ఎంత ఉంది? అందులో కౌలుకిచ్చే భూమి ఎంత? దీనిలో పట్టణంలో స్థిరపడిన కుటుంబాల భాగమెంత? నేను చూసిన గ్రామాలలోనూ, నేను చూసిన ప్రభుత్వ రికార్డులలోనూ ఒక విషయం కనిపిస్తూ ఉంటుంది. ఎక్కడైతే ప్రభుత్వ పెట్టుబడితో ఫంటకాలువల నిర్మాణం కాని సబ్సిడీలతో కొత్త పంటలు ప్రవేశపెట్టినా కాని అంటే, ఖచ్చితమైన అధిక నికరాదాయం ఇచ్చే ప్రక్రియలు ఎక్కడ ప్రవేశపెట్టినా, ఇంకా పట్టణీకరణ వేగవంతంగా జరిగిన ప్రదేశాల చుట్టూ భూమిని వదులుకోకుండా, అది ఎంత సరుకుగా మారినా సరే, భూమిని కౌలుకిచ్చే కుటుంబాలు, వాటిని నా భాషలో చెప్పాలంటే, Non cultivating peasant house holds, వారు ఉండడమే కాక వారు పెరుగుతూ వస్తున్నారు. ఇటువంటిదే పాణి వ్యాసంలో ఉన్న వాళ్ళు కూడా. వీరు వ్యవసాయానికి బయటగా ఉండి వ్యవసాయ సంబంధాలను నిర్దేశిస్తూ ఉంటారు. వ్యవసాయ సంక్షోభానికి, వ్యవసాయంలో పెట్టుబడులు పెట్టకపోవడానికి ఇది కూడా ఒక కారణం. వ్యవసాయంలో పెట్టుబడిదారీ వ్యవస్థ రాకుండా చిన్న కమతాల వ్యవసాయంగా మారే క్రమం కూడా ఇందులోంచే పుడుతుంది.

వ్యవసాయ సంక్షోభానికి ఒక కారణం కూలీరేట్ల పెరగడం ఒక్కటైతే, సరుకుల ప్రపంచంలోకి వెళ్ళే వ్యవసాయం సరుకుల ప్రపంచంలోని అనిశ్చితి కారణంగా, గిట్టుబాటు ధరలు దొరకని కారణంగా అప్పులపాలై వ్యవసాయాన్నుంచి వెళ్ళిపోవాలనుకోవడం ఆ సంక్షోభానికి ఒక ప్రతీక. వ్యక్తులుగా ఆ సంక్షోభాన్ని ఎదుర్కోవడం కష్టమై వలస పోవచ్చును. గ్రామీణాభివృద్ధిని, తద్వారా దేశాభివృద్ధిని కోరుకునే విరసంలాంటి సంఘం ఆ సంక్షోభాన్ని ఎదుర్కొనే ప్రత్యామ్నాయాన్ని గురించి ఆలోచించాలి. ప్రత్యామ్నాయమే లేదంటే పట్టణీకరణే సమాధానమవుతుంది. ఇకపోతే పాణి వ్యాసంలో, అది ఇతరత్రా కూడా కన్పిస్తుంది, సంక్షోభానికి మరొక అర్థం కూడా కన్పిస్తుంది. వ్యాసంలో "ఇప్పుడెట్లా అంగట్లో డబ్బిచ్చి సంచులు తెచ్చుకుని నేరుగా కయ్యాల్లో

# 'యజ్ఞం-మరోచూపు'-ఒక విమర్శ

- ముదునూరి భారతి

**1.'యజ్ఞం' మరో చూపులో పాణి చేసిన ఒక వ్యాఖ్య.**

పాత సంబంధాల మధ్య కొత్త వైరుధ్యాలు వచ్చాయని కాదు. అసలు కొత్త స్వభావంగల కొత్త వైరుధ్యాలు పుట్టుకొచ్చాయనీ, ఊళ్ళో జరిగిన పరిణామాలన్నిటి సారాంశం ఇదే అనీ సూచించడమే కథ ఉద్దేశ్యం".

**2. నా ఉద్దేశ్యంలో**

కథ ఏమిటి కథ చెబుతుంది? ఆ గ్రామంలో అభివృద్ధి పథకాల ప్రవేశం, అది తీసుకుని వచ్చిన 'నిర్వాసితత్వం' నిర్వాసితుల గురించి ఒక వ్యాఖ్యానం ఆ అభివృద్ధి పథకాలు రోడ్డు అవవచ్చును, పిండి మరల వచ్చును. బడి అవవచ్చును, వ్యాపారపంటలు అవవచ్చును. ఆ పథకాలు గ్రామ ప్రజల మధ్య నిష్పక్ష పాతంగా (Neutral)గా అంటే 'వర్గ'నిష్పక్షపాతం, కుల నిష్పక్షపాతంగా లేవని చెబుతుంది. (రచయితకి కాని గ్రామానికి కాని చైతన్యం ఉన్నది అనుకోవడం కొంచెం కష్టం).

**3. కథ ఏమి చెప్పదు?**

మనకి కథ ద్వారా అప్పల్రాముడి గురించి, తద్వారా మాల కుటుంబాల గురించి, అభివృద్ధి పథకాల ద్వారా వాళ్ళకు వచ్చిన నష్టాల గురించి, వాళ్ళు పట్టణాలకు వెళ్ళి తిరిగి వెనక్కు వచ్చే సంగతుల గురించి కొంత అవగాహన ఉంది. ఎవరీ శ్రీరాములు నాయుడు? ఎవరీ లచ్చుంనాయుడు? వాళ్లకు గ్రామ నేతృత్వం భూసంబంధాల ద్వారా వచ్చిందా? భూసంబంధాలలో కాలుదారీ వ్యవస్థ ద్వారా వచ్చిందా? భూసంబంధాలలో వచ్చే వడ్డీ వ్యాపారంతో వచ్చిందా? కంబారీల ద్వారా వ్యవసాయం చేసి మిగులు రాబట్టడం ద్వారా వచ్చిందా? ఈ విషయాల మీద కథలో నిశబ్దం ఉంది. బాగా చదువుకొన్నవాడు, గ్రామ సామరస్యాన్ని కోరుకున్నవాడు, గ్రామానికి అభివృద్ధి తీసుకుని వద్దామనుకున్నవాడు అవడం మూలన ఆయనకు నేతృత్వం వచ్చిందా? కథ ఈ ఆఖరి విషయం మీదే కేంద్రీకరించినట్లు కనబడుతుంది. ఆర్థిక సంబంధాలకు, సామాజిక సంబంధాలకూ అతీతంగా ఉండే నేతృత్వంమిది. శ్రీరాములు నాయుడుకాని లచ్చుంనాయుడుకాని మిగిలిన నాయుడు కుటుంబాలు కాని వారిని భూస్వాములుగా చూస్తామా? ధనిక రైతాంగంగా చూస్తామా? అనే చర్చ కథకి అతీతంగా జరిగిన చర్చ.

**4. కథలో అంతర్లీనంగా ఉండే ఒక అంశం**

గ్రామ ప్రజలకి, ముఖ్యంగా అప్పల్రాముడు లాంటి కుటుంబాలకు, బతుకు తెరువు భూమి కేంద్రంగానే ఉంది. బతుకు లేక బావిలో దూకినట్లు, భూమి లేకపోతే బతుకు తెరువు లేదు అనే అంశం ప్రధానంగా కనిపిస్తుంది. అప్పుమీద జరిగిన చర్చలో భూమిని పోగొట్టుకోవడానికి ఇష్టపడని అప్పల్రాముడు, భూమి లేకపోతే తన కొడుకుని కంబారీలా చూడడం ఇష్టపడని సీతారాముడు బతుకు తెరువుని భూమీ కేంద్రం అనే దానికి నిదర్శనం. భూమి పోతే వ్యవసాయం కూలీగా గానీ, పట్టణం వెళ్ళి మరో బతుకు తెరువు చూసుకోలేని, పట్టణ జీవితంలో ఉండే అభద్రతని తట్టుకోలేని అప్పల్రాముడులాంటి కుటుంబాలు భూమి మీదే ఆధారపడతాయి. కంబారీలా ఉండడం, తద్వారా తమ స్వేచ్ఛను కోల్పోవడం వాళ్ళకి ఇష్టం లేదు. భూమి తోనే కొంత స్వేచ్ఛాయుత జీవితం ఉంటుంది అనే భావన అంతర్లీనంగా కథలో ఉంటుంది. భూమి మీద ఆధారపడేటటువంటి సమాజాలు పెట్టుబడిదారీ పూర్వవ్యవస్థకి సంబంధించినవి. అవి పాత సమాజాలు. ఇటువంటి పాత సమాజంలో అభివృద్ధి పథకాలు తీసుకొని వచ్చే విధ్వంసం గురించి యజ్ఞం కథ చెబుతుంది.

**5.**

కథలో అప్పల్రాముడు తన మాల Identity మీద, మాల కుటుంబాలు నష్టపోయిన క్రమం మీద చెబుతాడు. అంతేకాకుండా వ్యాపార పంటల సుడి గుండంలో పడి "బాబయ్యా, నాన్నేకాదు మా పేటలో మూడొంతులు ముప్పాతిక మంది, గొల్లల్లో శానామంది, కాపుల్లో కొందరు కొందరు, ఈ సుడిగుండంలోపడి మునిగిపోయారు".

అభివృద్ధి పథకాల ద్వారా వచ్చిన విధ్వంసం కథలో ఒక కుల చైతన్యాన్ని చూపిస్తుంది. కాని ఆర్థిక పరమైన సన్నకారు-రైతులు అనే గుర్తింపు, ఒక వర్గ గుర్తింపు లాగా కన్పించదు.

అభివృద్ధి పథకాల ద్వారా వచ్చిన విధ్వంసం ఒక కుల అస్తిత్వాన్ని ముందుకు తెచ్చింది. కాని వర్గ సంబంధాలు, దానికి కావలసిన వర్గ చైతన్యాన్ని ముందుకు తీసుకుని రాలేదు. బహుశా ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా లేని కాలంలో కుల చైతన్యమే ప్రధాన మవుతుందేమో.

చల్లుకుంటున్నామో అంత సింపుల్‌గా పని అయిపోవాలి. మా చిన్నప్పటి మాదిరి దొడ్డి నిండా పశువులు పెట్టుకుని వాటి గడ్డిగాదం రోగం రొచ్చు చూసుకుంటూ, ఏడాదంతా వాటి పేడ కుప్పేసి చెయ్యాలంటే కాదు. ఒకప్పుడు ఇవన్నీ అలవాటున్న మేమే చెయ్యలేం" అన్నారు పాతకాలం వాళ్ళు. ఇందులో భావజాలం పాత్ర ఎంత? అనేది ఒక ప్రశ్న. మాల, మాదిగల కుటుంబాలు చూసినా, కొంత రైతు కుటుంబాలు చూసినా ఇటువంటి విరక్తి సహజమే. ఇటువంటి విరక్తికి మూలం ఉత్పత్తిలో భాగం పంచుకోని మానవశ్రమ. ఉత్పత్తిలో భాగంగా చూడని రాజ్యాధికారంతో భాగంగా జీవనం సాగించే బ్రాహ్మణవాదం ఒక భావజాలమైతే, మానవ శ్రమతోనే మిగులు ఉత్పత్తిని సాధించే క్రమం నుంచి Finance Capital ద్వారా మిగులును సంపాదించే సామ్రాజ్యవాదంగా మారిన పెట్టుబడిదారీ విధానం ఆ భావజాలానికి ఇది కొంత స్ఫూర్తినిస్తుంది. మార్క్సు ఆలోచనతో సంబంధం ఉన్న నాకు ఇది ఒక భావజాలంగా కన్పిస్తుంది. ఈ భావజాలాన్ని ఎదుర్కొనే శక్తి ఊహాజనితంగానైనా ఒక నూతన సమాజ నిర్మాణ క్రమంలోనే ఉంటుంది.

ఇక మూడో వ్యాసం "అడ్డా కూలీల జీవితాలలో సమాజ దృశ్యం" గ్రామాలలో ఉండే దుర్భర జీవితాన్ని గడపలేక కడుపు చేతితో పట్టుకుని పట్టణంలో బతుకు తెరువుకోసం ప్రయత్నాలు చేసే కూలీల సంగతి కర్నూలు పట్టణంలో వివిధ రహదారి కూడలులలో ప్రతిరోజూ ఉదయమే పక్క గ్రామాలనుంచి కూలీ పని నిమిత్తం వచ్చేవేలకొద్దీ కూలీల సంగతి ఈ వ్యాసం చెబుతుంది. గ్రామాల నుంచి వలస వెళ్ళే ప్రక్రియ 19వ శతాబ్దం మధ్య కాలం నుంచీ మొదలయింది. అందులో ముఖ్యమైనది ప్రభుత్వ హయాంలో Indentured labour గా అస్సాం టీ ప్లాంటేషన్స్. బ్రిటిష్ హయాంలో ఉన్న వివిధ దేశాలలో ప్లాంటేషన్ లేబర్‌గా లాటిన్ అమెరికా, ఆఫ్రికాలోని దేశాలకు తరలించడం జరిగింది. అలాగే మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో కూడా జరిగింది. అది ఒక రూపం. అది కాక నూలు పరిశ్రమ, జనుము పరిశ్రమ పెరుగుతూ ఉన్న బొంబాయి, కలకత్తాలాంటి పట్టణాలకు శ్రామికులుగా తయారైన వ్యవసాయ కూలీలు మరొక రూపం. పట్టణాలలో సైకిల్ రిక్షా తొక్కుకోవడం, సంచులు మోయడం లాంటి పనులకోసం వలసపోయినది మరొక రూపం. ఇది కాక పెద్ద పెద్ద ప్రాజెక్టుల నిర్మాణానికి అవసరమైన కూలీల తరలింపు, ఇది ముఖ్యంగా పాలమూరు లేబర్‌లాంటిదే. ఇంకో రూపం కర్నూలులో పాణి చెప్పిన అడ్డాకూలీలు ప్రతి పట్టణంలోనూ మనకి కనిపించే ఒక కొత్త రూపం. ఈ రూపం ప్రత్యేకత ఆయా పట్టణాలలో జరుగుతున్న గృహ నిర్మాణం, ఆ పట్టణ పెరుగుదలలో ఒక అంశం. మామూలుగా ఒక పట్టణం పెరుగుదల అనేది వ్యవసాయేతర పారిశ్రామిక ఉత్పత్తులు, వాటి పెరుగుదల మీద ఆధారపడుతుంది. అది పెట్టుబడిదారీ విధాన లక్షణం. ఆ ఉత్పత్తులు పెరిగే క్రమంలో పట్టణాలు కూడా పెరుగుతాయి. ప్రపంచంలో ఏ పెద్ద పట్టణమైన దాని చరిత్ర చూస్తే అది ఉత్పత్తుల పెరుగుదలతోటే ముడిపడుతుంది. మనదేశంలోనే కలకత్తా నగరమంటే ఒక జనుము పరిశ్రమ కేంద్రంగా చూస్తాం, ఒక బొంబాయి నగరమన్నా అహమ్మదాబాదు నగరమన్నా ఒక నూలు పరిశ్రమ కేంద్రంగా చూస్తాం. ఒక టాటా నగరమంటే ఉక్కు పరిశ్రమ కేంద్రంగా చూస్తాం. దీనికి విరుద్ధంగా భూస్వామ్య సమాజంలో పట్టణాలు రాచరికపు కేంద్రాలుగా ఉంటాయి. హంపి అంటే విజయనగరరాజుల అధికార కేంద్రంగా కన్పిస్తుంది. ఆ పట్టణాలు రాజ్యం చేసే సేవలుగానే పెరుగుతాయి. హైదరాబాదు నగరం కూడా నిజాం పరిపాలనా కేంద్రం కింద, ఆ సేవల ద్వారా అభివృద్ధి చెందిన పట్టణమే. మన దేశంలో చిన్న చిన్న పట్టణాలు, ప్రభుత్వ ఆఫీసులు అంటే తాలుకాఫీసు, మునసబు కోర్టు, పోలీసుస్టేషన్, పోస్టాఫీసు, స్కూలు, వైద్యశాలలు పెరిగినవే. ఆ చిన్న పట్టణాలకు చుట్టు పక్కల ఉండే గ్రామాల నుండి భూస్వాములవవచ్చు, ధనిక రైతులవవచ్చు, వడ్డీ వ్యాపారులవవచ్చు, పట్టణాలలోకి వచ్చి స్థిరనివాసం ఏర్పరచుకోవడం ఒక సామాన్యమైన విషయం. ఈ ప్రక్రియలో వ్యవసాయంలో వచ్చిన మిగులు పట్టణాలకు తరలించబడడం, తద్వారా వ్యవసాయంలో సంక్షోభం తీసుకురావడం ఒకవంతు అయితే, గృహ నిర్మాణాలకు కావలసిన కూలీలను తీసుకురావడం మరొక వంతు. దీనికి తోడు గృహనిర్మాణం, ఎవరి సొంత ఇల్లు వారే కట్టించుకోవడం అనే ఆర్థిక కార్యక్రమాన్ని ప్రోత్సహించే ప్రభుత్వం, బ్యాంకులు రియల్ ఎస్టేటు వ్యాపారస్తులు తోడై ఈ కార్యక్రమాన్ని వేగవంతం చేసారు. గృహనిర్మాణం ఒక ఉత్పాదక శ్రమ ఉత్పత్తా? లేక అది ఒక అనుత్పాదక కార్యక్రమమా అనేది తీవ్రంగా ఆలోచించవలసిన విషయం. (ఇక్కడొక విషయం చెప్పుకుంటే బాగుంటుంది. అమెరికాలో బ్యాంకు రుణాలతో సొంత ఇల్లు అనే కార్యక్రమాన్ని ప్రవేశపెట్టిన తరువాత ఆ బ్యాంకింగ్ రంగం అమెరికాలో ప్రస్తుతమున్న Financial crisis ఒక మూలమని అందరూ అనుకుంటారు) వ్యవసాయ కూలీలకు గృహనిర్మాణ కార్యక్రమంలో ఒక శాశ్వత పరిష్కారం ఉంటుంది అని అనుకోవడం కొంచెం కష్టతరంగా ఉంటుంది. మరే ప్రత్యామ్నాయం లేని దుర్భర జీవితం గడుపుతున్న వ్యవసాయ కూలీలకు అది ఒకే ప్రత్యామ్నాయం. ఒక నూతన సమాజ నిర్మాణం గురించి ఆలోచించే పాణిలాంటివాళ్ళు ఊహలోనైనా ఒక ప్రత్యామ్నాయాన్ని వెతకాలి. నేను ఒడిశాలో పనిచేస్తున్న కాలంలో అక్కడ ఒక ప్రత్యామ్నాయం ఉందనిపించేది. ప్రభుత్వం ఒక కంపెనీని పెట్టి ఇటువంటి రైతుకూలీలందరికీ అందులో ప్రవేశం కల్పించి వారికి minimum wages ఇచ్చి ప్రభుత్వ రంగంలోకాని ప్రయివేటు రంగంలో కాని, నిర్మాణాత్మక పనులు చేసినప్పుడు ఆ పనులను కంపెనీ చేపట్టే కార్యక్రమం. ప్రస్తుతం అమలులో ఉన్న గ్రామీణ ఉపాధి పథకం కొన్ని వ్యవస్థాగత మార్పులతో ఈ నిరుపేదల సమస్య ఏమైనా తీరుస్తుందా? ఇటువంటి ఆలోచనాస్రవంతి విరసం లాంటి సంస్థ నుంచి రావలసిన అవసరం ఉంది.

పాణి వ్యాసాలు వాస్తవికతను, అందులో ఉండే విశేషాలను బాగా ఎత్తి చూపుతాయి. ఆ విశేషాలను సమస్య రూపంలో గ్రహించి ఒక సమాజపు మార్పుకి దోహదపడేలా, ఎంత తప్పయినా, ఒక విశ్లేషణ ఇవ్వవలసిన అవసరం ఉంది. ఈ నా విమర్శ ఆ క్రమానికి దోహదపడితే నేను ఎంతో ఆనందిస్తాను.



రిపోర్టు

# అస్తిత్వాలు - మార్క్సిజం అనే అంశం కేంద్రంగా విప్లవ రచయితల సంఘం సాహిత్య పాఠశాల

**21-22, మే 2011, కావలి, నెల్లూరు జిల్లా**

మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానంతో నలభై ఏళ్ళుగా తెలుగు సాహిత్య, సామాజిక రంగాల్లో తన భావాలను, ఆలోచనలను పంచుకుంటున్న విప్లవ రచయితల సంఘం అదే వెలుగులో అస్తిత్వాలపై రెండు రోజుల రాష్ట్ర సాహిత్య పాఠశాల నిర్వహించింది. నెల్లూరు జిల్లా కావలి పట్టణంలో కా. ఆజాద్, కా.శాఖమూరి అప్పారావు ప్రాంగణంలో 21వ తేదీ ఉదయం 10.00 గంటలకు పతాకావిష్కరణతో సభలు ప్రారంభమయ్యాయి. మొదటగా అంతర్జాతీయ శ్రామికవర్గ పతాకమైన ఎర్రజెండాను నెల్లూరు జిల్లా అమరుడు కా.గడ్డం కోటారెడ్డి కుమారుడు కృష్ణారెడ్డిగారు ఆవిష్కరించారు. విరసం సభ్యులు, హాజరయిన రచయితలు, మేధావులు, ప్రజలు, ప్రజాకళామండలి కళాకారులు అరుణపతాకానికి తమ ఆట పాటతో రెడ్‌సెల్యూట్స్ చెప్పారు. విరసం వ్యవస్థాపక సభ్యుల్లో ఒకరైన కా. చలసాని ప్రసాద్ విరసం జండాను ఎగరేసి "ఎత్తినాం విరసం జెండా.." అంటూ పతాక గీతాన్ని ఆలపించారు. అమరుల స్థూపాన్ని కా. సంధ్య తండ్రి రాఘవులుగారు ఆవిష్కరించగా విప్లవసాహిత్యోద్యమంలో ప్రాణత్యాగం చేసిన అమరకళావేత్తలు, సమరరంగ నేతలకు విప్లవాభిమానులు వంతపాడగా ప్రజాకళామండలి విప్లవ జోహార్లు అర్పించింది.

అనంతరం సోంపేట, కాకరాపల్లి అమరుల హాలులో, సుద్దాల హనుమంతు వేదిక మీద కా.చెంచయ్య సాహిత్య పాఠశాలను ప్రారంభిస్తూ విరసం మార్క్సిజం వెలుగులో అస్తిత్వాల గురించి మాట్లాడుతోందని, చాలా మంది అనుకున్నట్లుగా అస్తిత్వవాదాల గురించి కాదని అయితే చర్చలో అస్తిత్వవాదాల గురించి కూడ ప్రస్తావన రావచ్చని వివరణ ఇస్తూ సభల ఉద్దేశాన్ని చెప్పారు. కా.ఉజ్జ్వల్ నిర్వహణలో జరిగిన మొదటి సెషన్‌లో సంస్థ కార్యదర్శి కా.పాణి "అస్తిత్వాలు - మార్క్సిజం" అనే అంశంపై కీలకోపన్యాసం చేశారు. అస్తిత్వం అంటే ఏమిటి, అదేలా ఉనికిలో ఉంటుంది, ఎలా మార్పుకు గురవుతుంది విశ్లేషిస్తూ సామాజిక న్యాయభావన అస్తిత్వ స్పృహ కలగజేసినప్పుడు వివిధ సమూహాలు పునః సంఘటితమవుతాయని అన్నారు. ఆయా సమూహాల ఆత్మగౌరవ ప్రకటన ఎట్లా మన ఆలోచనా రంగంలో, సాహిత్యంలో కొత్త పరిశీలనా పద్ధతుల్ని, కొత్త నుడికారాన్ని, కొత్త భాషను తీసుకొచ్చిందో వివరించారు. ఈ క్రమంలో అస్తిత్వవాదాలను ఎలా చూడాలో చెప్తూ మన సిద్ధాంతం దానికి దారి చూపుతుందని, అయితే భావజాలం ఒక్కోసారి ఆలోచనల్ని అడ్డుకుంటుందని, దానికున్న టెంపర్‌మెంట్ వాస్తవాన్ని గుర్తించడానికి ప్రతిబంధకమవుతుందన్నారు. విప్లవ భావజాలానికి, అస్తిత్వవాదానికి మధ్య ఘర్షణ చాలా ఇబ్బందికరమైనదంటూ మార్క్సిజానికి గుండెకాయ వంటి చారిత్రక భౌతికవాదం నుండి మాట్లాడకుండా రాజకీయ సంవాదంలోకి దిగకూడదని చెప్పారు. అస్తిత్వాలను చారిత్రక భౌతికవాద పరికరాలను ఉపయోగించి ఎట్లా అర్థం చేసుకోవాలో వివరించారు.

రెండో సెషన్‌ను కా. శశికళ నిర్వహించగా అందులో "స్త్రీల అస్తిత్వం - సాహిత్యం" అంశంపై ప్రొఫెసర్ చల్లపల్లి స్వరూపారాణి, "ముస్లిం మైనారిటీ అస్తిత్వం - సాహిత్యం"అంశంపై కా. బాసిత్ ఉపన్యసించారు. "స్త్రీల అస్తిత్వం - సాహిత్యం" పై స్వరూపారాణి మాట్లాడుతూ స్త్రీవాదం పేరుతో వచ్చిన సాహిత్యాన్ని, దాని అనంతర దశలో దళిత స్త్రీవాదం లేవనెత్తిన ప్రశ్నల్ని విశ్లేషించారు. సామాజిక ఉద్యమాలు స్త్రీల అస్తిత్వ పోరాటాలకు స్పేస్ ఇచ్చాయని చెప్తూ భారతదేశంలో మార్క్సిస్టు ఉద్యమం అందుకు దోహదం చేసిందన్నారు. స్త్రీవాద అధ్యయనాలు మొదట పోరాటాల గురించే మొదలయ్యాయని అయితే క్రమంగా స్త్రీవాదం అకడెమిక్ చర్చలకు పరిమితమై పోరాటాలకు దూరమయిందన్నారు. అగ్రకుల స్త్రీవాదులు కులాన్ని, వర్గాన్ని పట్టించుకోలేదంటూ దళిత స్త్రీవాదం జోగినీ వ్యవస్థ, గ్రామీణ స్త్రీలపై అణచివేత వంటి మౌలిక సమస్యలను జెండర్ స్పృహతో రాసిందని చెప్పారు.

భోజనవిరామం తర్వాత "ముస్లిం మైనారిటీ అస్తిత్వం - సాహిత్యం" పై కా. బాసిత్ మాట్లాడుతూ వలసవాద కాలంలో మొదట ముస్లింలు తమ మతపరమైన అస్తిత్వం కోసం కాక తమ జీవన వృత్తులను కాపాడుకోడానికి పోరాడారని అన్నారు. తన మార్కెట్‌ను విస్తరించుకోడానికి వలసవాదులు మనదేశ ఉత్పత్తిశక్తులను నాశనం చేసే క్రమంలో చేతివృత్తుల విధ్వంసం జరిగిందని, 1857 మొదటి స్వాతంత్ర్యోద్యమం సమస్త వృత్తుల, సమస్త శక్తుల భాగస్వామ్యంతో నడిచిందని, ఇక్కడ ముస్లింలు, హిందువులు కలిసి పోరాడారని, ఆ ఐక్యతను బ్రిటిష్ సామ్రాజ్యవాదశక్తులు విచ్ఛిన్నం చేశాయన్నారు. మతాలుగా చీలిస్తే తప్ప ఈ దేశాన్ని పాలించలేమని వలసవాద శక్తులు అనుకున్నాయి. ఆ తర్వాత జాతీయోద్యమంలోకి మతం ప్రవేశించిందని అది తిలక్ గణేష్ ఉత్సవాన్ని వాడుకున్న తీరులో కనపడుతుందని అన్నారు. మరోవైపు ముస్లిం కవులు ప్రేమ, శాంతి దేశభక్తితో కలిపి రాశారని, ఇస్లాం గొప్పదనం రాయలేదని అన్నారు. సద్దాజ్ జహీద్, నజ్రుల్ ఇస్లాం వంటి ముస్లిం కవులు, బంకించంద్ర, సావర్కర్ వంటి హిందూ రచయితల జాతీయోద్యమ రచనలను ఆయన ప్రస్తావించారు.

క్రమంగా హిందూ జాతీయోద్యమ శక్తులు దేశ విభజనకు 'ఎలా బీజం వేసిందీ, సారే జహాఁసె అచ్ఛా అన్న ఇక్‌బాల్ వంటి కవుల మనసూ మారిపోవడం ఎలా జరిగిందో చెప్పారు. క్రమంగా హిందుత్వ రాజకీయాలు ఈ దేశంలో ముస్లిం అస్తిత్వం గురించి మాట్లాడక తప్పని స్థితిని తీసుకురావడం బాబ్రీ మసీదు తర్వాత పరిణామాలు, ముస్లిం అస్తిత్వ సాహిత్యం గురించి ఆయన వివరించారు.

కా. రాంకి నిర్వహణలో జరిగిన మూడవ సెషన్‌లో "ఆదివాసీ అస్తిత్వం - సాహిత్యం" అనే అంశంపై కా. రాఘవాచారి మాట్లాడారు. ఆదివాసీ ఉద్యమాల గురించి, ఆ నేపథ్యంలో వచ్చిన సాహిత్యం గురించి ప్రధానంగా ఆయన చర్చించారు. ఆదివాసీల గురించి పురాణాల్లో ఉన్న ప్రస్తావనలు (శబరి, గుహుడు, తాటకి, ఏకలవ్యుడు), ఖాండవ దహనం వంటి దురాక్రమణలతో మొదలు పెట్టి రాజుల మృగయా వినోదాలు ఆదివాసులపై అమలు చేసిన దమనకాండను, వలసపాలనకు వ్యతిరేకంగా ఆదివాసుల ఉద్యమాలను ఆయా సందర్భాల్లో చరిత్రలో రికార్డయిన సాహిత్యాన్ని గురించి చెప్పారు. అయితే పాత సాహిత్యమంతా కేసులు పోరాటాల రికార్డే. నక్సల్బరీ తర్వాతే ఆదివాసీల సాహిత్యం ఎక్కువ వెలుగు చూస్తోంది. దీనికి విప్లవోద్యమం, దాని సారథ్యంలో వచ్చిన చేతనా నాట్యమంచ్ వంటి సాంస్కృతిక దళాల కృషి అపూర్వం. సామూహిక శక్తికి, సంఘటిత ఉద్యమాలకు పాట వేస్తున్న ప్రభావం ఎనలేనిది. ముఖ్యంగా ఆదివాసులకు ఆట, పాట ప్రాణప్రదం, జీవితంలో ఒక భాగం. దండకారణ్య సాహితీ సాంస్కృతిక ఉద్యమం పాటకు పదును పెట్టింది. దీంతోపాటు ఆదివాసీలపై బైటి ప్రాంతాలనుండి నుండి వచ్చిన రాగో, జంగల్‌నామా వంటి రచనలను రాఘవాచారి ప్రస్తావించారు.

ప్రభుత్వం ఆదివాసులపై గ్రీన్‌హంట్‌తో విరుచుకుపడడం మొదలుపెట్టాక, సాల్వాజుడుం, కోయకమాండోల వంటి హంతకముఠాలను ఉసిగొల్పాక మైదాన ప్రాంతాల నుండి ఆలోచనాపరులు ఎక్కువగా వాటిపై నిజనిర్ధారణ నివేదికలు తీసుకువస్తూ రాజ్యాన్ని ప్రశ్నిస్తున్నారు. బైటి ప్రాంతాల సాహిత్యకారులు ఆదివాసులపై ప్రేమతో రాస్తున్న కథలు, నవలలతోపాటు దండకారణ్యంలో వస్తున్న ఝుంకార్ పత్రిక, ఇతర రచనలు చూస్తే ఆదివాసులపై వచ్చినంత సాహిత్యం మరే అస్తిత్వం మీద రాలేదనిపిస్తోందని రాఘవాచారి అన్నారు. ఆదివాసులు కేవలం బాధితులుగా మిగిపోలేదని, వాళ్ళు తమ విముక్తి కోసమే గాక మనందరి విముక్తి కోసం పోరాడుతున్నారని ఆయన అన్నారు.

సాయంకాలం ప్రజాకళామండలి మిత్రుల "సెజ్" నాటికతో సాంస్కృతిక కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. కా. సుదర్శన్ నిర్వహణలో రాత్రి 10 గంటల దాకా ఇచ్చిన కళా ప్రదర్శనలు ఆకట్టుకున్నాయి. ఈ సెషన్‌లోనే కాక రెండు రోజులూ పి.కె.ఎం. కళాకారులు తమ ఆట పాటలతో పాఠశాలను ఉత్తేజపరిచారు.

### సాహిత్య పాఠశాలలో ప్రజా కళామండలి కళాకారుల ప్రదర్శనలు

**1. సెజ్‌ల సెగలు (నాటిక) 21 మే, 2011**

ప్రత్యేక ఆర్థిక మండలాలు ప్రజల జీవితాలను ఏ విధంగా ధ్వంసం చేస్తున్నాయో తెలియజేస్తూ ప్రజలు వాటిని ఏ విధంగా ఎదుర్కొని ఆపేయాలనే అంశంపై ఈ నాటిక సాగుతుంది.

**2. కులనిర్మూలన (ఒగ్గుకథ) 21 మే, 2011**

కులం పేరుతో అగ్రకుల మనువాద వారసులు దళితులపై చేస్తున్న మోసాలను, అవమానాలను, దాడులను తెలియజేస్తూ, కులనిర్మూలనకై ఎలా పోరాడాలో, ఎలా నిర్మూలించుకోవాలో ఈ ఒగ్గుకథ తెలుపుతుంది.

**3. పునాదులు కదులుతున్నాయి (నాటిక) 22 మే, 2011**

కులం పేరుతో అగ్రకుల అహంకారులు దళిత పీడిత కులాల వారిని ఎలా అవమానిస్తున్నారో, అణచివేస్తున్నారో తెలియజెపుతూ, కులనిర్మూలన కొరకు ఎలా పోరాడాలో ఈ నాటిక తెలుపుతుంది.

**4. యాడేసిన గొంగడి ఆడ్నే (నాటిక) 22 మే, 2011**

తెలంగాణ రాష్ట్రం కోసం ప్రజలు నాయకులు చెప్పే మాటలను నమ్మి మోసపోయి, ఎం.ఎల్.ఎ.ల నుండి ప్రధాన మంత్రి వరకు తిరిగి తిరిగి విసిగి వేసారి మోసం తెలుసుకొని పోరాటాల ద్వారా తెలంగాణ సాధించుకోవాలనే అంశంగా సాగుతుంది.

ఈ రెండు రోజులూ దాదాపు 20 పాటలు పాడారు. సభలో పాల్గొన్న ప్రజా కళామండలి సభ్యులు డి. జాన్ - రాష్ట్ర అధ్యక్షులు; జె. కోటి - రాష్ట్ర కార్యదర్శి; కె. ప్రభాకర్ - రాష్ట్ర కోశాధికారి; వి. నాగేశ్వరరావు - రాష్ట్ర సహాయ కార్యదర్శి; చినరామచందర్ - రాష్ట్ర సభ్యులు, మహబూబ్‌నగర్; రాణి - రాష్ట్ర సభ్యులు, గుంటూరు; యాదగిరి - రాష్ట్ర సభ్యులు, మెదక్; శ్రీనివాస్ - రాష్ట్ర సభ్యులు, ప్రకాశం; సభ్యులు - రాములు, జగన్, యాదగిరి, రామచందర్, రవి, వెంకన్న, నర్సన్న, గోపి, రామచందర్, నయన, ప్రశాంతి, మంజు, ఇందులో పాల్గొన్నారు.

సాహిత్యపాఠశాల వేదికపైనే విరసం సభ్యుడు కా. ఎం. శ్రీనివాసరావు, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం సహాయ కార్యదర్శి ఎ. అన్నపూర్ణలు జీవిత సహచరులుగా ప్రమాణం చేశారు. కా. వరవరరావు, కా. జి కళ్యాణరావు - విరసం, డి. సురేష్‌కుమార్ - పౌరహక్కుల సంఘం సభ్యులు, వై.వెంకటేశ్వర్లు - పి.డి.ఎం. కార్యదర్శి, ఇంకా మిత్రులు వాళ్ళను అభినందించారు.

రెండో రోజు ఉదయం 9 గంటలకు కా. అరసవిల్లి కృష్ణ కా. ఉదయమిత్రల ఆధ్వర్యంలో జరిగిన కవి సభలో రెండు గంటలపాటు సీనియర్ కవులతోపాటు పలువురు యువకవులు కవితా పఠనం చేశారు.

అనంతరం కా. అల్లం రాజయ్య "అస్తిత్వాలు - నేపథ్యం" అనే అంశంపై మాట్లాడారు. దీనిని భారతదేశంలో ప్రజాపోరాటాలు

- వైవిధ్యాలు అంటే బాగుటుందని ఆయన అన్నారు. భారతదేశంలో ప్రజాపోరాటాలను వేగంగా ముందుకు తీసుకుపోలేకపోవడానికి కారణం కమ్యూనిస్టుపార్టీ మన దేశ పరిస్థితుల్ని సరిగ్గా అర్థం చేసుకోకపోవడమేనని అంటూ మనం వైఫల్యాలను అధ్యయనం చేస్తే వాస్తవాలను తెలుసుకొని పక్షపాతధోరణి లేకుండా అంచనాలకు రాగలమన్నారు. 1970లకు ఒక రూపు తీసుకున్న విప్లవోద్యమానికి '80లలో ఎదురైన సవాళ్ళ గురించి చెప్పారు. కింది కులాల నుండి మహిళల నుండి, నాయకత్వాన్ని ఎదిగించుకోవడంలో వైఫల్యం, 1985నాటి రెక్టిఫికేషన్ క్యాంపెయిన్, తర్వాత నిర్బంధం తీవ్రతరం కావడం, పార్టీలు అరణ్యాలకు పోయాక ఉద్యమాలు లేక దిక్కుతోచని పరిస్థితులు, వీటికి తోడు నూతన ఆర్థిక విధానాల వల్ల తీవ్రంగా నష్టపోయిన దళితులు, ఇతర పీడిత సమూహాలు అనివార్యంగా అస్తిత్వ పోరాటాల రూపంలో పునఃసంఘటితమైన పరిణామాలను విశ్లేషించారు.

రకరకాల వేదికల కింద ఉన్న ప్రజలకు ఒక విశాల ఐక్యవేదిక నిర్మించాల్సిన అవసరాన్ని అస్తిత్వాలు గుర్తింపజేస్తున్నాయని, అలాంటి ఒక మాస్ బేస్‌ను మార్క్సిస్టు - లెనినిస్టు అవగాహనతో నిర్మించాలని ఆయన అన్నారు. సరైన రాజకీయ నిర్మాణం లేకపోతే అరబ్‌లోలాగ ఉద్యమాలు విఫలమవుతాయన్నారు.

తర్వాత కా. జగన్ నిర్వహించిన సెషన్‌లో "కుల అస్తిత్వం - సాహిత్యం" అంశంపై కా. జి. కళ్యాణరావు, "ప్రాంతీయ అస్తిత్వం - సాహిత్యం" అంశంపై కా. సి. కాశీం మాట్లాడారు.

కా. కళ్యాణరావు కులంపై పీపుల్స్‌వార్ పార్టీ (1997) అవగాహన నుండి వర్గ సమాజంలో కులం పాత్రను విశ్లేషించారు. భూస్వామ్య విధానం అభివృద్ధి చెందడంలో కులం ఎటువంటి పాత్ర పోషించింది, అది వర్గంతో ఎలా అనుసంధానంలో ఉందీ చెప్పారు. కులాన్ని ఒక భావజాలంగా రుద్దిన బ్రాహ్మణవాదం ప్రాచీన చరిత్ర పొడవునా దానికోసం రాసుకున్న సాహిత్యాన్ని ఆయన విశ్లేషిస్తూ జర్మనీ నాజీలకు మాగ్నాకాఫా ఎలాంటిదో ఇక్కడ బ్రాహ్మణులకు మనువు అంతని చెప్పారు. భారతదేశంలోనే అస్పృశ్యత పుట్టడం వెనకున్న రహస్యం పూలే చెప్పినట్లు బ్రాహ్మణవాదానికి ఎదురొడ్డి పోరాడంలో ఉందని అన్నారు. వేమన, వీరబ్రహ్మం మొదలుకొని బ్రాహ్మణవాదాన్ని ప్రశ్నించిన సాహిత్యాన్ని ఆయన ప్రస్తావించారు. విస్మరణకు, వివక్షకు గురైన కుసుమ ధర్మన్న వంటి దళిత రచయితల గురించి చెప్తూ వామపక్ష పార్టీలూ, సాహిత్యకారులు కూడ ఈ విషయంలో న్యాయం చేయలేదన్నారు. కమ్యూనిస్టు పార్టీ కులాన్ని ఉపరితల అంశంగానే చూసి దాన్ని సంస్కరణల జాబితాలోకి నెట్టేసిందని, నక్సల్బరీ వచ్చాకే కులం పునాదిలో భాగం అనే అవగాహన వచ్చిందని చెప్పారు. కార్ల్‌మార్క్స్ సిద్ధాంతాన్ని వర్గపోరాటానికి కుదించవద్దని, మిత్రవైరుధ్యాన్ని శత్రుశిబిరంలోకి నెట్టవద్దని ఆయన అన్నారు.

చివరి పాఠమైన "ప్రాంతీయ అస్తిత్వం - సాహిత్యం" పై కా. కాశీం మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్‌లో స్థూలంగా ప్రాంతీయ అసమానతలు, వివక్షకు గురైన ప్రాంతాలు, వాటి ఆకాంక్షల గురించి ప్రస్తావించారు, ప్రస్తుతం రాష్ట్రాన్ని కుదిపేస్తున్న ప్రత్యేక తెలంగాణపై ఆయన ప్రసంగాన్ని కేంద్రీకరించి దాని ఉద్యమ నేపథ్యాన్ని, సాహిత్యాన్ని ఆయన విశ్లేషించారు. తెలుగు మాట్లాడే అవకాశం లేని రోజు మొదట తెలంగాణలో భాష కోసం పోరాటానికి దారితీసిన చరిత్రను, గ్రంథాలయోద్యమాన్ని, ఆంధ్రజనసంఘం, ఆంధ్రమహాసభల పరిణామ క్రమాన్ని వివరించారు. కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో భూమి, భుక్తి, విముక్తి కోసం జరిగిన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటాన్ని, ఆ నేపథ్యంలో వచ్చిన సాహిత్యాన్ని గురించి చెప్తూ జీవితం, సాహిత్యం, పోరాటం వేరువేరు కావన్నారు. సాయుధ రైతాంగ పోరాటం తర్వాత తెలంగాణ అస్తిత్వం పోయిందని, మళ్ళీ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం తెలంగాణకు అస్తిత్వాన్నిచ్చిందని ఆయన అన్నారు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం తలెత్తిన పరిస్థితుల్ని ఆయన వివరించారు. ఇప్పటి ఉద్యమం అసంఖ్యాకంగా సృష్టిస్తున్న సాహిత్యాన్ని ప్రక్రియల వారీగా ప్రస్తావించారు.

సాయంకాలం జరిగిన బహిరంగసభకు కా. కోటయ్య అధ్యక్షత వహించారు. ప్రొఫెసర్ శేషయ్య, కా. వరవరరావు, కా. కళ్యాణరావు ప్రసంగించారు. అంతర్జాతీయ శ్రామిక గీతంతో విరసం సాహిత్య పాఠశాల ముగిసింది.

## సాహిత్య పాఠశాల తీర్మానాలు

సాహిత్య పాఠశాల సందర్భంగా కావలి సర్వసభ్య సమావేశం చేసిన తీర్మానాలు

**1. వీధి నాటక ప్రక్రియకు ఆద్యుడు, సుప్రసిద్ధ దర్శకుడు బాదల్‌సర్కార్ మృతికి సంతాపం**

భరతుని నాట్య శాస్త్రానికి చరమగీతంపాడి మనిషి శరీరమే రంగస్థల 'సెట్'గా, నటీనటుల శరీరాలే కథలుగా, సెట్ ప్రాపర్టీగా దేశంలోనే వినూత్న ప్రక్రియ ప్రవేశపెట్టిన మహాకళాకారుడు, దర్శకుడు బాదల్‌సర్కార్ మృతికి విరసం సంతాపం తెలియజేస్తోంది. శతాబ్ది అనే సంస్థ ద్వారా పశ్చిమ బెంగాల్‌లో నాటకరంగాన్ని పునరుద్ధరించాడు. దేశ విదేశాల్లో గొప్ప గుర్తింపు పొందిన వీధి నాటకం 'ఏవం ఇంద్రజిత్'. ఇదే కాకుండా బాదల్‌సర్కార్ జులూస్,హట్టమల, స్పార్టకస్ మొదలైన ఎన్నో వీధి నాటకాలు రాసి, దర్శకత్వం వహించారు.

1982లో హైదరాబాదు వచ్చి భారత్‌బంద్ అనే వీధి నాటకం రూపొందించారు. ఇరవై ఐదుమంది ఇక్కడి కళాకారులతో ఈ వీధి నాటకం ప్రదర్శించారు. దేశవ్యాప్తంగా ఎన్నో వీధి నాటక బృందాలను స్థాపించి, రంగస్థల నాటకాన్ని ఆకాశ అయోమయ వీధుల నుంచి దారి మళ్లించి వీధి నాటకంగా భూమి మీదికి తెచ్చి ప్రజలకు అందించాడు. బాదల్ సర్కార్ 13.5.2011న మరణించారు. విప్లవ రచయితల సంఘం జోహార్లు చెప్తోంది.

**2. మానవ హక్కుల నేత బుర్ర రాములుకు నివాళి**

ఆంధ్రప్రదేశ్‌లో విప్లవోద్యమ ప్రభావంతో పౌర, ప్రజాస్వామిక హక్కుల ఉద్యమంలోకి వచ్చిన ఆలోచనాపరుల్లో బుర్ర రాములు

# విరసం సాహిత్య పాఠశాలలో పుస్తకావిష్కరణలు

| పుస్తకం | రచయిత / ప్రచురణ | ఆవిష్కరించినవారు |
|---|---|---|
| కా. అప్పారావు స్మృతిలో... | విరసం | |
| మావోయిస్ట్స్ ఇన్ ఇండియా | ఫ్రెండ్స్ ఆఫ్ ఆజాద్ | చలసాని ప్రసాద్ |
| విప్లవ మేధావి ఆజాద్ | మావోయిస్టు పార్టీ లేఖ | |
| అర్జున్ చావుకు కారణం | దిక్సూచి | |
| జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులు మావోయిస్ట్ దృక్పధం | దిక్సూచి | సాంబశివరావు |
| సేద్యం | ఇక్బాల్ కవిత్వం<br>పాలమూరు అధ్యయన వేదిక | వరవరరావు |
| జంగ్ | దానక్క ఉదయభాను తెలంగాణ కవిత్వం<br>తెలంగాణ విద్యార్థి వేదిక | |
| హైదరాబాదు స్వాతంత్ర్య సంరంభం | ఎన్. వేణుగోపాల్, ప్రాచీ పబ్లికేషన్స్ | భూపాల్ |
| జస్టిస్ శ్రీ కృష్ణకమిటీ నివేదిక పొరపాట్లు, అబద్ధాలు, వక్రీకరణలు<br>ప్రతి అక్షరం ప్రజాద్రోహం | ఎన్. వేణుగోపాల్<br>తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | ఆర్. శశికళ |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి, వీక్షణం పబ్లికేషన్స్ | రాంకి |
| ఇన్ సెర్చ్ ఆఫ్ మెథడ్ (కలెక్షన్ ఆఫ్ ఆర్టికల్స్) | ముదునూరి భారతి<br>బి1 కలెక్టివ్ - సి.డి.ఆర్.సి. ప్రచురణలు | |
| మెథడాలజి ఆఫ్ సోషల్ ఎంక్వైరీ<br>ఎ మార్క్సియన్ పర్స్పెక్టివ్ | ముదునూరి భారతి<br>బి1 కలెక్టివ్ - సి.డి.ఆర్.సి. ప్రచురణలు | |
| ఎ ఫిలసాఫికల్ ఎస్సే ఆన్<br>క్రైసిస్ & డెవలప్మెంట్ ఇన్ మార్క్సియన్ ఫ్రేంవర్క్ | ముదునూరి భారతి<br>బి1 కలెక్టివ్ - సి.డి.ఆర్.సి. ప్రచురణలు | పి. వరలక్ష్మి |
| ఇండివిద్యువల్ సబ్-గ్రూప్స్, గ్రూప్స్ & ఫ్రీడం | ముదునూరి భారతి<br>బి1 కలెక్టివ్ - సి.డి.ఆర్.సి. ప్రచురణలు | |
| ఆన్ ఎద్యుకేషన్ | ముదునూరి భారతి, ఆర్.ఎస్. రావు<br>బి1 కలెక్టివ్ - సి.డి.ఆర్.సి. ప్రచురణలు | |
| కొత్తచూపు | ఆర్.ఎస్.రావు, వీక్షణం పబ్లికేషన్స్ | జి. కళ్యాణ రావు |
| ఎస్.సి. రిజర్వేషన్ వర్గీకరణపై నాలుగు వ్యాసాలు | సి. కాశీం, సహచర ప్రచురణలు | |
| సృష్టికర్తలు | అల్లం రాజయ్య కథలు<br>పర్స్పెక్టివ్ ప్రచురణలు | పాణి |
| మోదుగుపూలు | భూపాల్ "కొమురం భీం" సినిమా పాటలు<br>వెన్నెల ప్రచురణలు | తంగెళ్ల సుదర్శన్ |
| ప్రజా తెలంగాణ | విరసం వ్యాసాలు, విరసం ప్రచురణ | ఎ. అన్నపూర్ణ |
| తెలంగాణ | విరసం కవిత్వం, విరసం ప్రచురణ | వి. ప్రతిమ |
| తెలంగాణ ఉద్యమాలు పాట | సాహిత్య వ్యాసాలు - సి. కాశీం<br>సహచర ప్రచురణలు | జె. కోటి |
| ఆంధ్రప్రదేశ్ సర్వాలు - విద్రోహ రాజకీయాలు | సి. కాశీం, సహచర ప్రచురణ | ఎస్. రవికుమార్ |

ప్రముఖులు. విప్లవ విద్యార్థి ఉద్యమంలోకి వచ్చి పౌనహక్కుల కార్యక్షేత్రాన్ని ఎంచుకొని సుదీర్ఘ కాలం ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘంలో వరంగల్‌లోనూ, రాష్ట్ర స్థాయిలోనూ కీలక బాధ్యతలు నిర్వహించారు. ప్రజా పోరాటాల కేంద్రంగా, నిర్బంధ శిబిరంగా ఉండే వరంగల్‌లో పౌర, మానవ హక్కుల చైతన్యాన్ని నిలబెట్టి విస్తరింప చేయడంలో డా. రామనాథంగారి తర్వాత బుర్ర రాములు పాత్ర ఎన్నదగినది. కేవలం వరంగల్, ఆంధ్రప్రదేశ్‌లోనేగాక దేశవ్యాప్తంగా పౌరహక్కుల సంఘం, ఆ తర్వాత మానవ హక్కుల వేదిక చేపట్టిన నిజ నిర్ధారణల్లో రాములు కీలకంగా పాలుపంచుకున్నారు. దేశంలో ఎక్కడ ప్రజల హక్కులకు భంగం కలిగినా, ఉద్యమాలపై పోలీసు, పారా మిలటరీ, సైనిక దాడులు జరిగినా రాములు పట్టించుకొని ప్రజా పోరాట ఆకాంక్షలను, రాజ్యహింస దుర్మార్గాన్నీ ఎలుగెత్తి చాటారు. దళిత బహుజనుల మీద, ఆదివాసుల మీద, మహిళలు... మత మైనార్టీల మీద జరిగిన దాడులను ఎప్పటికప్పుడు ఎండగడుతూ రాష్ట్రంలో హక్కుల అవగాహనను నిలబెట్టారు. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘానికి, ఆ తర్వాత మానవ హక్కుల వేదికకు నాయకుడిగా ఆయన చివరంటా అలుపెరుగని యోధుడిగా నిలిచారు. కొద్ది కాలంగా కాన్సర్‌తో బాధపడుతూ వరంగల్‌లో మృతి చెందారు. హక్కుల ఉద్యమంలో ఆయన స్థానం సుస్థిరమైనది. ఆయన స్మృతికి విరసం ప్రగాఢ సంతాపం తెలియజేస్తోంది.

### 3. పాలమూరు కిట్టూకు జోహార్లు

దిగంబర కవిత్వోద్యమ మిత్రుడు, తొలిరోజుల్లోనే విప్లవ రచయితల సంఘంలో సభ్యుడు కిట్టు 21.3.2011న మరణించారు. ఆయన ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు. సి.పి.ఎం. నించి మార్క్సిస్టు లెనినిస్టు రాజకీయాల వైపు నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల వైపు వచ్చాడు. కిట్టు, కిట్టుమామ అని వనపర్తి ప్రజలు, మిత్రులు పిలుచుకునే కృష్ణమాచారి కుటుంబం తమిళనాడు నించి గద్వాలకు, అట్నుంచి వనపర్తికి వచ్చింది. చిన్న అన్నం హోటల్ నడుపుకొని వాళ్ళ అమ్మ అంబాబాయి కన్న కష్టాలతో ఆ కుటుంబాన్ని సాకింది. పెద్ద చదువులు చదువుకోలేకపోయిన కిట్టు జీవిక కోసం డాక్టర్ బాలకిష్టయ్య దగ్గర డ్రైవర్‌గా పని చేసేవాడు. భూస్వామ్యాన్ని, పీడనను ఎదుర్కోవడానికి అవసరమైన ప్రజాతంత్ర భావాలతో ఉండే డాక్టర్ బాలకిష్టయ్యకు కారుడ్రైవర్‌గానే కాకుండా ఆయనకు ప్రజాస్వామిక రాజకీయాల విషయంలో కిట్టు ఒక సలహాదారుగా, ఆయనను నడిపించిన వాడుకు పనిచేశాడు.

ఒక పెద్ద మనిషిగా డా. బాలకిష్టయ్య ముందు నిలిచి నిర్వహించిన అనేక కార్యక్రమాల వ్యూహకర్త, మిత్రులందరిని కదిలించిన వాడు కిట్టు. ఎన్నో విప్లవ రాజకీయ శిక్షణా తరగతులు నడిపారు. భారత చైనా మిత్రమండలి, విరసం కార్యక్రమాలు నడవడానికి అంతరంగంలో కిట్టు కృషి చేసేవాడు.

దిగంబర కవులను, విప్లవ కవులను మహబూబునగర్‌కు, వనపర్తికి తీసుకువచ్చి జిల్లాలో విప్లవ భావ వ్యాప్తికి కృషి చేశాడు. శ్రీశ్రీకి ఆసరాగా నిలిచి పర్సు బహూకరించిన వనపర్తి సభకు సర్వమూ ఆయనే అయి అందరినీ కదిలించాడు.

వనపర్తి పట్టణంలో గోడలు ప్రజలతో మాట్లాడే మాటలు కిట్టు చెప్పదలుచుకున్న విప్లవభావాలు. అవి విద్యార్థుల్నీ, యువజనుల్నీ తట్టిలేపేవి. గత శతాబ్ది 6-8 దశాబ్దాలలో కనీసం 20 సంవత్సరాలు ఆయన మనసుపెట్టని ప్రజాస్వామిక చలనాలు ఉండేవి కావు అంటే అతిశయోక్తి కాదు.

బతుకంతా పేదరికంలోనే గడుపుతు విప్లవాశయం కోసం తనకు అనువైన పద్ధతుల్లో పనిచేశాడు. ఎంత పేదరికం వేధించినా కులవృత్తిని ఆసరా చేసుకోలేదు. అది ఆత్మవంచన అనుకున్నాడు.

అనారోగ్యానికి గుర్రై వైద్యం చేయించుకునే ఆర్థికం లేక, వైద్యం చేయించుకుంటే బతుకుతానని అర్థమవుతు, అవుతూనే గుండెపోటుతో మరణించాడు. ఆయన సహచరి సరళ, కొడుకు, కూతురు పేదరికంతో మిగిలారు.

కిట్టు బాగా పాటలు పాడేవాడు. 'సుత్తి కొడవలి గురుతుగ ఉన్న ఎర్రని జెండా ఎగురుతున్నది' అని మనం పాడుకునే పాటకు స్వరకర్త ఆయనే. ఆయన లేడు. ఆయన కూర్చిన స్వరంతో ఆ పాట ఆయన ఆశయంలాగా మనందరినీ కదిలిస్తూనే ఉంటుంది. కిట్టు మృతికి విరసం వినమ్రంగా నివాళి తెలుపుతున్నది. కుటుంబానికి, మిత్రులకు సంఘీభావం ప్రకటిస్తున్నది. వాళ్ళ కన్నీటిలో భాగమవుతున్నది.

1970లు, 80లలో ఆయన ప్రజా ఆచరణను విరసం తలపోసుకుంటూ ఆయన మృతికి నివాళి ప్రకటిస్తోంది.

### 4. థర్మల్ విద్యుత్ ప్లాంట్లను నిరసించండి

రాష్ట్ర వ్యాప్తంగా ప్రభుత్వం ప్రజల జీవితాల మీదికి థర్మల్ విద్యుత్ ప్లాంట్ల కుంపట్లను తీసుకొని వచ్చింది. ఉత్తరాంధ్రలో, నెల్లూరు జిల్లాలో పెద్ద సంఖ్యలో థర్మల్ విద్యుత్ ప్లాంట్లను తీసుకొని వచ్చి పేదల భూములను కంపెనీలకు కట్టబెట్టింది. వీటి వల్ల ప్రజలు భూనిర్వాసితులు కావడమేగాక, అతిపెద్ద పర్యావరణ సమస్య తలెత్తుతుంది. ప్రకృతి, ప్రజా జీవితం అల్లకల్లోలమైపోతాయి. ఇప్పటికే ఈ దుష్ప్రభావాలు కొన్ని చోట్ల కనిపిస్తున్నాయి. సోంపేట, కాకరాపల్లి ప్రజల తిరుగుబాట్లు, ప్రభుత్వ పాశవిక హత్యాకాండ ఈ నేపథ్యంలోనివే. నెల్లూరు జిల్లాలో పెద్ద సంఖ్యలో థర్మల్ ప్లాంట్లకు అనుమతి ఇచ్చి వేలాది ఎకరాల భూములను ప్రభుత్వం లాగేసుకుంది. క్రిష్ణపట్నం ఓడరేవు నేపథ్యంలో థర్మల్ విద్యుత్ ప్లాంట్ల విధ్వంసం దీర్ఘకాలికంగా కూడా తీవ్ర దుష్ప్రభావం కలిగిస్తాయి. పేదల వ్యవసాయ భూములను కంపెనీలకు కట్టపెట్టడం వల్ల గ్రామీణ రైతాంగం, మత్స్యకారులు నిర్వాసితులైపోయారు. ఇప్పటికే నెల్లూరు జిల్లాలో సెజ్‌లు, క్రిష్ణపట్నం ఓడ రేవుల వల్ల విధ్వంసం అంచున ఉన్నారు. థర్మల్ విద్యుత్ ప్లాంట్లపై తమ నిరసన తెలియజేస్తున్నారు. విరసం ఈ థర్మల్ ప్లాట్ల వినాశక విధానాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తోంది.

శ్రీకాకుళం నుండి నెల్లూరు దాకా కోస్టల్ కారిడార్ పేరుతో సముద్ర తీర ప్రాంతమంతా పెట్టుబడిదారుల చేతుల్లో పెట్టే ఒక

ప్రణాళికలో భాగమే నెల్లూరు పవర్ ప్రాజెక్టులు. ఇవి కూడా గుజరాత్ నుండి బెంగాల్ దాకా దక్షిణ భారత సముద్ర తీర ప్రాంతాన్ని పరిశ్రమలకు అప్పగించడమనే ప్రణాళికలో భాగం. అటు సముద్ర తీరాలను, ఇటు అటవీ ప్రాంతాలను, కొండలను, గుట్టలను, పంట పొలాలను దేశ విదేశీ పెట్టుబడిదారులకు దోచిపెడుతున్న దళారీ నిరంకుశ ప్రభుత్వ విధానాలను అందులో భాగంగా సొంత దేశ ప్రజలపైనే యుద్ధం చేస్తున్న దుర్మార్గాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తోంది.

### 5. లాడెన్ హత్యకు ఖండన

మే 2, 2011న అమెరికా అధ్యక్షుడు ఒబామా అల్ ఖైదా నాయకుడు ఒసామా బిన్ లాడెన్‌ను తన సైన్యం మట్టుబెట్టిందని ప్రపంచానికి ప్రకటించాడు. సెప్టెంబర్ 11 దాడి తర్వాత టెర్రరిజంపై యుద్ధ పేరుతో అఫ్ఘానిస్తాన్, ఇరాక్ దేశాల లక్షలాది మంది ప్రజలను ఊచకోత కోసి, ప్రపంచ వ్యాప్తంగా ముస్లింలపై యుద్ధాన్ని ప్రకటించింది అమెరికా. చమురు బావులపై, భూగర్భ సంపదపై ఆధిపత్యం కోసం ముస్లింలపై, ఆదివాసులపై సామ్రాజ్యవాదులు చేస్తున్న యుద్ధంలో ఒక భాగమే ఇది. ప్రపంచ టెర్రిస్టు లాడెన్ చనిపోయాడు అని మిడియా ముందుకొచ్చి ప్రకటించిన అమెరికా అధ్యక్షుడు ఒక వ్యక్తిని నిరాయుధుడిగా చంపి, శవాన్ని కూడా చూపకుండా సముద్రంలో పడవేస్తే అది గొప్ప విజయమని సామ్రాజ్యవాద లొత్తులు, మిడియా ప్రకటించారు. ఈ చర్య అన్ని అంతర్జాతీయ చట్టాలన్ని ఉల్లంఘించిందని గట్టిగా చెప్పడానికి ఒకటి రెండు దేశాలు తప్ప అన్ని దేశాల పాలకులు వెనకాడుతున్నారు.

నిజానికి మార్కెట్ కోసం ప్రపంచాన్ని ప్రజానీకాన్ని, భూమిని కొల్లగొడుతూ లక్షలాది మందిని చంపేసిన అమెరికాయే నిజమైన టెర్రరిస్టు.

ఈ టెర్రరిస్టు ఒసామా బిన్ లాడెన్‌ను టెర్రరిస్టు పేరుతో హత్య చేసింది. ఆపరేషన్ జెరొనియా ఏకియా అని దీనికి పేరు పెట్టింది. జెరోనియా ఒక ఆదివాసీ విప్లవ నాయకుడు. ఎకియా అంటే కిల్డ్ ఇన్ యాక్షన్. ఇలా స్పష్టంగా దాని వైఖరిని అని బైటపెట్టింది.

ఒసామా బిన్ లాడెన్ హత్యను విప్లవ రచయితల సంఘం తీవ్రంగా ఖండిస్తోంది. అమెరికన్, సామ్రాజ్యవాదానికి ఏజెంటుగా వ్యవహరిస్తూ 'జెరోనియా ఎకియా'లను దేశ వ్యాప్తంగా అమలు చేస్తున్న భారత ప్రభుత్వ విధానాలను విరసం నిరసిస్తోంది.

### 6. నోయిడా కాల్పులపై ఖండన

దేశ రాజధాని ఢిల్లీ నుంచి గ్రేటర్ నోయిడా వరకు నిర్మిస్తున్న యమున ఎక్స్‌ప్రెస్ హైవే కోసం తమ భూములను బలవంతంగా తీసుకోవడాన్ని వ్యతిరేకిస్తూ అక్కడి రైతాంగం ఆందోళనలకు దిగింది. తీసుకున్న భూములకు పరిహారం పెంచాలని, సేకరించిన భూములో సగభాగాన్ని ఉచితంగా తిరిగి ఇవ్వాలని ఆందోళన చేస్తున్న రైతులపై మే 7న జరిపిన పోలీసు కాల్పుల్లో నలుగురు రైతులు చనిపోయారు. ఈ ఆందోళన ఆగ్రా, ఆలీఘడ్ ప్రాంతాలకు విస్తరించింది. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ రైతాంగ వ్యతిరేక విధానాలను విరసం ఖండిస్తోంది. రైతుల భూములను వారికి తిరిగి ఇవ్వాలని డిమాండ్ చేస్తోంది. అక్కడ మహిళలపై జరిగిన అత్యాచారాలను, హింసను ఖండిస్తోంది. రైతుల పోరాటానికి విరసం తన సంఘీభావం తెలియజేస్తుంది.

### 7. డాక్టర్ శివాజీ రావు మృతికి సంతాపం

నెల్లూరు జిల్లా కోటకు చెందిన డాక్టర్ శివాజీ రావు సుదీర్ఘ కాలంగా అనారోగ్యంతో బాధపడుతూ మే 21వ తేదీ హైదరాబాదు ఆస్పత్రిలో మరణించారు. ఆయన మృతికి విరసం ప్రగాఢ సంతాపం తెలియజేస్తోంది. శివాజీరావు నక్సల్బరీ ఉద్యమంతో ప్రేరణ పొంది విప్లవరాజకీయాభిమాని అయ్యారు. విరసం ఏర్పడ్డాక విప్లవసాహిత్యోద్యమంతో కలిసి నడిచారు. ముఖ్యంగా తొలి తరం విప్లవోద్యమ నాయకులతో, విరసం నాయకులతో సన్నిహిత సంబంధాలుండేవి. శ్రీశ్రీ, కె.వి.ఆర్ తదితరులతో కోటలో సభలు, సమావేశాలు నిర్వహించారు. 70లలో జిల్లాలో జరిగిన ప్రజా కార్యక్రమాలకు అండగా ఉండేవారు. ఆ తర్వాత అనారోగ్యానికి గురైనా కోటలో ప్రజా వైద్యశాల నడుపుతూ విప్లవాభిమానిగా చివరిదాకా కొనసాగారు. రచయిత, సామాజిక కార్యకర్త డా. లెనిన్‌ధనిశెట్టి వీరి కుమారుడు. శివాజీరావు మృతికి విరసం సంతాపం ప్రకటిస్తూ వారి కుటుంబానికి సానుభూతి తెలియజేస్తోంది.



పుస్తక పరిచయం

# పడుపు కత్తెల వేదనపై కురిసిన కన్నీటి ధార
# అలెక్సాండ్ర్ కుప్రీన్ నవల 'యమకూపం'

- ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు

స్త్రీలు ఎదుర్కొంటున్న అనేక ముఖ్యమైన సమస్యలలో పడుపువృత్తి కూడా ఒకటి. స్త్రీలపై పురుషులు సాగించే లైంగిక దోపిడీలో ఒక భాగమే పడుపు వృత్తిగా కొందరు చెబుతున్నారు. పడుపువృత్తిని అత్యంత ప్రాచీనమైన వృత్తిగా సమాజ శాస్త్రజ్ఞులు చెబుతారు. ఆదిమకాలం నుంచీ స్త్రీ పురుష సంబంధాలు ఎన్నో మార్పులకు లోనయి నేడున్న దంపతీ కుటుంబంగా పరిణమించాయనీ, ఈ క్రమంలో అనేక లోపాలు కూడా వచ్చాయనీ, ఆ లోపాల్లో వ్యభిచారమూ, పడుపు వృత్తీ ఉన్నాయనీ వీరంటారు.

వేశ్యావృత్తికి మూలకారణమైన సమాజమే వేశ్యల్ని తీవ్రంగా అసహ్యించుకుంటుంది. ఆ వృత్తి లేకుండా చెయ్యడానికి ఏమాత్రం కృషి చేయకుండానే, వేశ్యలు సమాజానికి పట్టిన చీడపురుగులుగా భావిస్తుంది. కానీ, ఆ చీడపురుగులు ఎక్కణ్ణుంచి వచ్చాయో ఆలోచించదు. వేశ్యల్ని నీచంగా చూస్తూనే, ఈ వృత్తిని పెంచి పోషించే మగరాయుళ్ల పట్ల పక్షపాతాన్ని ప్రదర్శిస్తుంది. నిజానికి ఈ సమాజానికి పడుపు వృత్తి నశించిపోవడం ఇష్టంలేదు. అది ఏదో విధంగా కొనసాగాలనే కోరుకుంటుంది. పడుపు వృత్తే లేకపోతే సైనికులు, కుటుంబాలకు దూరంగా పనిచేసే భర్తలు, బ్రహ్మచారులు, సంసారం నిర్వహించలేని వివిధ వృత్తులకు చెందిన పనివాళ్లు, అనాథలు తమ లైంగిక దాహాన్ని ఎలా తీర్చుకుంటారు? భార్యల దగ్గర తీర్చుకోలేని తమ వికృత లైంగిక కోర్కెలు మరెవరి దగ్గర తీర్చుకుంటారు? వేశ్యలే లేకుంటే పరువు గల స్త్రీల పరిస్థితి ఏమిటి?

నిజానికి వేశ్య - మర్యాదస్తులు, పెద్దమనుషులతో పాటు, దొంగలు, హంతకులు, వికారులు, బిచ్చగాళ్ళు వీరందరి మురికినీ భరిస్తున్న ఓ మురికి గుంట, ఓ పబ్లిక్ పాయిఖానా! మురికి గుంటలోకి మురికిని పారిస్తున్న వారిని శిక్షించడం పోయి, మురిగ్గుంటను శిక్షించాలని చూడడం ఎంత వరకూ న్యాయం? నిజానికి తన యొక్క మురుగునంతటినీ భరిస్తున్నందుకు సమాజం ఆమె పట్ల కృతజ్ఞతగా ఉండాల్సింది పోయి, శిక్షల పాల్జేయడం కృతఘ్నత కాక ఏమవుతుంది?

అయితే సమాజమే కాదు, ప్రభుత్వమూ, న్యాయ వ్యవస్థా కూడా వేశ్యలపట్ల వివక్షతను చూపిస్తూ, వారిపట్ల అణచివేతను ప్రదర్శిస్తుంది. ఇక పోలీసులయితే వేశ్యలపట్ల చూపించే దాష్టీకం చెప్పగలవి కాదు. వారి దగ్గర మామూళ్ళు గుంజుతూనే, వారిపట్ల జులుంను ప్రదర్శిస్తారు.

ఒక పక్క యజమానురాళ్లూ, తార్పుడుగాళ్లూ చేసే దారుణ్యాలు, అకృత్యాలకు తోడు, విటుల హింసాపూర్వక అసహజ లైంగిక వాంఛలూ, మరోపక్క పోలీసుల జులుం, చట్టాల శిక్షల మధ్య ఆమె బతుకు ప్రతిక్షణం అభద్రతాభావంతో కొట్టు మిట్టాడుతుంది. వేశ్యలనుభవించే తీవ్ర మానసిక క్షోభ ఎంత దారుణంగా ఉంటుందంటే, అది వారికి తప్ప ఇతరులకర్థం కాదు.

• పడుపు వృత్తిలో ఉండేది ఎక్కువగా శ్రామిక వర్గ స్త్రీలే. వారి ఆర్థిక హీన స్థితి, పురుషుల నైతిక దివాళాకోరుతనం గ్రామీణ స్త్రీలను బలవంతంగా ఈ వృత్తిలోకి లాగుతున్నాయి. నేడు విజృంభిస్తున్న వ్యాపార సంస్కృతి, అసాంఘిక శక్తుల తోడ్పాటు వీరి సంఖ్య తీవ్రంగా పెరగడానికి దోహదం చేస్తున్నాయి. వ్యభిచారుల స్థితిగతులపై స్పందిస్తూ మహోపాధ్యాయుడు లెనిన్ ఇలా అన్నాడు. "వాళ్లు బూర్జువా సమాజం చేత రెండు విధాల బాధితులైన దురదృష్టవంతులు. ఒకటి దాని పాపిష్టి ఆస్తి వ్యవస్థ చేత, రెండు దాని పాపిష్టి నైతిక కపటత్వం చేత."

ఒక సర్వే ప్రకారం నూటికి 70 మంది వేశ్యలకు సుఖవ్యాధులు, సామాన్యమైతే మిగిలిన వారికి ఆ సుఖవ్యాధులు ప్రాణాంతకంగా పరిణమిస్తాయి. వేశ్యలలో నూటికి 40 మంది 40 ఏళ్లలోపే మరణిస్తున్నారంటే, పరిస్థితి ఎంత దుర్భరమో అర్థం చేసుకోవచ్చు.

అయితే ఇంత దుర్భరంగా జీవించే వేశ్యల పట్ల అసలెవరికీ సానుభూతి లేదని కాదు. ఇది వరకెలా ఉన్నా, నేడు పలు స్వచ్ఛంద సంస్థలు, హక్కుల సంఘాలు, స్త్రీల సంఘాలు వీరికి కొన్ని సౌకర్యాలు కల్పించేందుకు, చట్ట రక్షణ కల్పించేందుకు కొంత కృషి చేస్తున్నాయి. స్వాతంత్ర్యోద్యమ కాలంలో కూడా వేశ్యలకు పెళ్లిళ్లు చేసి, వారిని ఆ వృత్తి నుంచి బయటకు రప్పించేందుకు కొంత ప్రయత్నం జరిగింది. వేశ్యలపట్ల సానుభూతితో సినిమాలు, కథలు, నవలలు, నాటకాలు ప్రపంచ వ్యాప్తంగా వచ్చాయి. అయితే వాటిలో చాలావరకు నేలవిడిచి సాము చేసేవి తప్ప, పడుపు వృత్తిలోని లోతుపాతులు, పడుపుకత్తెల గురించి సమగ్రమైన అవగాహన కలిగించేవికావు. అయితే పరిశీలించి చూస్తే ఈ విషయంలో ఒక సమగ్రమైన, పూర్తి వాస్తవికతను ప్రతిబింబించే ఒక గొప్ప నవల దాదాపు 100 సంవత్సరాల నాడే రావడం మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ప్రసిద్ధ రష్యన్ కథా రచయిత, నవలాకారుడు అయిన "అలెక్సాండ్ర్ కుప్రీన్" రాసిన 'యామా' అనే ఈ నవల 1909-15 మధ్య 'యామా' పేరుతో మొదటి భాగం,

1927లో 'దిపిట్' పేరుతో రెండో భాగమూ వచ్చి ప్రపంచ వ్యాప్తంగా తీవ్ర సంచలనాన్ని కలిగించింది. తెలుగులోనూ 'యమకూపం' పేరుతో అనువదించబడింది. సాహిత్యానికి ఆదరణ తగ్గడం వల్ల ఉత్తమ సాహిత్యం కూడా పునర్ముద్రణకు నోచుకోకపోవడం చేత, అందుబాటులో లేని ఈ నవలను నేటితరం పాఠకలోకానికి తెలియజెప్పడానికి ఈ పరిచయ వ్యాసాన్ని రాస్తున్నాను.

ఈ నవలలో వేశ్యా గృహాల నిర్వహణ, పడుపుకత్తెల దైనందిన జీవితం, తార్పుడుగాళ్ళ దురాశ, వేశ్యలు యజమానురాళ్ల నుండి, విటుల నుండి ఎదుర్కొనే సమస్యలు, సమాజంలో వేశ్యల దుస్థితి మొదలైన విషయాలు ఎంతో పరిశీలన చేసి, పరిశోధన చేసి చెప్పబడ్డాయి. ఈ నవల ఎంతటి శక్తివంతమైనదంటే, ఈ నవల చదివాక, వాస్తవ పరిస్థితులు అర్థమై వేశ్యలపట్ల సమాజం అనుసరిస్తున్న ధోరణి మనకెంతో బాధ కలిగిస్తుంది. కేవలం పొట్ట నింపుకోవడం కోసం ఒక్కో వేశ్యా తనకోసం క్యూకట్టిన విటుల్ని తప్పక భరించాల్సిన దారుణ స్థితిని తలుచుకుంటే తోటి మానవులుగా ఈ పరిస్థితిని నివారించ లేకపోతున్న మన అశక్తతకు సిగ్గుపడతాం. వారిపట్ల కనీస మానవతా పూర్వక సానుభూతినైనా చూపాలనుకుంటాం.

నవల్లోకి వెళ్లే ముందు దీని రచయిత కుప్రీన్ జీవిత విశేషాలు, ఇతర రచనలను గురించిన కొన్ని విశేషాలు తెలుసుకుందాం.

కుప్రీన్ పూర్తి పేరు "అలెక్సాండ్ర్ ఇవనోవిచ్ కుప్రీన్" (1870-1938). రష్యాలోని "నారొవ్ చాత్" అనే చోట ఒక చిన్న ఉద్యోగి కుటుంబంలో జన్మించాడు. పిల్లాడికి ఏడాది రాకముందే తండ్రి మరణించడంతో, దిక్కులేని అతని తల్లి మాస్కోలోని ఓ అనాథ శరణాలయంలో చేరింది. కుప్రీన్ చిన్నప్పుడు ఆ శరణాలయానికి చెందిన పాఠశాలలోనూ, ఆపై సైనిక పాఠశాలలోనూ చదివాడు. తనని తాను అతడు 'ప్రభుత్వ బాలుడు' అని పిలుచుకున్నాడు. సైనిక పాఠశాలలో చదివేప్పుడు ఒక చిన్న తప్పుకుగాను అందరి ముందూ కొరడాతో దెబ్బలు తినడాన్ని ఆయన జీవితాంతం మరిచిపోలేదు. 19 సంవత్సరాల వయస్సులో కుప్రీన్ మొదటి కథ "కడుపటి రంగస్థల ప్రవేశం" ఒక అధిక్షేప పత్రికలో అచ్చైంది. దానికంతగా గుర్తింపు రాలేదుగానీ, కంపెనీ కమాండర్ మాత్రం అటువంటి 'చెత్త' రాసినందుకు శిక్షించాడు. ఆ పాఠశాలలో చదువయ్యాక, సైన్యంలో "ప్రొస్కూరొవొ" అనే చిన్న ఉక్రేనియన్ పట్నంలో ఒక అధికారిగా ఉద్యోగంలో ప్రవేశించాడు గానీ, అతనక్కడ ఇతర అధికారులతో కలవలేకపోయాడు. వారికి గల పొగరుబోతుతనం, తమ విధుల పట్ల తీవ్ర ఉపేక్ష, సామాన్య సైనికుల్ని అమానుషంగా చూడ్డం అతనికి నచ్చలేదు. వీటన్నిటికీ తోడు రష్యా-జపాన్ యుద్ధ సందర్భంగా దేశ వ్యాప్తంగా సైన్యం పట్ల ప్రజల్లో ఏర్పడ్డ వ్యతిరేకభావం జత కలిసి 4 సంవత్సరాలకే అతడు సైన్యం నుండి విరమించడానికి (1894) దారితీసింది.

సైన్యం నుండి వచ్చేశాక, జీవిక కోసం కుప్రీన్ చెయ్యని పనిలేదు. ఓ జాక్ లండన్‌లా, గోర్కీలా కనిపించిన పనినల్లా చేశాడు. నాటకాల ప్రాంప్టర్‌గా, బొగ్గు బస్తాలు నింపేవానిలా, చర్చి గాయకునిగా, దంత వైద్యునిలా, పుచ్చకాయలమ్మేవానిలా, భూమి సర్వేయర్‌గా, శానిటరీ సామాను అమ్మేవానిగా, ఎస్టేట్ మేనేజర్‌గా ఎన్నో రకాల పనులు చేసి అపారమైన జీవితానుభవాన్ని సంపాదించాడు. ఆ అనుభవాలే తన రచనలకు ముడిసరుకులుగా చేసుకున్నాడు. ఎక్కడా నేల విడిచి సాము చెయ్యలేదు. ఊహాల మీద ఆధారపడకుండా వాస్తవికతకు పెద్దపీట వేశాడు. తన కథావస్తువుకవసరమైన సామాగ్రి సేకరణ కోసం వారాలూ నెలలూ సంవత్సరాలూ వెచ్చించాడు.

అసాధారణ బాలుడైన కుప్రీన్ ఒక గుర్రపు నాడాని సులభంగా వంచగలడు. అయినప్పటికీ ఉదార స్వభావం, జాలి గుండెగల అద్భుతమైన మనిషి. ప్రతిదాన్నీ తెలుసుకోవాలన్న ఆకాంక్ష, ప్రతి పనినీ చెయ్యగల సామర్థ్యం పొందడం ఆయన విశిష్ట లక్షణాలు. విమానయానాలు ఆరంభమవుతున్న రోజుల్లో బెలూన్‌లో గాలిలో పైకెళ్లిన మొదటి వాళ్లల్లో ఆయనొకడు. కొంతకాలానికి విమానంలోను ఎగిరాడు. ఒకసారి విమానం హఠాత్తుగా కూలి పోతుంటే కొద్దిలో మృత్యువును తప్పించుకున్నాడు. తుఫాను సమయంలో బెస్తవారితో కలిసి ఒక చిన్న నావలో సముద్రంలోకి వెళ్లాడు. డైవింగ్ సూట్‌తో సముద్రం అడుగుకూ వెళ్లాడు. సింహాల బోనులో కెళ్లి షాంపెన్ తాగాడు. మందలోంచి తప్పిపోయిన గుర్రాన్ని పట్టుకొని దాన్ని మచ్చిక చేసుకుని స్వారీ చేశాడు.

నాగరికులు తక్కువగా చూసే సామాన్య ప్రజలంటే కుప్రీన్‌కు అమితమైన ఇష్టం. వారే అతని కథల్లో హీరోలు. వారినతడు ఆసక్తి కల వ్యక్తులుగా, ఆత్మ సంపదగలవారిగా వర్ణించాడు. ప్రసిద్ధమైన అతని కథ 'గంబ్రీనస్'లో రేవు దగ్గర కల్లు అంగడిలో పాటలు పాడి పొట్ట పోసుకునే వ్యక్తి కథానాయకుడు. ప్రపంచంలోనే అద్భుతమైన ప్రేమకథల్లో ఒకటైన "ఒలేస్యా"లో ఓ పల్లెటూరి జానపద వృద్ధ మంత్రగత్తె మనవరాలు పేదబాలిక అయిన 'ఒలేస్యా' కథానాయిక. అలాగే అంతటి అద్భుత కథ 'కెంపులకంకణం"లో విషాద మరణం పాలైన కథానాయకుడు ఒక చిన్న టెలిగ్రాఫ్ ఉద్యోగి. ఈ చివరి రెండు కథలూ ప్రపంచ కథా సాహిత్య చరిత్రలో కలకాలం నిలిచిపోయే అద్భుత విషాద ప్రేమ కథలు. బెస్తవాళ్లు, పల్లెటూరి డాక్టర్లు, ఓ గుమాస్తా, ఓ సర్కస్ జోకర్ - ఇలాంటివారే అతని ఇతర కథానాయకులు.

రచయిత కావాలని కలలుగన్న కుప్రీన్, సైన్యం నుండి రిటైరయ్యాక మొదట పత్రికా రచయితగా పనిచేస్తూ వివిధ రకాల రచనా రీతుల్లో కృషి చేశాడు. 1896లో అచ్చైన 'మోలఖ్' (దురాశా పిశాచి) అతనికి పెద్ద పేరు తెచ్చింది. ఈ కథ మొదట 'రష్యన్ సంపద' అన్న పత్రికలో ప్రచురించబడింది. పెట్టుబడిదారీ విధానం యొక్క వికృతరూపం ఈ కథలో నగ్నంగా వర్ణించబడింది. ఈ కథా సామాగ్రి పోగు చెయ్యడం కోసం కుప్రీన్ మొదట పత్రికా

రచయితగా 'దొనేత్స్క్' బొగ్గు గనుల లోహ పరిశ్రమల ప్రాంతంలో తిరిగాడు. విలేకరి పని ఒదిలేసింతర్వాత కూడా, కొన్ని నెలల పాటు ఆ ప్రాంతాన్ని వదిలిపెట్టకుండా రైలు పట్టాల తయారీ ఫ్యాక్టరీలో పని చేశాడు. అక్కడున్నప్పుడే సమిష్టి శ్రమ కమనీయత ఆయన్నాకర్షించింది. సమాజానికి ఉపయోగపడే శ్రమ చెయ్యడంలోని మానవుడి జీవితానికి పరమార్థం ఉందని గ్రహించాడు. మనిషికి పని ఆనందం సమకూర్చడానికి బదులు శాపంగా పరిణమించిందని, మనిషి యంత్రానికి తోకగా మారాడని, ఫ్యాక్టరీ నరకం అయిందని గ్రహించాడు. అందువల్లనే కథను కార్మికుల తిరుగుబాటుతో ముగించాడు. కథ మొదటి రూపంలో ఆ కార్మికుల తిరుగుబాటు చిత్రణ మకుటాయమానంగా ఉందని, అయితే పత్రికా సంపాదకుని ఒత్తిడి మూలంగా, నాటి సెన్సార్‌షిప్ కారణంగా రచయిత ఆ తిరుగుబాటును బలవంతంగా అణచివేసినట్లు ముగించాల్సి వచ్చిందని కుప్రీన్ తన మిత్రుడికి రాసిన ఓ ఉత్తరాన్ని బట్టి తెలుస్తోంది. అయితే ఈ కథ ప్రచురించబడి తొమ్మిదేళ్లేనా తిరక్కుండానే మొదటి రష్యన్ విప్లవం జరిగి, జారిస్టు నిరంకుశత్వపు పునాదులు కదలడం చరిత్ర ప్రసిద్ధం!

'మోలఖ్' కథ ఆయనకెంతో పేరు తెచ్చి పెట్టింది. ఈ కథా రచనానంతరం ఆ దశాబ్దం అంతం దాకా రష్యా అంతటా తిరుగుతూ కుప్రీన్ చిత్రమైన అనేక ఉద్యోగాలు చేశాడు. వరసగా మూడేళ్లపాటు (1899-1901) నాటి ప్రసిద్ధ కథా రచయిత 'చేహోవ్'ని కలుసుకోవడానికి ఆరోగ్య కేంద్రమైన 'యాల్టా' పట్నానికి వెళ్లాడు. చేహోవ్ అతన్నెంతైనా ప్రోత్సహించాడు. 1901లో నాటి రష్యా సాంస్కృతిక కేంద్రమైన 'పీటర్స్‌బుర్గ్'కి మకాం మార్చాడు. నాటి ప్రసిద్ధ రచయితలు బూనిన్, సెరఫిమోవిచ్, గారిన్, మిహైలోవ్‌స్కీ మొదలైనవారు అతణ్ణెంతగానో ఆదరించారు. మహారచయిత 'తోల్‌స్తోయ్' తోనూ పరిచయం కలిగింది. నాటి ప్రసిద్ధ శ్రామిక వర్గ రచయిత మక్సీమ్ గోర్కీ "జ్ఞాన ప్రచురణాలయం" వారి గ్రంథా ప్రచురణలలో పాల్గొనమని కుప్రీన్‌ను ఆహ్వానించాడు. ఆ ప్రచురణల్లో భాగంగానే కుప్రీన్ కథల మొదటి సంపుటి వెలువడింది.

1905లో కుప్రీన్ నాటి సాంఘిక రాజకీయ జీవితాల్లో చురుగ్గా పాల్గొన్నాడు. నల్ల సముద్ర నావికాదళ సిబ్బందితో సంబంధాలు పెట్టుకున్నాడు. విప్లవకారుల సహాయార్థం నిర్వహించిన సభలలో పాల్గొన్నాడు. పోలీసులు పట్టుకోవాలనుకున్న వాళ్లను దాచాడు. 'ఒచాకోవ్' అనే యుద్ధ నౌకలో నావికులు జరిపిన తిరుగుబాటుకి వ్యతిరేకంగా అడ్మిరల్ 'చుఖ్నీన్' జరిపిన దమనకాండకు కుప్రీన్ సాక్షిగా ఉన్నాడు. ఆ యుద్ధ నౌక మీద బాంబు వెయ్యమని చుఖ్నీన్ ఇచ్చిన ఆజ్ఞతో వందలాది మంది నావికులు సజీవ దహనం చెందారు. ఈ ఘటనకు నిరసనగా "సెవస్తపోల్‌లో ఘటనలు" అనే వ్యాసాన్ని రాసి నిర్భయంగా ప్రకటించాడు కుప్రీన్. ఆ సంవత్సరమే (1905లో) రష్యా-జపాన్ యుద్ధంలో జారిస్టు రష్యా ఓడిపోవడానికి దారితీసిన కారణాలు తెలిపే "ద్వంద్వ యుద్ధం" అనే కథ వెలువడి కుప్రీన్ ఖ్యాతిని ఇనుమడింపజేసింది. జార్ నిరంకుశత్వం ముదిరిపోయిందనీ, తిరిగుబాటుదార్లని అణచడానికి చేసినంతగా, మాతృదేశాన్ని రక్షించడానికి సైనికులకు శిక్షణనివ్వడం లేదనీ ఈ కథ తెలియజేసింది. "కాల్చమని అతనికి ఉత్తర్వులు వచ్చాయి. అతను కాలుస్తాడు. ఎవరి మీద? ఎందుకోసం? ఒట్టి పుణ్యానికా? అతనికి పట్టదు. ఎప్పుడు, అతను ఆలోచించడు." "ఎవరికీ కొలువుల మీద నమ్మకం లేదు. ఆ కొలువుకి సహేతుకమైన గమ్యం ఏమైందీ తెలీదు" అంటాడు కుప్రీన్ ఈ కథలో.

ఈ కథ ఆయనకు ఎంతటి గుర్తింపును తెచ్చిపెట్టిందంటే, అభిమానుల్నించి తప్పించుకునేందుకు ఆయన ఎక్కడికి వెడుతున్నదీ చెప్పకుండా ఇల్లు వదిలిపోవాల్సి వచ్చేది. అయితే కీర్తి ఆయనకు డబ్బునివ్వలేదు. ఒక్కోసారి కడుపు నింపుకోవడమే కష్టమయ్యేది. ఒకసారి తక్కువ స్టాంపులంటించిన ఉత్తరం వస్తే, దాన్ని తీసుకోవడానికి కొన్ని కోపెక్కులు.లేకపోయిన సంగతి బాధగా గుర్తుచేసుకునేవాడు.

కుప్రీన్ చిత్తశుద్ధి గల కళాకారుడు గనుక తను నమ్మిన విషయాల్ని నిర్భయంగా తన రచనల్లో పేర్కొన్నాడు. ఒక ప్రజాస్వామికవాదిగా సంఘంలో జరుగుతున్న దురన్యాయాల్ని ఎత్తి చూపాడు. జార్ నిరంకుశత్వాన్ని నిర్భయంగా ఖండించాడు. "మనిషి ఈ లోకంలోకి అనంతమైన స్వేచ్ఛ కోసం, సృజనాత్మక కృషి కోసం, ఆనందాన్ని పొందడం కోసం వచ్చాడు" అని చెప్పిన కుప్రీన్ ఈ మాటలు ఆయన రచనలన్నిటా ప్రతిబింబిస్తాయని చెప్పవచ్చు. ఆయనకు జీవితం పట్ల అపరిమితమైన ప్రేమ ఉంది కాబట్టి ప్రపంచం మెరుగవుతుందని విశ్వసించాడు. సకల ప్రజలూ ఆనందమయంగా ఉండే కాలాన్ని గురించి కలలుగన్నాడు.

కుప్రీన్ మనస్పూర్తిగా జార్ పతనాన్ని కోరుకున్నాడు. విప్లవాన్ని ఆహ్వానించాడు. అయితే మహత్తర అక్టోబరు విప్లవం తర్వాత జరిగిన సంఘటనల్ని ఆయన జీర్ణించుకోలేకపోయాడు. బోల్షివిజాన్ని "స్వార్థరహిత, పరిశుద్ధ, మహత్తర విధియుక్త బోధన" అని వర్ణించాడు. కానీ, కమ్యూనిజపు ఆదర్శాలను నిజ జీవితంలో అనువర్తింప జేసే కార్యక్రమాలను సమర్థించలేకపోయాడు. విప్లవపు తీవ్ర పోరాట రూపాలకు భయపడి పోయాడు. ఎటూ తేల్చుకోలేక గజిబిజి పడిపోయి, చివరికి 1919లో కొంతమంది ఇతర మేధావుల బాటలో పారిస్‌కి ప్రవాసం వెళ్లాడు. ప్రవాసంలో కూడా తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించాడు. అయితే తన మాతృదేశమైన రష్యాలో ఉంటూ, రష్యా ప్రజల కోసం, వారితో మమేకమై రాసినట్లుగా, పరాయిదేశంలో ఉండి రాయలేకపోయాడు. ఆ ఎడబాటు ఆయన్ని కుంగదీసింది. తన విచారాన్ని ఒక వార్తా పత్రిక ఇంటర్వ్యూలో ఇలా చెప్పాడు: "తమ తెలివి తక్కువతనం వల్లగానీ, లేదా విషమ పరిస్థితి వల్లగానీ, మాతృదేశం లేకుండా మనిషి బతకొచ్చని అనేవాళ్లు కొందరున్నారు. క్షమించండి. వాళ్లని, తమని తామే మోసగించుకునే వంచకులని తప్ప మరోలా పిలవలేను. మనిషి ఎంత ప్రతిభావంతుడైతే అంతగా అతనికి రష్యాని వదిలి ఉండడం కష్టమవుతుంది." రష్యా

తనకి కలల్లో కనిపించేదనీ, నిరంతరంగా రష్యాని గురించి తలవంచుకునేవాణ్ణని ఆయనన్నాడు.

అయితే 1937లో తీవ్రమైన జబ్బుతో తననింత కాలం బాధించిన వియోగ దుఃఖాన్నుండి ఉపశమనం పొందేందుకు తిరిగి సోవియట్ యూనియన్ వచ్చాడు. కానీ అనతికాలంలోనే, 1938 ఆగస్టు 25న చనిపోయాడు. కాని చనిపోవడానికి కొద్ది ముందు, ఆయన తన విషాద భరిత దోషాలకి పశ్చాత్తాపపడుతున్నట్లు జరిగిన ఒక ప్రముఖ సమావేశం గురించి 'తెరిషోవ్' అనే రచయిత ఎంతో కరుణరస పూరితంగా వర్ణించాడు.

"ఆట స్థలంలోకి తెచ్చిన కుర్చీలో ఆయన్ని కూర్చోబెట్టారు. ఆయన పట్ల తమ భక్తి ప్రవృత్తులు ప్రదర్శించారు. ఆయన మాట్లాడకుండా ప్రతిదాన్ని చూస్తుండిపోయాడు. సైనికులు ఆయన దగ్గర కెళ్లి ఆయన్ని తాము ఎరుగుదుమనీ, ఆయన పుస్తకాలు చదివామనీ, తమ మధ్య ఆయన్ని చూడ్డం సంతోషంగా ఉందనీ చెప్పారు. ఆయన కృతజ్ఞతలు చెప్పి, గాఢంగా ఆలోచిస్తూండి పోయాడు. కాని, ఎర్రసైన్యపు సైనికులు 'ఓల్గానది వారనే'', మొదలైన పాటల్ని పాడగానే, కుప్రీన్ పూర్తిగా మారిపోయాడు. "నా మాతృదేశం విస్తరించుకుంది..'' అనే దాన్ని వాయించగానే, కుప్రీన్ బాగా చలించిపోయాడు. చివరికి సైనికులు ఆయన దగ్గర సెలవు తీసుకుని వెళ్లిపోతూన్నప్పుడు, ఇక ఆయన నిబ్బరించుకో లేకపోయాడు.

"నా మాతృదేశం నన్ను, ఆమెకి ఎంతో అపచారం చేసిన వాణ్ణి, క్షమించింది. నా ప్రజల పుత్రులు, సైన్యమే, నన్ను క్షమించడం జరిగింది. చిట్ట చివరికి నాకు శాంతి లభించింది'' అన్నాడాయన కన్నీళ్లతో..:

కుప్రీన్ కథలకీ, నవలకీ అపార ప్రజాదరణ ఉంది. ఒక్క రష్యాలో మాత్రమే గాక, యావత్తు ప్రపంచ భాషల్లో అవి అనువదించబడి కోట్లాది పాఠకుల ఆదరణ పొందాయి. ఆయన రచనల్ని గురించి చెబుతూ, ప్రసిద్ధ సోవియట్ రచయిత వి. సోలొవుహిన్ "... ఆయన కేవలం కళాకారుడు మాత్రమే కాదు. ఓ 'శోధకుడు', విప్లవాత్పూర్వపు వాస్తవికతా ధోరణిలోని రష్యన్ రచయితలలో కుప్రీన్ అంతగా ఈ బిరుదుకి అర్హమైన రచయితలు ఎక్కువ మంది లేరు. ఒక్క కల్పిత విషయంగాని, ఊహాకపోలితంగానీ లేకుండా ఉండడం ఒకపక్క, సమున్నత పరిశుద్ధ కళానైపుణ్యం మరోపక్క. మరో గొప్ప పదం 'నిష్ణాతుడు' అనేది కూడా ఆయనకు వర్తిస్తుంది. ఆయన ప్రతి రచనా ఒక చిత్రణ. అదే సమయంలో ఒక గేయం...'' అంటూ కీర్తించాడు.

కుప్రీన్ 19వ శతాబ్దపు చివరి భాగంలోను, 20వ శతాబ్దపు ఆరంభంలోను ఉన్న విశిష్ట రష్యన్ రచయితల కోవలోనివాడు. ప్రపంచ ప్రసిద్ధ రష్యన్ రచయితలు లెవ్ తోల్‌స్తాయ్, చేహోవ్‌ల సమకాలికుడు. విమర్శనాత్మక వాస్తవికతా విధానానికి చెందిన ప్రసిద్ధ రచయితలు గోగొల్, దొస్తొయేవ్‌స్కీల వరుసలో చివరివాడు. అయినా వారి విధానానికి భిన్నంగా, వారి ప్రసిద్ధ రచనల్లోని బలహీన పాత్రలతో కరుణరసాన్ని చిత్రించడానికి బదులు, సాంఘిక దౌష్ట్యాన్ని ప్రతిఘటించే దృఢమైన పాత్రల్ని సృష్టించి పాఠకుల్లో ఉత్సాహాన్ని వీరావేశాన్ని రగిలిస్తాడు. ప్రస్తుత నవలలో "జెన్నీ'' పాత్ర అలాంటిదే.

ఇక చూడండి "యమకూపం'' ఎలా ఉంటుందో....!

చాలా కాలం కిందట - అప్పటికింకా రైలుబళ్లు పడనప్పుడు - రష్యాలో ఓ పెద్దనగరం శివారు ప్రాంతాల్లో గుర్రబ్బళ్లు తోలే వాళ్లు నివాసం ఉండసాగారు. దాంతో క్రమంగా ఆ ప్రాంతానికి "యామ్‌స్కాయా స్లొబోడా'' (బళ్లవాళ్లపేట) అని, లేక పొట్టిగా 'యామ్‌స్కాయా'' అనీ, లేక "యామా'' అనీ పిలిచేవాళ్లు. రైళ్ళొచ్చాక బళ్లవాళ్ల పని పడిపోయి చెట్టుకొకరు పుట్టకొకరు అయి జనం పల్చబడ్డారు. అయినా పూర్వం పేరు పోలేదు. ఇప్పుడు యామా వ్యభిచారానికి, తాగుడుకీ ప్రసిద్ధికెక్కింది. జూదం, గలాటాలు సాధారణమయ్యాయి. పూర్వం అక్కడ పాతకాలపు పడుపుకత్తెలు, పాత ఇళ్లూ పోయి కొత్త పిల్లలు, కొత్త ఇళ్ళూ వచ్చాయి. ఈ వ్యభిచార గృహాల మీద కట్టుబాట్లు పకడ్బందీగా ఉండి, ప్రభుత్వ అజమాయిషీ ఉంది. ఇప్పుడక్కడ రెండు వీధులున్నాయి. రెంటిలోనూ పడుపుకత్తెల ఇళ్లే. పోతేకొన్ని సారా అంగళ్లు. వాటిలో సానులకు కావలసిన సమస్త హంగులు లభ్యమవుతాయి.

సాని వ్యాపారం ముప్పై ఇళ్లల్లో సాగుతుంది. ఒక్కో ఇల్లూ ఒక్కో సంస్థ. అన్నిట్లోనూ జరిగే తంతంతా ఒకటే. విటుల్ని ఆహ్వానించడం, వారిని ఆదరించడం, వారితో విహరించడం. రేటు మాత్రం తేడా. అందానికీ, పడుచుదనానికీ ఎక్కువరేటు. అలాగే అందంగా అలంకరించుకున్నా తేడా ఉంటుంది. గదుల్లోనూ ఆ తేడా కనబడుతుంది. శుభ్రంగా ఉన్న గదిలో, పరుపు మంచం, కుర్చీ, అద్దం, దువ్వెనా వగైరాలుంటాయి. చింకి చాపతో, చీకటి కొట్టులా ఉండేగది చవక. ఈ తేడాలు విటుల సౌకర్యం కోసమే. వారి తహత్తును బట్టే అంతా.

పెద్ద వీధిలో ఉండే 'ట్రెప్పెల్స్' అనే రెండతస్తుల భవనం ఖరీదైంది. తివాసీలతో, చుట్టూ శిల్కు తెరలతో, బొమ్మలతో అలంకరించబడి, ఖరీదైన సోఫాలతో పెద్ద అద్దాలతో, గదుల్లో శిల్కు దుప్పట్లతో ఉండే ఈ ఇంట్లోని సానులంతా జర్మనులు. అందంగా, దుక్కలా ఉంటారు. ఇక్కడ ఒకసారికి మూడు రూబుల్స్, రాత్రంతా ఉంటే పది రూబుల్స్. ఇంకా ఆ వీధిలో మరో మూడిళ్లు రెండో రకానివి. ఇక్కడ రేటు తడవకు రెండు రూబుల్స్. ఆ వీధిలోని మిగిలిన ఇళ్లన్నీ మూడో రకానివి. అధ్వాన్నంగా ఉండే అక్కడ తడవకు ఒక రూబుల్. ఇక చిన్న వీధి సంగతి చెప్పక్కర్లేదు. దారుణం. ఇక్కడికొచ్చే వాళ్లంతా సోల్జెర్లు, దొంగ వెధవలు, అమాంబాపతు అలగాజనం. రేటు కేవలం యాభైకోపెక్కులు. ఇళ్లన్నీ మురికి కూపాలు. గది గదికీ మధ్య ఒక తెర ఉంటుంది. కింద గడ్డి పరుపులు నేల మీదే. ఇక్కడి స్త్రీలంతా చిరుగుడ్డలతో, ఒళ్లంతా పుళ్లూ రక్కుళ్లతో ఉండి, సాయంకాలానికి అవి కనబడకుండా ఎర్రరంగు పూసుకుంటారు. ఇలా సంవత్సరమంతా

జరుగుతూనే ఉంటుంది. ఓ నాలుగు రోజులు తప్ప హోలీ వీక్‌లో చివరి మూడు రోజులు, మార్చి 25న దేవ మాత మేరీకి మంగళవార్త చెప్పే రోజు.

ఈ కొంపలకు రకరకాల వాళ్లు వస్తారు. వృద్ధులు, యువకులు, విద్యార్థులు, కొత్త పెళ్లికొడుకులు, ప్రొఫెసర్లు, లాయర్లు, దొంగలు, హంతకులు, రచయితలు, కవులు, గూఢాచారులు, సంఘ సేవకులు, రాజకీయ నాయకులు వగైరాలు, రోగులు, అంగవికలురు - అంతా దుకాణానికో, హోటలుకో వెళ్లినంత స్వేచ్ఛగా వచ్చి తాగుతూ, తూలుతూ, డ్యాన్సు చేస్తూ ఏదో ఆనందాన్ననుభవిస్తారు. ఎవరికీ ఆశాభంగం కలగదు. వాళ్ల కోర్కెలు తీర్చడానికి ఆడవాళ్లు సిద్ధంగా ఉంటారు. డబ్బు పారేసి, ఆడదాని శరీరంతో ఆడుకుంటారు. సానులు తమ శరీరాన్ని అప్పగించి, క్యూలో వచ్చే విటుల్ని ఎంత మందుంటే అంత మందినీ తృప్తిపరుస్తారు. ఆవిధంగా రాక్షస రాత్రి గడిచి, తెల్లారగనే యామా నిద్రిస్తుంది. ఉదయాన ఎడారిలా, శవంలా ఉంటుంది. సాయంకాలం మళ్లీ లేచి రాబోయే రాత్రికి హంగులు సిద్ధం చేసుకుంటారు. సంవత్సరమంతా, ప్రతి సంవత్సరమూ... ఇదే తంతు. ఈ స్త్రీలకు సంఘంలో స్థానం లేదు. లోకం వీరిని ద్వేషిస్తుంది, అసహ్యించుకుంటుంది. బంధువులు వీరిని తిట్టి దూరంగా తరిమేశారు. కాని, సంఘంలోని కాముకశక్తి వీరిని బలపశువులుగా ఉపయోగించుకుంటుంది. తన ఇంద్రియ సుఖం కోసం వీరిని పదిలంగా భద్రపరుచుకుంటుంది. తమ కుటుంబ గౌరవానికి సంరక్షకులుగా అట్టిపెట్టుకుంటుంది. అలా నాలుగు వందల మంది పతితలు, పడుపుకత్తెలు, గొడ్డుబోతు స్త్రీలు మూర్ఖులై, సోమరులై, పిచ్చివాళ్లయి యమకూపమైన 'యామా'లో బతుకీడుస్తున్నారు.

మధ్యాహ్నం పూట ఓ రోజు రెండో రకం ఇల్లైన 'అన్నా మార్కోవ్‌నా' ఇంట్లో అంతా గాఢ నిద్రలో ఉన్న సమయంలో ఒకపిల్లను బలవంతంగా చెరచి పడుపు వృత్తిలోకి దింపిన దాన్ని గురించి దర్యాప్తు చెయ్యడానికి 'కెర్బిష్' అనే పోలీసు వచ్చి, అన్నా దగ్గర అన్ని మర్యాదలు స్వీకరించి లంచం అందుకుని చక్కాపోయాడు. ఆ సమయంలో అమ్మాయిలంతా 'మంకా' అనే అమ్మాయి గదిలో పేకాట ఆడుతూంటే, ఇవేం పట్టనట్టు 'జెన్నీ' అనే పిల్ల ఓ ఫ్రెంచి నవల చదువుతోంది. మరో పిల్ల 'టమారా' తన ప్రియుడు 'శంకా' కోసం ఏదో అల్లిక పని చేస్తోంది. ఇది చూసిన జెన్నీ, విటుల దగ్గర్నుంచి డబ్బులాగకుండా, వారికి ప్రేమనందిస్తావని విమర్శించింది. ఆమె అందం తనకుంటే ఈపాటికి మూటలు మూటగట్టేదాన్నంది. "ఎవరదృష్టం వారిది. నువ్వూ అందగత్తెవే కదా! అయినా మనందరం 'అన్నా' అడుగులకు మడుగులొత్తాల్సిన ఖర్మ పట్టింది" అని విచారించింది టమారా. అందర్నీ భోజనాలకు రమ్మని పనిమనిషి 'జూస్యా' కేకపెట్టేసరికి, అంతా లేచారు. రకరకాల దురభ్యాసాలకు అలవాటు పడ్డంవల్ల అందరి ఆకళ్లూ చచ్చిపోయాయి. ఇటీవలే సానికొంపకు చేరిన 'నైనా' అనే అమ్మాయి మాత్రం కడుపునిండా తినేసరికి అంతా ఆమెను ఎగతాళి చేశారు. ఇటీవలే ఆ పిల్లను ఓ వ్యాపారస్తుడు చెరిచి, సాని కొంపకు అమ్మేశాడు. ఇలా అంతా కబుర్లు చెప్పుకుంటూంటే, జోస్యా రాత్రికి తయారుకమ్మని అరిచేసరికి అంతా కొద్ది నిమిషాల్లోనే సువాసనల నూనెలు రాసి, తల దువ్వుకొని, బోరిక్ డైమండ్ సబ్బుతోటి, సువాసన నీళ్లతోటి మొహాలు తోమడంతో ప్రతి గదీ గుమగుమలతో నిండిపోయింది. పడుపుకత్తెలంతా రాత్రికోసం ముస్తాబు పూర్తి చేసుకున్నారు.

భారీమనిషి 'సిమన్' లాంతర్లు వెలిగించాడు. పియానో వాయించే వ్యక్తి పెందరాడే వస్తాడు. విటులు డ్యాన్స్ చెయ్యమంటే ఇతను - అన్నా భర్త 'ఇషయాసవిచ్'తో కలిసి సంగీతం వాయిస్తారు. వచ్చే డబ్బుల్లో సగం అన్నాకు, మిగిలిన సగంలో సగం సరిగ్గా వయోలిన్ వాయించడం రాకపోయిన ఇషయాసవిచ్‌కి ఇవ్వాలి. మిగిలింది తనకు. తేలికపాటి నృత్యానికి ముప్పై కోపెక్కులు, మరో రకమైన నృత్యానికి తడవకు యాభై కోపెక్కులు వసూలు చేస్తారు.

సాని కొంపకు ఒక్కోరోజు కొత్త మనుషులు వచ్చి ఒక తుఫాను వాతావరణం సృష్టిస్తారు. ఒకోసారి తప్పతాగిన రౌడీ వెధవలకూ, సాని కొంపల్లో ఉండే కాపలా వాళ్లకు కొట్లాట జరుగుతుంది. తలలు పగులుతాయి. వేశ్యలంతా భయంతో ఉంటే, జెన్నీ హుషారుగా ఇరుపక్షాలను ఉసిగొల్పుతుంది. ఒక్కొక్కడు జూదంలో అంతా పోగొట్టుకుని సానివాడకు తాయరయి ఎంత ఘోరానికయినా వెనుదియ్యడు. ఒక్కో గుంపు వచ్చి సాని కొంపకు తలుపులేసి, నోటితో ఉచ్చరించరాని పనులు చేస్తూ, రెండూ మూడు రోజులు గడబిడ సృష్టిస్తారు. ఆడవారి అవయవాల నుండి రక్తం ప్రవహిస్తుంది. ఆడాళ్లూ మగాళ్లూ నగ్నంగా నాట్యం చేస్తారు. ఏడుపులు పెడబొబ్బలతో కొంపంతా మార్మోగేది. తాగినంత తాగి, పారబోసి పందుల్లా పడిదొర్లడం, మలమూత్రాదుల దుర్గంధం... ఆడాళ్ల మీద పడి ఎక్కి తొక్కడం... అంతా బీభత్సం... యమలోకం!

సాని పడుచుల్లో 'పాషా' ది ఒక దీన చరిత్ర. నరాల వ్యాధి గల ఆమె ఆస్పత్రికి బదులు సానికొంపకు చేరింది. ఈ జబ్బు వల్ల మగాడు కనిపిస్తే చాలు వెర్రి ఆవేశంతో వాంఛ తీర్చుకోవడానికి పశువులా ప్రవర్తిస్తుంది. ఈ బలహీనతను ఆసరాగా చేసుకుని యజమానురాలు ఆమె చేత విచ్చలవిడిగా వ్యభిచారం చేయిస్తుంది.

ఇంతలో పెద్ద మనిషిలా ఉన్న ఒక జర్మన్ టీచర్ వచ్చి, ల్యూబాని పిలిచాడు. మళ్ళీ ఆ పిల్లను కాదని, బలిసిన కాట్యాని ఎంచకుందామనుకున్నాడు గానీ, లావుపాటి వాళ్లు రతిలో హుషారుగా ఉండలేరనుకుని, జెన్నీ గర్వపోతులా ఉందనుకుని, మంకాను తీసుకుపోయాడు. పని ముగిశాక అతడిచ్చిన డబ్బుని మేజోళ్లలో దాచుకుందామె. అయినా అతడు ఆమెతో సంతృప్తిపడక జోస్యాకు చెబితే, పాషను పంపిందామె. ఆ టీచరు భార్యకు స్త్రీ సంబంధమైన రోగాలుండటం చేత అతనికి స్త్రీ సుఖం లేదు. డబ్బు కూడబెట్టుకుని అప్పుడప్పుడు ఇలా సానికొంపలకు చేరి సుఖం కొనుక్కుంటుంటాడు. (ఇంకా ఉంది)



# ఉద్యమమే నా ఊపిరన్న తెలంగాణ

**- తంగెళ్ల సుదర్శనం**

ఉద్యమాల ఊటనన్నదిరో నా తెలంగాణ
ఉరుములయ్యి ఉరముచున్నదిరో నా తెలంగాణ
తాగు సాగు నీరు లేక
పంటలు చేతికి రాక
గిట్టుబాటు ధరలు లేక
కొట్టుమిట్టాడె బతుకుల
మండె గుండెల రైతునన్నదిరో నా తెలంగాణ
పోరు జెండల జాడనన్నదిరో నా తెలంగాణ

నెర్రబారిన నేలలో
నెమళ్ళు నాట్యాలాపెనో
ఆంధ్ర దోపిడి పాలనాలో
నెత్తుటి ఏరులు పారితె
నెగడులయ్యి మండుచున్నదిరో నా తెలంగాణ
దగడులో చూపించుచున్నదిరో నా తెలంగాణ

కూలికెళ్ళిన కూడు దొరుకక
పస్తులాతో కుస్తి పడుతు
చంద్రవంకల తీరున
వంగిపోయిన నడుములాతో
నగారయ్యి మోగుచున్నదిరో నా తెలంగాణ
పాలపిట్టై పాడుచున్నదిరో నా తెలంగాణ

నంగనాచి మాటలాడి
పూటకొక్క ఎత్తువేసి
తెలంగాణ ప్రజాపోరును
నిలువరించే రాజకీయుల
తరిమి తరిమి కొట్టమన్నదిరో నా తెలంగాణ
ఉద్యమమే నా ఊపిరన్నదిరో నా తెలంగాణ

గోసి బోసి గొంగడేసి
గజ్జె గట్టి గంతులేసి
గుండెలల్లో కెలుకుతున్న
గాయాల తిత్తులూదిన
రాగాలతో రగులుతున్నదిరో నా తెలంగాణ
డప్పుల సప్పుల్లనన్నదిరో నా తెలంగాణ

పల్లె పల్లె ఇల్లు ఇల్లు
పోరు పాటై సాగినాది
పోరులోన జేరమంటు
సైరనంట ఊదినాది
ప్రజాస్వామ్యమునడుగుచున్నదిరో నా తెలంగాణ
ప్రత్యేక రాష్ట్రమన్నదిరో నా తెలంగాణ

# స్వప్నాలు పంచినవాడు

**- శశిధర్ రెండు కవితలు**

అనంత సుదీర్ఘ బాటలో
ఒక్కో అడుగు వేస్తూ
బేఫర్వాగా సాగిపోతున్న బాటసారి
ఎన్నెన్నో అవరోధాలు, మరెన్నో అడ్డంకులు
స్వప్న సాఫల్యంకై
తీక్షణ దృష్టి సారించి
ఎర్రకాంతుల విరజిమ్మి
లక్ష్య సాధనకు ప్రతిన బూనిన బాటసారి
స్వప్నాల్లో తెలియాడే నిద్రలేని రాత్రులు...
దిమ్మదిరిగే దెబ్బకొట్టిన
గెరిల్లా దళాలు
చరిత్ర రచనకు రక్తం వోడ్చి
అడవులు - గ్రామాల్లోని శంఖనాదానికి
దరువుగా మోగుతున్న డోలు...
అలసి సొలసి ఉదాసీనమైన వేళ
బందీ చేసిన చట్ట పోరు బంధనాలు
రక్తమోడిన గుండెల పై
స్వప్నాలు పంచినవాడి దేహాన్ని
హత్తిన ఎర్రజెండా...
అడుగు ముందడుగేనన్న బాటసారి
అలసిసొలసిన బాటసారి... అడుగు ముందుకే....

(బంగ్లా పీపుల్స్ మార్చ్ పత్రిక సంపాదకుడు స్వపన్‌దాస్‌ను కుహనా మార్క్సిస్టు ప్రభుత్వం యు.ఎ.పి.ఎ.లో బంధించి, వైద్య సేవలందించక హత్య చేసిన పిమ్మట ఆయన దహన సంస్కార వార్తల ప్రతిస్పందనతో)

# కన్నీరుతో కవిత తడిసింది

మోడుబారిన మాను చైతన్యం కోల్పోలేదు
వెలవెలపోతున్న చందమామ,
కల్లోలిత ప్రాంతాలు, బీభత్సమైన జనపదాలు,
విషాదవేళ స్మృతుల్లో... అసంఖ్య ఆల్బమ్స్...
అనివార్యమైన నిద్రలో తెగిన తంత్రులు

పంటపొలాల్లో బరువుగా వంగిన కంకుల పై నుండి
ఇంపైన గాలి, కన్నుల పండుగ దృశ్యం
స్వప్న విహారంలో కొత్త అన్నం రుచి
మిట్ట మధ్యాహ్న వేళ ఆడే శైశవావస్థ
అతి పురాతన మందిరం
ఒంటరిగా, పొగమంచులో తడిసి ముద్దై
సచేతనంగా అతను... దృఢంగా అతను
కారడవుల్లో - కొండ శిఖరాలపైన
హుందాగా తలపై కెత్తి సాగి
భూమి పుత్రుల సంకెళ్ల మరకలు తుడిచి,
కడుపు కాలిన భూదేవి
విస్ఫోటాన్ని పులుముకున్నది
శతాధిక రూపాల్లో ఉగ్రమైన రాజ్యం...
బొట బొటా కారిన కన్నీరు
కవిత రాసిన పుస్తకాన్ని తడిపింది
గుండె వొలికిన అమరుల రక్తంతో
కవిత రాసే పుస్తకం తడిసింది...

(మావోయిస్టు పార్టీ పశ్చిమ బెంగాల్ రాష్ట్ర కమిటీ నాయకుడు నిర్మల్‌దా గుండెపోటుతో కనుమూసిన వార్త విని;
మూలం - నవంబర్ 2010, బంగ్లా పీపుల్స్ మార్చ్)

## ఉజ్వల భవిష్యత్

- సితార

మెరుస్తున్న వెన్నెల మురిపిస్తున్న వెన్నెల
శక్తినిచ్చే వెన్నెల వెంట నడిచే వెన్నెల
అంధకారంలో దూరపు చూపైన వెన్నెల
అడవి నిండా వెన్నెల అనంత వెన్నెల
అడవన్నల అక్కల గుండెల్లోని వెన్నెల
కొండ అంచున ప్రతిబింబమైన వెన్నెల
కొండ దిగువున నదిలోని తళుకు
చమకైన వెన్నెల వెలుగు అయిన వెన్నెల
ఎగుడు దిగుళ్లలో అలసిన దేహం
మూగబోయిన మనసు పెదవి దాటని మాట
సెలయేటి గలగలతో ముచ్చటించిన మనసు
వెన్నెల వెలుగై పారే నిశ్శబ్ద ఏరు
దూరతీరాలను ఏకం చేసే నదిలో ప్రతిబింబం
ఇంద్రావతి మీదుగా వీస్తున్న గాలి
ప్రజాస్వామ్య వెలుగుకు సాక్షిగా వెన్నెల
సువర్ణం పులుముకున్న వెన్నెల సొగసైన వెన్నెల
దామోదర్ ఎరుపుకు మొహం చాటేసిన వెన్నెల
అరుణిమమైన యమునను గాంచి
హస్థి, హస్థినాపురం మార్చ్ ప్రజాస్వామ్యానికి
మొహం తిప్పి థూ... థూ... అన్న బుద్ధ పూర్ణిమ చంద్రుడు...
కాళ్లు కడిగి దారిచ్చిన గోదారి
మహానదై పొంగి పొర్లి కేరింతలు కొట్టింది
సేద దీర్చిన జనప్రవాహం
వెన్నల వెలుగులా వెంటరాగా
భవిష్యత్ రూపురేఖను రేఖాంతం చేసింది
వెంట నడిచిన వెన్నెల వెన్ను చరిచిన వెన్నెల
వెన్నెల్లా పోటెత్తిన జనసంద్రం
ఉజ్వల భవిష్యత్‌ను వాగ్దానం చేసింది...
ఎగుడు దిగుళ్లలో దారి తప్పకుండా
వెంట నడిచి వెలుగు నిచ్చిన వెన్నెల
వెన్నంటిన వెన్నెల మెరుస్తున్న వెన్నెల
చూపు అందిన బాట పురివిప్పిన మనసు
మురిపించే భవిష్యత్ చిత్రపటం...

(దంతెవాడ నుండి ధన్‌బాద్ మీదుగా నోయిడా వరకు ప్రజా ప్రభంజనంలో అమరులైన భూమి పుత్రులకు అంకితం; 'సితార' అముద్రిత కవితకు తెలుగుసేత - శశిధర్)

## ఆజాద్‌ను వెతుకుతుంటా!

- కబీర్ సుమన్

గదవ నదిమి పట్టి కొట్టిన తూటా
ఛాతిని కాదు మస్తిష్కాన్ని ఛిద్రం చేసిన గురి
కాలిన గాయం లోతు
ప్రజాస్వామ్యానికి షరతుగా నిలిచింది.
మేరు పర్వతంలా నిలిచిన ఓ దిక్కు
మూసిన కళ్లలో చరిత్రను చదవవచ్చు
శాంతిని పంచిన కళ్లు
శాంతి లోతు ఒడిసి పట్టేదెవరో
ఎవరుండిరో ఉన్నారో ఎందరుంటారో
ఎవరేం ఇచ్చారో మాట నిలబెట్టారో
స్వప్న సాఫల్యానికి జీవితం అంకితమై
వీరులుగా నిలిచే వారినే కదా
నేల తల్లి ముద్దాడేది
ఎన్‌కౌంటర్ కథల కొనసాగింపుగా
పల్లెలెత్తిన ప్రజాస్వామ్య గానం
పాట అర్థం, అర్థమిచ్చే చోట
ఆజాద్‌ను వెతుకుతుంటా నేను

(కవి, గాయకుడు, కళాకారుడు, విమర్శకుడు, లోక్‌సభ సభ్యుడు కబీర్ సుమన్ రచనకు తెలుగు పరిచయం - శశిధర్)

# వేచి చూస్తుంది కాలం

- అరసవిల్లి కృష్ణ

నిశ్శబ్ద నిశీథిలాంటి
అడవిలో కూర్చున్నారు
దీపమక్కర్లేదు
దీపధారులున్నారు

మంచులో కురిసిన
నీటి బొట్టును తాకుతున్నప్పుడు
దొరికిన సన్నజాజి పువ్వు
అత్యంత మృదువుగా మాట్లాడుతున్నది
ఆకాశం నాది
వెలుతురు పూలనదం మీది

అక్కడే ఉన్నావు
క్షేమంగానే ఉన్నావు కదా!
శరీరంపై గాయాలు లేవుకదా!
ఉత్తరమయినా లేదే!

ఎదురు చూశాను
చూసిన కనులు అగ్నిపూలయ్యాయి
నువ్వక్కడే ఉన్నావా!

నూరు వరహాల చెట్టు కనబడిందా
దాని పూలను ముద్దాడు
కన్నీరు - మున్నీరుగా ఏడుస్తుంది
ఓ దుఃఖాన్ని చూసి
కన్నీటి చారికలను తుడిచేందుకు
నా చేతులు ఖాళీగా లేవు

రాత్రంతా
నా చుట్టూనే తిరుగుతున్నావు
నిద్రలేచి చూస్తే
అదృశ్యమయినావు

తెల్లారగట్ల
నీ అమాయక ముఖం కనబడక
నన్ను నేను వెతుక్కున్నాను

ఎలా వెళ్ళావు
వెళ్ళడం మాకు నేర్పలేదు
నీ నుండి నేనేది నేర్చుకోలేదు

నువ్వెళ్ళిన దారి వంక చూశాను
మెత్తని పూలు నలిగి
నీ కోసం మాలలల్లుతున్నాయి

నీ అమాయక ముఖం
ఆనవాళ్ళను వెతికాను
నులకమంచంలో తలదూర్చి
నీ కోసం కలవరించాను

జనం మధ్య
ఏకాకివి
ఎవరి వంక చూసినా
తరలిపోయిన వర్షమేఘం

పంచూతిలో
ముసలమ్మ ఒంటరితనం
నాలోకి జొరబడుతుంది

అనేక కేరింతల మధ్య
హాహాకారాల మధ్య
ఓడిపోయి నిల్చున్నాను

నీలానే
నన్నెవరూ గుర్తించేలేదు
నిన్నయిన ఆనవాళ్ళు పట్టడానికి
పుట్టుమచ్చల్ని వెతుకుతారు
ఎప్పుడో అయిన గాయాల్ని తడుముతారు

నా శరీరంపై
గాయాలు లేవు
బహుశా
ఇంకా గాయపడనివాణ్ని
గాయాల రుచి తెలియనివాణ్ని
గాయాలు లేని
మనుషులు కోసం ఎదురుచూస్తున్నాను
మొదటి గాయమయితే
నువ్వే జ్ఞాపకమవుతావు

కల్లం దగ్గర కూర్చున్న వాళ్ళు
ముచ్చటిచ్చుకుంటున్నారు
బియ్యపు గింజ
నోటిదాకా రాదెందుకని!
జ్ఞాపకమయినావు

కలవ పూల సౌందర్యాన్ని
మందార పూల ఎరుపుదనాన్ని
ఆస్వాదించాం కదా
గోగుపూల వెలుతుర్ని
చేతులలో బంధించాం

ఏమయినావు
చెరువులోని నీళ్ళు
దోసిలితో తాగుతున్నావా!
భూమిలోపల నిద్రిస్తున్నావా

కంఠనాళం సజీవమా
చెరోదిక్కు నిద్రించాక
నీదో ప్రపంచం
నాదో ప్రపంచం
దేన్నో వెతుకుతూ వెళ్ళావు
అడవి దాచుకున్న నెమలీకల్ని
ఆ నెమలీకల బతుకు భయాన్ని

అక్కడే ఉన్నావు
జలపాతంలా
అడవి రాల్చిన వెన్నెల నీడలా
జనం - కంటిపాపల వెనుక
కదలాడుతున్న నీడలా ఉన్నావు

జనారణ్యంలో
లేడిపిల్లలా
నిద్రలో ఉలిక్కిపడుతున్నాను

ఎవరెవరో
నా మౌనంలోకి నడిచి వస్తున్నారు
ఏ క్షణమయినా
మౌనం - సుదీర్ఘ సంభాషణగా మారవచ్చు

నిన్ను చూడాలని ఉంది
నీ చుట్టూ వాలిన
మిణుగురు పురుగుల్ని
రెప్పవాల్చకుండా చూడాలని ఉంది

అడవి
చిత్రకారుని ఊహకాదు
కవి లోపలి వాక్యం కాదు
అక్కడే సమస్త జీవరాశులున్నాయి

స్వప్నాల ఎండలో మీరున్నారు
ఎప్పుడో మరణించి
జీవిస్తున్న జనారణ్యం

మృత్యువు తర్వాత
మొలకెత్తిన వరికంకులు మీరు

తూర్పు వాకిలి దగ్గర నిలబడి
ఉదయాల్ని ఆహ్వానిస్తున్నాను

రంగు రంగుల చీకటిల్నీ దాటి
ఉదయ కిరణాల వంక చూస్తున్నాను

సముద్ర తీరంలో కూర్చున్నా
నారు మడి దగ్గర నిలబడినా
మర్రిచెట్టు కింద నిద్రించినా
మట్టి దాకలోని అంబలి తింటున్నా
జ్ఞాపకమవుతారు

పసిపాపల కేరింతలలో
ముదుసలి చివరి మాటలో
బాలింత పాలిండ్లలో
జ్ఞాపకమవుతారు

సారంగ మార్గంలో
ఊపిరి సలపని ఉక్కపోతలో
చిరుగాలి సవ్వడి కోసం
నాసిక ఎదురు చూసినట్లు
వేచి చూశాను

ఎన్నాళ్ళయినా
మరణవార్తలే
మరణిస్తున్న ప్రతిసారి
పూతకొస్తున్న చెట్టుని చూశాను
చిగుర్లకు మునివేళ్ళతో తాకుతున్న
పసిచేతుల్ని చూశాను

ఆ పసిచేతులు
రేపటి ఆగ్రహజ్వాలలవుతాయి
వేచి చూస్తుంది కాలం

పదే పదే గుర్తొస్తున్నావు
నీ కళ్ళలోని మెరుపు
గోదావరిపైన తెరచాపలా కన్పిస్తుందిట

క్షణక్షణం
నా దగ్గరే వాలుతున్నావు
నిన్ను చూసేందుకు
ప్రేమగా నిన్ను నిమిరేందుకు
నా దగ్గర కన్నీళ్ళు లేవు
తూనీగలా
గరికపూలపై నడుస్తున్నావు కదా!
గుర్తున్నానా!
నగరంలో నడుస్తున్న గొంగళి పురుగు
నా ఆలోచనపై ఎగబాకుతుందా!
సమాంతర రేఖల్ని కలపడానికి
కాళ్ళపై పరుగెడుతున్నావ్
ఎక్కడో ఓ చోట
పచ్చని చెట్టులా కనబడతావ్
కనబడతావా!

గాయాలు లేని దేహంతో
నీకై జీవనది
తన దోసిలిలో నీటిని దాచింది
నీ దాహార్తిని తీర్చడానికి
నీ గాయాలను ముద్దాడడానికి
వర్షం జోరున కురుస్తుంది

సహచరి
మరణం రాస్తున్న పద్యం
ప్రజల నాల్కలపై పాడుకునే
బతుకు పాట

# వీరుడా! నీ మరణం!

## - సంపత్ మూడు కవితలు

వీరుడా!
నీ మరణం
ఊరంతా దుఃఖమై ప్రవహించింది

నిన్న
ఆకాశం ఎందుకేడ్చిందోగని
ఇవ్వాళ
పొయ్యిల కట్టెల నిప్పు రాజేయడానికి
ఊది ఊది తలప్రాణం తోకకొచ్చింది

ఏమైతేనేం
ఎలాగైతేనేం
ఇప్పుడు
పొయ్యిమీద
కుతకుత ఉడుకుతున్న అన్నం!

ఇవ్వాళ
మనిషి మనిషిగా లేడు!
ఇల్లు ఇల్లుగా లేదు!
వాడ వాడలా లేదు!
ఊరు ఊరులా లేదు!

ఇవ్వాళ
మనిషి ఇల్లు వాడ
ఊరు దారులన్నీ
ఆ వైపే!

వీరుడా!
నీ పరిచయం ఉంటేనేం
లేకపోతేనేం
ప్రతి మనిషి
నీ కోసం రెండు కన్నీటి చుక్కలు రాలుస్తున్నాడు

వీరుడా!
నీ మరణం
ఊరంతా మనిషితనాన్ని మేల్కొలిపింది

వీరుడా!
నీ మరణం
ఊరంతా యుద్ధక్షేత్రమేనని నిరూపించింది

(కా. ఆజాద్ కోసం)

# ప్రజలు అజేయులు

వాడికి
వాగులతో, వంకలతో
కొండలతో, కోనలతో
అడవులతో సంబంధం లేదు

వానికి
మనుషులతోనే సంబంధం లేదు
వాడికి ఉన్న సంబంధమల్ల
డాలర్లు ఇచ్చే గనులతోనే

మాట్లాడే హక్కు
మంటగల్సినాక
బతికే హక్కు
బూడిదైనాక

వాగులు వంకలు కొండలు కోనలు
ఏదో
కొత్త రాగం
పాడుకుంటూ
ఏకమై
కదిలివస్తున్నపుడు

పౌరులారా!
ఈ దేశం
నాకేమివ్వకపోయినా
నేనే
ఈ దేశానికి ఏదో ఇవ్వాలని
ఈ దేశ ప్రజల సాక్షిగా

నేను మనిషిగా బతకాలని అనుకుంటున్నందుకు

ఇవ్వాళ
నా ప్రస్థానం
అబూజ్‌మడ్ వైపు మొదలయింది

తుపాకీ
ఏమైనా చేయగలదనే
అహంకార అధికార దర్పం ముందు

తుపాకీ
ఏమీ చేయలేదనే
ధిక్కార స్వరం
కొత్తగా వినబడుతుంటే
వాని వెన్నులో
ఏదో వణుకు
వాని కళ్ళలో ఏదో బెదురు

బహుశా
వాడికి కూడా అర్థమైందేమో
ప్రజలెప్పుడు అజేయులేనని

# బినాయక్ సేన్ కోసం

అబద్ధాల పునాదులపై
నిలబడిన
భారత ప్రజాస్వామ్యం
తన ప్రజలపై
తానే యుద్ధం ప్రకటించింది

రక్తం
రుచి మరిగి
హక్కుల గొంతుకల్లో
కత్తులు దించే
దళారీ భూస్వామ్య ప్రజాస్వామ్యం

గాలిలో
పక్షులు ఎగరడం నేరం!

నీటిలో
చేపలు ఈదడం నేరం!

సెలయేరు
ప్రవహించడం నేరం!

కోకిల
పాడడం నేరం!

నెమలి
ఆడడం నేరం!

విత్తనం మొలకెత్తడం నేరం!

మొగ్గలు
వికసించడం నేరం!

అడవి
చిగుర్లు వేయడం నేరం!

పసిపిల్లల నవ్వులు నిషేధం!

ప్రశ్నించే నీకై
హక్కులడిగే నీకై
యుద్ధం నేరమనే నీకై
పసిమొగ్గలకు ప్రాణం పోసే నీకై

విలువల కోసం తపించిన నీకై
మనుషుల కోసం తపించిన నీకై

ప్రశ్నించడమే
నేరమై ఉరితాడై
వేలాడే
ప్రజాస్వామ్య దేశం
తనే గొయ్యే తవ్వుకున్నది
నీకు గొయ్యి తియ్యాలనీ

## నెత్తుటి కాసారంలో నల్ల కలువ

- నెల్లిమర్ల శ్రీనివాస్

యాభై చుక్కల ఆశల పతాకం నీవు
చీకటి గుహలో సంచరించే చంద్రవంక వాడు
నెత్తుటి కాసారంలో బతికే నల్లకలువ నీవు
మతపుటిసకలో విరిసే ఎర్రమందారం వాడు
ఆధిపత్యపు ఆకలితో
అవకాశం కోసం చూసే
తోడేలు తెలివి నీది
రంగు వెలిసిన ఎర్రపులిని సైతం
కొండను డీకొట్టే పొట్టేల్లా
ఎదురించి తరిమే తెగువ వాడిది
ఎత్తు పారకపోతే
నిరాయుధుడిని చేసి చంపే
'నాగరిక' యుద్ధ నీతి నీది
నీ వేళ్లతో నీ కళ్లు పొడిచే
సాంప్రదాయిక సాహసం వాడిది
రాజకీయ ప్రాబల్యానికై
మూలాలను సైతం
'జెరోనియో'లను చేసే 'జింగోయిజం' నీది
జాతి మనుగడకై
తల్లి వేరు తెగినా
ఊడలై విస్తరించే తత్త్వం వాడిది
తొందరపడి తాను తప్పుచేసినా
విచారించి విధానం మార్చాల్సిన
'నోబుల్ శాంతి'వి నువ్వే
వాడి సమాధి సైతం ప్రమాదమని
నేడు వాడ్ని గంగ పాల్జేసినా
వేయి గొడ్లను తిన్న రాబందులా
రేపటి 'హరికేన్' తాకిడికి
నీవు సిద్ధం కావల్సిందే!

## శిలాక్షరాలు

- ముకుందాపురం పెద్దన

శ్రమంతా...
వృథా అయ్యిందని
ఎందుకనుకుంటున్నావు
క్రియాత్మక ఆలోచన
ఉభయ పార్శ్వాల్లోనూ
నేర్చుకుంటూనే ఉంటుంది
లోలోపలి పొరల్లో
ఘనీభవించిన నదుల్ని పిండుతుంది
కరడుకట్టిన తలల్ని తొలుస్తుంది
నూతన నిర్మాణ కౌశలాన్ని
ప్రోది చేసుకుంటుంది
సృజన
ఏ రూపంలోనైనా
ఏ మార్గంలోనైనా
జనిస్తుంది
ఆపడం ఎవరి తరం కాదు
ఏ జవాబుకి లొంగని ప్రశ్నలా
ఏ ప్రశ్నకు జంకని జవాబులా
నీకు నీవె జవాబుదారివి
చేతనైతే...
అమరశిల్పికి కుడిచెయ్యిగా విజృంభించు
లేదా... ఒక సాధారణ ప్రేక్షకుడిలా ఉండిపో
ఇంకా శంకిస్తున్నావా... ఐతే,
వర్తమానం నుండి నీవు...
వైదొలుగుతున్నట్లే - కాదు ధ్వంసిస్తున్నట్లే
అప్పుడు నీవొక విధ్వంసక చర్యవి
విద్రోహ శక్తివి - ఓ కుట్రదారుడివి

## ప్రకటన

- పెద్ది కృష్ణ

ప్రపంచ బ్యాంకు పాలనలో
అమెరికా సైన్యాల ఆధిపత్యంలో
ప్రపంచ ప్రజల జీవన విధానాన్ని
మార్కెట్‌కై
మానవ విధ్వంసాన్ని సృష్టిస్తున్న తరుణాన

నా నేలపై నన్ను పరాయి

వాడ్ని చేస్తున్నపుడు
వాడేమిటో నాకు తెలిసినపుడు
నేనేమిటో ప్రకటించుకోవాలి కదా!

నా అస్తిత్వాన్ని, ఉనికిని ఆత్మగౌరవాన్ని
నన్ను నేను వీక్షింపచేసుకోవాలని
నా నిగ్రహాన్నీ ఆగ్రహాన్నీ ప్రకటిస్తూన్నా
నేను చేసిన శిల్పాలను
చిదిమి ఇసురుతున్నా!

# సంఘర్షణే సారాంశం

- ఎం. రాఘవాచారి

నువ్వెప్పుడైనా
మబ్బువైనావా
స్నేహమై వర్షించటడానికి

నువ్వెప్పుడైనా
విత్తనమైనావా
జ్ఞానమై మొలకెత్తడానికి

అలలెత్తే
కడలివైనావా
జీవనసారం విప్పడానికి

నీలాల ఆకాశానివో
చీకట్లు చీల్చుకుని
చండ ప్రచండంగా
కిరణాలు ప్రసరించే
సూర్యునివో అయినావా?

అయినా...
ఏమైనా
మనం మనుషులం కావాలి
ఎప్పటికప్పుడు చిగురించే
ప్రేమలు మిగుల్చుకోవాలి
స్నేహాలు మిగుల్చుకోవాలి
సంఘర్షణా మిగుల్చుకోవాలి
కష్టానికి సుఖానికి కాసిన్ని
కన్నీళ్ళు మిగుల్చుకోవాలి

అంతరంగంలోకి
చొచ్చుకుపోయి తెలుసుకోవాలి
విశ్వవికాస సారాంశం సంఘర్షణ
జ్ఞాన విజ్ఞానాల రహస్యం సంఘర్షణ
జన జీవన పరిణామ సారాంశం సంఘర్షణ

# ఆమెతో ఉన్నప్పుడు

- దానక్క ఉదయ భాను

ఆమెను నేను ఒంటరిగా చూశాను
నడిరాత్రి వెచ్చని నిశ్శబ్దంలో...
అందరూ నిద్రిస్తున్న సమయంలో...
చీరకొంగులో తలదూర్చి
చెక్కిళ్లపై మహానదులు ప్రవహిస్తున్నప్పుడు
(కనుపాపలు అలుగువారుతున్నప్పుడు)
ఆమెను నేను చూశాను

ఆమెను నేను విన్నాను
ఆకాశం విచ్చిన్న శకలాలవుతున్నప్పుడు
సముద్ర భాషలో మాట్లాడుతున్న
ఆమె మాటల్ని నేను విన్నాను

ఆమెను నేను గమనిస్తూనే ఉన్నాను
మసిగుడ్డై, చీపురు కట్టై,
అంటుగిన్నెపై నారపీచై
కరిగిపోతున్నప్పుడు కోల్పోయిన ఆనందాల్లో
విషాద వృత్తం చుట్టూ పరిభ్రమిస్తున్నప్పుడల్లా
నేను ఆమెను చదువుతూనే ఉన్నాను

నేను ఆమెతో ఉన్నాను
ఆకాశంలో సగానికి జన్మనిచ్చినప్పుడు
భూమాత గుండెకు అయిన గాయాల్ని
భారంగా మోస్తూ
నెత్తుటి గుడ్డతో అవ్యక్త భావాల్ని పంచుకుంటున్నప్పుడు
నేను ఆమెతోనే ఉన్నాను

నేనిప్పుడు ఆమెలోకి ప్రవేశించాలనుకుంటున్నాను
తరతరాల చీకటిగుహల్లో
బందీగా ఉంచబడిన ఆమెను
రూపాయిబిళ్ల పాదం కింద
తల చిట్లిపోయిన ఆమెను
సినిమాతెర దారాలకు
నగ్నంగా ఉరితీయబడిన ఆమెను
అలల వెంట చల్లగాలిని చేసి
విహరింపజేయాలని...

కోకిల గొంతులో రాగాన్ని చేసి
వసంతరాత్రిలో వెన్నెల చేయాలని
ఖండాతర ఖడ్గాల్ని
ఖండాలు ఖండాలుగా చీల్చిపారేయాలని...

మెత్తని రేకుల కింది ముళ్లను
కత్తులుగా ఝళిపించడం
నీవు నేర్చుకోవాలమ్మా
అమ్మా గులాబీ జరభద్రం!

# అమ్మా గులాబీ జరభద్రం!

- చిత్తలూరి సత్యనారాయణ

అమ్మా గులాబీ జరభద్రం!
అసలే రోడ్డుమీదకెళుతున్నావు
కాలేజీకెళుతున్నావు
చర్చికి వెళుతున్నావు
గుడికెళుతున్నావు
రోడ్డుమీద రోమియోలుండొచ్చు
కాలేజీలో ఆకతాయిలుండొచ్చు
చర్చిలో కామ చకోరాలుండొచ్చు
గుడిలో గుంట నక్కలుండొచ్చు
నీ లేత మాంసాన్ని నంజుకుతినాలని
ఆవురావురుమంటూ ఉండొచ్చు
అమ్మా గులాబీ జరభద్రం!

పువ్వుగా మారడమే నీకు తెలుసు
పరిమళాలు వెదజల్లడమే తెలుసు
సీతాకోకచిలుకవై రంగులుపోవడమే తెలుసు
ప్రకృతి సౌందర్యంగా ఆహ్లాదించడమే తెలుసు
అమ్మా గులాబీ జరభద్రం!

స్నేహమేనంటారు
ప్రేమించానంటారు
ప్రేమిస్తున్నానంటారు
కామం కాస్తేనంటారు
మనసే కావాలంటారు
అమ్మా గులాబీ జరభద్రం!

మాటల్ని ఈటెలుగా మలవడం
ఆకాశంలో సగానివైనా
ఆకాశంకేసి తలెత్తి చూడడం
కాలి చెప్పును చేతిలో
ఆయుధంగా చేయడం
ఆటబొమ్మగా కాక
నువ్వే ఆయుధంగా మారడం

# అస్తిత్వం....!?

- శిఖా - ఆకాష్

మాటల మధ్య
పువ్వులు పుష్పించాల్సిన చోట
ముళ్ల చెట్లు కాళ్లు విసురుతున్నాయి

చేతుల మధ్య
హృదయాలు వికసించాల్సిన చోట
కత్తులు కళ్లు విప్పుతున్నాయి
మనుషుల మధ్య
శాంతి వనాలు మొలకెత్తాల్సిన చోట
కొండ గుహలు నోళ్లు తెరుస్తున్నాయి

వీధికో బడి
ఇంటికో గుడి
ఊరో వృద్ధాశ్రమం
"దేశమంటే మట్టికాదోయ్
మనుషులోయ్...."
కాకుంటే
ఒక గ్లోబల్ ఖడ్గం
ఒకానొక డాలర్ శిల్పం

ఎప్పటినుండో
నిరంతరంగా బాస తప్పకుండా
ఈ కాలం
మనిషికి
ఆకుపచ్చ ప్రేమలేఖ
రాస్తూనే ఉంది
రంగు రంగుల కలల్ని
బహుకరిస్తూనే ఉంది

మనిషిని ప్రేమించే
ప్రకృతి మీద
దండయాత్రగా
విధ్వంస రచన
దేశమంటే మట్టికాదోయ్

మనుషులోయ్
కాకుంటే...
ఒక గ్లోబల్ దీపం
శతకోటి దీపం పురుగులు

# మీ సిగ్గులేని తనాన్నీ...

- సి.ఎచ్. శిరోమణి బాబు

తరాలు గడిచాయి
ఉద్యమాలు జరిగాయి
మారణకాండలు మండాయి
సజీవ సాక్ష్యాలు మిగిలాయి

అవమానాల్ని ఎదిరించినా
బానిస బతుకు వదిలించుకున్నా
అంటరాని కంపును కడిగేసుకున్నా
మా నల్లని రూపాన్ని మార్చేసుకున్నా
ఇంకా... ఇంకా... అవమానిస్తున్నారు
పొడిచి పొడిచి గుర్తు చేస్తున్నారు
వెకిలి... వెకిలిగా గేలచేస్తున్నారు
మా 'కోటా'లపై గుంజుకు చస్తున్నారు

మేం ఆస్తుల్ని కూడేసుకోలేదు
భూముల్ని పోగేసుకోలేదు
మీలా 'నగల్ని' దిగేసుకోలేదు
లాకర్లో ధనాన్ని దాచేసుకోలేదు
మీలా 'విద్యను' కొనుక్కోపోవచ్చు
మీ అంత 'సృజనాత్మకం' కాకపోవచ్చు
మీ అంత 'భాషా ప్రావీణ్యం' లేకపోవచ్చు
మీ లాలిత్యం, మీ అంత పాండిత్యం రాకపోవచ్చు
కాయా కష్టం చేసే చేతులు
కావ్యాలు 'మధురంగా' రాయలేకపోవచ్చు
స్త్రీల 'సౌందర్యాలను' ప్రకృతి వర్ణాలతో
పద్యంలో ఇరికించి మెప్పించకపోవచ్చు

మీ దొరతనం, మీ రాజఠీవి
మీ సుకుమారం, మీ నాజూకుతనం
సెమట కంపుతో నిండిన
మా మట్టి మనుష్యులకు లేకపోవచ్చు

మీతో ఎదిగాక కూడ
చదువులో పోటీ పడ్డాక కూడ
చదువులు నేర్పేకాడ మేం పనికిరామంటే
జ్ఞానాన్ని పంచేకాడ మేం అజ్ఞానులమంటే
పంతుళ్ళ కొలువులకి "రిజర్వేషన్స్" వద్దంటుంటే
మీ అర్థంలేని తర్కాన్ని
నడిబజారులో తగలెయ్యాలనీ ఉంది

మా భాషను, మా వేషాలను
మా వాడలను, మా గుడిసెలను
చివరకు మేము తినే తిండిని కూడ
అవహేళన చేసి మాట్లాడుతుంటే
మేము వండిపెట్టే భోజనాన్ని పాఠశాలల్లో
మీ పిల్లలు తినకూడదని బహిష్కరిస్తుంటే
మీ సిగ్గులేనితనాన్ని తన్నాలనిపిస్తుంది
మిమ్మల్ని మీ అహంకారాన్ని చూసి
మీ ముఖం మీద ఉమ్మాలనిపిస్తుంది

# గొల్లభామ

- పిన్నిక శ్రీనివాస్

దేవరింటిలో
గొల్లల కొల్పుల
కోలాహలం
బైనీడు కతల
కొమ్ము కూతల
బొల్లావుల వీరంగం

రౌద్రంతో చిందేసిన
వీరతాడు వీరత్వం
పుల్లరిని ఎగ్గొట్టి
మనుమ సిద్ధికే
ముచ్చెమటలు
పట్టించిన
కాటమ పౌరుషం

ప్రకృతి శక్తులకు
పురుడు పోసిన
పాతాళ గంగమ్మ
తల్లి కోసం
ఉట్టికొట్టిన పోతురాజు
గడ్డి పువ్వుల అమృతాన్ని
సమానత్వం కోసం
గొల్లభామల గుంపు
గొర్రెదాటు

# కరెంటు చీకటి

- ఏటూరి నాగేంద్రరావు

శాంతి గీతాన్ని
బుల్లెట్ల అపస్వరాలు భగ్నం చేస్తున్నప్పుడు
బతికే హక్కును
ధనదాహ కంఠీరవాలు దుస్స్వప్నంగా మారుస్తున్నపుడు
అడవుల్లో సైతం మనిషి
జంతువులాగ వేటాడబడుతున్నాడు
జీవితాలని కబళించే బ్లాక్ హోల్స్
ప్రాణాలని గరికపోచల్లా పరిగణిస్తున్నది
మమతల వెన్నెలని మేఘమై ఆర్పేస్తున్నది
మనుషులే లేని ఇళ్లలో దీపాలు వెలగవు
తలదీపం పెట్టను కరెంటు బల్బులు పనికి రావు
రక్తంతో తడిసిన ప్రగతి పునాదులపైన
వాసనలేని ఉమ్మెత్త పూలు విరుస్తాయి
చిరునవ్వులపాటను నిలువెత్తు మింగుతూ
జనావాసాన్ని ప్రవాసాలు చేసే ప్రవాహం
నీడల్ని మింగేసే పగటి దీపం సూర్యకాంతి కాలేదు
గూడును కూల్చేసే రాత్రి దీపం ప్రగతి దాంతి కాలేదు
పచ్చని జీవితాలకి వేసిన నిచ్చెనలు కూలిపోతే
అడవిగుండె అల్లకల్లోలమై పోతుంది
బతుకుపాట నిశ్శబ్దనీరవమైపోతుంది
మరిగే రక్తం పిడికిలై పోరాటం
అనివార్య ఉనికి యుద్ధమై పోతుంది
అది కాకరపల్లైనా సోంపేట క్షేత్రమైనా
ఆరంభానికి ఆదిగా నిలుస్తుంది
ఉచ్ఛ్వాస నిశ్వాసల నిరసనల మధ్య
ధిక్కార స్వరం సమరకాహళిగా మోగుతూ
ఒక జీవన్మరణ రణం ఆవరణమై పోతుంది
చితిమంటల ఉష్ణం నుండి ఉత్పత్తి చేసిన కరెంటు
అనంతంలో కలిసిపోయిన ప్రాణాలపాలిటి చీకటై పోతుంది!

# ఉద్యమ కోడి

- ఎం. తిరుపతయ్య

నేడు
ఉద్యమ కోడి పొదిగింది
పల్లె పల్లెకు
కోడిపిల్లలు పయనిస్తున్నాయ్
పిల్లల్ని ఎత్తుకు పోయే గద్దలకు
ఎదురు తిరుగుతున్నాయ్
ఏటి కెరటాలతో పోటీపడి
ఉద్యమం ఉవ్వెత్తున ఎగిసింది

ఒక్కో యూనివర్సిటీ
ఒక్కో నిప్పుకణికై
తెలంగాణ అలా యిలా మండుతూ
దూల ఆడుతున్నాయ్

పడిపోయిన శిలలకే అంత బాధ
మరి
మా జీవిత శిలలకు
రూపు నివ్వడానికి అమరులైన
తల్లుల గర్భశోకం గురించి మాట్లాడరేం?

నీ గాజు బలగాలిసిరే
గుండ్లకి
నా చేతిలోని రాయి సమాధానం చెప్తుంది చూస్కో

నీ మాయల ఫకీరు ప్రభుత్వాన్ని
కూల్చడానికి
మా తోట రాముండ్లు సిద్ధంగా ఉన్నారు

తెలంగాణ ఆకాశంలో
ఉద్యమ మేఘాల్లోంచి
అమర వీరుల చినుకులు పడి
వారి
కలల మొలకలు చిగురెత్తి
రేపు
చెట్లయి నీడనిస్తాయి

# తెలంగాణ చంద్రుడు ఉదయించక మానడు

- నాగేశ్వర్

పొద్దు పొడవాల్సిన నేల మీద
పట్టపగలే పొద్దుగూకుతోంది
గొరుకొయ్యలు మొలవాల్సిన జాగల
గోరీల వాసన గొడుతాంది

69 మొదలు 2009 మీదుగా వర్తమానం
వందల సంఖ్యలో
బిడ్డల్ని పోగొట్టుకున్న

తల్లుల గర్భశోక సముద్రమై కుములుతోంది

బతుకును
తమ వాకిట్లో ముగ్గులేసుకున్న వాళ్ళు
భవిష్యత్‌ను
తమ అరుగు మీద అల్లుకున్న వాళ్ళు

సెల్ టవర్ల మీద
శవాలై వేలాడుతున్నారు
ఎవరి మీద వాళ్ళే
భోగి మంటలేసుకుంటున్నారు

శ్రీకాంత్
వొంటిమీద చితిమంట పేర్చుకుంటూ వెళ్ళాడు

ఆపొద్దు
యాదయ్య సూర్యోగోళమే అయ్యిండు

నవయవ్వన నక్షత్రాలు రాలుతూనే ఉన్నాయి.

- - -

తమ్మీ జరంత ఇసారించు
గెట్లదేముంది
నువ్వో నేనో
పారా పలుగందుకుని
గిరిగీసుకుంటే సరిపోద్ది
ఎవ్వల జాగల వాళ్ళే ఉంటే వొడిసిపోద్ది

మనది గెట్ల తగాదే కాదు
భూమి తగాద
బువ్వ తగాద
తెలంగాణ చెట్టుమీది
పండ్లెత్తుకెళ్ళేటోన్ని ఊరవతల బొందబెట్టె తగాద

తెలంగాణ పేరుజెప్పుకుని
కాయలమ్ముకునేటోన్ని ఇక్కడే పాతరబెట్టె తగాద
ఒక్కరోజుతో వొడిసేది కాదు
ఒక్క దెబ్బకు రెండు పిట్టల సామెతాకాదు

ఓట్ల పొట్టలు పట్టుకొని
వాలే పిట్టలు వాలుతయ్
నిలిచి నిజం కూసేటివి కూస్తాయ్
ఎగిరి పోయేటివి పోతాయ్

ఖద్దరు చొక్కాలు కుచ్చుటోపీలు
సీజనల్ వ్యాధులు
తమ్ముడూ
చానాదూరం నడువాలె
నడి మధ్యనే ఆగమైతే ఎట్లా!

నెత్తిన పేండ్లున్నయని నిప్పులేసుకుంటామా
పాచి పేరుకుందని పండ్లూడగొట్టుకుంటామా

రేపనేది నీది
వర్తమానం మీద బలంగా నిలబడి
భవిష్యత్తుగా ఉదయించు
భావితరంగా వికసించు

తొవ్వితేనే కదా
పాతాళం అందేది
గంగ ఉప్పొంగేది
కొట్లాడు
కొట్లాటలో పొద్దుగూకితే
రేపటి
తెలంగాణను పసిపాప పాలపెదాల్లో వెతుక్కుంటాం

పిడికెడు మంది
పెట్టుబడి జలగలు
జగన్ లగడపాటిల
వారసత్వ బుడగలు తప్ప
అటువైపు అందరూ మనజెండే ఎత్తుకున్నరు
మన జెండా మీంచే స్వజెండా రూపొందించుకుంటాండ్లు

తెలంగాణ 69 నాటి అందని చందమామ కాదు
డిసెంబర్ 2009లో పూచిన నిండుపున్నమి జాబిలి
నిజం తమ్ముడూ నిజం

# శ్రామికులకే నాయకత్వం

- ఎస్. ఎస్. ఆర్

నేనో ఆడపిల్లను ఆడపిల్లగా పుట్టి
ఆడపిల్లగా పెరిగినదాన్ని
అమ్మ చెల్లిని కడుపున మోస్తుంటే
అమ్మ పురిటి నొప్పులతో చెల్లికి జన్మనిస్తే
నిండుగా పారే కాలువలో పురిటి గుడ్డలుతికి

చేతులు కాల్చుకుంటూ అమ్మకు
అన్నం వండిపెట్టిన అయిదారేడుల
పసిదానిని పసిదానినే
బాధ్యతెరిగిన దానిని
అమ్మ కన్నీటి బొట్టును నాన్న తీపి మమతను
సుగుణను, అయినా ఆడపిల్లనే
పల్లెపట్టు పైరగాలి నన్ను సోకకుంటే
ఎల్ ఎల్ బి చదివిన నేను

అమ్మ నాన్నల ముద్దుల కూతురినైనా
అల్లుని ముందు తలొంచుకునే ఆడపిల్ల
తండ్రికి గుండెలపై బరువు గాక
నాన్న గుండెల నిండా పీల్చుకునే
ఆత్మతృప్తిని, అయినా ఆడపిల్లనే
దళిత కాలంలో పుట్టినా ఆడపిల్లనే
పెద్ద కులంలో పుట్టినా ఆడపిల్లనే
విప్లవాల బాటల్లో అడుగులేసి
నా కోసమో, అమ్మానాన్నల కోసమో గాక
అమ్మానాన్నలందరి కోసం వేలాది
తమ్ముళ్ళు చెల్లెళ్ళతో కలసి
సాయుధ కవాతు చేసిన రాధక్కను
అయినా ఆడపిల్లనే
ఉద్యమంలో పురుషులతో
పోటిపడి శ్రమించినా
మహిళలని చిన్నచూపు చూడబడితే
మహిళా కామ్రేడ్స్ అందరి కలయికతో
స్త్రీ వివక్షను నిలదీసి పోరాడినదాన్ని
ఆడపిల్లనా! కాదు ఈడపిల్లనే
లక్షలాది తల్లుల కన్నీటి కాలవాలమైన
మద్యం మహమ్మారిపై రణభేరి మోగించిన
నేను ఆడపిల్లనా
కాదు కాదు వీరవనితనే
లతక్కను అయినా ఆడపిల్లనే
ఎంతటి గుండె గలదయినా ఈ బిడ్డ
ఏ ఖాకీ క్రూర మృగాల కాటుకు
బలవ్వనుందోనని వేలాది
పల్లె తల్లుల గుండె దిగులును
శ్రమించకుండా చెమటోడ్చకుండా
శ్రామిక మహిళను కాకుండా
శ్రామిక మహిళల కన్నీటిని తుడవబోయానా
ఈ భూగడ్డపై జరిగిన ఎన్నో
రణరంగాలలో పారే నెత్తురు టేర్లలో
సాయుధులై పోరే వందలాది యువకిశోరాలకు
వేలాది దళిత ఆదివాసీ వీర యోధులకు
నేతలైన మేము దళిత శ్రామిక మహిళలం కాదా
ఔ! విప్లవ వనితలం వీరవనితలం
లతక్కయినా చందనక్కయినా
మేమింకా కులమతాల చేదు గుర్తులమేనా
దున్నేవానిదే భూమి పోరాడేవానిదే
ఎర్రజండయినట్లయితే
వివిధ వైవిధ్య వైరుధ్యాల మీద పోరాడే మేము
విప్లవ నాయకత్వానికి దిగితే మనమింకా
అస్తిత్వ వాదాల పరిమితుల బందీలమా
పుట్టుకతో దళిత శ్రామికులయితే సరా
శ్రమ విముక్తి పోరాటాలలో మునిగితేలి
వర్గ పోరాటాలలో రాటుదేలిన మహిళా శక్తి మనమైతే
నాయకత్వం శ్రామిక మహిళలది కాదా
కులమేదయితేనేం మతమేదయితేనేం
శ్రామిక వర్గ పనిముట్లయి
శ్రమించుదాం పోరాడుదాం
విరామ మెరుగక శ్రమించుదాం
దళిత శ్రామిక మహిళా సైన్యాన్ని మోహరించుదాం
పోరాటాలలో సాహసాన్నీ త్యాగాన్ని రంగరించుదాం
నాయకత్వం మనదే! రాజ్యాధికారమూ మనదే!

# మనిషిగా....

- గిన్నె రాజు

నా ఆలోచనల పరిమళంతో
జగమంతా వ్యాపించాలనుకున్నాను
వెలుగొందాలనుకున్నాను
నా జాతి వారు యద నిండా
స్వేచ్ఛా వాయువులు పీల్చాలనుకున్నాను
చీకటి బతుకుల్లో చిరుదీపంలా
వెలగాలనుకున్నాను
ఆకలితో అలమటించే
అభాగ్యుల కంచంలో
బుత్తంత బువ్వ నవ్వాలనుకున్నాను
నడి సంద్రంలో నావలాంటి మీ బతుకులకు
చుక్కాని కావాలనుకున్నాను
పాలకోసం గుక్కపట్టి ఏడ్చే
పసిపిల్లలకు జోలపాటనవ్వాలనుకున్నాను
కానీ...
ఏది కాలేకపోతున్నాను
ఇలా...
ఎన్నెన్నో ఆలోచనలు, ఆశయాలు
మసురుకున్న నా ముఖంలో
మీ ముఖం పెట్టి చూడండి

మీకు కనిపించేది కేవలం
నా చిరునవ్వులు మాత్రమే
కానీ....
ఆ చిరునవ్వుల తెరను
తొలగిస్తే తెలుస్తుంది
నా ఆవేదనలతో అలముకున్న
అసలు ముఖం
ఆ ముఖంలో కనిపిస్తారు మీకు
తరతరాలుగా పీడించబడిన
నా జాతి పూర్వీకులు
ఏవరు దీనికి బాధ్యులు
అందుకే....
అడుగుతున్నాను ఓ మనిషి
నాసాటి మనిషి
నీకు నాకు మధ్య పెనవేసుకున్న
సాంఘిక దురాచారాల సంకెళ్ళను
వేసిందెవ్వరు?
నా, నీ స్వేచ్ఛను హరించిందెవ్వరు?
నన్ను నలుగురిలో
దోషిగా నిలబెట్టిందెవ్వరు?
నా హృదయానికి
గాయం చేసిందెవ్వరు?
నా విశ్వాసాలను
కాలరాసిందెవ్వరు?
అహంకార భావజాలానికి
నన్ను బలిపశువుని
చేసిందెవ్వరు?
మానవతా వాదానికి మచ్చ
తెచ్చిందెవ్వరు?
ఇదిగో....!
నా ఈ మానసిక సంఘర్షణల్లోంచి
మళ్లీ ఉద్భవించిన నేను
నా జాతి స్వేచ్ఛా అన్వేషినై
బానిస బతుకుల
సంకెళ్ళను తెగనరకడానికి
నడిరేయి నడకనై
సెలయేరు జోరునై
కెరటాల హోరునై
గమ్యం దిశగా గమనం సాగిస్తూ
ఉంటా....!

# యుద్ధ మేఘం

**- వి. వెంకటేష్**

నెత్తుటి చుక్కను నీరుగా చేసుకుని
బీడువారిన నేల నెర్రల నోటిలోంచి
మువ్వన్నెల ముత్యంలా
బయటకి వచ్చిన
గునుక పువ్వు...

తెల్లబోయిన మోముతో
మూగబోయిన దీన కంఠంతో
రామన్నా... మన తెలంగాణకీ గాయాలేమిటే?
ఎందుకు? మనకీ దుర్భర జీవితం

ఫరవాలేదు... పరేషాను గాకు
భూమికి గాయం చేయకపోతే
పంటెలా పండుతుందే పిచ్చిదాన
అదిగో దూరంగా చూడు
పంట చేతికి వచ్చే వేళయ్యింది

పగిలిన నేల దుఃఖం
రైతన్నల స్వేధ జలం
అమరుల నెత్తుటి చుక్కలు
తెలంగాణ ప్రజల ఆశలు
అన్నీ... ఆవిరై
నేడు యుద్ధ మేఘమయ్యింది...
దిక్కులు పెక్కటిల్లేలా ఉరుములతో
తెలంగాణ దండోర మోగిస్తున్నది
గెలుపు కత్తుల మొనలపై
మెరుపులు చిందిస్తున్నది
చినుకుల కత్తుల్ని కవాతులుగా చేసి
యుద్ధం సాగిస్తున్నది
ధరణి తడిసి ముద్దైతున్నది
ధరిత్రిలో నిశ్శబ్ద పరిమళాలు
గుబాళిస్తున్న ఊా వేళ....
పుడమి తల్లి పురిటి నొప్పులతో
సొమ్మ సిల్లుతున్నదీ వేళ...
తెలంగాణ రాష్ట్రాన్ని ప్రసవించడానికి
సిద్ధంగా ఉందీ వేళ...

# తెలంగాణ రతనమయ్యే దినం

- ఎస్. చంద్రయ్య

నేను నిజంగానే చూసాను
ఇరువైపుల భూభాగాన్ని
తన రంపపు పాదాలతో కోసినట్లు
పట్నాన్ని కలుపుతూ
పల్లెవేసిన వలసబాటను
ఈ బాట ఇప్పటిదా?
దీనికి మా ముత్తాతకున్నంత వయసుంది
మాకు మా తాత నేర్పిన బతుకుదారి
పొయ్యి మీది కుండ ఆకలితో
పొట్టను చీల్చుకుని ముక్కలు ముక్కలై
బూడిదలో పొర్లాడుతున్న దృశ్యం
తాతా నెత్తిపై మట్టి తట్టనెత్తింది
ఎండిపోయి దుమ్ముపేరిన పంటభూములు
తాత పాద ముద్రలను
తమ గుండెలపై ముద్రించుకున్నవి
మళ్ళా తిరిగొస్తానని వాగ్దానం చేయించుకున్నట్లుగా

ఇప్పుడు నేను చూస్తున్నదీ నిజమే
మా అయ్య మమ్మల్నిడిసి
యాడికెళ్తుండో అనుకున్నా
యాడాదికోపారొచ్చేటోడు
పోయేప్పుడు ఇదే కడసారన్నట్టు
బిత్తర సూపులతో నా కండ్లల్లోకే సూసేటోడు
గిట్లే సూసిపోయిన
నా సోపతిగాని తండ్రి రాకపోతే
పిడికిలి యెదపై గుద్దుకుంటూ ఏడ్సిండు
ఇకనుంచి నేను నిజంగానే చూడబోతున్నా
ముత్తాత నేసిన వలస తాటిపై
నడిచిన నా తెలంగాణ
ముక్కోటి గొంతులను ఏకం జేస్తూ నినదిస్తున్న వైనాన్ని
ఇక నుంచి నేను నిజంగానే చూస్తాను
మొండిగోడల మీద తలానిచ్చిన ముసలవ్వ
తన కట్టె కాళ్లకు గజ్జలు కట్టే దృశ్యాన్ని
చూడబోతాను నిజంగా నేను
చెవులకు మోకాలానిచ్చి కూసున్న తాత
శిర్నకోల దుమ్ము దులిపి ఇదిలించడాన్ని
మొరందేలిన వాకిట్లల్ల
తంగెడు పూలై మెరిసిన ఆడోళ్ళు
బతుకమ్మలను నీళ్లలో ఒదిలినట్లు
ఆంధ్రోళ్ళను ఒదలగొట్టడాన్ని
నేను నిజంగానే చూస్తాను
సైకిల్ టైర్ వెంట ఉరికే మా పోరడు
ఇప్పుడు ఆంధ్రోళ్ళను ఉరికియ్యడాన్కి
నా పల్లె కళ్లల్లో
నా తెలంగాణ రతనమయ్యే దినం
నేను నిజంగానే చూడబోతున్నాను
చూడబోతున్నాను నేను నిజంగానే

# ఆవలికి పోదాం

- పాణి

కనిపించేవే ఎంత కాలం చూస్తాం
వినిపించేవే మళ్లీ మళ్లీ ఏం మాట్లాడుకుంటాం
ఇదొక అగడ్త
ఒకరినొకరం ఆసరా తీసుకొని
అవతలకి పోదాం

వినిపించేదంతా రణగొణ ధ్వని
కనిపించేదంతా గజిబిజి

ఓడించడానికి వాడే భాషను
కలిసి గెలవడానికి ఉపయోగించగలమా?
సంవాద చిత్రాన్ని
సహాన్వేషణా మార్గం చేయగలమా?

ఇష్టాఇష్టాల జాబితాను మధించి
పిసరంత సత్య ప్రకటన చేయగలమా?

బాల్య చేష్టల్లోని రాగద్వేషాలు మాత్రమే
ఒకింత మురిపం
పెద్దయ్యాక వాటికొక సామాజికార్థం వినిపిస్తుంది

బంధాలను బాపుకోవడమో...
నిలుపుకోవడమో తెలియని
ప్రతిమూల మలుపు మీద
ఆలోచనల అవనతపు విషాదం

మార్పును ఊహిస్తున్నామో
మోహిస్తున్నామో తెలియని సందిగ్ధంలో
ఎవరి చుట్టూ వారే భ్రమిస్తూ... పరిభ్రమిస్తూ

స్వయం బందీ కావడం గురించీ నీవెప్పుడైనా విన్నావా?

మనుషులందరి కలయికగా నిలిచిన కాలానికీ
నాకు నేనొక్కడినే అనుకునే అకాలానికీ
చారిత్రక భాష్యమెలా చెప్పగలం?

చరిత్ర తన ఇష్టమెచ్చినట్లు తాను నిర్మాణం కాదుగాని
నా ఇష్టమొచ్చినట్లు నేను అందులో భాగమవుతాను
గట్టిగా మాట్లాడితే నేను వేరే... చరిత్ర వేరే
ఎల్లెడలా పలుచటి గీత మీద నిలబడి ఉంటానని
ఎవ్వరికీ తెలియదు

ఆత్మగౌరవం, వ్యక్తిత్వాల ఛాయా భేదాల సుడిలోంచి
నిరంతర ప్రవచనాల కార్ఖానాగా మెసలుతాను
అనుకూల వేళ అధ్యయన సంస్కృతికి, నిర్మాణ సంస్కృతికి
నేనే మానవాకృతి
పేచీ వచ్చిందో... నేను వేరే, నా అధ్యయనం వేరే

భాష, ప్రతీకలు, అర్థాలు కొడిగట్టినప్పుడు
జ్ఞాపకాలు పొడారిపోతాయి
సంకేతాలు లేకపోతే మనిషి ఉన్నట్టా?
ఆది నుంచి ఒక్కో సంకేతాన్నీ, అర్థాన్నీ పొదివి పట్టుకొన్న
మనిషి
నిరర్థకంగా మిగిలితే ఎలా?

ఖండన మండనల దుస్స్వప్నమయం కాదిది

తెలిసిన విషయాలను తెలియనట్టుగా
సొంతమైన వాటిని పరాయిగా
ఎవరికి వారొక పరమ భావనగా
చెలామణీ అవుతున్న తరుణమిది
చరిత్రకు నేను తొలి తుది వాక్యమనే నిర్భయ రాజ్యమిది

ఎవరు ఎవరిపై కత్తులు దూస్తున్నారో కనిపించదుకాని
శవాల గుట్టలు... గుట్టలు
హత్యలో, ఆత్మహత్యలో తేలని రక్తపాతం
అసంతృప్తులు, ఆగ్రహావేశాల ముడి దినుసుతో

ఎన్నిటికని అలవాటు కొద్ది స్పందిస్తాం?

నడిచి వచ్చిన దారి ఏ మలుపు తిరిగిందో
తెలుసుకోకుండా ఎంత కాలం ప్రయాణిస్తాం?

మళ్లీ మొదటికే వస్తాను

కనిపించే వాటినే ఎంతని చిత్రిక పడతాం
వినిపించే వాటికే ఎన్ని స్వరాలను కూర్చుతాం

# పాగల్ షాయర్ - పగ్లాపన్

- మహమూద్

నేనో పాగల్ షాయర్‌ని
దర్ద్ భరా దిల్ నాది...
ప్రపంచమంత హృదయంలో
కదిలిస్తే జలపాతమయ్యే కవిత్వం దాగుంది....

- - -

చినుకంత వర్షంపై
చిగురిస్తుంది నా కవిత్వం
భూగోళమంత బరువుని మోస్తుంది
నా మనసు కాగితం...
నా కవిత్వాన్ని నెగడు చేసి
చలికాచుకుంటుంది ప్రపంచం

- - -

రాయకూడదనుకొని
రాయడానికి పూనుకుంటాను
మోయకూడదనుకొని... అన్నీ మోస్తాను
మదిర
ఒక్కోసారి కంటితో
ఒక్కోసారి మనసుతో తాగుతాను
నోటితో కవిత్వం మాత్రమే చెబుతాను...

- - -

తాగుబోతునని
ఆడిపోసుకుంటుంది గానీ ఈ ప్రపంచం
తాగకూడనిదాన్ని
ఎందుకు తయారుచేస్తుందీ...?
మైకంపై మక్కువ ఉంటేనే కదా
మైకాన్ని పుట్టిస్తుందీ?

- - -

మనసుకు గాయాలందరూ చేస్తారు
మందుగా
మధువునే చూపుతారు
బహుశా
లాభాలు చూసుకొని మురిసిపోయే కాలంలో
కవిని కావడమే నా నేరం

- - -

మరల మరల
మకరందాన్ని జుర్రుకోవడమే కదా
తేనెటీగ నైజం

- - -

తేనెటీగల్లాంటి మనుషుల మధ్య
కపటత్వం కమ్ముకున్న మనుసుల మధ్య
కవిగా నిలబడ్డాను...
నిలువెత్తు గాయాల పుస్తకం నేను...

- - -

కడివెడు కన్నీళ్ళు
నిట్టూర్పులు వేలు వేలు...
కొంత నైరాశ్యం
కొన్ని ఆశల మజిలీలు...
ఈ పాగల్ షాయర్
మస్తిష్కంలో ఊహల రెపరెపలు

# నాలుగు పిట్టలు

- మహమూద్

### హింస

సూర్యుడి కంటినెవరో పొడిచినట్టు
ఎర్రబడిపోయింది సాయంకాలం
అబూజ్‌మడ్ ఆదివాసీల
రక్తాన్ని జుర్రుకొంది రాజ్యం

### ప్రేమ - కవిత్వం

ప్రేమ అనే ఆజ్యం
పడుతున్నంత సేపూ
కవిత్వం అనే నెగడు
మండుతూనే ఉంటుంది

### శిల - శిల్పి

శిల్పి ఊహ
గొప్పదైతే సరిపోతుందా?
ఉలితోడు లేనిది
శిల శిల్పమౌతుందా?

### కృతజ్ఞత

కంచెంలో బువ్వ
కమ్మగా ఉన్నదా...?
అమ్మకూ... అన్నదాతకూ
కృతజ్ఞత చెప్పు

### జైలు

దేవుడికి
విడుదల లేదు
గర్భగుడి
గట్టి జైలు

### మూఢత్వం

స్పర్శకు అందడు
రుచికి దొరకడు
కదిలిస్తే కదలడు
భక్తుల మూఢనమ్మకంలో సజీవుడు దేవుడు

### ప్రవక్త

మానవుల్లో మహనీయుడు కదా
జీవిపై జబర్దస్తీని అంగీకరించడు ప్రవక్త!
పరదాని పట్టింపు చేయకు
సత్యంపై బురఖా కప్పకు

### తడి

నిజమే!
నీరెండిన నది
ఎడారిని తలపిస్తుంది
తరచి చూస్తే తడి సముద్రం తగులుతుంది

### దేవుడు

భగవానుడు
భూమిపైనే పుట్టాడు
అందుకే మహమూద్
అతనెప్పుడు షావుకార్ల పంచనే ఉంటాడు

### శక్తి

చెవిటివాడు కంటితో వింటాడు
గుడ్డివాడు చెవితో చూస్తాడు
శక్తి అవయావానిది కాదు మహమూద్
అంతరాత్మది

### రూపం - సారం

లోకాన్ని మారుస్తున్న
కాలం వెంట పరుగిడుతున్న మిత్రుడా...!
రూపాన్ని సంస్కరించే
సారం కంటి వెలుతురువి నువ్వు

### మావో

మనోడని కౌగిలించుకుంటే
గుండెలో గునపం దించాడు

పరాయివాడైనా మావో గొప్పోడు కదూ
చేతిలో ఆయుధం పెట్టాడు

## ఆలాపన

-ఎన్.డి.

గొంగళి పురుగుల్లా మనసంతా పాకుతున్న దిగుళ్ళు
సీతాకోకచిలుకలై ఎగిరిపోయేలా
చల్లని లావాలా నయనాల్ని తడిపే అశ్రువుల్లో
జాబిల్లులు తళుక్కుమనేలా
ఆకాశమంతా చెల్లాచెదురవుతున్న ఆలోచనల పక్షులు
అల్లన మెదడు చెట్టు మీద వాలేలా
నన్ను ఆవహించవూ...

ముకుళిత మొగ్గై మునగదీసుకున్న హృదయం
పొద్దుతిరుగుడు పువ్వై సూర్యునికై చేతులు చాచేలా
సునామీ అయ్యి మీదిమీదికొచ్చే దుఃఖ ప్రళయం
తేటనీటివాగై పాదాల్ని ముద్దాడేలా
నాన్న దెబ్బకు చిన్నబోయిన పసితనం
అమ్మ ముద్దు అయ్యి కాళ్లను చుట్టేసుకునేలా
నన్ను కౌగిలించుకోవూ...

ఆదిమ మానవి అరుపువై
నల్లజాతి ధిక్కార స్వరానివై
సంథాలీ యుద్ధదరువుల సిరింగ్‌వై
కుయీ గుండె గొంతుకవై
రేలా రిలోల మంద్రనాదానివై
అరబ్ సంగీతపు రాగాలాపనవై
విశ్వమానవ ఇంటర్నేషనల్‌వై
నన్నావరించుకోవూ....

పాటా...పాటా...పాటా...
ఇక నువ్వే నేనై నేనే నువ్వై
మనం ఒకరినొకరం అభావం చెందించుకునేలా
నీ గర్భాశయంలోకి నన్ను పొదువుకుని
నాలో అద్వైతం చెందవూ......

(బాబ్ డైలన్‌కూ, ఇంకా....)

## చెట్లు నాటుతున్న మనుషులు

- ఎన్.డి.

ప్రాంతాల ఎడబాటుతో
తెగిపోయిన మాటల తంబూరాకు తీగెలు కలిపి
ఆనందమో, ఉద్వేగమో,
అంతు తెలియని దుఃఖపు స్వరమో
ఉండలా అడ్డంపడ్డ గొంతుకను శృతి చేసుకుంటూ
ఎనిమిదో, ఐదో ఇంకెంతో గానీ
ఏండ్ల క్రితం పాడుకున్న పాటల్ని
వణుకుతున్న పెదాలతో
మళ్లీ కూడబలుక్కోవాలన్నట్లుగా
వాగు పక్కన చెట్టు కింద
బండల మీద కూచున్నాం ఇద్దరం

ఇద్దరం అంటే ఇద్దరమే కాదు
కొన్ని పదులో, ఇంకొన్ని డజన్లో మంది
మాలో నుండి, మా ద్వారా, మా నుండి
తమను తాము చూసుకోవడం
అలాగని పాటంటే పాటా కాదు
కడుపులో నుండి కనలి, కనలి
తన్నుకొచ్చే ఆర్తనాదాల్ని
పెదాల మీంచి పలవరింపులుగా జార్చడం

అనాదిగా అన్నట్లుగా
అనంతంగా సాగుతున్న ఆ సంభాషణ
సెకన్లూ, నిమిషాలూ, గంటలూ, రోజులూ...
నిజానికి సంభాషణంటే సంభాషణా కాదు
దాన్నిండా చూపుల, స్పర్శల
ఇంకేమీ లేకున్నా ఉత్త సాన్నిధ్యపు, సాన్నిహిత్యపు
మౌనపు ముక్కల్ని మాటల దండగా గుచ్చుకోవడం

ఇక లాభం లేదన్నట్లు
ఏమిటీ తపన, ఇంకెన్నాళ్లన్నట్లు
దండకారణ్య ఆదివాసీ గెరిల్లా
ఆశ్చర్యాన్నో, దయనో గానీ కురిపిస్తూ
మా ఎదురుగా వచ్చి
నేలకి కాళ్లని గట్టిగా తాటించి
ప్రశ్నార్థకంలా నిలబడింది

మేం ఇద్దరం మొహాలు చూసుకుని
చెరో చేయీ చాచి ఆమెను మా ఇద్దరి మధ్యా కూచోబెట్టుకుని
మేం పరిశీలిస్తున్న పటాన్ని ఆమె ముందు పరిచాం
వాస్తవంగా పటం అంటే పటమూ కాదు
అనన్యమైన మనుషులూ, అసాధారణ ప్రతిభలూ
వెలకట్టలేని బలిదానాలూ, నిస్వార్థపు హిమాలయాలూ
అబ్బురపరిచే విజయాలూ,
అందగలమా అనిపించే ఎత్తులూ

ఓటములూ, సెట్‌బ్యాకులూ
నివారించగలిగిన త్యాగాలూ, అమల్లోకి రాని గుణపాఠాలూ...

చెట్ల ఆకులతో, పూలరేకులతో
మేం పెట్టుకొస్తున్న ఆ ఎర్రని, నల్లని గుర్తులన్నిటినీ
అచ్చంగా మా చెంపల్ని నిమిరినంత మార్దవంగా
ఒక్కొక్కటిగా తన కరుకు చేతుల్తో తడిమింది ఆమె
ఆ సాంత్వనపు స్పర్శకు మా దేహాలు
ఒక్కసారిగా పులకరించాయి
అసలు విషయం మా దేహాలంటే దేహాలూ కాదు
తెలంగాణ, నల్లమల, రాయలసీమ
హైదరాబాద్, విశాఖ, వరంగల్
ఇంకెన్నో, ఏవో పట్టణాలూ, గ్రామాలూ, గూడేలూ...

చిక్కుముడి విడిపోయినట్లుగా
భ్రుకుటిని విశాలం చేస్తూ
మీరిద్దరూ కలవడం అంటే
ఓ ఉజ్వలమైన గతాన్ని తలబోసుకోవడమూ
కారుచీకట్లో ఆశల నక్షత్రాల్ని లెక్కించుకోవడమే కదూ అంది
అంగీకారంగా తలూపుతూ
ఇప్పుడు మేం అంటే
ఆ అమరుల దృఢత్వంతో బిగిసిన పిడికిళ్లమూ
మరో విప్లవ వెల్లువను దాచుకున్న సముద్రాలమూ
నలుమూలలా పెనువృక్షాలుగా ఎదిగే విత్తనాల్ని
జల్లుతున్న రైతులమే కదా
అన్నాం మేం

"అందుకే వాడికంత ఉలుకు"
పకాలున నవ్వుతూ
ఆమె అమాంతంగా
మమ్మల్ని తనతో పాటు లేపింది
ముగ్గురం చెట్టాపట్టాలేసుకుని నడవసాగాం
జమ్మి చెట్టు లాంటి ఓ చెట్టు దగ్గర ఆగి
చరచరా పైకి పాకి మూటల్ని దింపుకున్నాం
అచ్చంగా చెట్టంటే చెట్టూ కాదు
దండకారణ్యం, బీహార్-ఝార్ఖండ్
లాల్‌గఢ్, కంధమాల్
పశ్చిమ కనుమలు, హిమాలయ సానువులు
ఢిల్లీ, ముంబయ్, కోల్‌కతా, చెన్నై...

మూటలోంచి ఓ బ్లాక్‌బోర్డుని తీసి చెట్టుకు తగిలించి
దోసెడు బలపాల్ని మా ముందు కుప్పబోసింది
మేం ఆప్యాయంగా వాటిని మా చేతుల్లోకి తీసుకుని
తుపాకి మొనల్లాంటి వాటి ముక్కులతో
ఇప్పుడిక దేశవ్యాప్తంగా లావాలా మాత్రమే పాకుతున్న
ఉద్యమానికి
తిరిగి భౌగోళిక సరిహద్దుల్ని గీయడం మొదలు పెట్టాం.
(దండకారణ్యంలో ఎప్పటెప్పటి నుండో కలవని ఎపి, ఎన్.టి. కామ్రేడ్స్ కలిసిన తర్వాత....)

# గంజాయి వనంలో తులసి మొక్క

**- కౌకొండ**

"ఓ శాంతి స్థాపనా సంగీతం మూగబోయిందా రోజు
గంజాయి వనంలో తులసి మొక్కనేల వాలిందా రోజు
హక్కుల ఉద్యమానికి తీరనిలోటు
ఓ రాజ్యమా నీ నీడ వాకిట్లో నువు నడువు
అమాయకపు జీవులతో ఆటలాడకు
ప్రజాస్వామ్యం అంటావు ప్రజలను చంపుతుంటావు
హక్కుల అడగొచ్చు అంటావు
అడిగిన పురుషోత్తం, ఆజాంఅలి, నర్రా ప్రభాకర్
రామనాథం, నారాయణలను నడిరోడ్డులో చంపుతావు
చట్టమా నువ్వు చట్టం కాదు
న్యాయమా ఇక్కడ న్యాయం లేదు
చూడు చూడు ప్రజాస్వామ్య దేశమా
అన్ని ఉన్నా అల్లుడి నోట్ల శని ఉన్నట్లు
సంపద ఎంత ఉన్నా నోచుకోని జనుల చూడు" అంటూ
మానవుల మనుగడ కోసం పోరాడుతూ
"ప్రతిది నియమాలపై విధిగా నడువాలి
మానవ హక్కులుండాలి" అని
నిలబడిన మహామనీషి ఆయన
మానవ విలువలు మట్టికలుస్తుంటే
రాజ్యంపై కలం ఎక్కుపెట్టిన సమర సేనాని
టెర్రరిస్టులని విప్లవకారులను బంధిస్తే
సమాజసేవకులని న్యాయస్థానం కండ్లు తెరిపించి
రాజకీయ ఖైదీలని బెయిల్ ఇప్పించినా ప్రజా లాయర్
అతని కలం మనిషన్నవాడికి ఎంతో ప్రేరణ
సమాజ అభివృద్ధికి అతనో చోదక శక్తి
అతని ఘర్షణ వెనక సృజనాత్మక శక్తి
అతని మౌనం వెనుక ఒక ప్రళయం ఉంది
తన కన్నీరు వెనుక
ఒక కమ్యూనిస్టు ప్రాణం ఉంది
అతని జీవితం మానవ ప్రపంచానికి ఒక సందేశం
శాంతి స్థాపనా సంగీతం!

(పౌరహక్కుల ఉద్యమనేత కన్నబీరన్ అమరత్వపు స్మృతిలో...)

# శ్యామల

నల్లమల అడవిలో
ఓ మునిమాపు వేళ
రెండు జ్వలిస్తున్న కళ్లనుండి
మెరుపుల బాణంలా
నా ముంగిట దిగబడిందో ప్రశ్న
'నల్లనివన్నీ అందం లేనివేనా?'

చివాల్న తలెత్తి చూశాను
ఆ నల్లని ముఖంలో సన్నగా వెలుగుతున్నది
వ్యంగ్యమో, క్రోధమో
తేల్చుకునేలోగానే
'తెల్లనివన్నీ అందమైనవేనో?'

టోపిపై ఎర్రనక్షత్రం ధగధగలాడుతుండగా
శత్రువు పైకి తుపాకిని ఎక్కుపెడుతూ
'అసలు అందం అంటే ఏమిటి? ఎలా ఉంటుంది?'

సర్రు..సర్రు...మంటూ
ఏకలవ్యుడిలా నా చుట్టూ
ప్రశ్నల పంజరాన్ని బిగిస్తో

కుండపోతగా కురుస్తున్న తూటాల మధ్యనే తెప్పరిల్లి
'సమాజంలోని వికారతనంతా మాటుగాసి
దెబ్బకొట్టేవాళ్లదే అందమంటే' అన్నాను

'అందం అంటే గెరిల్లానా?'
ఆశ్చర్యపోతూ చివరి తూటానూ,
చివరి ప్రశ్ననూ సంధించింది

'అవును, అది నీలా ఉంటుంది' అన్నా
యుద్ధంలో ఒరిగిన ఆమె
నొసటిని ముద్దాడుతూ

(కా. మాధవ్, ఇతర కామ్రేడ్స్‌తో పాటు 23.07.2006న అమరురాలైన కా. శ్యామలను ఇంటి వద్ద 'కాంద్రానా' అనీ, 'అందంగా లేదనీ' ఈసడిస్తే తల్లడిల్లేదని తెలిసి...)

# నేటికీ మానని గాయమై

- బల్ల రవీంద్రనాథ్

చట్టానికి కళ్ళు లేవంటారు కొందరు!
చట్టం కళ్ళు ఉండి చూడలేదంటారు మరికొందరు!
మనసును మెలిపెట్టే జ్ఞాపకం
మహబూబ్‌నగర్ జిల్లా మందారాలు...
మన మల్లేషెడి? మన మనోహర్ ఏడి?
మల్లేషెక్కడో, మనోహరెక్కడో
దుర్మార్గంగా చంపిన రాజ్యానికి తెలియదా?
కన్నవారి ఎదుటే ఎత్తుకెళ్లి..
మాయం చేసి మట్టు పెట్టిన
మట్టికాళ్ల మహారాక్షసి ఏమెరగనట్టు...
త్పూ మహబూబ్‌నగర్ జిల్లా కోర్టు

జమానయదారులకు నోటీసులు...
ష్యూరిటీ ఇచ్చిన పాపానికి
వారిని వెతకడానికి బాధ్యులు వారే,
లేదంటే ష్యూరిటీ డబ్బు కట్టాల్సిందీ వారే!
ఇంతకంటే దుర్మార్గం మరొకటుందా!
ఈ మేలి ముసుగు ప్రజాస్వామ్యంలో
చంపింది ప్రభుత్వం! చచ్చింది మా పిల్లలు
అని నెత్తినోరు కొట్టుకున్నా దిక్కులేదు
హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటిషన్...
అయిన జాడ లేదు జవాబు లేదు
ఉన్నదంత అమ్మైన, అప్పో సప్పో చేసైన
జమానతు కట్టొచ్చు... సరే,
జర మా బిడ్డల జాడ చెప్తరా?
మా మనోహర్, మల్లేష్‌లను తెచ్చిస్తరా?
అది అసాధ్యమని నీకు తెలుసు... మాకూ తెల్సు
అందుకే, ఓ నికృష్ట రాజ్యమా!
నీ కోర్టులు చట్టాలు ఎవడిక్కావాలి?
మల్లేష్, మనోహర్ కోరుకున్న సమాజం,
వారు నమ్మిన ఆశయం,
నడిచిన బాట... అవే మాకాదర్శం
అందుకే ఈ ఆరాటం! పోరాటం!

(మనోహర్, మల్లేష్‌లను ఈ కిరాతక ప్రభుత్వం మాయం (6 మార్చ్, 2006న) చేసి మట్టుపెట్టి, ఇవ్వాల (14 జూన్ 2011న) ష్యూరిటీలకు వారిని కోర్టుకు తీసుకురండి. లేకుంటే ష్యూరిటీ డబ్బులు కట్టండి అని జిల్లా కోర్టు నోటీసులు ఇచ్చిన సందర్భంగా)



కథ

# దలాల్ స్ట్రీట్

పి. చిన్నయ్య

"వెల్‌కమ్‌టు బిజినెస్ బ్రేక్‌ఫాస్ట్..." ముందు గదిల టి.వి. నుండి వినిపిస్తున్న మాటలతో ఇబ్బందిగా లేచి కూర్చున్నాడు.

రాత్రిబాగా పొద్దుపోయి రావడం, దానికితోడు నిద్రలేమి ఈ పరిస్థితికి కారణం. గోడ గడియారం చూస్తే ఎనిమిదిన్నర దాటింది.

"ఈమె బిజినెస్ మొదలయినట్టుంది, పిలువుడు దండగే..." మనసులో అనుకుంటూ బాత్‌రూంలోకి నడిచి తిరిగి బయటకొచ్చాడుగాని ఆమె అదే లోకంల ఉన్నట్టుంది. ఎప్పటిలాగే తనే టీ వేడి చేసుకుని తాగుతుండగా వేగంగా వచ్చి

"పిలవొచ్చుగా టీ పెట్టేదాన్ని..." అంది విజయలక్ష్మి.

"ఫర్వాలేదులే...." టీ తాగుతు అన్నాడు రవిందర్‌రెడ్డి. అతని అసంతృప్తి వేరు. ఏదైనా అడుగుతదేమోనని ఆశగా చూశాడు. తను ఏమి అడక్కుండానే పోయి టి.వి. ముందు కూర్చుంది.

టి.వి.ల ఎవరో ఏదో స్టాక్ గురించి ప్రశ్నిస్తే, దానికి సంబంధించిన టెక్నికల్, ఫండమెంటల్ ఎనలసిస్‌ను స్టాక్ ఎనలిస్టులు ఇస్తున్నారు. వాళ్ళిచ్చె సలహాలు రాసుకోవడం, సరిచూసుకోవడం నెలల తరబడి జరుగుతున్న తంతే. పది గంటలు దాటాక నెట్ ఓపెన్ చేసి అసలు బిజినెస్‌లోకి వెళ్ళడం...

అసహనంగా ఉంది రవిందర్‌కు. ఎట్లున్నడు, ఏం జరిగింది అడగొచ్చుగా విజయ? రోజు రోజుకు ఎందుకింత కఠినంగా తయారవుతుంది? ఇరుగుపొరుగు లేకుంటమాయే, కనీసం దగ్గరి బంధువుల గురించి పట్టించుకోకుంటే ఎలా? ఈ మార్పులో తన పాత్రేమన్న ఉందా? ఈ ప్రశ్నతో తనమీదె తనకు అసహ్యం వేసింది. ఆ కోపంతో బైక్ తీసి బయటకొచ్చాడు గాని ఎటు పోవాలో అర్థం గాలే కొద్ది సేపు. అటువంటి సమయంలో తన వీధిలో ఉండే చంద్రయ్యసారు గుర్తొస్తడు.

సార్ ఇంటి ముందున్న కానుగ చెట్టుకింద బండి పెట్టి ఎప్పటిలాగే ముందు గదిలకు నడిచాడు.

ఆ గదిల ఉండే పుస్తకాలు, నెల నెల వచ్చే పత్రికలు దాదాపు తెలుసు. ఏ కొత్త పుస్తకం వచ్చిన సారు పరిచయం చేసుడు మామూలే. ఇంకా విప్పని టీ పాయ్ మీదున్న పుస్తకాన్ని చేతులకు తీసుకున్నడో లేదో.

"ఎప్పుడొచ్చినవన్న!" చంద్రయ్య సారు భార్య గిరిజ అంది.

"ఇప్పుడేరా, సార్ లేడా ఏంది, సప్పుడు లేదు ఇంట్ల" అనుమానంతో అడిగాడు.

"మీటింగు ఉండేగా నిన్ననే హైద్రాబాద్‌కు పోయిండు"

"అందుకేనా ఈ పత్రిక ఇంకా ఇప్పలేదు" పిన్స్ తీసి పుస్తకాన్ని తెరుస్తూ అన్నడు.

"అవునన్న మీ మేనమామకు ఎట్లుంది, నిన్న గాంధీ హాస్పిటల్‌కు తీసుకపోయినరంట" టీ తేవడానికి పోబోతు అంది.

"ఫర్వాలేదురా, హాస్పిటల్ల మనకు తెల్సిన డాక్టరుండే, ఆయన పట్టించుకొని సూడబట్కి సరిపోయింది."

"పాపం చంద్రారెడ్డి మామ ఈ వయసులగూడేంది వ్యవసాయం చేసుడు, సుగరుండె, ఇంతకు ముందు టి.బి. గూడ వచ్చిపోయె, మీ విజయ వస్తే బాగుండుపోయి చూసొద్దుం..." వంట గదిల నుండి.

"ఎందుకురా, రేపు డిస్‌చార్జి చేస్తుండొచ్చు, వడదెబ్బెగా..."

"ఏమో పాపం, ఎటువంటోడు, ఈడికి వచ్చేటపుడు ఏ కూరగాయలో, పండ్లో పట్టుకొస్తడు వద్దన్న..." నిట్టూర్పుగ అంది టీ అందిస్తూ.

పొద్దటి నుండి పడుతున్న బాధకు గిరిజ మాటలు తోడయినట్టయినయి. బయటవాళ్ళన్న మేనమామ గురించి అడుగుతున్నరు గాని, విజయ ప్రవర్తన మింగుడు పడడం లేదు. తన కోసం తన కుటుంబం కోసం ఎంత చేసింది ఎన్ని సార్లు చెప్పలేదు? ఒక విధంగా విజయతో పెండ్లి కావడానికి సంబంధం వెతకడం మేనమామే కారకుడు. అటువంటిది కనీసం ఎట్లున్నడు అడగొచ్చుగా? ఆమె ఇట్ల మారడానికి తప్పంత ఒక్కదానిదేనా? తన బాధ్యత లేదా?

ఈ టౌన్‌ల, ఈ భగత్‌సింగ్ వీధిల హాయిగ బతుకుతున్న తను ఆ 'దలాల్ స్ట్రీట్'లకు ఎట్ల పోతి? దాని గురించి ఆలోచిస్తేనే ఒక వైపు విచిత్రం, మరోవైపు బాధ...

సెల్ మోగింది, నెంబరు మేనమామ కొడుకుది, హాస్పిటల్ నుండి.

"బావ సాయంత్రం వరకు డిస్‌చార్జి చేస్తరంట నాయనను, ఇప్పుడు మంచిగనే ఉండు, ఇంటికి తీసుకపోత..."

"అట్లనా", అన్నడుగాని తనింటికి మాత్రం తీసుకరమ్మన లేకపోయాడు."

"డబ్బులున్నయిగ" అడిగాడు.

"నీవిచ్చినయి అట్లనే ఉన్నయి బావ, ఏం ఖర్చుగాలే."

"జాగర్త, బస్సుల ఇబ్బందయితే ఆటోలో తీసుకెళ్లు, రేపు కలుస్తా..." బాధతో స్విచ్ ఆఫ్ చేశాడు.

"ఏందన్న డిస్‌చార్జి చేసినరంటన?" గిరిజ అడిగింది లోపలి నుండి.

"అవునురా..."

"రేపు చూసిరావాలా, అల్లుడా, అల్లుడా అనుకుంట ఎట్లుంటడు ఆయనతో..." ఇంకా ఏదో చెప్పుకపోతుంది గిరిజ.

చంద్రయ్యసారు మనుషులతో స్నేహాలు, సంబంధాలు మొదలు పెడితే ఎట్లుంటయో తనకు అనుభవమే. తన దగ్గరికంటె సారు దగ్గరనే మేనమామ సాన్నిహిత్యంగా ఎందుకుంటడో తనకు అర్థంగాని విషయముగాదు...

కాని ఇటువంటి సమయంలో రెండు మూడు రోజులు మేనమామను ఇంట్ల ఉంచుకునే పరిస్థితి లేకుండా పాయే. తనమీద తనకే జాలికలగసాగింది. అయినా ఒక రకంగా ఈ ఊబిలో పడడానికి తను కారణమేగా? చాలా రోజుల నుండి గుండెలో గూడు కట్టుకున్న బాధంతా బద్దలైనట్లయి, గబుక్కున కండ్ల నుండి కన్నీటి చుక్కలు రాలి పడ్డాయి. పుస్తకం అడ్డం పెట్టుకొని కండ్లు తుడుచుకున్నాడు. ఎందుకో ఊరు, అమ్మ, మేనమామ కండ్లల్ల తిరిగినట్టయింది మసక మసగ్గా....

ఈ టౌన్‌కు రెండు మూడు కిలోమీటర్ల దూరంలో ఉంటది తనూరు. చిన్నప్పుడు చెలుక దగ్గరకు పోయినపుడు గుట్టెక్కేది పండ్లకోసం. దాని మీది నుండి చూస్తే ఎడమ వైపు బోనగిరి, కుడివైపు తనూరు కనిపించేది.

అమ్మకు ఇద్దరు అక్కలు, ఒక్కడే తమ్ముడు. ఇద్దరు ఆడోళ్ళను బయట ఊర్లకిచ్చినరు. అమ్మను మాత్రం ఊర్లనె ఇవ్వడం వల్ల తనకు అమ్మమ్మ, నాయనమ్మ ఊరు ఒకటే అయింది. ముగ్గురు సంతానంలో తను పెద్దోడు. ముగ్గురిని బడికి పంపిన తనకు తప్ప ఇద్దరికి చదువు అబ్బలేదు. మధ్యోడు పదో తరగతి తప్పి బోర్‌ఫెల్డింగ్‌లకు పోయి బాగానే సంపాదించాడు. చిన్నోడు వ్యవసాయంలో పడ్డడు.

నాయనకు అనవంశికంగా వచ్చింది ముప్పై ఎకరాలు. నాయన చనిపోయిన సంవత్సరంకే అమ్మ చనిపోవుడు, భూమి పంపకాలకు గొడవలు ప్రారంభం కావుడు...

"మా అన్నకు గవర్నమెంట్ ఉద్యోగముండే, భూముల్ల పాలు ఎక్కువుండాలి మాకు..." ఇద్దరు తమ్ముళ్లు పెద్ద మనుషులకు చెప్పుకుంటు బతిమిలాడుతున్నరు ఊర్ల.

"ఉద్యోగముంటే ఏందిరా, మిలాగా వాడు మినాయనకు పుట్టలే? అయినా ఇప్పటిదాక వ్యవసాయంకు పెట్టుబడి పెట్టింది ఎవర్రా?" మేనమామ వాదన పెట్టుకునేటోడు.

ఇట్ల ఒకటి రెండేండ్లు మాటల యుద్ధమైనాక, ఊరి పెద్ద మనుషులు తీరిక చేసుకొని ఎండాకాలంలో తష్పా చేసి చెప్పినారు.

"....చిన్నోడు వ్యవసాయం మీదనే బతికేటోడు కానా పదెకరాల పెద్దబాయి వానికి, మద్యోడు అంతో ఇంతో బాగనే ఉండు. కాబట్టి బోరున్న పదెకరాలు వాడికి, ఇగ పెద్దాయనకు మేము చెప్పేదెముంది, ఆయనే నలుగురుకు చెప్పెటోడు, అగుట్ట పంటున్న రాళ్లభూమి పెద్దాయనకు".

తీర్పయినాక వాదనకు దిగాడు చంద్రారెడ్డి.

"మీరు చెప్పింది న్యాయంగా ఉందా, చిన్నోనికిచ్చిన బాయిల ఇరవైనాల్గంటలు పెట్టిన తరగని నీళ్లు, మద్యోనిబోరు అంతే, ఎటుకాకుండ పెద్దోనికి అన్యాయం చేస్తరా..."

రవిందర్ గొడవలు ఎందుకని పెద్దమనుషులు చెప్పింది ఒప్పుకున్నడు.

తన కొచ్చిన భూమిలో ఒకటి రెండు సార్లు బోరు వేయించాడు ఆశతో. రాళ్ల పొడి తప్ప నీటి చుక్క పడలేదు.

"ఎకరం ముప్పయి వేలకు ఇస్తవా"? ఒకరిద్దరు అడిగినారు భూమిని.

అంత తక్కువ ధరకూ ఎందుకని ఒప్పుకోలేదు. అదే పిదప కలిసొచ్చినట్టయింది.

2006లో ఊహించని మార్పులు ఈ ప్రాంతంలో.... భూమి రేట్లు పోటిపడి పెరిగినయి. ఎందుకు పెరుగుతున్నయో తెలియని అయోమయం, ఉద్విగ్నస్థితిల రైతులు, భూ యాజమానులుంటె, ఇంకో వైపు కొన్ని పుకార్లు పుట్టినయి.... హైద్రాబాద్ చుట్టు పక్కలున్న కంపెనీలు ఇటు వైపు వస్తయని కొందరు, ఆడ భూములమ్ముకున్నోలు ఇటువైపు కొంటున్నరని ఇంకొందరు, అది కాదు ఇది కాదు ఈ ధరలు పెరగడం వెనుక ప్రభుత్వం మాయ ఉందని ప్రచారం జరుగుతున్న సమయంలో దగ్గరి బంధువొకతను అడిగాడు.

"ఎకరం ఎనిమిది లక్షలు...." మాట వరుసకు అన్నడు తప్పించుకోవాలని రవిందర్ మరునాడే బేరగాళ్లతో వచ్చాడు బంధువు. మాట తప్పడం ఇబ్బందనిపించింది రవిందర్‌కు. అంతా అయోమయం, ఎనిమిది లక్షలకి ఖాయమయింది. నలభై లక్షలు అడ్వాన్స్ ఇచ్చినారు. మిగిలిన సగం రిజిస్ట్రేషన్ రోజున ఇచ్చారు.

విజయలక్ష్మి పుట్టింటికి వెళ్లింది ఆగమేఘాల మీద.

ఎదో గొడవల్లో ఉన్న భూమి కోర్టు తీర్పు తమకు అనుకూలంగా రావడం వల్ల, ఆ భూమిని అమ్మగా రెండు కోట్లొచ్చినయి పుట్టింటోళ్లకు. ఒకతే కూతురాయె, తల్లిదండ్రులతో, అన్నలతో గొడవ పడకుండానే తమకు రావలసింది తీసుకొని అన్నను వెంటబెట్టుకొని వారం రోజులకు మెట్టింటికి చేరుకుంది విజయ.

"బ్యాంకులో అంత డబ్బుంటే కష్టం, ఇండ్లో, ప్లాట్లో కొనుక్కోండి..." ఆదాయపు పన్ను ఎట్ల ఎగగొట్టాలో ఒక రోజంతా జాగ్రత్తలు చెప్పి ఫుట్కేసర్‌కెళ్ళి పోయాడు విజయ అన్న.

ఊహించని పరిణామాలు... ఉక్కిరిబిక్కిరైనారు... నిలకడ లేకుండయింది... నిద్రకరువైంది ఇద్దరికి...

ఇప్పుడున్న ఇంటిని, హైద్రాబాద్‌లో ఉప్పల్ డిపో వెనుక రెండు ప్లాట్లు. ఈ టౌన్‌ల రెండు ప్లాట్లు, ఇద్దరు పిల్లల పేరు మీద కొంత ఫిక్స్‌డ్ చేసిన ఇంక ఇద్దరిదగ్గరా డబ్బు మిగిలే ఉంది. 'ఏం చేయాలో అర్థంగాకుండున్న సందిగ్ధ సమయంలో ఈ టౌన్‌లనే బాగ పేరున్న కె.సి.ఎస్. ఫైనాన్స్ సంస్థ మేనేజర్ రాంరెడ్డితో పరిచయం. ఆయన పేరు వినడమే కాని ప్రత్యక్ష పరిచయం లేదు. తన గురించి ఎలా తెలిసిందేమోగాని.

ఆదివారం ఉదయానే ఓ ఉపాధ్యాయ మిత్రుడు ఈ రాంరెడ్డితో ఇంటి ముందు వాలిపోయాడు. అంత పెద్దమనిషిని

చూసేసరికి నోట మాట రాకుంటయింది. టీ ఫలహారాల మర్యాదలయినాక మొదలు పెట్టాడు.

"మన చేతిల డబ్బుండాలే గాని, చేతులకు మట్టంటకుండ, ఇంట్లనే కూర్చుని ఆ డబ్బును కొన్ని నెలల్లోనే రెట్టింపు చేసుకొనే అవకాశాలొచ్చినయి ఇప్పుడు. మనకు తెలియక ఎల్ఐసిలనో, బ్యాంక్‌లనో పెడతాం. ఏం లాభం ఉంటుంది చెప్పండి?....

ఈక్విటీ మార్కెట్‌ల పెడితే మీ డబ్బు రెట్టింపు చేసుకోవచ్చు. మీరు నమ్మరుగాని ఈ సార్‌ను అడగండి చెపుతడు అంటూ ఆ ఉపాధ్యాయ మిత్రుడు ఏదో స్టాక్‌లో పెడితే లక్షకు మూడు లక్షలొచ్చిన ఉదాహరణ చెపుతు, ఈ మధ్యనే టౌన్‌లో ప్రారంభించిన తమ 'స్మార్ట్ ఇన్‌వెస్ట్ & బ్రోకింగ్ సంస్థ' ఎంత విజయవంతంగా నడుస్తుందో వివరించసాగాడు.

ఈ స్టాక్ మార్కెట్ ఇద్దరికి కొత్తే. అయోమయంగా ముఖాలు చూసుకున్నరు. అయినా ఈ ఉపాధ్యాయ మిత్రుడు పాత పరిచయమే, ఆ ధైర్యంతోనే.

"దీంట్లో ఏం మోసం ఉండదుగా?" అనుమాన నివృత్తి కోసం అడిగాడు రవిందర్.

"ఏం ఉండదు, ఇంతకు ముందంటే స్టాక్ బ్రోకర్ల నుండి మోసం జరుగుతుండే, ఇప్పుడు మీరే డైరెక్ట్‌గా ట్రేడింగ్ చేసుకోవచ్చు!" రాంరెడ్డి.

"ఎలా?"

"వెరి సింపుల్! మీరిద్దరు 'డిమాట్' ఎకౌంట్ తీయాలి..." చెప్పటమే గాదు, వారం రోజుల్లో ఎస్.బి.ఐ. బ్యాంక్ నుండి డిమాట్ ఎకౌంట్ తీయించి, ఎట్ల ఆపరేట్ చేయాలో ఇద్దరు దగ్గరుండి మరీ నేర్పారు.

ఇదంత చేసినందుకు కాదు గాని, రాంరెడ్డి రెండు రూపాయల మిత్తికి, రెండు లక్షల రూపాయలు తన ఫైనాన్స్‌ల డిపాజిట్ చేయించుకున్నడు. మిత్తికేగా సంతోషంగా ఒప్పుకున్నరు రవిందర్, విజయ.

ఇంట్లో అనేక మార్పులు...

తెలుగు పేపర్‌తో పాటు, బిజినెస్ లైన్ రావడం, కొన్ని రోజులకే ఇంటర్‌నెట్ కనెక్షన్. బికామ్‌లో తను చదివిన జ్ఞానాన్నంతా ఈ ట్రేడింగ్‌లో అన్వయించుకోసాగింది విజయ.

చిత్రం! టౌన్‌లో తనకు ఏదో హోదా పెరిగినట్టు నిపించసాగింది రవిందర్‌కు. రాంరెడ్డిగారు ఎక్కడ వ్యాపార సమావేశాలయిన, ఫంక్షన్‌లయిన పిలవడం, పెద్ద వాళ్లకు పరిచయం చేయడం పరిపాటయింది. కొత్తలో ఇది ఏదో మంచిగా అనిపించినా రాను రాను ఇబ్బందిగా, తగనిదిగా అనిపించసాగింది. ఫంక్షన్‌లలో ఆ పెద్ద మనుషులు తాగినాక మాట్లాడే భాష ఇబ్బందిగా ఉండేది. ముఖ్యంగా పేదల పట్ల...

మరోవైపు విజయ పరిస్థితి రవిందర్‌ను మించి పోయినట్టయింది. ఈ చిన్న టౌన్‌లో పది మంది దాక మహిళలు స్టాక్ మార్కెట్‌ల ట్రేడింగ్ చేస్తున్నరు. వీళ్లకు ఓ అసోసియేషన్ లాంటిది ఉంది. దానికి పెద్ద దిక్కులాంటిది రాంరెడ్డి భార్యే!

విజయలక్ష్మి ఈ సంస్థలోకి పోయేనాటికి దీనిలో ఎం.ఆర్.ఓ. భార్య, సిఐ భార్య, ఇద్దరు లెక్చరర్స్ భార్యలు, వ్యాపారస్తుల, రియల్ ఎస్టేటర్‌ల భార్యలు దీంట్లో భాగస్వాములు. తనొక్కతే ఉపాధ్యాయుని భార్యని మొదట బాధ, చిన్నతనమనిపించిన, రాను రాను వాళ్లే తనను బాకీ అడగడం మొదలైనాక ఆ ఆత్మన్యూనత నుండి బయటపడింది.

ఏయే స్టాక్‌లో పెట్టుబడి పెడితే బాగుంటుందో వివిధ రిసోర్స్ ద్వారా పరిశోధన చేసేవాళ్లు. నష్టాలొస్తే చెప్పుకునేవాళ్లు కాదు, లాభాలొస్తే చిలువలు పలువలుగా వల్లించుకునేవారు.

ఏదో స్టాక్‌లో ఎవరో పెట్టమని చెప్పితే, పెట్టిన నెలకే లక్షకు లక్షయింది. విజయ ఆనందానికి అంతు లేదు. ఆమె కళ్లనిండా స్టాక్‌లు, లాభాలే తిరుగుతున్నాయి. రవిందర్ నమ్మలేదు మొదట్లో. ఆమె పోర్ట్ ఫోలియో చూశాడు. ఆ స్క్రీన్ మీద చూస్తుంటే ఆశ్చర్యం! క్షణాల్లో ఎర్రగీతలు (నష్టాలు)... క్షణాలో ఆకపచ్చ గీతలు (లాభాలు)గా మారడం...

"ఏంటి, నెలకె డబుల్ కావడమా?!" ఆలోచనలో పడ్డడు. నెల తిరక్కుండానె ఆమె పోర్టు ఫోలియోలో ఇంకో స్టాక్‌లో లక్ష రూపాయల లాస్. రవిందర్‌కు డక్ మంది.

"ఏంది ఇట్ల?" భయంతో అన్నడు.

"వ్యాపారమంటె ఇట్లనే ఉంటది, తట్టుకొని నిలబడాలి, అయినా వారన్ బఫెట్ ఏమన్నడో తెలుసా?"

"వారన్ బఫెటా ఆయనెవరు?" అమాయకంగా అడిగాడు.

"ప్రపంచ స్టాక్ మార్కెట్‌కు కింగ్, ప్రపంచ సంపన్న వంతులలో రెండోవాడు!"

"ఏం చెప్పిండు?"

"రాత్రికి రాత్రె లక్షాధికారి అవుదామని ఆశపడకూడదు, నెమ్మదిగా ఒక్కో అడుగు వేసుకుంటు ముందుకు పోవాలి..." బోధించడం మొదలు పెట్టింది.

ఆన్‌లైన్ ట్రేడింగ్ విజయకు బాగా అబ్బినట్టయింది. ఏ స్టాక్ ఎందుకు కొనాలో, కొనొద్దో విశ్లేషించి తన మిత్రులకు, రవిందర్‌కు చెప్పే స్థాయికి ఎదిగింది. విజయకు మంచి భవిష్యత్తు ఉందని సంస్థ సభ్యులు పొగడడం ప్రారంభమైంది. రాను రాను ఈ ట్రేడింగ్ రవీందర్‌కు విసుగనిపిస్తుంటే, విజయకు సవాల్‌గా మారి, ఏదో ఒకటి తేల్చుకోవాలన్నట్టుగా ఉన్నది...

ఇదే సమయంలో రవిందర్ హెచ్.ఎం.గా ప్రమోషన్ రావుడు, టౌన్‌కు ముప్పయి కిలోమీటర్ల దూరంలో చంద్రయ్యసారు చెప్పిన ఊరును కౌన్సిలింగ్‌ల తీసుకున్నడు. విద్యార్థులు ఎక్కువగా ఉన్న హై స్కూల్. పదో తరగతి ఫలితాలలో అతి తక్కువ నమోదు చేసుకున్న స్కూళ్లల్లో జిల్లాలోనే ఇదొకటి. ఊరు, స్కూల్ పరిస్థితి చంద్రయ్య సార్ ముందే చెప్పి ఉండడం వలన త్వరగానే అన్నింటిని అర్థం చేసుకోగలిగాడు. పదో తరగతి రిజల్ట్స్ మీద దృష్టిలో పడి తన పాస్‌వర్డ్ కూడా మరిచాడు.

విజయకు కలిసొచ్చినట్టయింది. రవిందర్ పాస్‌వర్డ్, తన పాస్‌వర్డ్‌ను మార్చుకుంటు ఇద్దరి డిమాట్‌లను ఆపరెట్ చేస్తూ

ట్రేడింగ్ చేయసాగింది.

ఆ రోజు బ్యాడ్ ఫ్రైడే....

భారత స్టాక్ మార్కెట్ కుప్పకూలింది. నిఫ్టీ, సెన్సెక్స్ ఐదేండ్ల కనీస స్థాయికి పడిపోయాయి. అంతకు ముందు రోజే నాస్‌డాక్, డౌజోన్స్, ఎస్ అండ్ పీ, షాంఘై, కుప్పకూలినవి. పారిశ్రామిక వర్గాల్లో విషాదఛాయలు. పత్రికలన్ని అవే కథనాలు...

స్కూల్ నుండి రాగానే విజయను పరిశీలనగా చూశాడు. దాదాపు సగం సంపద హరించుకుపోయినట్టు మాటల ద్వారా అర్థమైంది. ఇప్పటికైనా ఈ ట్రేడింగ్ బందు చేస్తే బాగుండుననిపించింది. అందుకే నెమ్మదిగ కదిపాడు.

"ఈ టెన్షన్ ఎందుకురా, ట్రేడింగ్ బందు పెట్టరాదు?"

విజయ ఆశ్చర్యంగా రవిందర్ వైపు చూస్తూ "ప్రపంచ ప్రఖ్యాత స్టాక్ మార్కెట్ నిపుణుడు పీటర్‌లిన్ ఏమన్నడో తెలుసా?!" అంది.

"నా కేమి తెలుస్తది చెప్పు?" కోపం పైకి కనబడకుండ అన్నడు.

"స్టాక్ మార్కెట్‌ల డబ్బులు నష్టపోవడం వల్ల సిగ్గుపడాల్సిందేమీ లేదు. కాకుంటే పనికిరాని షేర్లను కొనడం, ఉంచుకోవడం సిగ్గుపడాలి..."

"ఈ పరిస్థితులో ఇంకా కొంటావా?!"

"కొంటా... వారన్ బఫెట్ చెప్పినట్టు అంతా పరుగుల వేటల ఉన్నప్పుడు కొనకూడదు, ఇట్ల పడిపోయినపుడు, ఎవరికి ఆసక్తి లేనపుడు షేర్లను కొనాలి!"

"డబ్బులు మీ అన్నలు పంపిస్తమన్నరా?"

"ఎటకారం వద్దు, నా ఏర్పాట్లు నాకున్నవి. నీవేమి ఇవ్వనక్కర లేదు."

"ఏమో ఈ ట్రేడింగ్ బందు చేస్తే బాగుంటుందనిపిస్తుంది. దీంట్లో ఏం ఆనందం ఉంది చెప్పు?"

"నీకు ఇష్టం లేకుంటే ఊరుకో, నాకు ఓపిక ఉంది...."

ఈ మాటతో ఏం మాట్లాడాలో, ఎట్ల అర్థం చేయించాలో తెలియడం లేదు. విషయాన్ని మళ్ళిస్తూ అనునయంగా అడిగాడు.

"స్కూల్ నుండి రెండు రోజులు రామప్ప, భద్రాచలం టూర్‌కు పోతున్నం, రారాదు!"

"నేను రాను" ఖచ్చితంగా అంది.

"ఎందుకు?"

"మాకు ఈక్విటీ మార్కెట్ మీద అయిదు రోజులు క్లాసులున్నయి హైద్రాబాద్‌లో... పోతున్నం."

"ఏం ఉపయోగం?"

"గవర్నమెంటు మీకు వృత్యంతర శిక్షణ ఇస్తుందిగా ఎందుకు?"

"అదిగాదు పోక తప్పదా!"

"చంద్రయ్య సారుతో మీటింగులకని, సదస్సులకని పోతవుగ, నేను వద్దంటే ఆగుతున్నవా?"

"దానికి దీనికి లింకేంది?"

"ఉంటది, నీ ఇష్టమున్నది నీవు చేస్తవు, నాకిష్టమైంది నేను చేస్తా".

"ఇట్లయితే సంసారం నడువుడు కష్టమే..." గొణుక్కుంట లేచి ముందు రూంలకు నడిచాడు.

ఇంట్ల ఉండలేక చంద్రయ్య సారు దగ్గరకు పోయాడు. ఆ సాయంత్రం తన బాధనంత చెప్పుకున్నడు. చంద్రయ్య సారు మొత్తం ఓపిగ్గ విని అన్నడు.

"మన ఆలోచనల్ని, అభిప్రాయాల్ని ఎట్ల మార్చుకోమో, విజయ తన అభిప్రాయాల్ని అంత త్వరగ మార్చుకోదు. ఆ వ్యాపారంలున్న అమానుషం ఏందో ఆమెకు అర్థం చేయించాలి. దానికి కొంత ఓపిక, సహనం కావాలి మనకు.." చెప్పుకుంటు.

... సమాజంల ఉత్పత్తి ఎట్ల ప్రారంభమైనది, ఉత్పత్తి సాధనాలు ఎందుకు, ఎట్ల పుట్టినవి, చివరికి ఎవరి చేతులకు పోయినది, మార్కెట్, డబ్బు పుట్టుక, పెట్టుబడిదారులు, జాయింట్ స్టాక్ కంపెనీలు ఎట్ల పుట్టినాయో ఆదిమ సామాజిక వ్యవస్థ నుండి ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ వరకు గల పరిణామ క్రమాన్ని ఉదాహరణలతో పండొలిచి పెట్టినట్టు రాత్రి పొద్దు పోయేవరకు వివరించాడు. గిరిజ లేబట్టిన ప్రశ్నలు రవిందర్‌ను ఆలోచనల పడేటట్టు చేశాయి.

స్టాక్ మార్కెటంటే డబ్బు సంపాదించడానికి ఓ ఇన్వెస్ట్‌మెంట్ సాధనమని అప్పటి దాకున్న భ్రమలు పటాపంచలైనట్టయింది. ఈ మార్కెట్ గురించి ఆలోచిస్తే ఎంత ఉద్విగ్నత ఉండేది మొదట్లో! అంతా తలకిందులైనట్టయింది. ఈ స్టాక్ ఎక్స్ఛేంజ్ ప్రభుత్వ సహాయంతో నడిచే పైకి కనబడని బహిరంగ దోపిడి స్థలంగా అనిపిస్తుంది...

పైగా స్టాక్ ఎనలిస్టులు ఎంత అందమైన పదజాలాన్ని, స్వార్థాన్ని, అమాయకత్వాన్ని వెదజల్లుతారు! పిఇ, ఇపిఎస్, బుక్ వ్యాల్యూ, నెట్‌వర్త్, డివిడెండ్, బోనస్, బుల్లిష్, బేరిష్ ఏమి పదాలు! 'తక్కువ ధరకు కొనండి, ఎక్కువ ధరకు అమ్మి బయట పడండి!' ఇదే దాని వేదమంత్రం!

రవిందర్ ఇప్పుడిప్పుడే కొద్ది కొద్దిగా అర్థం చేసుకోసాగాడు ఈ ట్రేడింగ్‌ల ఉండే డొల్లతనం ఏమిటో...

విజయలాంటి చిన్న ఇన్వెస్టర్ కొన్నిసార్లు లాభాలొచ్చిన పదే పదే ఎందుకు నష్టపోతుందో మొదట్లో అర్థమయ్యేదికాదు. దీనిలో ఎక్కడో ఏదో మోసం జరుగుతోందని అనుమానమున్న, ఎవరి వల్ల జరుగుతుందో చంద్రయ్య సారు చెప్పేదాక స్పష్టత లేకుండే.

బ్లాక్ మార్కెట్ చేసే దొంగ వ్యాపారుల్లాగా ఈ బ్రోకర్లు, స్పెక్యులేటర్స్, ప్రమోటర్స్ తమ దగ్గరున్న షేర్లను ఎక్కువ ధరకు అమ్మడం, తిరిగి మార్కెట్ పడగానే తిరిగి కొనడం. ఈ మాయను అర్థం చేసుకొని వేగంగా ట్రేడింగ్ చేసే సమాచారం విజయకు లేకపోవడం.

పోని కంపెనీల ఏదైనా డివిడెండ్, మంచి న్యూసో

ఉన్నయనుకుంటే, అవి ప్రకటించే లోపు ఇన్‌సైడర్ ట్రేడింగ్, ప్రైస్ రిగ్గింగుకు సామాన్య ఇన్‌వెస్టర్ బలి....

ఈ జూదశాల నుండి విజయను ఎట్ల బయటపడెయ్యాలో అర్థం కావడం లేదు. ఉన్న డబ్బును బ్యాంకులో పెట్టి, పిల్లల్ని జాగ్రత్తగా పెంచుకుంటూ, సుఖంగా బతకొచ్చని ఎట్ల అర్థం చేయించాలి?

పక్కకు తిరిగాడు పడక మీద. అస్తవ్యస్తంగా పడి నిద్రపోతున్న విజయ, పక్కనే 'దలాల్ స్ట్రీట్' పత్రిక.

గతంలో సినిమాకో, టూర్‌కో అనగానే ఎగిరి గంతేసేది. ఇప్పుడు అన్నిటి మీద నిరాసక్తే, ట్రేడింగ్ తప్ప. ఎప్పుడో ఒకసారి శారీరక కలయిక జరిగిన అది యాంత్రికమైనదే. నిస్సారంగా మారుతున్న ఈ జీవితం నుండి ఎట్లైనా బయటపడాలి. ఇవే ఆలోచనలతో ఎప్పుడో తెల్లారుజామున నిద్ర పట్టినట్టయింది రవిందర్‌కు...

- - -

రెండో శనివారం ఆ రోజు...

రవిందర్‌కు సెలవే, స్టాక్ మార్కెట్‌లకు సెలవే.

అప్పటికే విజయ బిజినెస్‌లైన్ చదవడంలో నిమగ్నమై ఉంది. టీ తాగుతూ ఆమె పక్కనే పిల్లల గురించి ఆలోచిస్తూ సోఫాలో కూర్చున్నడు రవిందర్.

ఉన్నట్టుండి ఏదో మునిగిపోయినట్లుగా అరిచింది విజయ.

"చూసినవ, వారెన్ బఫెట్ ప్రపంచ సంపన్న వంతుల రెండవ స్థానం నుండి కిందికి పడిపోయినడంట!"

"ఎందుకు" అని అడగబోయి, ఆ మాటను గొంతులోనే మింగి, తేరుకుని కోపంతో ఎగిరాడు.

"వాడెవడో ఆస్తుల్లో రెండవ స్థానం నుండి పడిపోయిండని ఏడుస్తున్నవు గాని, నీ కొడుకు, కూతురు సదువుల్లో ఎన్నో ర్యాంకులకు దిగజారినరో పట్టించుకుంటున్నవా?

.... మొన్న హాస్టల్‌కు పోతే స్వాతి హాస్టల్‌లో లేదు. పోయి రెండు రోజులయిందంట.

మీ అన్నను అడుగుపోయి, నీ కొడుకు కూతురు సంగతంత చెబుతడు. ఎట్లనో ఈ రెండు సంవత్సరాలు మీ అన్న ఇంట్ల వాళ్ల పిల్లలతో ఉంచి సదివిద్దామంటే వినవైతివి. పైగా పిల్లలకు లెక్క లేకుండా డబ్బులు ఇవ్వబడితివి. వాళ్లు ఎట్ల తయారైనరో చూసిరా..."

రవిందర్ కోపం చూసి గమ్మునయి పోయింది. అర్ధగంటకు గాని కోపం తగ్గలేదు రవిందర్‌కు. అతి కష్టంగా తనకు తాను నిగ్రహించుకొని, నెమ్మదిగా కదిపాడు.

"ఎందుకొ ఈ ట్రేడింగ్ నచ్చడం లేదు, నష్టమైన ఫర్వాలేదు, బందువెట్టి ఇంకెదైన చేయి..."

"ఏం చేయమంటవు చెప్పు, అయిన దీంట్ల ఎవర్ని మోసం చేయడంలే, స్టాక్‌ల ఇన్‌వెస్ట్ చేస్తున్న, లాభం వస్తే తీసుకుంటున్న..."

"ఎదుట ఎవరు కనిపించరు గనుక, ఎవరిని మోసం చేసినట్టనిపించదు, ఒకరినొకరు కనిపించకుండ, ఒకని డబ్బులు ఇంకొకడు గుంజుకొనే దగాకోరు వ్యాపారమిది..."

"ఎట్లనో నాకు అర్థం కావడం లేదు..."

"స్టాక్స్ ఎప్పుడు కొంటవు చెప్పు?" సహనంతో అడిగాడు.

"మార్కెట్ పడినపుడు, ఎనలిస్టులు చెప్పినప్పుడు!" ఇది గూడ తెలియదాన్నట్టుంది విజయ గొంతు.

"ఎప్పుడు అమ్ముతవు వాటిని?"

"స్టాక్స్ పెరిగినపుడు, లాభం వచ్చినపుడు!"

"లాభం ఎట్ల, ఎవరి నుండి వచ్చింది?"

"ఏమో, చెప్పు..." నిర్లక్ష్యంగా అంది.

"నష్టపోయిన వాడి నుండే డబ్బులు లాభ పడ్డోలకు ముడుతుంది. ఇదే దాని వ్యాపార సూత్రం. ఒక రకంగా దోపిడి...

ఇంకా అర్థం కావాలంటే, ఓ అమాయకుడినో, అజ్ఞానినో, అత్యాశపరున్నో ముంచితే గాని లాభపడేటోడు లాభపడడు. సమాచారం వెంటనే తెలిసే ప్రమోటర్స్, స్పెక్యులేటర్స్, బ్రోకర్లు సమయానికి బయటపడుతారు. మునిగేది చిన్న చేపల్లాటి రిటైలర్స్, నీలాంటి అమాయకులే.

ఈ చిన్న చిన్న చేపల్ని మింగి మింగి వారెన్ బఫెట్ లాంటి ప్రపంచ తిమింగలమో, రాకేష్ ఝున్ ఝున్ వాలా లాంటి భారత తిమింగలమో తయారవుతయి..." కోపాన్ని టీ లో దిగమింగుతు అన్నడు.

"ఏందో నీ ఆలోచనలన్నీ చిత్రంగా ఉంటయి, పెండ్లయిన సంది చూస్తనె ఉన్నగా నీ తిక్క వాదనలు! అయిన ఈ ట్రేడింగ్ వదిలిపెట్టి ఏం చేయమంటవో చెప్పు?" రవిందర్ మనస్సు తెలుసు కనుక ప్రేమతో అతని దగ్గరకు జరుగుతూ అంది విజయ.

"కాదురా విజ్జీ, గిరిజ వాళ్ల ఫ్రెండ్స్ కలిసి పచ్చళ్లు, కారం పొడి, అల్లం పేస్టు తయారు చేసి ఏదో మహిళా సంఘం పేరుతో అమ్ముతున్నారు. బాగానే గిట్టుబాటు ఉందంట. పెట్టుబడి లేక కొద్దికొద్దిగా చేస్తున్నరు. నీవు వాళ్లతో కలిస్తే నీకు పని ఉన్నట్టుంటది, కాలం గడిచినట్టు ఉంటది..."

"ఏమో అండి, నాకు అటువంటి వ్యాపారాలు నచ్చవు, ఇప్పటిదాక తెలియని తనంతో పిచ్చి పిచ్చిగా ట్రేడింగ్ చేసిన, ఇప్పటి నుండి బ్లూ చిప్ కంపెనిలో మాత్రమే ఇన్‌వెస్ట్ చేస్తా, పెద్దగా నష్టాలుండవు, పెట్టుబడికి బయముండదు!"

తిరిగ మొదటికొచ్చినట్టయింది కథ. తల తిరిగింది...

చంద్రయ్య సారు చెప్పినట్టు, ఈ పెట్టుబడులలో డబ్బు పెట్టుబడికన్న ఉత్పాదక పెట్టుబడి ఎంతో కొంత మేరకు ఉపయోగకరమేనన్న విషయం అర్థం కావడానికి తనకే కిందా మీదవుతుంది. అటువంటిది ఈమెకు ఎట్ల వివరించాలి? అర్థం చేయించిన ఈ ట్రేడింగ్ అవుతుందనే నమ్మకం లేదు ఈమె పట్టుదల చూస్తే. అసహనం నుండి వచ్చిన కోపంతో ఎగిరాడు.

"ఏదైనా పెద్ద చేపొచ్చి మింగితే బాగుండు నిన్ను, పీడా పోవు..."

"నేనె నా కంటే చిన్న చేపల్ని మింగుకుంట ఏనాడో ఓనాడు పెద్ద చేపగ మారితే!" బుజాలేగరేస్తు తేలిగ్గా నవ్వుతు అంది.

విజయవైపు పిచ్చిచూపులు చూస్తూ, చంద్రయ్య సారు చెప్పిన పెట్టుబడి, సామ్రాజ్యవాదం వాటి వేయిన్నర రూపాల గురించి ఆలోచిస్తూ తల పట్టుకున్నాడు...

"పెట్టుబడికి పుట్టిన వికృత రూపాల్లో ఈ స్టాక్ మర్కెటొకటి. కంపెనీలు కట్టి, కార్మికుల్ని పెట్టి, వస్తువులను ఉత్పత్తి చేసి లాభాలు పొందేకన్న, డబ్బుకు డబ్బును పుట్టించడమే ఈ మార్కెట్ పుట్టుక. ప్రపంచంలో ఏ మూలకో ఉన్నోడు మరో మూలలో ఉన్న కంపెనీల పెట్టుబడి పెట్టి లాభాలు పొందొచ్చు. ఆన్‌లైన్ ట్రేడింగ్ వచ్చి ఎంత సులభమైంది ఈ దోపిడి!"

"ఆర్థికంగా చాలా బలంగా ఉంది మనదేశం. ప్రపంచ దేశాలన్ని మన మార్కెట్ వేపై చూస్తున్నాయి. మన పారిశ్రామిక విధానాల ఫలితాలు ప్రజలందరకు అందుబాటులోకి రానున్నాయి..." కేంద్ర ఆర్థిక మంత్రి మాటలు టివిలో.

కోపంతో ఛానల్ మార్చాడు రవిందర్, అంతే...

పచ్చటి పోలాల్లో రైతుల్ని, ముసలి ముతక, మహిళలనే బేధం లేకుండా జంతువులను వేటాడినట్టు క్రూరంగా వేటాడుతున్న మానవ మృగాలు. అవి డ్రెస్సులలో, సివిల్ డ్రెస్సులలో ఉన్న ప్రభుత్వ, ప్రైవేటు ముఠాలు.

"సోంపేట కాల్పుల్లో ఇద్దరు మృతి" బ్రేకింగ్ న్యూస్... స్క్రోలింగ్‌లో.

"సచ్చిన ఆ కంపెనికి మా భూములివ్వం..." తగలబడి పోతున్న కంపెనీ ఆఫీసును చూస్తూ కోపంగా అరుస్తున్నడు ఓ ముసలిరైతు.

"ఫండమెంటల్‌గా చాలా స్ట్రాంగ్ ఆ కంపెనీ, అట్ల చేసిందా!" వెనుకనే నిలబడి ఆ దృశ్యాలను చూసస్తూ అంది విజయ అమాయకంగా.

"స్ట్రాంగ్‌గా ఉండకుంటే ఎట్లుంటది... రైతుల, కార్మికుల రక్తమాంసాలను పీక్కుతింటుండే, అయినా ఆ కంపెనీలో నీకు షేర్లు ఉన్నాయా!" కోపంతో వణికిపోతూ అన్నడు.

ఉన్నయంటే మీద పడి కొట్టెటట్టున్నడు. పెండ్లయిన దగ్గర నుండి ఇంత కోపం చూడలే ఇతనిలో.

"లేవు..." భయంతో దూరం జరుగుతూ అంది.

కండ్లు మూసుకొని సోఫాలో కూర్చున్నాడు గాని ముసలి రైతును, బక్కపల్చటి స్త్రీని బాదుతున్న దృశ్యమే కండ్లల్లో మెదలుతుంది. గుండెను పిండినట్లనిపించసాగింది. ఎందుకో ఆ సమయంలో మేనమామ గుర్తొచ్చినడు. వేగంగా బయటకొచ్చి బైక్ తీశాడు, ఊరును, ఊర్ల మేనమామను పలుకరించడానికి....

- - -



## రచనలకు ఆహ్వానం

అరుణతార అనేక ఇబ్బందుల మధ్యనే విప్లవ సాహిత్య సాంస్కృతిక రంగంలో కృషి చేస్తోంది. విరసం అధికార పత్రికగా ప్రజా ఉద్యమాల పక్షాన నిలబడి ప్రగతిశీల విలువలను నిలబెట్టడంలో సోదర సాహిత్య, రాజకీయ, సామాజిక పత్రికలతోపాటు తన వంతు బాధ్యత నిర్వర్తిస్తోంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ పెచ్చరిల్లిన ఈ తరుణంలో విప్లవోద్యమంతోపాటు అనేక ప్రజా ధిక్కార స్వరాలు, నిరసనలు, పోరాటాలు వెల్లువెత్తుతున్నాయి. సామాజిక సంబంధాలను, విలువలను, ప్రజా ఆకాంక్షలను పాలకవర్గ విధానాలు ధ్వంసం చేస్తున్నాయి. ప్రజలు తమ వనరుల నుంచి, స్థావరాల నుంచి విస్థాపనకు గురవుతున్నారు. ప్రజల సహజీవన సంస్కృతి మీద దారుణమైన అణచివేత కొనసాగుతోంది. ఆదివాసుల పోరాటాల మీద రాజ్యం అతి పెద్ద స్థాయిలో యుద్ధం ప్రకటించిన సందర్భంలో మనం ఉన్నాం. అణగారిన ప్రాంతాలు, కులాలు, మహిళలు, మత మైనార్టీలు తీవ్ర అభద్రతలోంచే ఆత్మగౌరవం కోసం, న్యాయమైన ఆకాంక్షల కోసం పెనుగులాడుతున్నారు. ఈ సంఘర్షణను తెలుగు సృజనాత్మక సాహిత్యం అద్భుతంగా వ్యక్తీకరిస్తోంది. మారుతున్న ఈ సామాజిక సందర్భాన్ని తెలుగు రచయితలు గతం కంటే శక్తివంతంగా వివిధ ప్రక్రియల్లో ప్రజానుకూల చైతన్యాన్ని ప్రదర్శిస్తున్నారు, సామాజికవేత్తలు విశ్లేషిస్తున్నారు.

ఈ వ్యక్తీకరణలకు, విశ్లేషణలకు అరుణతార మరింతగా వేదిక కావాలని మా ఆకాంక్ష. కథ, కవిత్వం, పాట, విమర్శ, పుస్తక సమీక్ష, అనువాదాలతోపాటు విశాల ప్రజా సాహిత్య సాంస్కృతిక రంగంలోని ఏ విషయం మీదైనా రచనలు పంపండి. సాహిత్య, కళా సిద్ధాంత, భావజాలపరమైన వాదాలను, విమర్శలను, వివిధ భాషా సాహిత్యాల్లోంచి ప్రగతిశీల రచనలను అనువాదం చేసి పంపించండి. సామాజిక, రాజకీయ, ఆర్థిక అంశాల మీద, ఉద్యమాల మీద విశ్లేషణలు, నివేదికలు పంపించండి. రాజ్యహింసా రూపాల మీద వ్యాసాలు పంపిండి. అమరులైన ప్రజా ఉద్యమ కార్యకర్తలు, బుద్ధిజీవులు, రచయితలపై స్మృతి వ్యాసాలు పంపించండి.

మీ రచనల వల్లే అరుణతార తాను నిర్దేశించుకున్న సాహిత్య, సాంస్కృతిక కర్తవ్యాలను, ప్రజా ఉద్యమ బాధ్యతలను మరింత శక్తివంతంగా నిర్వర్తించగలుతుంది. మీ రచనల వల్లే పత్రిక ప్రమాణాలు మరింత బలోపేతమవుతాయి. పత్రికలో వస్తున్న రచనల మీద ఎప్పటికప్పుడు అభిప్రాయాలను, విమర్శలను రాసి మా కృషిని మెరుగులు దిద్దండి. అన్ని రకాలుగా మీ నుంచి సహకారాన్ని కోరుతూ...

- సంపాదకుడు

ఒక అనుభవం

# నాకు "బుద్ధి" నేర్పుతారా!

- గురూజీల టీం

ఇది ఒక పిట్ట రోజూ అన్ని పిట్టల్ని అడుగుతున్న ప్రశ్న.

ఏమి కథ? ఎక్కడిదా పిట్ట? తెల్సుకోవాలనుకుంటున్నారా?

ఈ పిట్ట కథ రష్యన్ పిల్లల కథల పుస్తకంలో ఉంది. కథ పేరు "అడవర్స్ టీచెస్ (ప్రతికూలతే నేర్పుతుంది)" - సంక్షిప్తంగానే చెబుతాం. కాదనకండి మరి. అలాగే మా చర్చా వేదికల్లో వెల్లివిరిసిన విజ్ఞానాన్ని ("బుద్ధి"ని) కూడా పరిశీలించండి. అందులో మూడవ పద్ధతి కథ చెప్పడం. అక్కడ ఈ కథ చెప్పుకుందాం.

2009 అక్టోబర్, నవంబర్ నెలల్లో దక్షిణ బస్తర్, దర్భా డివిజన్లలో ఉన్నప్పుడు మాతోపాటు ఉన్న సభ్యులతో చర్చా వేదికలు నిర్వహించాం. అందులో అనేక వైజ్ఞానిక, రాజకీయ అంశాలపై ప్రశ్నలు, జవాబులు నడిచేవి. ఇందులో మాస్ టీచర్లు, డాక్టరు టీంలు, పి.ఎన్.ఎం. కళాకారులు, స్థానిక పార్టీ కమిటీలు, ఆర్.పి.సి. సభ్యులు, దళ సభ్యులు, గార్డ్స్, కమాండర్స్ పాల్గొన్నారు.

ఒకరోజు అందరం గుంపుగా కూర్చొని మాట్లాడుకుంటున్నప్పుడు అందులో ఒకరిని గురూజీగా ఎన్నుకొని మిగిలిన వారంతా వరుసగా ప్రశ్నలు వేసే వెంటనే సమాధానాలు వినే పద్ధతిగా (ఆటగా) మొదలయింది చర్చా వేదిక.

ఇది మూడు రకాల పద్ధతుల్లో కొనసాగింది. మొదటి పద్ధతిలో విద్యార్థులు వేసే ప్రశ్నలు అనేక రకాల విషయాల్ని తడిమేవి. అక్కడ అప్పుడు కూర్చున్న వారిని బట్టి విషయాలు మార్పు చెందేవి. జనతన సర్కార్ కామ్రేడ్స్‌తో సామాజిక అంశాల్ని మాట్లాడిన సందర్భాల్లో వాళ్లు అడిగిన ప్రశ్నల్ని పరిశీలిస్తే మంచిగా ఆలోచిస్తున్నారనేది అర్థమౌతుంది.

సోషలిస్టు సమాజంలో సంతలు ఉంటాయా?

అమరులకు స్థూపాలు నిర్మిస్తామా?

ఎవరి ఇంటిలో వారే వంట చేసుకుంటారా?

మన పార్టీ రహస్యంగా పని చేస్తుందా?

చాలా ప్రశ్నలు రేపటి సమాజంలో మన కర్తవ్యాలు ఏమిటీ అనే విధంగా ఉన్నాయి. ఒక సందర్భంలో ప్రజల మధ్య చర్చిస్తున్నప్పుడు "గరీబు జనతా ఆకలితో సమిష్టి పనుల్లో పాల్గొంటున్నారు కదా దానికి పరిష్కారం ఏమిటి?" అని అడిగినప్పుడు ఒక గ్రామంలో ప్రజల నుండి "అందరం మధ్యతరగతి స్థాయికి ఎదిగేలా వారికి కూడా భూమి ఇవ్వాలి" అని, మరో గ్రామంలో "అందరం కలిసి పని చేస్తున్నాం కదా, పండిన పంటను సమానంగా పంచుకుంటే సరి" అన్నారు. ఇది సువిశాల కార్మికవర్గ దృక్పథం. భవిష్యత్‌లో జనతన సర్కార్లు వున్న గ్రామాల్లో జరగాల్సిన మార్పు అదే. ఇందుకు మన జనతన సర్కార్ల నిర్మాణాత్మక కృషిని అభినందించాల్సిందే! నేటి కోబ్రాల దాడిలో ప్రజాయుద్ధం, ప్రజామిలీషియా, జనతనా సర్కార్‌ల పాత్ర కనుగుణంగా ఎన్నో చర్చలు చేశాం.

రెండవ పద్ధతిలో గురూజీల ప్రశ్నలకు విద్యార్థులిచ్చే సమాధానాలు అనేకం ఉండేవి. వాటి మంచి చెడులను చర్చించి సరైన సమాధానాన్ని స్పష్టం చేస్తూ చెప్పడం వుంటుంది.

ప్రాణమెక్కడ ఉంటుంది? అన్న ప్రశ్న అనేక రోజులు అందరి మధ్య చర్చ అవుతుంది. దానికి సమాధానాలు మనిషిలో, జంతువులో, పక్షిలో, చెట్టు లోపల అని వస్తుంది. మరి మనిషిలో ఎక్కడా? అంటే, గుండెలో, మెదడులో, శరీరం లోపల, చర్మం లోపల, కణంలో అంటారు. రాయిలో, నీటిలో, నిప్పులో, బ్యాటరీలో, సూర్యుడిలో ఉంటుందా? ఉండదు... ఉంటుంది... అనుమానం వారిలో కనబడేది.

మరల ప్రాణం అంటే? మరో రూపంలో ప్రశ్న.

మనలా బతకడం, జంతువులా కదలడం, పక్షిలా ఎగరడం, చెట్లు పువ్వులు పూసి కాయలు కాయడం... తలా ఒక సమాధానం. చెట్టుకి, పిట్టకి మధ్య, పిట్టకి జంతువుకు మధ్య, జంతువుకి మనిషికి మధ్య తేడా ఏమిటి?

కదలవు-చచ్చిపోతాయి... బండలు-ఇలానే ఎన్నో...

మనిషి చనిపోయాక ప్రాణం ఎక్కడికి పోతుంది?

ఆకాశంలోనికి... మట్టిలోనికి... గాలిలోనికి... ఏమో...

వారి సమాధానాలు సంశయంతోనే ఉండేవి

అన్నింటినీ క్రోడీకరించి ప్రాణి అంటే?

ఒకటి - పుట్టడం, నశించడం ఉంటుంది. రెండు - తినడం జీర్ణం చేసుకోవడం, విసర్జించడం ఉంటుంది. మూడోది - పిల్లల్ని కని సంతానాన్ని వృద్ధి చేయడం. ఈ మూడు లక్షణాలు ఉంటే ప్రాణి, లేకుంటే నిర్జీవి అని చెప్పడం జరిగేది.

ఈ చర్చలోనే ఉడుముల కడుపులో పాములు పుట్టవని ఏ జాతి జీవి - ఆ జాతినే పుట్టిస్తుందని చెబుతూ మూఢ నమ్మకాలు, అంధ విశ్వాసాలు ఎలా కలుగుతాయో వివరించి శాస్త్రీయతను అర్థం చేయించడం జరిగేది. (సోఫీస్ వరల్డ్ - జోస్టిన్ గార్డర్) అనుసరించిన పద్ధతిని ఇక్కడ ప్రాక్టీస్‌లో పెట్టి చూస్తే మంచి ఫలితమే వచ్చింది. ఇలా విజ్ఞానాన్ని వినోదాన్ని కలిగిస్తూ అనేక ప్రకృతి విజ్ఞానశాస్త్ర విషయాల్ని ఎడ్యుకేటివ్‌గా చర్చించడంతో అందరిలో ఉత్సాహం కలిగింది. ఈ పద్ధతి అందరూ ప్రయత్నించవచ్చు. ఎలుకలు పెట్టే గుడ్లు ఏ రంగులో ఉంటాయి (!) లాంటి ప్రశ్నలతో ఉత్సాహపరుస్తూ నెత్తురు రంగు, పాలగుణం, ఆకుల్లో పచ్చదనంలతోపాటు విశ్వ రహస్యాలు చెప్పవచ్చు. ఇక మూడవ పద్ధతిలో గురుజీ ఒక ప్రశ్నవేసి చెప్పడానికి ముందుగా

చర్చించాల్సిన విషయానికి సంబంధించిన కథను చెప్పి తర్వాత రోజున ఆ ప్రశ్నకు జవాబును చర్చించడం జరిగేది. ఉదాహరణ కోసం ఒక కథ చెప్పుకుందాం!

రెండు పిట్టలు ఒక చెట్టు మీద కూర్చున్నాయి.

మొదటి పిట్ట పేరు రామే, రెండో పిట్ట పేరు సోమే అనుకుందాం.

"అక్కడ భూమి మీద వడ్ల గింజలున్నాయి" అంది రామే.

"ఇంకేం మరి నడు తినవచ్చు కదా" అంది సోమే.

"వాటిని నేను చూసాను అవి నావి" రామే

"ఎవ్వరు చూస్తే ఏమిటీ అవి ఎవ్వరికి దొరికితే వారివే" మనం స్నేహితులం కదా కలిసే తిందాం పద పద" సోమే.

"కాదు అవి నాకే కావాలి" రామే.

రెండింటి మధ్యన తగాదా పెరిగింది. సోమే వాటిని తినడానికి దిగుతుంటే రామే వేగంగా వచ్చి దాని తల మీద ముక్కుతో పొడిచింది. ఇక రెండు తరుముకుంటూ, పొడుచుకుంటూ అలాగే ఒక గంటసేపు పోట్లాడుకున్నాక అలసిపోతాయి. అప్పుడు రెండు రాజీ పడ్డాయి. ఆ గింజల్ని కలిసి తినాలని నిర్ణయించుకున్నాయి. ఆ చెట్టు దగ్గరకు వచ్చి గింజలు ఉన్న చోటకి వెళ్లాయి. అప్పుడే ఒక కోడిపెట్ట తన పిల్ల గుంపుతో వచ్చి వాటిని మొత్తం తిని అక్కడి నుండి వెళ్లిపోతూ కనబడింది. అది చూసాక సోమేకి ఒక్కసారిగా ఆకలి, కోపం పెరిగిపోయాయి.

రామే వైపు తిరిగి కోపంగా...

"నీకు బుద్ధి లేదు. నీతో ఇంకా స్నేహం చేయనుపో" అని అక్కడి నుండి వెళ్లిపోతుంది. పోతూ పోతూ "ఆ కోడి చూడు ఎంత బుద్ధిగలదో" అని అంటుంది. రామేకు ఏడుపొస్తుంది. "నాకు బుద్ధిలేదా?" అని పౌరుషం కలుగుతుంది. చాలాసేపటికి ఎండ తీవ్రం కావడంతో అక్కడి నుండి చెట్టు నీడకు వెళ్లి ఆలోచిస్తుంది. వెంటనే బుద్ధి నేర్చుకోవాలని తీర్మానించుకుంటుంది. బుద్ధి నేర్చుకునే మార్గాన్ని ఆలోచించి కోడిపెట్ట దగ్గరకు వెడుతుంది. "దయచేసి నాకు బుద్ధి నేర్పండి" అంటుంది. ఆ కోడి తన చిన్న పిల్లల్ని చూపించి వాటికి తిండి సంపాదించాలి. నాకు కుదరదు అంటుంది. తర్వాత రామే వెళ్లి అడిగినా పాటకత్తె కోయిల పాటలు పాడడానికీ, నాట్యకత్తె నెమలి నాట్యం చేయడానికి, గద్ద వేటకు, కొంగకు జపం చెయ్యడానికి, పక్షి వైద్యుడు గుడ్లగూబ (పగలు కండ్లు కనపడకపోయినా) సమయం చాలదని చెప్పి రామేకు మాత్రం బుద్ధి నేర్పరు. ప్రతిచోటా నిరాకరణ. రామెకు నీరసం వచ్చేస్తుంది. రామెకు తిండిలేదు. గూడు లేదు. స్నేహితుల్లేరు. ఒంటరై బక్కచిక్కిపోయింది. ఈ లోపల వర్షాలు వచ్చాయి. తడిసిపోయింది. చలికాలం మొదలయింది. చలికి వణుకుతుంది. అన్ని పక్షులూ రామేను చూసి "బుద్ధి లేదు" అంటున్నాయి. అది ఇంకా కుంగిపోతుంది.

ఒకరోజు రామే తీవ్రంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. వెంటనే కష్టపడి గూడు కట్టుకుంది. తిండి సంపాదించుకుంది. దానికి బుద్ధి వికసించి శక్తి వచ్చినట్లయింది. దానిని చూసి జంట పక్షి చేరింది. గుడ్లు పెట్టి పొదిగి పిల్లల్ని చేసింది. రామేకు ఇప్పుడో సంసారం ఉంది. దాన్ని ఇప్పుడు "తెలివైనది" అంటున్నారు. ఎందుకలా అంటున్నారు? రామెకు బుద్ధి ఎలా వచ్చింది? ఇప్పుడు రామేను ఎవ్వరైనా "నాకు బుద్ధి నేర్పుతారా" అని అడిగితే "ప్రతికూలతే నేర్పుతుంది" అని సమాధానం చెబుతుంది.

ఈ కథ గురించి ఎంత చర్చ చేయవచ్చో, ఆ విస్తృతి ఎంతో మనకు తెలియనిది కాదు. జ్ఞాన సిద్ధాంతాన్నంతా ఇక్కడ చెప్పుకోవచ్చుకదా? ఇలాగే పిపీలికం, తెల్ల గుర్రపు పిల్ల, నల్లచేప పిల్ల కథ, రాజుగారి కలలు, దుప్పి జాతి నాయకుడు, జి.ఆర్. మహర్షి చెప్పిన కోతి కథల్లాంటివి ఎన్నయినా చెప్పుకోవచ్చు. "ఏనుగు - చీమ", "కోతి తోక" కథలు మన వాళ్లకు గొప్ప ఉత్సాహాన్నిస్తాయి.

ఇదంతా మేం మా ప్రయాణాల్లో, ఫీల్డ్ స్టడీలో, డి.వి.సి. మీటింగ్‌ల సందర్భంగా, చర్చగా జరపడంలో రెండు జిల్లాల కేడర్లను, సంఘ నాయకుల్ని బాగా ఉత్సాహపరిచింది. ఇలా రెగ్యులర్‌గా జరుగుతే మంచిగా ఉంటుందని అన్నారు. కొన్ని ప్రశ్నలు తయారుచేసి ఇవ్వడంతో సమిష్టి నిర్వహించే వారికి, టీచర్ల టీం "ఇది కొత్త అనుభవం - ఇంటరెస్టు పెరిగింది. అనేక విషయాలు తెలిసాయి. మేం కూడా చేస్తాం, అని మాట్లాడారు. ప్రశ్నలు అందరూ రాసుకుంటున్నారని కూడా ఉత్సాహంగా రిపోర్టు చేశారు. అన్ని స్కూల్స్ గురుజీలకు ప్రశ్నలు, జవాబులు కాపీలు రాసి పంపిస్తామని కూడా హామీ ఇచ్చారు.

చివరగా ఒకే విషయాన్ని చర్చించడం మూలంగా విద్యార్థుల్లో శ్రద్ధ తగ్గుతుంది. అనేక రకాల విషయాల్ని మార్చి మార్చి చర్చిస్తే, అదీ వివిధ పద్ధతుల్లో చేస్తే అందరూ ఉత్సాహంగా పాల్గొంటారు. వారిలో విజ్ఞాన జిజ్ఞాస రేకెత్తిన తర్వాత రాజకీయ, మిలిటరీ, ఐక్య సంఘటన... ఇలా అన్నీ చర్చించవచ్చు. వాళ్లు వినకుండా, చర్చలో భాగం కాకుండా ఎంత చెప్పినా ఉపయోగం ఉండదు. పోలికలు, తేడాలు ఉన్నవాటిని ఒకచోట చేర్చి చెప్పడం ద్వారా బాగా గుర్తుంటుంది. ఇక్కడి కామ్రేడ్స్‌కు చెప్పిన ఈ విధానం బాగా అర్థం అయిందని మాకనిపించింది.



అనువాదం

# గతితార్కిక భౌతికవాదం

ఐరా గొలోబిన్
స్వేచ్ఛానువాదం: కొడవగంటి రోహిణీప్రసాద్

1911లో జన్మించిన ఐరా గొలోబిన్ న్యుయార్క్ లో పౌరహక్కులు, ఇమిగ్రేషన్ రంగాల్లో న్యాయవాదిగా ప్రాక్టీసు చేశారు. 96వ ఏట కూడా చురుకుగా ఆలోచించగలిగే స్థితిలో ఉన్న ఈ మేధావి యువతకు ఆదర్శం. 1950ల నుంచి 1980ల దాకా రాజకీయంగా తమకు నచ్చనివారిపై ప్రభుత్వం బనాయించిన ఎన్నో కేసులు చేపట్టి, అటువంటి పెద్దపెద్ద కేసుల్లో అన్యాయాలకు గురైనవారి పక్షాన నిలిచి వాదించిన ధీశాలి. రెండో ప్రపంచయుద్ధకాలంలో పసిఫిక్ ప్రాంతంలో పనిచేశారు. 'American Veterans of the Philippine Campaign' సమాచారపత్రికలో తరుచుగా వ్యాసాలు రాశారు. 'Committee for a Democratic Far Eastern Policy, American Committee for the Protection of the Foreign Born' వగైరాలలో సభ్యుడుగా పనిచేసి గతితార్కిక భౌతికవాదం గురించి అనేక వ్యాసాలు రాశారు. తన అనుభవాలను గురించి 1987లో 'Winds of change : an immigration lawyer''s perspective of fifty years' అనే రచనలో వివరించారు. మార్క్సిజానికి మూలాధారంవంటిదైన గతితార్కిక భౌతికవాదం అంటే ఏమిటో తెలిపే పెద్ద గ్రంథం 'Dialectical Materialism: its laws, categories, and practice' ఆయన రచనల్లో ముఖ్యమైనది. దానికి స్వేచ్ఛానువాదాన్ని పాఠకులకు ధారావాహికంగా అందిస్తున్నాం.

## కృతజ్ఞత

ఎన్నో ఏళ్ళబట్టీ సాగిన ఈ గ్రంథరచన ఇప్పటికి పూర్తయింది. అప్పట్లో ఇదొక పరిమిత లక్ష్యంతో మొదలయింది. 1930ల ప్రారంభంలో లెనిన్‌గ్రాద్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫిలాసఫీ సంస్థ వెలువరించిన మార్క్సిస్ట్ తత్వశాస్త్రం అనే గ్రంథం ఆధారంగా ప్రాథమిక రచన చెయ్యడానికి ఒక ప్రచురణకర్తతో 1950లో నాకు అంగీకారం కుదిరింది.

ఇలాంటి విషయాల్లో నాకు కొన్ని సంగతులు తెలియవనిపించడంతో కొంత అధ్యయనం మొదలుపెట్టాను కాని ఇదంత త్వరగా తేలేది కాదని నా కర్థమైంది. చదువుతున్నకొద్దీ చదవవలసినది ఇంకా ఎంతో ఉందని అనిపించసాగింది. ఏళ్ళు గడుస్తున్న కొద్దీ నా బంధుమిత్రులందరూ నేనేదో తలకు మించిన బాధ్యత చేపట్టాననీ, ఇలా చదవడం, రాయడం ఎంతకీ తెగని వ్యవహారమనీ భావించసాగారు.

ఇది కాక వకీలుగా నా బాధ్యతలు మరిన్ని అంతరాయాలు కలిగించడంతో ఈ అభిప్రాయం బలపడింది. 1950, 1960లలో నేను ప్రచ్ఛన్న యుద్ధం (కోల్డ్ వార్) కారణంగా అమెరికాలో వేధింపులకు గురి అయినవారి వకాల్తా పుచ్చుకున్నాను. వీరిలో కొందరికి వామపక్ష పార్టీల్లో సభ్యత్వం, లేదా సాన్నిహిత్యం ఉన్నందువల్ల దేశబహిష్కరణ విధించారు. మరికొందరిని దేశ వ్యతిరేక కార్యకలాపాల అభియోగంతో శాసనసభ, సెక్యూరిటీ కమిషన్ వగైరాల విచారణకు హాజరు కమ్మన్నారు. 1970లలో నా దృష్టి కాందిశీకుల హక్కులకేసి మళ్ళింది. తక్కిన కార్యకలాపాలెన్నో నాకు తీరిక లేకుండా చేశాయి. నిజానికి ఇటువంటి విషయాల్లో నా ప్రమేయం ఈ పుస్తకరచనతో మమేకం కాసాగింది. ఇవన్నీ గతితార్కిక భౌతికవాద సూత్రాల గురించిన నా సిద్ధాంతాలను ఆచరణశీలంగా పరీక్షించుకునే అవకాశాలను కల్పించాయి. ఆ విధంగా నా ప్రతిపాదనలను సరిదిద్దుకుని గాఢతరం చేసుకోగలిగాను.

ఈ పుస్తకం ముగించటానికి నెలల తరబడి అధ్యయనమూ, రచనా చెయ్యవలసిరావడంతో నా కుటుంబసభ్యులు ఎంతో ఓర్పుతో సహకరించారు. అలాగే మిత్రులందించిన అమూల్య సాంకేతిక సహాయం కూడా ఎంతో లభించింది. బెర్నార్డ్ సీమన్ (Bernard Seeman), సూసన్ వారెన్ (Susan Warren) నాకు విలువైన సలహాలూ, విమర్శలూ అందజేసినందుకు వారికెంతో ఋణపడి ఉన్నాను. ఈ పుస్తకానికి రూపకల్పన చేసిన లిండా బ్రిగ్స్(Linda Briggs), పుస్తకం తయారీకి సలహాలిచ్చి ఇతరత్రా తోడ్పడిన సూసన్ లోవ్ (Susan Lowes) ఎంతో శ్రమ తీసుకుని చాలా సహాయం చేశారు. వారందరికీ ఎన్నెన్నో ధన్యవాదాలు!

ప్రస్తుతయుగంలో సంఘటనలన్నీ అల్లకల్లోలంగా, జటిలంగా, అంతకంతకూ వేగంగా జరిగిపోతున్నాయి. ఈ పరిస్థితిలో గతితార్కిక భౌతికవాదాన్ని సమగ్రంగా వివరించే ఈ పుస్తకం పాఠకులకు ప్రపంచాన్ని గురించీ, తమ గురించీ స్థిరైన అవగాహన కలిగిస్తుందనీ, పరిస్థితులను మెరుగుపరిచేందుకు తోడ్పడుతుందనీ నా ఆశ. అంతేకాదు సోషలిస్ట్ సమాజ నిర్మాణానికి పాటుపడేవారికిది ఉపయోగకరం కాగలదని కూడా ఆశిస్తున్నాను.

## రచయిత వివరణ

### వివరణ పద్ధతి, పరిధి

ఒకవంక సామ్రాజ్యవాదం పతనమౌతున్న లక్షణాలు అంతకంతకూ పెరగడం, తీవ్రమవడం కనిపిస్తోంది. అయితే ఇటీవలి దాకా సోషలిజమొక్కటే పరిష్కారమని నమ్మిన

చాలామందికి మళ్ళీ సందేహాలూ, ప్రతికూలతా కలుగుతున్నాయి. అంతకుముందు వరకూ మార్క్సిజం లెనినిజం, దాని తత్వధోరణిని వివరించే గతితార్కిక భౌతికవాదం పట్ల అనుకూలత కలిగి ఉండిన చాలామందికి వాటిలో నమ్మకం సన్నగిల్లి, నిస్పృహ మొదలైంది. అందుకు కారణం 1950ల మధ్య కాలంలో సోవియట్ సోషలిస్ట్ సమాఖ్య (యూఎస్ఎస్ఆర్) లో జరిగిన సంఘటనలూ, పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనాలో (ముఖ్యంగా 1970ల మధ్య కాలంలో) జరిగిన సంఘటనలే. అంతేకాక, పెట్టుబడిదారీ విధానం తక్షణమే (లేదా త్వరలోనే) కుప్పకూలిపోతుందని అడపాదడపా చెపుతూ వచ్చిన మార్క్సిస్ట్ లెనినిస్ట్‌ల మాటలేవీ నిజంకాలేదు. దాంతో ఈ అపనమ్మకమూ, నిస్పృహా బలపడ్డాయి. పైగా ఎన్ని రోగలక్షణాలు కనబడుతున్నప్పటికీ పెట్టుబడిదారీ విధానమే పటిష్ఠమైన వ్యవస్థ అనీ, కలకాలం మన్నుతుందనీ చాలామందికి అనిపిస్తోంది.

గతితార్కిక భౌతికవాదాన్ని ఒక శాస్త్రంగా దాని మూలభావనలను వివరించడమే ఈ పుస్తకం లక్ష్యం. సోషలిస్ట్ దేశాల్లో జరిగిన ఆందోళనకర పరిణామాలను వివరించడానికి పుస్తకం చివర, అనుబంధంలో ఈ భావనల నుపయోగించే ప్రయత్నం చేశాను. ఈ ప్రక్రియలన్నిటికీ కొన్ని ప్రాథమిక సూత్రాలే కారణమని వివరిన్నా, వీటి కొనసాగింపుకు హద్దులు నిర్ణయించేందుకు ప్రయత్నించాను.

ఈ పుస్తకం ఉద్దేశం గతితార్కిక భౌతికవాదానికి సమగ్రమైన, పొందికైన వివరణ నివ్వడమే. అన్ని విషయాల్లోనూ, ప్రక్రియల్లోనూ ఎల్లవేళలా ఎన్నో సూత్రాలూ, విభాగాలూ పనిచేస్తూనే ఉంటాయి. ఇటువంటివే మరికొన్ని సూత్రాలూ, విభాగాలూ కూడా ఎప్పుడూ ఉంటాయి కాని అవి హేతువాద దృక్పథానికి మటుకే వర్తిస్తాయి. ఇవన్నీ ఈ పుస్తకంలో ఉన్నాయి. ("విషయా"లనేవి మారవు. "ప్రక్రియలు" మారుతూ ఉంటాయి. సౌలభ్యం దృష్ట్యా సామాన్యంగా ఇవి రెండూ ఈ పుస్తకంలో పర్యాయపదాలుగా కనిపిస్తాయి. "విషయా"లంటే అవి వస్తువులు, అస్తిత్వాలు, గుణాలు, లక్షణాలు, వ్యవస్థలు, స్థాయిలు వగైరాల్లో ఏదైనా కావచ్చు. David Bohm రచన Causality and Chance in Modern Physics పుట 145). వేల ఏళ్ళబట్టీ పాలకవర్గాల సొత్తనిపించుకున్న "వివేకం" గురించినది చివరి అధ్యాయం. అందులో ఈ పుస్తకాన్ని మొత్తంగా సమన్వయం చేసే అంశాలున్నాయి.

ఈ అంశాలను పటిష్ఠం చేసేందుకు రకరకాల నిదర్శనాలు ఉపయోగపడ్డాయి. వీటిలో కొన్ని ప్రాచీన చైనా, భారతీయ, ఆఫ్రికా, గ్రీక్ తదితర నాగరికతలకు చెందినవి కాగా మరికొన్ని మానవశాస్త్రం, జీవ, రసాయనిక, భూవిజ్ఞాన, గణిత, భౌతికశాస్త్రాలే కాక, ఆర్థిక, రాజకీయశాస్త్రాలకు చెందినటువంటివి. ఇంకొన్ని ప్రత్యేకంగా చరిత్ర, సాహిత్యంవంటి మానవీయశాస్త్రాలలోనివి. అలాగే అమెరికా చరిత్ర గురించిన ఉల్లేఖనాలూ, నిత్యజీవితానికీ సంబంధించిన నిదర్శనాలూ ఉన్నాయి. ఈ గతితర్కపు సామాన్య సూత్రాలనూ, విభాగాలనూ సర్వసమ్మత సిద్ధాంతాలుగా చూపలేదు. నిదర్శనాలతో నిరూపించలేదు. నిదర్శనాలన్నీ సూత్రాలనూ, విభాగాలనూ గురించి తెలియజెప్పేందుకే కాని వాటిని నిరూపించేందుకు కాదు. ఎందుకంటే ఎన్ని ఉదాహరణలు ఇచ్చినప్పటికీ అవి నిరూపణకు పనికిరావు.

గతితర్కపు మూలభావనల పుట్టుకనూ, వికాసాన్నీ గురించి జాడతీస్తే తప్ప వాటిని అవగాహన చేసుకోలేం. గతితార్కిక భౌతికవాదాన్ని గురించిన రచనలు సామాన్యంగా దాన్ని పూర్తి చారిత్రక పద్ధతిలో వివరించవు. ఎందుకంటే తాత్విక విషయాలను గుర్తించడం (ఫిలసాఫిక్ కాగ్నిషన్) ఎల్లప్పుడూ ఒకేలా లేదు. విజ్ఞానం వికసించక ముందూ (పూర్వవైజ్ఞానిక స్థాయి), తరవాతా, విజ్ఞానాన్ని విరోధించే దశలోనూ ముఖ్య పరిణామాలు కలిగాయి. (తాత్విక విషయాల పరిజ్ఞానం పూర్వవైజ్ఞానిక స్థాయి నుంచి క్రమంగా పెరుగుతూ వచ్చింది. ఇందులో కళల, వివిధ శాస్త్రాల ప్రత్యేక తాత్విక అంశాల నుంచి మొత్తం తాత్విక చింతనదాకా ఎదిగిన పరిణతి కనిపిస్తుంది. ఈ పుస్తకంలో "శాస్త్రీయ తత్వశాస్త్రం, మార్క్సిస్ట్ తత్వశాస్త్రం, గతితార్కిక భౌతికవాదం" అనేవన్నీ పర్యాయపదాలుగా ప్రయోగించబడ్డాయి) ఈ దశలు అంత స్పష్టమైనవి కావుగాని శాస్త్రీయ తత్వ అంశాల అవగాహన ఎన్నో హెచ్చుతగ్గులతో, అస్పష్టంగా, పాక్షికంగా, అయోమయంగా కొనసాగింది. సరిగ్గా చెప్పాలంటే విజ్ఞానం వికసించక మునుపటి దశలో ఎన్నో ఉపదశలుండేవి. వీటిలో ప్రకృతి, సమాజం, భావాలు మొదలైన సామాన్య విషయాల గురించిన అశాస్త్రీయ అవగాహన ఎక్కువ. దానితో బాటు కొన్ని వైజ్ఞానిక, విజ్ఞాన విరోధక అంశాలు కూడా కలగలిసి ఉండేవి.

ఈ పుస్తకం గతితార్కిక భౌతికవాదాన్ని మూడు దశలుగా విభజిస్తుంది. మొదటిది విజ్ఞానం వికసించక ముందుండిన పూర్వ వైజ్ఞానిక దశ. ఇందులో వర్గ సమాజం గురించినదీ, అంతకు పూర్వపు సమాచారమూ పేర్కొనబడ్డాయి. పియాజే (Piaget) తదితరులు చిన్నపిల్లల ఆలోచనల్లో జరిగే పరిణామాన్ని ఎలా విశ్లేషించారో తెలుస్తుంది. రెండోది వైజ్ఞానికదశ. ఇందులో వివిధ విజ్ఞానశాస్త్రాల విశేషాలూ, హెగెల్, మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావోల ప్రతిపాదనలూ ఉంటాయి. మూడోది విజ్ఞాన విరోధక దశ. ఇందులో సిడ్నీ హుక్ (Sidney Hook), కార్ల్ పోపర్ (Karl Popper), హెర్బర్ట్ మార్క్యూస్ (Herbert Marcuse), సోరెన్ కీర్క్‌గార్డ్ (Soren Kierkegaard), ఝూఁ పోల్ సార్త్ర్ (Jean Paul Sartre), లుడ్విగ్ విట్‌గెన్‌స్టయిన్ (Ludwig Wittgenstein), ఎరిక్ ఫ్రామ్ (Erich Fromm), కార్ల్ జాస్పర్స్ (Karl Jaspers), గేబ్రియెల్ మార్సెల్ (Gabriel Marcel), బరస్ స్కినర్ (Burrhus Skinner), పాల్ టిలిచ్ (Paul Tillich), జె. కృష్ణమూర్తి తదితరుల ప్రతిపాదనలుంటాయి. (పరిచయం, సమన్వయం అనే అధ్యాయాల్లో మటుకు ఈ మూడు రకాల విభజనలుండవు). పుస్తకాన్ని మొత్తంగా చదివిన మీదట ఈ మూడు రకాల విభజన సరైనదో కాదో పాఠకులే నిర్ణయించుకోవచ్చు.

ఇదికాక చారిత్రక భౌతికవాదపు అంశాలను కూడా ఈ మూడు దశలకూ జోడించడంతో మరొక ప్రయోజనం

కలుగుతుంది. గతితార్కిక భౌతికవాద భావనల వికాసానికి సమాజపు ఉత్పత్తి పద్ధతులతోనూ, వాటి సాంకేతిక స్థాయితోనూ ఎటువంటి పరస్పర సంబంధాలుండేవో అర్థమవుతుంది.

వైజ్ఞానికదశకు ముందుండిన పరిస్థితిని పిల్లల మనోవికాసం ద్వారానూ, నమ్మోదైన సమాజచరిత్ర ద్వారానూ తెలుసుకోవచ్చు. యదార్థప్రపంచాన్ని అవగాహన చేసుకునే గుర్తింపు ఆదిమదశలో పిల్లల మనోవికాసంలాగే ఎదిగింది. దీన్ని గురించి నమ్మోదైన దాఖలాలు కొద్దిగానే ఉన్నాయి. సోక్రటీస్‌కు మునుపటి సమాజ చరిత్రలోని భౌతికవిజ్ఞానం మొదలైన విషయాలన్నీ ఏడు నుంచి పది సంవత్సరాల వయసుగల పిల్లల గ్రహణశక్తికి సమానంగా అనిపిస్తాయి. ఈ పోలికల వివరణ ఈ పుస్తకంలో లభిస్తుంది.

విజ్ఞానమనేది పనిముట్ల తయారీతోనూ, పురాణాలూ, మూఢనమ్మకాలతోనే మొదలవుతుంది. నిజమేదో తెలుసుకునే ప్రయత్నంలో మూఢనమ్మకాలన్నీ బొత్తిగా అర్థం లేనివిగా మొదలై, క్రమంగా కాస్త మెరుగౌతాయి. దృక్పథంలోనూ, ఆలోచనా పద్ధతుల్లోనూ ఇటువంటి పరిణామం కనక జరగనట్టయితే విజ్ఞానం మొదలవడానికి ప్రాతిపదికగాని, సరైన దిశగాని ఏర్పడదు.[1] యదార్థతను అవగాహన చేసుకునే పూర్వవైజ్ఞానిక దశలో "కొన్ని సత్యాలు బీజరూపంలోనూ, తప్పుల తడక అభిప్రాయాలు అయోమయంగానూ కలగలిసి ఉంటాయి".[2] ఆధ్యాత్మిక అంశాలకు ప్రాధాన్యతనిచ్చి ఆదర్శవాదానికి దారితీసే ప్రాచీన తత్వధోరణులు కూడా ఈ దశకు చెందినవే.[3] "స్వర్గం ఆదేశం" అనే గ్రంథం గురించి చెపుతూ మావో "ఎన్నో వేల ఏళ్ళ క్రితమే అది విశ్వాన్ని గురించీ, ప్రకృతి, చరిత్ర గురించీ అనేక ప్రశ్నలు లేవనెత్తడం అద్భుతమనిపిస్తుంది" అన్నాడు.[4]

తత్వశాస్త్రంలోనూ, ఆర్థిక, రాజకీయ శాస్త్రాల్లోనూ వైజ్ఞానిక తత్వశాస్త్రం ఒక సమగ్రమైన శాస్త్రంగా (మార్క్స్, ఎంగెల్స్ సాధించిన విజయం) ఆవిర్భవించగానే దానికి విరుద్ధమైన విజ్ఞాన విరోధక ధోరణి కూడా ఉత్పత్తి అవుతుంది. వైజ్ఞానిక, విజ్ఞాన విరోధక తత్వశాస్త్రాలు రెండూ తలపడక తప్పదు. "...(మార్క్స్ ప్రతిపాదించిన) సిద్ధాంత చర్చలోని లక్షణాలన్నిటినీ పెట్టుబడిదారీ పద్ధతిలో ఉండే సిద్ధాంత చర్చ సరిగ్గా ప్రతిబింబిస్తుంది".[5]

వైజ్ఞానిక తత్వశాస్త్రం మటుకే అభ్యసించి, విజ్ఞాన విరోధక తత్వశాస్త్రం అభ్యసించనివారికి సమాజంలో సామాన్యంగా కలిగే ఒత్తిళ్ళని ఓర్చుకోవడం కూడా కష్టమౌతుంది. "సత్యమూ, మంచితనమూ, సౌందర్యమూ వగైరాలన్నీ అబద్ధమూ, చెడూ, అందవికారమూ అయిన అంశాల సరసనే వాటితో పోరాడుతూ పెరుగుతాయి...ఎవరి విమర్శకూ మార్క్సిస్టులు వెరవనవసరం లేదు...అతి సుకుమారంగా పెంచిన మొక్కలు బలమైనవిగా ఎదగజాలవు"[6] తత్వశాస్త్ర రంగంలో పొరబాట్లు జరిగే అవకాశం ఎక్కువే కాని, వైజ్ఞానిక తత్వశాస్త్రం తప్పుదారులు తొక్కకుండా సరైన మార్గాన్నే సాగడం అసాధ్యమే. "మతాలూ, వేదాంతమూ వగైరాల పనికిమాలిన విషయాల వల్ల తప్పుదారి పట్టకుండా సరైన మార్గాన్నే పోవాలంటే ముందుగా అన్నిటికన్నా పెద్ద బొంకు అనదగిన విజ్ఞాన విరోధక తత్వశాస్త్రాన్ని అధ్యయనం చెయ్యాలి"[7] తప్పుడు వేదాంతాన్ని నిర్లక్ష్యం చేస్తే లాభం ఉండదు.

ప్రాథమికంగా తత్వశాస్త్రం సమగ్రమైనది. వైజ్ఞానిక తత్వశాస్త్రం, విజ్ఞాన విరోధక తత్వశాస్త్రం రెండూ దాన్ని విభజించి, వివరించగలిగిన అంశాలే. "అసలు తత్వశాస్త్రం చరిత్రే వైజ్ఞానికమైనది. అందుచేత అది తత్వశాస్త్ర విజ్ఞానమౌతుంది".[8] వైజ్ఞానిక తత్వశాస్త్రాన్ని విస్తృతం చేసి, దాని అవగాహనకు తోడ్పడగలిగినవి దాని పూర్వవైజ్ఞానిక, విజ్ఞాన విరోధకదశలు. ఈ పుస్తకం వాటిని విశదీకరించి, వైజ్ఞానిక తత్వశాస్త్రంతో వాటికి గల సంబంధాన్ని వివరిస్తుంది.

ఈ పుస్తకంలోని అధ్యాయాలనూ, విభాగాలనూ విడివిడిగా పరిగణించనక్కర్లేదు. అవన్నీ పరస్పరం సంబంధం కలిగినటువంటివే. వీటిలో కొన్ని విభాగాలకు కొంతవరకూ ప్రత్యేక అస్తిత్వం ఉంటుంది. ఇవి వర్ణిస్తున్న విషయాలను తరిచి చూసేందుకు ఈ విభజన పనికొస్తుంది. ప్రతి అధ్యాయమూ గతితార్కిక భౌతికవాదాన్ని సమగ్రంగా వర్ణించేదే అయినా ఒక్కొక్క అధ్యాయమూ విడిగా చదవదగ్గదే.

ఈ అధ్యాయాలన్నీ ఒక క్రమంలో కనిపిస్తాయి. అయితే ఇవన్నీ విషయాలను తెలిపే వరసను బట్టి ఉండవు. "మనం విషయాలను కాలానుగతంగా తెలుసుకుంటున్న క్రమంలోనే ఆ అంశాలన్నీ వివరించబడాలని లేదు".[9] ఈ అధ్యాయాల వరస గురించి "మొత్తంగా గతితర్కం" అనే 26వ అధ్యాయంలో "గతితర్కాన్ని క్రమానుసారంగా వివరించే పద్ధతి" అనే విభాగంలో చెప్పబడింది. ఇదంతా క్రమబద్ధంగా అనిపిస్తుంది కాని ఇదొక బోధనాత్మక శైలి మాత్రమే. గతితార్కిక భౌతికవాదం ప్రకృతిలో భాగమేమీ కాదు గనక దాన్నలా అభివర్ణించలేదు.

ఈ పుస్తకం స్థాయి మధ్యస్థమైనది. గతితార్కిక భౌతికవాదపు మూల సూత్రాలనూ, విభాగాలనూ, ఆచరణనూ క్లుప్తంగా వివరించే మొదటి వాచకం వంటిది కాదు. అలాగని ఉద్గ్రంథమూ కాదు. ఎందుకంటేగతితార్కిక భౌతికవాదపు ఒక్కొక్క మూల సూత్రాన్నీ, విభాగాలనూ వివరించడానికి ఒకటేసి రెండేసి పుస్తకాలే రాయవచ్చు.

స్థూలంగా చెప్పాలంటే ఈ పుస్తకం రెండు పుస్తకాల సమ్మేళనంలాంటిది. మొదటిది ఎందరివో అభిప్రాయాలను నాటకీయంగా ఉటంకిస్తుంది. ఒక్కొక్కప్పుడు ఇవి సందర్భానుసారంగా పలుమార్లు కూడా ఉదహరించబడ్డాయి. ఎన్నో శతాబ్దాలనుంచీ ఎందరో ప్రతిభావంతులూ, వాదనల్లో ఉద్దండులూ తమ అభిప్రాయాలను సూటిగా, స్పష్టంగా ప్రకటించారు. నేను చేసినదల్లా ఈ పెద్దల మాటలనూ, వారి గ్రంథాలనూ ఎంపిక చేసి, సందర్భానుసారం ఉటంకించడమే. అలా కాకుండా వారు చెప్పినదాన్ని నా మాటల్లో క్లుప్తీకరించి ఉంటే మూలరచనల్లోని ఉత్తేజం తగ్గి, నిస్సారంగా తయారయేది. ఈ పుస్తకంలోని రెండో

అంశం నా అభిప్రాయాల వ్యక్తీకరణ. ఇలా రెండిటినీ మేళవించడంతో స్పష్టతా, అవగాహనా, చదివే సౌలభ్యమూ పెరుగుతాయని నా ఆశ. ఎందుకంటే ఈ విషయం మీద రాసిన అనేక ఇతర గ్రంథాల్లో సందిగ్ధతా, అర్థం కాకపోవడమూ, వికృతీ, నిస్తేజమూ వగైరా లక్షణాలు కనబడతాయి.

**కొన్ని పరిమితులు**

1. సమాచారం తగినంతగా అందక, నా గ్రంథాన్వేషణ అసంపూర్తిగా మిగిలిపోవడంతో నేను ఎక్కువగా యూరప్, అమెరికాల్లో లభించినదానితో సరిపెట్టుకున్నాను. అందువల్ల ఇతర ప్రాంతాల సంస్కారానికి కొంత అన్యాయం జరిగినట్టే. ఈ విషయంలో ముఖ్యంగా ఆఫ్రికా పట్ల భయంకరమైన వర్ణవివక్షలాంటిది తీవ్రంగా పొడచూపుతుంది. అందువల్లే చాలామంది పాశ్చాత్య శాస్త్రకారుల్లో వర్ణవివక్ష కనబడుతుంది. ఆఫ్రికాకు చెందినదిగా ప్రాచీన ఈజిప్ట్ నాగరికతను గుర్తించడంలోనూ, పాశ్చాత్య నాగరికతలో ఈజిప్ట్ వారసత్వాన్ని అంచనా వెయ్యడంలోనూ వారి అజ్ఞానం బైటపడుతుంది. తొలినాటి గ్రీస్ ఎంత ప్రగతిని సాధించినా, అదంతా అంతకు మునుపు అయిదువేల ఏళ్ళ ఈజిప్ట్ నాగరికతకు కొనసాగింపేనని ప్రొ. జార్జ్ ఎం. జేమ్స్ "The Stolen Legacy" అనే తన పుస్తకంలో మనకు స్పష్టం చేస్తాడు. (అలాగే ఈజిప్ట్ సాంస్కృతిక ప్రగతికి దోహదపడిన ఆఫ్రికా సంప్రదాయం గురించి "The African Origin of Civilization: Myth or Reality?", "Civilization or Barbarism" అనే పుస్తకాల్లో డా. షేఖ్ ఆంటా డియోప్ వివరణ కనబడుతుంది. Legrand Clegg రాసిన వ్యాసం The First Invaders, Journal of African Civilizations, సంపుటి 3, సంచిక 1, ఏప్రిల్ 1981 పు. 15, కూడా చూడవచ్చు. సుమారు 40 వేల ఏళ్ళనాడు ఆఫ్రికాయిడ్ గ్రిమాల్డీ జాతివారు యూరప్‌నుంచి నియాండర్తాల్ ప్రజలను పారదోలడంతో చరిత్ర మొదలవక మునుపే ఆఫ్రికా సంప్రదాయాలు యూరప్ సంస్కృతిలోకి వచ్చి చేరాయి. ఆ విధంగా చరిత్ర పూర్వదశలోనే ఆఫ్రికా నాగరికత యూరప్‌కు ఎగుమతి అయిందని పై పుస్తకం 17 పుటలో చూడవచ్చు). ఈజిప్ట్‌లో విద్యాభ్యాసం చేసిన ప్రముఖుల్లో థేలీజ్, పైథాగొరస్, పార్మెనిడీజ్, జెనో, హిరాక్లిటస్, డెమోక్రిటస్, సోక్రటీజ్, ప్లేటో, అరిస్టాటిల్ తదితరులున్నారు.[10]

2. చదువరుల పరిచయార్థం "కార్మికులూ, వైజ్ఞానిక తత్వశాస్త్రం, తాత్విక వికాసంలోని ముఖ్యదశలు" అనే రెండు ప్రారంభ అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయంలోనే కార్మికులను ప్రస్తావించడంలో నా ఉద్దేశం వారిలో ఆసక్తిని ప్రేరేపించడానికే గాని, ఇతరుల ఆసక్తిని తగ్గించడానికో, ఇతరుల విషయంలో గతితార్కిక భౌతికవాదం అప్రస్తుతమనటానికో కాదు. చాలామంది కార్మికులు గతితార్కిక భౌతికవాదాన్ని ఒక శాస్త్రంలాగా చదవకుండా, దాన్ని గురించి తాము తెలుసుకున్నదంతా అంత ముఖ్యం కాదని భావిస్తారు. శాస్త్రజ్ఞులేమో దానికి మితిమీరిన ప్రాధాన్యం ఉందనుకుంటారు.

3. ఈ పుస్తకంలో, ముఖ్యంగా పూర్వవైజ్ఞానిక, విజ్ఞాన విరోధక ధోరణుల గురించిన అధ్యాయాల్లో మతాల ప్రస్తావన ఉంది. మతాల్లోని తాత్విక అంశాలూ, మతాలని పాలకవర్గాలు అణచివేతకు ఉపయోగించడమూ వివరించబడ్డాయి. తాత్విక అంశాలూ, ఈశ్వరతత్వమూ తదితర విషయాలకు సంబంధించినంతవరకూ మతం మూఢనమ్మకాల్లో పాతుకుని ఉంటుంది. విజ్ఞానశాస్త్రంతో మతానికి తీవ్రమైన విభేదాలున్నాయి. ఈ విషయంలో కొందరు మతపెద్దలకూ, శాస్త్రవేత్తలకూ కూడా అభ్యంతరాలుండవచ్చు. "విజ్ఞానానికి మతంతో పనిలేదు. మతం లేకుండానే అది తన పని చేసుకోగలదు...ఎన్ని సమస్యలున్నప్పటికీ విజ్ఞానమూ, మతమూ సహజీవనం చెయ్యవలసిందే".[11]

ఈ పుస్తకంలో నేను మతాల్లోని తాత్విక అంశాలనూ, దోపిడీవర్గాలు దాన్ని అణచివేతకు ఉపయోగించిన పద్ధతులనూ మాత్రమే విశ్లేషించాను. ఇది పాక్షికమూ, అసంపూర్ణమూ కూడా. ఎందుకంటే బౌద్ధమూ, ఇస్లాం, క్రైస్తవ, యూదు (యుద్ధమూ, శాంతి గురించిన ఐసయా ప్రస్తావన) మతాల్లోని నైతికనిబంధనలు చాలావరకు ఆదిమ జన సముదాయాల్లోని సమసమాజ ధోరణులనీ, మైత్రీ భావనలనీ తలపిస్తాయి. ఒకవిధంగా ఇవన్నీ ఆధునిక సాముదాయక సమాజానికి దారితీసినవే. ఎంగెల్స్ చెప్పినట్టుగా "తొలినాటి క్రైస్తవ మత చరిత్రలో ఈనాటి కార్మిక పోరాటాన్ని పోలిన విషయాలుండడం గమనించదగ్గది".[12] బైబిల్‌లో పాల్ లేఖలలోని కొన్ని అంశాలను ప్రస్తావిస్తూ ఆయన "వీటిలో కొన్నిటిని చూస్తే ఈనాటి అంతర్జాతీయ కార్మిక సంస్థకు చెందినవారెవరో ముందుచూపుతోనూ, ఉత్సాహంతోనూ రాసినట్టనిపిస్తుంది" అన్నాడు.[13] ఎందుకంటే మతవిశ్వాసం కలిగిన లక్షలాది ప్రజలు ఆయుధాల ఉత్పత్తిని నిలిపివెయ్యాలనీ, పీడనకు లోనవుతున్నవారికి విముక్తి లభించాలనీ కోరుకోవడం సామ్రాజ్యవాద ప్రభుత్వాలకు కాస్త కంటగింపుగా ఉంటుంది. ఏది ఏమైనా సాంప్రదాయక మతవిశ్వాసాల ప్రధాన వైఖరీ, మతాధిపత్య సంస్థల ధోరణీ పరస్పరం వ్యతిరేకంగా అనిపిస్తాయి. పీడకుల, వారి దోపిడీ ప్రభుత్వాల సిద్ధాంతాలకూ, అభిరుచులకూ, విలువలకూ సమాజంలోని వ్యక్తులందరూ లోబడి ఉండాలనే విషయంలో అభిప్రాయభేదాలుంటాయి. ఒకవంక మతసంస్కరణకు దారితీసి (దీనివల్లే భూస్వామ్యవ్యవస్థకు బదులుగా పెట్టుబడిదారీ విధానం మొదలయింది) విముక్తిని బోధించే ఈశ్వరవాదమూ, మరొకవంక మత ఛాందసమూ పరస్పరం వ్యతిరేకమైనవి. తీవ్రమైన సామాజిక సంక్షోభం పొంచి ఉందని ఈ వైరుధ్యం సూచిస్తుంది.

సామ్రాజ్యవాదంలో ప్రతిరోధ శక్తులు తీవ్రతరమౌతూ ఉంటే, సాముదాయక, విముక్తి పోరాట ధోరణులు మతరూపాల్లోనే కొనసాగుతాయి. కాని అవి కోట్లాది ప్రజల్లో ధర్మయుద్ధాలకూ, అంతర్‌దృష్టి కలిగిన సాయుధ పోరాట ప్రవృత్తికీ ప్రేరణలనిస్తాయి. ఈ ధోరణి వల్ల వారి మధ్య ఉండే కొన్ని ప్రతిబంధకాలు

తగ్గుతాయి. తమవంటి ఉద్దేశాలే కలిగి, మతవిశ్వాసాలు లేనివారితో సహకరించేందుకు వెనకాడకుండా చేస్తాయి. దీనికొక ఉదాహరణ. సామ్రాజ్యవాద ప్రభుత్వ విధానాలకూ, పరిశుద్ధ క్రైస్తవ మతపు నైతిక నియమాలకూ మధ్య సంఘర్షణ విస్తృతమౌతున్న పరిస్థితిలో చాలామంది మతం వేపుకే మొగ్గుతారు. వామపక్ష భావాలు ఎక్కువగా ఉన్నవార్కైతే "భూతల స్వర్గ నిర్మాణానికి జరిగే విప్లవ పోరాటాల్లో పీడిత శ్రామిక వర్గాల మధ్య ఐకమత్యం ఉండడం ముఖ్యం. పరలోకంలో స్వర్గమేదో ఉందని శ్రామికులకు ఏకాభిప్రాయం ఉండడం అంత ముఖ్యం కాదు".[14]

4. ఈ పుస్తకంలో మతాన్ని గురించిన వర్ణన పరిమితంగా ఉండటమొకటే కాదు. ఆధునికయుగాన్ని మినహాయిస్తే, తత్వశాస్త్రానికి మహిళలు చేసిన కృషి గురించిన ప్రస్తావన కూడా తక్కువగా కనిపిస్తుంది. ప్రాచీనకాలం నుంచీ ఎందరో స్త్రీలు తత్వశాస్త్రంలో చెప్పుకోదగ్గ కృషి చేసినప్పటికీ అదంతా ఇతరులకు ఆపాదించబడుతూ వచ్చింది. వారిని తలుచుకోవడంగాని, గుర్తింపునివ్వడంగాని, వారు చేసినదాన్ని భద్రపరచడంగాని జరగనేలేదు. సమాజంలోని ఎన్నో అడ్డంకులను అధిగమిస్తూ, స్త్రీలు తత్వవేత్తలుగా ఎదగడానికి చాలా కష్టాలు పడవలసివచ్చింది. పితృస్వామ్య వ్యవస్థలోనూ, దానికి వారసత్వంగా వచ్చిన వర్గ సమాజంలోనూ పురుషాధిక్యత మితిమీరడంతో చరిత్రలో గొప్ప తత్వవేత్తలుగా పురుషులకే ఉన్నత స్థానం లభించడంలో ఆశ్చర్యంలేదు. దాన్ని బట్టి స్త్రీల సహజ సామర్థ్యాన్ని అంచనా వెయ్యలేము. మానవజాతిలో సగంకన్నా తక్కువ జనాభాకున్న నైపుణ్యానికీ, విజయాలకూ మాత్రమే గుర్తింపు లభిస్తోంది. అంటే వైజ్ఞానిక తత్వశాస్త్రం అవగాహనా, నానాటికీ మారుతున్న ప్రపంచంలో దాని ఉపయోగమూ ఆటంకపడి తగ్గినట్టే. స్త్రీల సైద్ధాంతిక వికాసానికి అవరోధాలన్నీ తొలగిపోయి, తత్వశాస్త్రంలో జరిగిన ప్రగతికి లింగ వివక్ష అడ్డుతగలడమనేది ఒక చారిత్రాత్మక తప్పిదంగా మిగిలిపోవాలి. అప్పుడే తత్వశాస్త్రానికి రావలసిన గుర్తింపు వచ్చి, అదొక విస్తృతమైన మానవ విజయంగా నిలవగలుగుతుంది.

References:


1. Morris R. Cohen, quoted in Hollinger, *Morris R. Cohen and the Scientific Ideal*, p.150.
2. Ibid
3. Marx, *Introduction to Critique of Hegel's Philosophy of Right*, quoted in Korsch, *Marxism and Philosophy*, p.73
4. Mao, "Talks on Questions of Philosophy", in Schram, *Chairman Mao Talks to the People*, p.230
5. Lenin, quoted in Hyman, *The Tangled Bank*, p.434
6. Mao, "On the Correct Handling of Contradictions among the People", *Selected Works*, Vol.5, pp.409-410
7. Joseph Dietgen, quoted in Lenin, *Materialism and Empirio-Criticism*, in Selected Works, Vol.11, p.391
8. Hegel, *Lectures on the History of Philosophy*, Vol.1, p.6
9. Cohen and Nagel, *An Introduction to Logic and Scientific Method*, p.390
10. Williams, "*The Stolen Legacy:* Greek Plagiarism of Dynastic Egyptian Doctrines", *Journal of African Civilizations*, Vol.3, No.1 (April 1981), PP. 31-37
11. Frank Cardinal Konig, remarks at New York University luncheon, *New York Times*, Sept. 29, 1981
12. Quoted in A.P.Khazdan, "F.Engels on the Origin of Christianity", *Soviet Studies in Philosophy*, Summer 1971, p.82
13. Ibid
14. Lenin, "Socialism and Religion", *Selected Works*, Vol.11, p.661


( ఇంకా ఉంది)



దండకారణ్య డైరీ

ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోనూ, మొత్తంగా దేశ వ్యాప్తంగానూ ముఖ్యంగా ఆదివాసీ ప్రజలపై గ్రీన్‌హంట్ పేరిట అమలవుతున్న అణచివేతలో ఆదివాసీ ప్రజలు ఎదుర్కొంటున్న నిర్బంధం గురించి సాధన అందించిన రిపోర్టు - సం.

# గ్రీన్‌హంట్ ఉత్పాతాలు

- సాధన

(గత సంచిక తరువాయి...)

(3)

కోసాదా పక్కనే ఆయన సహచరి రాధక్క 'పోరుమహిళ వందేళ్ల అంతర్జాతీయ శ్రామిక మహిళా దినం ప్రత్యేక సంచిక' చదువుతూ కూచుంది. రాహీ దళం అక్కడకి చేరడంతోనే కోసాదా ఎదురొచ్చి ఆప్యాయంగా 'లాల్‌సలాం' అంటూ అందరికీ చేయి కలిపాడు. ఆయన వెనుకే రాధక్క, ఇతరులూ కలుపుతూ వచ్చారు. చేతులు కలపడాలూ, లాల్‌సలాం, పలకరింపులూ, నవ్వులూ...ఆ గుంపులో పరిచయం ఉన్న వాళ్లెవరూ? లేనివాళ్లెవరూ అంటూ అందరి కళ్లూ అందరినీ పరిశీలిస్తూ ఎవరి సన్నిహితులతో వాళ్లు మాటల్లో ఉండగానే 'మీరు ఈ వైపు డేరా వేసుకోండి' అంటూ కోసాదా సెక్యూరిటీ దళం కమాండర్ నిర్మల చెప్పింది.

రాహీ దళం కిట్లు దించుకొని మోతీ వెంట నడువగా ఆమె ఎవరి ఫైరింగ్ ఆర్క్‌లు వాళ్లకు కవర్‌తో సహా చూపింది.

'ఇప్పుడే వస్తా మోతీ' అంటూ రాహీ దళ బాధ్యుడు కోసాదా డేరా వైపు దారి తీశాడు. ఆయన వెంటే ఆయన గార్డులు కదిలారు.

కోసానీ, రాహీ దళ బాధ్యుడినీ చూస్తూ రాధక్క తనలో తానే నవ్వుకుంది. 'కలుసుకున్నారంటే మళ్లీ విడిపోయేవరకూ ఒక్క క్షణం కూడా విడిచి ఉండరు వీళ్లు, ఎంత మంచి గోతి (స్నేహం) వీళ్లది !' అనుకుంటూ వాళ్ల మూడు దశాబ్దాల సహచర్యాన్ని గుర్తు చేసుకుంది. 'రా అన్నా కూచో' అంటూ పాలిథీన్ పర్చింది.

కోసాదా ఎప్పటిలా హుషార్‌గా అగుపడడం లేదు. ఆయన బట్టతలను మధ్య మధ్యలో చేత్తో నిమురుకుంటూ దీర్ఘశ్వాస వదులుతున్నాడు. తాడు కట్టిన కళ్లజోడు మెడలో వేలాడుతోంది. ఓ పక్కన హిందీ, మరాఠీ, తెలుగు దిన పత్రికల్నీ, మరో వైపు ఉత్తరాల కుప్పనూ చూస్తుంటే దండకారణ్య పార్టీ కార్యదర్శిగా ఆయన వ్యస్థత చెప్పకనే అర్థమవుతోంది. 'ఏంటీ కోసాదా ! ఈ రోజు అదోలా ఉన్నావు?' అంటూ రాహీ దళ బాధ్యుడు పాలిథీన్‌లో కూచున్నాడు.

'వయనార్ జ్ఞాపకాలు నన్నొదలడం లేదు రాహీ '

'ఏంటో, అంత వదలని జ్ఞాపకాలు !'

'నన్ను ఇప్పటికీ బుధురాం పిలుస్తున్నట్టే అన్పిస్తోంది'

'ఎవరాయన?'

'కేస్‌కల్ ఏరియా డివికెఎంఎస్ అధ్యక్షుడు బుధురాం. ఆయన తూర్పు బస్తర్ డివికెఎంఎస్ డివిజన్ కమిటీ కార్యనిర్వాహక సభ్యుడు కూడా. ఆయనా మార్చ్‌లో కేస్‌కల్ నుంచి నా వెంటే వచ్చాడు. వచ్చే ముందు పార్టీ డివిజనల్ కమిటీ కార్యదర్శి కమలేష్ ఆయనతో విడిగా చాలా సేపు మాట్లాడాడు' అంటూ కాసేపు ఆగి మళ్లీ తనే కొనసాగించాడు.

'బుధురాంకు భార్యా, ముగ్గురు పిల్లలున్నారు. ఊళ్లో ఆయన మంచి పేరున్న ఆదివాసీ రైతు. ఊరి ప్రజల విశ్వాసం చూరగొన్నాడు. ఊరి వాళ్లే ఆయనను ప్రోత్సహించి డివికెఎంఎస్ అధ్యక్షుడిగా నిలుపుకున్నారు.

'ఆయన గతంలో సల్వాజుడుం ఘాతుకాల గురించి విన్నవాడే. సల్వాజుడుం గూండాలు వాళ్ల ఊరి పై దాడి చేయకపోయినా దండకారణ్యంలో, ముఖ్యంగా దంతెవాడ, బీజాపూర్‌లలో ఇండ్లు కాల్చడం, పంటలు తగులబెట్టడం, స్త్రీలపై అత్యాచారాలూ, సామూహిక హత్యలూ, లూటీలూ ఆయనకు తెలుసు. గ్రీన్‌హంట్ మొదలైనప్పటినుండీ మనిషిలో చాలా దిగులు పట్టుకుంది'

కోసాదా బీడీ బయటకు తీశాడు. మళ్లీ తనే 'కాల్చుకుంటే నాకు సమస్య, కాలిస్తే నీకు సమస్య, కాల్చనులే' అంటూ దానిని పక్కన పెట్టేశాడు.

'బుధురాం ను మధ్యలో ఆపావు' గుర్తు చేశాడు రాహీ.

'లేదు రాహీ, నీకు పూర్తిగా చెప్పాలి. నువ్వు ఆయన జీవితాన్ని తప్పక ప్రజలకు చెప్పాలి. నువ్వు రచయితవు కదా' అన్నాడు కోసా.

రాహీ ముసిగా నవ్వుతూ 'సరే' అని హామీ ఇచ్చాడు.

'గ్రీన్‌హంట్ షురువయ్యాక ఫిబ్రవరిలో ఓంగ్‌నార్‌లో ఐదుగురు గ్రామ యువతను పోలీసులు దారుణంగా చంపడం, అడవులూ, ఊళ్లూ విస్తృతంగా గాలించడం, రేషన్ షాపులను మూసివేయడం, పోలీస్ స్టేషన్లలోనే దుకాణాలను పెట్టడం చేశారు కదా. కార్డు తీసుకుని స్టేషన్‌కి వెళితే తప్ప ఏదీ దొరకని స్థితి. చీకటి పడిందంటేనే ఊరు బయట ఎవరు కనబడినా ఫైరింగ్ తప్పదనే చాటింపు, వాహనాల తనిఖీ, చాలా చోట్ల కొత్త పోలీసు క్యాంపులూ, స్టేషన్లూ తెరవడం సహా పోలీసులు కొనసాగిస్తున్న ప్రచార యుద్ధం ఆయన్ని చాలా పరేషాన్ చేసింది. పోలీసులు అరెస్టు చేసి, తీసుకెళ్లి పెడ్తున్న చిత్రహింసలు వినీ, వినీ మనిషి నాతో కూడా చాలాసార్లు 'నేనైతే వాటిని తట్టుకోలేను దాదా' అనేవాడు. నేనూ ధైర్యం చెప్పాను, కమలేషూ మాట్లాడాడు. అయినా మనిషిలో ఏదో కోల్పోయిన ఫీలింగ్ ఎప్పుడూ అగుపడేది రాహీ'.

రాహీ ప్రతి ఒక్క మాటనూ ఇంకించుకుంటూ అలాగే తల వంచుకుని శ్రద్ధగా వింటున్నాడు. రాహీ దూరంనుండి నడుచుకుంటూ వచ్చాడు, తనకూ బుర్ర వేడెక్కుతోంది అని కోసాదా తన గార్డు మంగ్తూను కేకేశాడు.

'మంగ్తూ, మా ఇద్దరికీ కొద్దిగా చాయ్ దొరుకుతుందా'

మంగ్తూ చిరునవ్వుతో 'ఇంగో' అంటూ వెళ్లాడు. కోసాదా మళ్లీ బుధురాం జ్ఞాపకాల్లోకి వెళ్లాడు.

"ఆ రోజు మార్చ్ 5 అనుకుంటా. ఉదయం పది గంటలకు గజేన్ సెంట్రీకి వెళ్లాడు. కొద్ది సేపటికే సెంట్రీకి వెళ్లిన గజేన్ ఒక్క ఉదుటున నా వద్దకు ఉరికి వచ్చాడు. మనిషి చెమటలు కక్కుతున్నాడు. నోట మాట రావడం లేదు. బాతా, కోస్కా (ఏంటీ, పోలీసులా) అని అడిగాను. కాదు అంటూనే బుధురాం డొల్తోర్ అన్నాడు. ఆ మాటతో నేను అదిరిపడ్డాను. ఎక్కడ అనడంతో నన్ను గజేన్ సెంట్రీ వద్దకు తీసుకెళ్లాడు. చెట్టుకు బుధురాం శవం వేల్లాడుతోంది. ప్చ్, గ్రీన్‌హంట్ బుధురాంను బతుకనియ్యలేదు రాహీ' కోసాదా పెదవి విరిచాడు.

'బుధురాం వెత వింటుంటే ఒకప్పటి అహిరి పరికి నారాయణా, దామరంచ మల్లన్నా, ఇంకెందరో దిగులు గుండెల రైతులు గుర్తుకొస్తున్నారు కోసాదా. అందుకే మావో విప్లవం అత్యంత నిర్దాక్షిణ్యమైంది అన్నాడు. గ్రీన్‌హంట్‌ను గట్టిగా ప్రతిఘటిస్తూ అసువులు బాస్తున్న వాళ్లు ఎందరో కాగా, దాని దారుణాలకు తట్టుకోలేక బలవుతున్న వాళ్లు కొందరు' అంటూ రాహీ చేతి గడియారం చూసుకున్నాడు. సరిగ్గా పన్నెండవడంతో రేడియో ఆన్ చేశాడు. ఆకాశవాణి ఆంగ్లంలో వార్తలు మొదలుపెట్టింది. మొదటి వార్తే చిదంబరం మావోయిస్టులకు చేస్తున్న విజ్ఞప్తి - 'అబ్‌జూర్ వయొలెన్స్' అంటూ.

'ఇంతకన్నా క్రూరమైన పరిహాసం ఏముంటుంది' అనుకుంటూ రాహీ రేడియో బంద్ చేశాడు.

'నిజాయితీ గల ఆదివాసీ రైతు బుధురాం నిర్బంధ నిప్పుల కొలిమిని తట్టుకోలేక, ప్రజలకూ, విప్లవోద్యమానికీ ద్రోహం చేయలేనని, తనలో తాను మధనపడి మరో దారి లేదనుకొని ప్రాణాలు తీసుకుని ఏ హానీ తలపెట్టకుండా కన్ను మూశాడు. కానీ ఆయనను తయారు చేసిన పార్టీ నాయకుడు రాము ఇందుకు విరుద్ధంగా శత్రువు ముందు తలొంచాడు. ప్రాణ భీతితో వరంగల్లో శత్రువుకు లొంగిపోయి ఉద్యమానికి తీరని నష్టం చేశాడు. ఒకరు నిజాయితీకీ, మరొకరు ద్రోహానికీ ప్రతీకగా నిల్చారు, కదా రాహీ' అంటూ కోసాదా నిట్టూర్చాడు.

## ఇంద సాక్షిగా

మహారాష్ట్ర-ఛత్తీస్‌గఢ్ రాష్ట్రాలకు మధ్య దాదాపు 100 కి.మీ. పొడవునా ఇంద్రావతి నది సరిహద్దుగా నిలిచింది. దండకారణ్యంలో ఆ సరిహద్దు గ్రామాలలోని ఆదివాసీ ప్రజలు ఇంద్రావతి నదిని 'ఇంద' అని ముద్దుగా పిలుచుకుంటారు. విశాల ప్రాంతంలో నదికి ఇరువైపులా ఛత్తీస్‌గఢ్ గ్రామాలే ఉన్నాయి. ఈ విశాల అటవీ ప్రాంతాల్లో భైరాన్‌గఢ్ ఒకటి. భైరాన్‌గఢ్ ప్రాంతంలోని ఇంద్రావతి నదికీ, మాడ్ కొండలకూ మధ్య గల పోరాట ప్రాంతాన్ని ఇంద్రావతి ఏరియాగా వ్యవహరిస్తూ గత రెండు దశాబ్దాలుగా భా.క.పా. (మావోయిస్టు) విప్లవ కార్యకలాపాలు కొనసాగిస్తోంది. ఇంద్రావతి ఏరియాకు భైరాన్‌గఢ్ నుండి పోలీసులు రావాలంటే ఇంద నది దాటి రావల్సిందే. అందుకే ఒడ్డు జనాలు ఎప్పుడూ ఇంద నిండుగా ఉంటే పోలీసులను అడ్డుకుంటుందని నమ్ముతుంటారు. పాములా బుస కొడుతూ నది పొంగుతుంటే మరీ సంతోషిస్తారు. కానీ వారి నమ్మకాలను మొదట సల్వాజుడుం, ఆ తర్వాత గ్రీన్‌హంట్ వమ్ము చేశాయి. ఇప్పుడు పోలీసులు వేసవి కాలమైనా, వర్షాకాలమైనా, శీతాకాలమైనా ఎప్పుడైనా రావచ్చని ప్రజలకు అర్థమైంది. సల్వాజుడుం చేసిన తొలి దాడులకు నష్టపోయిన వెడ్మా, డుంగా, రేకవాహి, నాయుంపార ఇంకా కొన్ని ఆదివాసీ గ్రామాలు ఇంద ఒడ్డు నుంచి కొండల్లోకి వెళ్లాయి. గ్రామస్తులు అక్కడే పిల్లాపాపలతో భయం-భయంగా కాలం వెళ్లబుచ్చుతున్నారు. అక్కడ పిల్లల కోసం జనతన సర్కార్ పాఠశాలలు తెరిచింది. ప్రజా మిలీషియా, పిఎల్‌జిఏ రక్షణలో తిరిగి కొండల్లోని గూళ్లకు రావడం గత ఐదేళ్లుగా అలవాటైంది. మహిళలు ఇప్పపూలు, గార (ఇప్పకాయ) ఏరుకోవడం కానీ, పాత ఊరి ముఖం చూసి రావడం గానీ అదే పద్ధతుల్లో జరుగుతోంది. ఇంద్రావతి ఏరియా జనాలు భైరాన్‌గఢ్ సంతకు వెళ్లాలంటే ఇంద దాటి వెళ్లాల్సిందే. కానీ వాళ్లు సల్వాజుడుం మొదలయ్యాక సంతకు వెళ్లడమే దాదాపు మానుకున్నారు. పొరపాటున వెళ్లినవాళ్లు తిరిగి ఇంటికి వస్తారన్న హామీ లేదు. ఎందరివో ప్రాణాలను తీసి సల్వాజుడుం గూండాలు శవాలను ఇందలోకి విసిరేశారు. నదీ ప్రవాహంలో కొట్టుకుపోయే ఆ శవాలు ఎక్కడ తేలుతాయో చూసి చెప్పేదెవరు? మరెందరినో ఆ గూండాలు సల్వాజుడుం చిత్రహింసల శిబిరాల్లోకి తరలించారు. నది దాటిన మహిళలు అత్యాచారాల పాలై ఇందకు బలవ్వడమో లేదా జుడుం శిబిరాలకు వెళ్లి దినమొక గండంగా బతుకులు ఈడ్వడమో తప్పదు. ఈ దారుణాలన్నింటికీ ఇంద మౌనసాక్షిగా నిలిచింది.

అది ఫిబ్రవరి నెల కావడంతో ఇంకా పూర్తిగా చలి వదల్లేదు. రాత్రివేళ మంచు కురుస్తోంది. పైన ఏ కప్పూ లేకుండా అడవిలో చెట్ల కింద గెరిల్లాలూ, సర్కారీ జులుం పీడిత ప్రజలూ పడుకుంటే తెల్లారేసరికి వారు కప్పుకున్న దుప్పట్లు మంచుతో తడవడం ఖాయం. గెరిల్లాల తుపాకులూ నానాయి. సల్వాజుడుం, గ్రీన్‌హంట్ దాడులు మొదలయ్యాక నెగళ్లు రాజేసి పడుకోవడం నిషేధం కావడంతో తెల్లవార్లూ వణుకుతూనే పక్కలో పొర్లాల్సిందే తప్ప తెలివిపడ్డా చేసేదేం ఉండదు. మరీ ముఖ్యంగా గెరిల్లా జీవితంలో తెల్లారే సమయంలో బ్యాటరీ లైటు వెలుతురులో చదువుకోవడమూ నిషేధమే. దీనితో రాహీ దళ బాధ్యుడు ఉదయాన్నే తెలివిపడినా లేవకుండా బ్లాంకెట్ ముసుగు తీయకుండానే పక్కపై దొర్లుతున్నాడు. రాత్రి క్లోరోక్విన్ మాత్రలు మింగి పడుకోవడంతో కడుపులో వికారంగా ఉంది. ఒంట్లోంచి జ్వరం ఇంకా పూర్తిగా జారలేదు.

ఉదయాన్నే ఐదున్నరకు కమాండర్ రెండుసార్లు చిన్నగా విజిల్ ఊదడంతో రాహీ దళ సభ్యులందరూ లేచారు. పదిహేను నిమిషాల్లో కాలకృత్యాలు తీర్చుకుని రెండవసారి కమాండర్ విజిల్ ఊదేసరికి అందరూ తయారుగా ఉన్నారు. విజిల్ ఊదడంతోనే కిట్లూ, తుపాకులూ భుజాలకు తగిలించుకుని ఎవరి వరుసల్లో

వాళ్లు నడవసాగారు.

రాహీ దళం రేకవాహి చేరేసరికి ఉదయం తొమ్మిదవుతోంది. ఆ ఊర్లో జనతన సర్కార్ ఏర్పాటు చేసిన ప్రాథమిక పాఠశాల దగ్గర్లోనే రాహీ దళం డేరా వేసింది. జుడుం దాడులతో కొండల్లోకి జారుకున్న ఊళ్లల్లో ఇదొకటి. రోల్‌కాల్ ముగిసిన వెంటనే కిచెన్ డ్యూటీ వాళ్లు పొయ్యి అంటించి చాయ్ పెట్టారు. మిగతా సభ్యులు ఎవరి పనుల్లో వాళ్లుండగా కమాండర్ మోతీ ఊళ్లోకి ఇద్దరిని పంపింది. రాహీ దళ బాధ్యుడు చాయ్ కోసం ఎదురు చూస్తూ జిల్లీపై వాలాడు. ఆ పరిసరాల్లో పాటలు వినవస్తుండడంతో 'పాటలు పాడెదెక్కడ మోతీ' అని కోయలో అడిగాడు.

'బడి పిల్లలు పాడుతున్నట్టున్నారు. ఊళ్లోకి వెళ్లిన వాళ్లు వస్తే గానీ విషయం తెలియదు' అంది మోతీ.

'సరే, జావ తెమ్మన్నావా? కడుపులో గాబరవుతోంది' అన్నాడు.

మోతీ 'ఇంగో' అని జవాబిచ్చింది.

ఊళ్లో నుంచి రైతులూ, యువతీ యువకులూ అరగంటలో దళం వద్దకు చేరుకున్నారు. వాళ్లలోని ఒక యువతి తన తలపై నుంచి జావ గంజు దించి పొయ్యి దగ్గర పెట్టింది. దానితో పాటు నంజుకోవడానికి తెచ్చిన గళ్లుప్పు దొప్పను మరో యువతి జావ గంజు పక్కన పెట్టింది.

'మోతీ, బల్లే ప్రకాష్ గురూజీ పెళ్లవుతోంది. దళం అక్కడికే వస్తే బాగుంటుంది' అంటూ గ్రామ జనతన సర్కార్ అధ్యక్షుడు సన్ను కోరాడు.

'పెళ్లి పిల్ల ఎవరు?' మోతీ ప్రశ్న.

'గురూజీ రత్ని'

ఈ మాటలు విన్న రాహీ దళ బాధ్యుడు 'నేనైతే తప్పకుండా వస్తాను' అనడంతో కమాండర్‌కు ఆయన అనుమతి కోరాల్సిన అవసరం లేకుండా పోయింది. చాయ్, జావ తాగాక దళం పెళ్లి వేడుక దగ్గరకు ఊరి జనాలతో కలిసి వెళ్లింది.

నేలపై పరిచిన జిల్లీ మీద ప్రకాష్, రత్ని ఒకరి పక్కన ఒకరు కూచున్నారు. వాళ్ల పక్కన జనతన సర్కార్ న్యాయ విభాగ అధిపతి మంగ్లో చేతిలో కాయితంతో నిలబడి ఉంది. గ్రామస్తులు వాళ్లకు ఎదురుగా కూచున్నారు. బడి పిల్లలు హుషారుగా డాకాలు వేస్తూ ఆదివాసీ నృత్యంలో మునిగిపోయారు. కొద్ది దూరంలో తన చేతిలో పసికందుతో కూచున్న సుక్‌మతి ముఖంలో మాత్రం ఏ భావమూ వ్యక్తం కావడం లేదు. దళం అక్కడికి చేరుకోగానే పెళ్లి పిల్లా, పిల్లాడు సహా అందరూ పరుగున వచ్చి లాల్‌సలాం..సలాం..సలాం అంటూ చేతులు కలపసాగారు. అందరికన్నా ఆఖరున సుక్‌మతి చేయి కలిపింది.

సుక్‌మతి చేతిల్లోని పిల్లాడ్ని రాహీ దళ బాధ్యుడు తీసుకుని ముద్దుగా బుగ్గలు నిమురుతూ, 'నీ కొడుకు బాగున్నాడు కామ్రేడ్, ఈ హీరో పేరు ఏం పెట్టావ్?' అని ప్రశ్నించాడు.

'దివాకర్'

'బాగుంది' అంటూనే 'ఏయ్ దివాకర్, నీవు పెరిగి పెద్దవాడివై మీ బద్మాష్ నాయిన్ని తన్నాలి. వాడు పిరికివాడు. మీ అమ్మకు నమ్మకద్రోహం చేసి, ప్రజలకూ ద్రోహం చేసి శత్రువు ముందు లొంగిపోయాడు. నువ్వు మీ లడాయి తల్లి పాలు తాగుతున్నావు. నువ్వూ అమ్మలాగా ధైర్యంగా ఎదగాలి' అంటూ దివాకర్ బుగ్గలను ముద్దాడి, వాడిని తిరిగి తల్లి చేతికి ఇచ్చాడు.

పలకరింపులు అయిపోవడంతోనే పెండ్లి పెద్ద మంగ్లో 'ఇక నా కార్యక్రమం పూర్తి చేయనా' అంటూ సన్ను వైపు చూసింది. జనతన సర్కార్ ఉనికిలోకి వచ్చాక, న్యాయ విభాగం వారు పెళ్లి చేయడం అనే పద్ధతి మొదలైంది.

'ఇంగో' సన్ను జవాబు.

ప్రకాష్, రత్నిలు ఇద్దరూ నిలబడి పెళ్లి ప్రతిజ్ఞ చేశారు. మంగ్లో ఒక్కొక్క పదం చెప్తుండగా వాళ్లిద్దరూ ఆ పదాలు అంటూ ప్రతిజ్ఞ పూర్తి చేశారు. ఇష్టపడి పెళ్లి చేసుకుంటున్నామనీ, తమ మధ్య తలెత్తే సమస్యలు ఏవైనా పార్టీ కమిటీల ముందు పరిష్కరించుకుంటామనీ, తమ వికాసానికి పెళ్లి మరింత తోడ్పడాలనీ, చివరి వరకూ విప్లవ ఆశయ సాధనలోనే నిలిచి ఉంటామనీ ప్రతిజ్ఞ చేశారు. ఆ ప్రతిజ్ఞ వింటుంటే రాహీ దళ బాధ్యుడికి 1987 జనవరి 16 గుర్తొచ్చింది. ఆ రోజు తన పెళ్లికి సందర్భవశాత్తూ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పార్టీ కార్యదర్శి హాజరవడం, తన సన్నిహితులంతా పెళ్లి వేడుకలో పాల్గొనడం, తామూ ఆనాడు అలాంటి ప్రతిజ్ఞే చేయడం, తన పక్కన తన జీవిత సహచరి విమల రత్నిలాగే నించొని ఉండడం అంతా కళ్ల ముందు తిరగసాగింది. అక్కడే దూరంగా నిల్చుని ఉన్న సుక్‌మతిని చూస్తుంటే పెళ్లి చేసుకుంటానని హామీ ఇచ్చి, గర్భవతిని చేసి చెప్పా పెట్టకుండా పారిపోయిన పిరికివాడి మూలంగా ఆమెకు ఇలాంటి వేడుక లేకుండా పోయింది కదా అన్న ఆలోచన ఆయన్ను విడవడం లేదు. ప్రతిజ్ఞ విన్న సంతోషంలో జనం చప్పట్లు కొట్టడంతో ఆయన ఈ లోకంలోకి వచ్చి అందరితో పాటు చప్పట్లు కొట్టాడు.

రాహీ జనతన సర్కార్ అధ్యక్షుడు సన్నును పిలిచి ఏరియా విషయాలు తెలుసుకుంటున్నాడు. గ్రీన్‌హంట్ ఆపరేషన్ మొదలయ్యాక పరిస్థితులు ఎలా ఉన్నాయని అడగడంతోనే సన్ను ముఖం గంభీరంగా మారిపోయింది.

'కామ్రేడ్, మన పార్టీ అంచనా వేసినట్టే ఉంది పరిస్థితి. సల్వాజుడుంకూ, గ్రీన్‌హంట్‌కూ జనం దృష్టిలో పెద్ద తేడా ఏం లేదు. సల్వాజుడుం గూండాలకూ, అది సృష్టించిన ఎస్.పి.ఒ.లకూ గీర ఇంకా పెరిగింది. రైతులను చంపడం ఇంకా పెరిగింది. కాకపోతే ఇప్పుడు పోలీసులు చేసే ప్రతీకార హత్యలూ, హంతక ముఠాలు చేస్తున్న రహస్య హత్యలూ ముందుకు వస్తున్నాయి. ఈ మధ్య మన గెరిల్లాలు సంతలో దుర్మార్గ పోలీసు అధికారిని మట్టుబెట్టారు. దీనితో వెంటనే పోలీసులు రాత్రికి రాత్రే ఇందను దాటి వచ్చి ముగ్గురు రైతులను చంపారు. మావోయిస్టుల యాక్షన్ టీంను ఇంత వెంటనే ఖతం చేయడం ఇదే మొదటిసారి అని అబద్ధాలకోరు విశ్వరంజన్ వాగిన వాగుడును రేడియో కూసింది. ఇది గ్రీన్‌హంట్‌లోనే సాధ్యమైంది అని కూడా పత్రికల్లో రాయించాడు.

నేను వెళ్లి ఆ రైతు కుటుంబాలను కలిసి వచ్చాను కామ్రేడ్. ఆ ముగ్గురు ఆదివాసీ రైతులూ చాలా పేదవాళ్లు. వాళ్ల మరణంతో ఆ కుటుంబాలకు దిక్కు లేకుండా పోయింది. నన్ను చూడగానే వాళ్ల పిల్లలు వచ్చి నా మీద బడి ఏడుస్తుంటే...' అని కోయలో చెప్తున్న సన్ను బుగ్గలపై కన్నీరు ధార కడుతోంది.

కాసేపు మౌనం చోటు చేసుకుంది. రాహీ దీర్ఘ శ్వాస వదిలి చేతి గడియారం చూసుకున్నాడు. సాయంత్రం ఏడు కావస్తోంది. పుష్యమాసం కావడంతో దట్టంగా చీకటి అలుముకుంది.

'రాజ్‌మన్ వచ్చేది ఉంది సన్ను' అన్నాడు రాహీ.

'ఇప్పుడే ఉందా కామ్రేడ్ ఎపిటి?' అడిగాడు సన్ను.

'ఇంగో, ఇప్పుడు రాలేకపోతే రేపు ఉదయం తప్పక రావాలి' అన్నాడు రాహీ.

ఈ సంభాషణ జరుగుతుండగానే రాజ్‌మన్ దాదాపు 25 మంది గెరిల్లాలతో రానే వచ్చాడు. వాళ్లందరికీ గైడ్‌గా సంపత్ ముందు నడుస్తున్నాడని వాళ్లు ఒక్కొక్కరే వచ్చి చేతులు కలుపుతుంటే రాహీకి అర్థమైంది.

దక్షిణ బస్తర్ (దంతెవాడ జిల్లా), పశ్చిమ బస్తర్ (బీజాపూర్ జిల్లా), మాడ్ (నారాయణ్‌పూర్ జిల్లా)లలో బలమైన ప్రజా పునాది ఉండడంతో ప్రజలు గెరిల్లా జీవితం నుంచి వెనక్కి వచ్చినవాళ్లను తమ మధ్య 'భద్రం'గా కాపాడుకుంటున్నారు. అలాంటి వాళ్లలో సంపత్ ఒకడు.

చేతులు కలపడం పూర్తి కాగానే రాజ్‌మన్ పిడికిలెత్తి 'తాకిలోడ్ ప్రజా అమరవీరులకు జోహార్లు', 'అమరవీరుల ఆశయాలను తుదకంటూ కొనసాగిద్దాం', 'ఫాసిస్టు గ్రీన్‌హంట్ దాడులను ఓడిద్దాం' అంటూ బిగ్గరగా నినదించాడు. అక్కడ ఉన్న వాళ్లంతా నినదించడంతో అడవులూ, కొండలూ ప్రతిధ్వనించాయి. రాజ్‌మన్ నినదించడం ఆగిపోయినా స్కూలు పిల్లలంతా తమకు తెలిసిన అమరులను పేరు పేరునా తల్చుకుంటూ నినదిస్తుంటే వాతావరణం ఉద్విగ్నంగా మారింది.

రాజ్‌మన్ నినాదాలతో రాహీకి ముందు రోజు సాయంకాలం రేడియో వార్తల వెనుకగల అసలు విషయం అర్థమైపోయింది. శత్రువు గ్రామాలపై దాడులు చేస్తూ ,పేద ఆదివాసీ రైతాంగాన్ని విచక్షణారహితంగా కాల్చి చంపుతూ, వాళ్లపై మావోయిస్టులంటూ ముద్ర వేస్తున్నాడు. ఈ 15 రోజుల్లోనే ఈ ఏరియాలో జరిగిన రెండవ హత్యాకాండ ఇది. వారం రోజుల క్రితం తాకిలోడ్ పరిసరాల్లోని కోడ్మా గ్రామంపై దాడి చేసిన పోలీసులు ముగ్గురు రైతులను హత్య చేసి మావోయిస్టుల యాక్షన్ టీంను మట్టుబెట్టామన్నారు. ఇప్పుడు మరో ఏడుగురు రైతులను హత్య చేశారు. 'ఫాసిస్టు గ్రీన్‌హంట్‌కు ప్రజలూ, పిఎల్‌జిఎ గెరిల్లాలూ తప్పకుండా బుద్ధి చెపుతారు, దానిని ఓడించి తీరుతారు' మనసులోనే అనుకుంటూ రాహీ రాజ్‌మన్ వద్దకు వచ్చాడు.

'తాకిలోడ్ వివరాలు తెలుసుకుని రావడంతో మాకు కొంత ఆలస్యమైంది కామ్రేడ్' అంటూ రాజమన్ అనడం పూర్తి కాక ముందే రాహీ గద్గద స్వరంతో 'ఈ విషాదం ఎలా జరిగింది కామ్రేడ్?' అని ఆతృతగా అడిగాడు.

రాజ్‌మన్ కళ్లల్లో ఒక్కసారిగా తాకిలోడ్ ఊరు మెదిలింది. ఇంద్రావతి ఉద్యమంలో దృఢంగా నిలిచిన గ్రామాల్లో తాకిలోడ్ ఒకటి. ఆ ఊరు ఆ పరిసరాల్లోనే కాస్త పెద్దూరు. అమరులు కామ్రేడ్స్ శ్యాం, మహేశ్, మురళిల 25 అడుగుల సిమెంట్ స్థూపం ఆ ఊరికి వచ్చేవాళ్లందరినీ ఆహ్వానిస్తూ ఉంటుంది. సల్వాజుడుం తొలినాళ్లలో (2006 జనవరి) ఆ స్థూపాన్ని కూల్చడానికీ, ఆ ఊరును కాల్చడానికీ వచ్చిన ఫాసిస్టు ఖాకీ మూకలకు ఇల్లిల్లూ మందుపాతరై జవాబిచ్చింది. ఖంగు తిన్న పోలీసులు ఈనాటి వరకూ ఆ స్థూపాన్ని కూల్చలేకపోయారు. ఆ ఊరును కాల్చలేకపోయారు. ఆ ఊరు రాములులాంటి యువకులనూ, ఇందిర లాంటి యువతులనూ, సోమాల్ లాంటి పిల్లలనూ ఎందరినో ఉద్యమానికి అంకితం చేసింది. మరెందరో మెరికల్లాంటి యువతీ యువకులు రమేశ్, రతన్, సిలుక్, ఐతేలు ఆశయ సాధనలో అసువులు బాసి తాకిలోడ్ అనే నాలుగు అక్షరాలను దండకారణ్య ఉద్యమ చరిత్రలో నెత్తురుతో రాసి దానికి అమర స్థానాన్ని కల్పించారు. ఆ ఊరు శత్రువును ఎప్పుడూ నిద్రపోనివ్వదు. ఆ ఊరు శత్రువుకు ఒక సవాలుగా నిలిచింది. అందుకే వాడు దానిపై పదే పదే దాడులకు దిగుతున్నాడు. తాకిలోడ్ వీర జనాలను మట్టుబెట్టాలని వాడు రోజూ కలలు కంటుంటాడు. నేటి భారీ బూటకపు ఎన్‌కౌంటర్‌తో వాడు తన కలలకు ఈ రోజు ఒక రూపం ఇవ్వగలిగాడు - ఇదంతా చరిత్ర పుటల్లోంచి తవ్వి గుర్తు చేసుకుంటున్న రాజ్‌మన్ కళ్లు వర్షిస్తున్నాయి. ఆ చరిత్ర నిర్మాతల్లో తానొకడు కావడం వల్ల ఆయన బాధ అధికంగానే ఉన్నది. ఆ ఊరంతా ఆయనను ఒక కొడుకుగా, ఒక అన్నగా, ఒక గురువుగా, ఒక ఆప్తుడిగా అన్నింటికన్నా మించి ఒక కామ్రేడ్‌గా చూసుకుంటుంది. ఆ ఊరితో ఆయనకు గల పుష్కరకాల అనుబంధం ఆయనెన్నటికీ మరిచిపోలేడు.

వర్షిస్తున్న రాజ్‌మన్ కళ్లల్లో బాధ్యుడు ఖాకీల గ్రీన్‌హంట్ ఉత్పాతాన్ని స్పష్టంగానే చూడగల్గుతున్నాడు. తమకు పిఎల్‌జిఎ అండగా ఉందనీ, ఊరవతల ప్రజా మిలీషియా సాయుధంగా కాపలా ఉందనీ పూర్తి విశ్వాసంతో ఆదమరచి నిద్రిస్తున్న తాకిలోడ్ ఊరు మీద తోడేళ్ల మందలా ఖాకీలు పడ్డారు. ఆ మందకు ముందు ఎస్.పి.ఒ. రాములున్నాడు. రాములు అగుపడగానే రాహీకి వాడు జనతన సర్కార్ స్కూల్లో టీచర్‌గా పని చేసి ద్రోహిగా మారాడనీ, వాడు దొంగదారుల్లో మందను తెచ్చి ఊరి మీద పడ్డాడనీ సులభంగానే బోధపడింది.

ఊరి మీద పడ్డ మంద ఇళ్లల్లోనుంచి జనాలను ఈడ్చుకొచ్చి స్థూపం ముందు పోగేసింది. స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ, ముసలోళ్లూ అందరూ పోలీసుల్నీ, ఎస్.పి.ఒ.ల్ని తిడుతున్నారు, ఏడుస్తున్నారు, గుంజులాడుతున్నారు. కానీ వారి శక్తి ఆ మంద

ముందు సరిపోవడం లేదు. ఆ మంద ఏడుగురిని బంధించింది. ఆ ఏడుగురూ ఊళ్లో ప్రజా పోరాటానికీ, జనతన సర్కార్‌కూ ప్రాణంలాంటి వాళ్లని చెబుతూ రాములు ఒక్కొక్కరినీ వేలెత్తి చూపుతున్నాడు. వారిలో 35 ఏండ్ల బార్స మోటు, 23 ఏండ్ల కల్మం అనంతరాం, ముప్పై ఏళ్ల వేకో అనంతరాం, ఏములు జైరాం, ఆశారాంలతో పాటు నవ యువకులు, నిండా రెండు పదులు దాటని కల్మామి, రాము, మురామి రాజులు కూడా ఉన్నారు.

వర్షిస్తున్న కళ్లల్లో బార్స మోటును చూడగానే రాహీకి ఆయన భార్య, ఐదుగురు పిల్లలు అగుపడ్డారు. పిల్లల్లో రెన్నెల్ల పసిగుడ్డును చూసి రాహీ గుండెలవిసిపోయాయి. ఆ పసిగుడ్డు తన తండ్రినీ, గ్రీన్‌హంట్ ఉత్పాతాన్నీ చూస్తోంది. నేను పెద్దయ్యాక తప్పక బదులు తీర్చుకుంటానంటూనేమో ఆ గుడ్డు పిడికిళ్లు బిగుసుకుంటున్నాయి. ఆ దృశ్యం పక్కనే వేకో అనంతరాంను చూసిన రాహీ కళ్లు ధారలు కడుతున్నాయి. అనంతరాంను చూడగానే ఆయితే గుర్తొచ్చిన రాహీకి 2007 స్మృతిపథంలో మెదిలింది. సల్వాజుడుం గూండాలు సిలుకను పట్టుకొని ముక్కలు ముక్కలుగా నరికారు. ఆ వీరనారి స్మృతులతో జీవిస్తున్న అనంతరాంను ఈ రోజు గ్రీన్‌హంట్ హంతకులు హతమార్చడం చూసిన రాహీ బిగబట్టిన పెదవుల నుంచి ఉబికి వస్తున్న దుఃఖం. తాకిలోడ్ ఆకాశ వీథుల్లో ఆ అమర జంట చిరస్థాయిగా నిలిచి పోతుందని ఆయన అనుకుంటుండగానే మోటు కూతురు ఏడుపు విన్నాడాయన. ఆ చిన్నారి 'మా నాన్న ఏం నేరం చేశాడు? ఆయనకు డ్రెస్సు తొడుగుతున్నారెందుకు? మా నాన్నను చంపొద్దు' అంటూ రోదిస్తోంది. ఆ బిడ్డ ఏడుపు ఖాకీల కరకు గుండెలను కదిలించలేకపోతోంది, కానీ మోటు మాత్రం ధైర్యంగా బిడ్డను ఓదారుస్తున్నాడు. పక్కనే జైరాం-ఆశారాంలు అతుక్కుపోయిన దృశ్యం రాహీ కంటపడింది. ఆ అన్నదమ్ములిద్దరూ 'మనం విడిపోకుండానే చనిపోదాం' అంటున్నారు. ఆ మాటల్లోని ఆర్ద్రత మానవీయ సంబంధాలనూ, ఆత్మీయానుబంధాలనూ అర్థం చేసుకున్న మానవత్వమున్న మనుషులను కదిలిస్తుందే కానీ నల్ల సరపు బండలాంటి మెదళ్లను తాకవని రాహీకి తెలియంది కాదు. ఖాకీలు ఆ చివరి కోర్కెనైనా మన్నించేలా లేరని పేలుతున్న తూటాల కర్కశ చప్పుళ్లు జవాబునిస్తున్నాయి. రాహీ కళ్లు మూసుకున్నాడు.

స్కూలు పరిసరాల్లోని వాతావరణమంతా బరువెక్కింది. చుట్టూ నిల్చిన ఎత్తైన కొండలు 'తాకిలోడ్ త్యాగాలు మాకన్నా ఉన్నతమైనవ'ని కీర్తిస్తూ తమ శిఖరాల్ని వాల్చినట్టుగా అవుపడుతున్నాయి. ఆదివాసీలను గ్రీన్‌హంట్ సంపూర్ణంగా హతమారుస్తుందేమోనన్న బాధతో అడవంతా మౌనం దాల్చినట్టుంది. స్వచ్ఛమైన ఇంద నీరు గత ఐదేళ్లుగా ఎర్రగా పారుతోంది. సుక్‌మతి చేతుల్లోంచి తప్పుకొని వచ్చిన పసికందు దివాకర్ రాహీ బుగ్గలు నిమురుతూ కన్నీళ్లు తుడుస్తుండగా కళ్లు తెరిచిన రాహీకి స్కూలు పిల్లలంతా రాజ్‌మన్ చుట్టూ చేరి పిడికిళ్లు బిగించడం అగుపడింది. ఇన్ని దుర్మార్గాలు చేస్తూ ఈ చిన్నారుల హృదయాలనూ, మెదళ్లనూ గెలుచుకోవడం - 'అంకుల్ చిదం కాదు కదా వాడి అబ్బ అంకుల్ శామ్ తరం కూడా కాద'నుకుంటూ రాహీ దివాకర్‌ను సుక్‌మతికి అందించాడు. రాహీ దళం కిట్లు వేసుకొని కదిలింది.

(అయిపోయింది)



## అరుణతార సంపాదకులకు....

ఏప్రిల్ 2011 అరుణతారలో 'ప్రజాఉద్యమాలు - నాటకాలలో స్త్రీల భాగస్వామ్యం' అని డా. నళిని రాసిన వ్యాసం ప్రసంగపాఠం చదివాను. ఇది సమగ్రమైనదని రచయిత ఎక్కడా పేర్కొనలేదు, అలాగే ప్రసంగపాఠం అనేది చదువుతూ చివరకు వచ్చాక అర్థమైంది కనుక దానికి పరిమితులు ఉంటాయనీ అర్థమైంది. అయినప్పటికీ ఎ.పి.జె.ఎన్.ఎం. కార్యక్రమాలను, వాటిలో పాల్గొన్న స్త్రీల పేర్లను చాలానే పేర్కొన్నందువల్ల కామ్రేడ్స్ పద్మ, కుమారిల గురించి లేకపోవడం, ప్రజా ఉద్యమాలు అని శీర్షికలోనే ఉంది కనుక బెల్లి లలిత, అరుణోదయ విమల వంటి వారి పేర్లు లేకపోవడం అనేది 'లేకపోవడం వల్ల ఎక్కువ కొట్టొచ్చినట్లుగా' కన్పించింది. ఇది ఎందుకు జరిగింది అనే రచయిత ఉద్దేశాల్లోకి వెళ్లదలచుకోలేదు గానీ, ఈ వ్యాసం శీర్షికను బట్టి ఆ అంశాన్ని గురించి రాసేటప్పుడు తమ జీవితాలను ప్రజాకళల కోసం పూర్తిగా అంకితం చేసి, ఈ రంగంలో నాయకులుగా ఎదిగిన వారు, మొత్తం సమాజంలోనే ఆ రూపంలో గుర్తింపు పొందినవారు అయిన వీరి గురించి లేకపోవడం వల్ల ఆ వ్యాసం తనకు తాను అన్యాయం చేసుకుందని కచ్చితంగా అన్పించింది. పద్మ, లలితలు రాజ్యహింస వల్ల అమరులైన ప్రముఖ ప్రజా కళాకారిణులు. వాస్తవానికి పదుల సంఖ్యలో ప్రజా కళాకారిణులు ఆంధ్రప్రదేశ్‌లో రాజ్యం చేసిన ఎన్‌కౌంటర్లలో, బూటకపు ఎన్‌కౌంటర్లలో మరణించారు. కుమారి కూడా నిర్బంధం వల్లనే సకాలంలో సరైన వైద్యం అందక మరణించిందని చెప్పాలి. ఆంధ్రప్రదేశ్‌లో ప్రజా ఉద్యమాల్లో నాటకాలలో స్త్రీ భాగస్వామ్యం గురించి ఎవరు ఎంత అసమగ్రమైన వ్యాసాన్ని రాసినా గానీ దాదాపు నలభై సంవత్సరాల చరిత్ర కలిగిన ఎ.పి.జె.ఎన్.ఎం. అత్యంత ప్రముఖ పాత్ర వహించిన వారినిగానీ, అరుణోదయనే తన ఇంటి పేరుగా మార్చుకున్నంత ప్రముఖురాలు విమలను గానీ, తెలంగాణ ఉద్యమంలో ముందుకొచ్చిన అత్యంత ప్రజాదరణ కలిగిన బెల్లి లలితను గానీ పేర్కొనకపోవడం కొంత ఊహకందని విషయంగానే ఉంటుందని మాత్రం చెప్పక తప్పడం లేదు.

- తరుణ

# ముప్పై వసంతాల దండకారణ్య ఉద్యమానికి విప్లవ జేజేలు!

(నాల్గవ కవర్ తరువాయి)

నక్సల్బరీ, శ్రీకాకుళాలు సెట్ బ్యాక్‌కు గురయినా విప్లవోద్యమం ఆగిపోలేదు. నిర్బంధాలు, నిషేధాలు, ఎన్‌కౌంటర్లు, ఎమర్జెన్సీలు కూడ విరసంను గానీ విప్లవ సాహిత్య సాంస్కృతికోద్యమాన్ని గానీ తుడిచిపెట్ట వేయలేక పోయాయి. జగిత్యాల, సిరిసిల్లా పోరాటాలతో తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటానికి, నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలకు సాధ్యం కాని కొనసాగింపు మూడు దశాబ్దాలకు పైగా వర్తమానంలో విప్లవోద్యమానికి సాధ్యమైంది.

పెద్ది శంకర్ అమరత్వంతో, పీపుల్స్ వార్ నిర్మాణంతో, ఇంద్రవెల్లి ఆదివాసుల త్యాగాలతో - ఈ మూడింటి త్యాగాల, నిర్మాణాల, పోరాటాల ముడితో, ఇవ్వాళ దండకారణ్యం తన ముప్పై ఏళ్ల ఉద్యమ చరిత్రను సమీక్షించుకుంటున్నది.

ఇందులో రగల్ జెండాతో గోండ్వానా రాజ్యాన్ని పాలించిన చంద్రవంశపు రాజులు మొదలు, నెహ్రూ రాజ్యాన్ని ధిక్కరించి హతుడైన భాంజీరావు వరకు, స్వాతంత్ర్య యోధుడైన రాంజీ గోండు మొదలు, 'మన ఊళ్లలో మన రాజ్యం' ప్రకటించిన కొమురం భీం వరకు ఎందరివో పోరాటాల త్యాగాల వారసత్వాల సమీక్ష ఉంది. సరిగ్గా వందేళ్ల క్రితం 1910లో బ్రిటిష్ వలస పాలనను ప్రతిఘటిస్తూ భూంకాల్ సైన్యాన్ని నిర్మాణం చేసిన వీరనారాయణ సింగ్, గూండాదార్ వేసిన దారి మొదలు - ప్రజల పై యుద్ధాన్ని ప్రజా యుద్ధంలో భాగంగా చలన యుద్ధంతో తిప్పి కొడుతున్న భూంకాల్ మిలీషియా పోరాటం వరకు సమీక్ష ఉంటుంది.

పై నుంచి ఒక సైనిక దాడి మాత్రమే జరగడం లేదు. అభివృద్ధి పేరుతో ఒక రాజకీయార్థిక దాడి, అంతకన్న మించిన ప్రచార, ప్రసార సాంస్కృతిక దాడి జరుగుతున్నాయి. దండకారణ్యంలో, ముఖ్యంగా బస్తర్‌లో విప్లవోద్యమ నాయకత్వంలో జనతన సర్కార్‌ను ఏర్పాటు చేసుకొని ప్రజా అభివృద్ధి నమూనాను అమలు చేస్తున్నారు. గ్రామ అభివృద్ధి కమిటీల నాయకత్వంలో అందరికీ సమానంగా భూమి పంపిణీ చేసి, ప్రజలందరి భాగస్వామ్యంతో, సహకారంతో శ్రమతో స్వావలంబన అభివృద్ధిని అమలు చేస్తున్నారు. అవసరాన్ని బట్టి చెరువులు, కుంటలు, కాల్వలు తవ్వుకొని, వ్యవసాయం చేస్తున్నారు. తోటలు పెంచుతున్నారు. కోళ్లు, గొర్లు, మేకలు, పశువులు పెంచుతున్నారు. దంతెవాడ, బీజాపూర్, నారాయణపూర్ జిల్లాల్లో పారామిలిటరీ బలగాల దాడిలో 'ఎన్‌కౌంటర్' అవుతున్న ఆదివాసులు, అత్యాచారాలకు గురవుతున్న మహిళలు, గృహదహనాల పాలవుతున్న గ్రామాలతో పాటు, పెంపకపు జంతువుల అపహరణ, ధాన్యాగారాల విధ్వంసం కూడా వింటున్నాం. అంటే ఇంత యుద్ధంలోనూ ఇవ్వాళ దండకారణ్యంలో ఆదివాసులు ఒక సహకార ఉత్పత్తి విధానంలో పాల్గొంటున్న ఒక స్వావలంబన అభివృద్ధి క్రమాన్ని మనం గమనించవచ్చు. చేపలను పెంచుతున్న చెరువుల్లో తళతళ మెరుస్తున్న అల్యూమినియం మూల ధాతువు మట్టిచిప్ప స్థానంలో వచ్చిన సత్తు కంచానికే కాదు యుద్ధ విమానాలకు కూడా వాడుతారని తెలుసుకుని అటువంటి ఖనిజాలను కంపెనీలు తరలించుకొని పోకుండా అడ్డుపడుతున్నారు.

అయితే సామ్రాజ్యవాద దోపిడీని అడ్డుకోవడం, బహుళజాతి కంపెనీల, బడా కంపెనీల చొరబాటును అడ్డుకోవడం, వాటికి దళారీలుగా మారిన భూస్వామ్య, పెట్టుబడిదారీ వర్గాల విధానాలను అడ్డుకోవడం, వాటికి అండగా ఉండే ఏజెన్సీగా మారిన ప్రభుత్వాల దాడిని అడ్డుకోవడం, ఒక నిర్మాణం కాని ప్రజా సంఘటనతో సాధ్యమయ్యే పనికాదు. ఒక ప్రభుత్వం అభివృద్ధి నమూనాను ప్రతిఘటించడమంటే ఆ ప్రభుత్వాన్ని ప్రతిఘటించడం. అది ఒకానొక రాజకీయ పార్టీ అధికారం కాకుండా అన్ని ఎన్నికల పార్టీల అధికారమై ఈ దేశంలో ఆక్టోపస్ వలె విస్తరిస్తున్నపుడు అది రాజ్యాధికారాన్నే ప్రతిఘటించడమవుతుంది. అప్పుడది ఆ ప్రభుత్వాల ఏర్పాటులో పాల్గొనకుండా, ఆ ప్రభుత్వాలను పన్నులు చెల్లించి పోషించకుండా ప్రత్యామ్నాయ రాజకీయ నిర్మాణాలు చేసుకోవడం వల్లనే సాధ్యం. జనతన సర్కార్ ఆ ప్రజల ప్రత్యామ్నాయాన్ని ఇవ్వాళ దండకారణ్యంలో ఒక ప్రయోగంగా రచిస్తున్నది. అధ్యయనం చేయాల్సిందదే. నిర్దిష్ట ఫలితాల్లోనే చూద్దాం.

విప్లవోద్యమం ప్రవేశించకపూర్వం దండకారణ్యం బైలదిల్లాలో ఒక జపాన్ పోస్కో కంపెనీ మాత్రమే ప్రవేశించింది. కిరాండుల్ నుంచి జపాన్‌కు విశాఖపట్నం మీదుగా ఇనుప రజం తీసుకపోవడానికి ఒక రైలు మార్గం వేసింది. విప్లవోద్యమం గత ముప్పయ్యేళ్లుగా ఈ ప్రక్రియకు అడుగడుగునా అడ్డుపడడమే కాకుండా, 1997 నుంచీ, మరీ ముఖ్యంగా 2004 నుంచీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వేదాంత, టాటా, ఎస్సార్, పోస్కో వంటి కంపెనీలతో చేసుకుంటున్న ఒప్పందాలు అమలు కాకుండా మిలిటెంటుగా అడ్డుపడుతున్నది. విప్లవోద్యమ నాయకత్వంలో ప్రజలు సాయుధంగా ప్రతిఘటిస్తున్నారు. 2000లో ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వం ఏర్పడినాక గత పది సంవత్సరాలలో రాజ్యహింసలో ఎన్ని వందల వేల మంది ఆదివాసులు, విప్లవకారులు

అమరులయ్యారో, ఎన్ని వందల మంది స్త్రీలపై అత్యాచారాలు జరిగాయో, ఎన్ని వందల గ్రామాలు నేలమట్టమయ్యాయో, ఎన్ని లక్షల మంది ఆదివాసులు నిర్వాసితులయ్యారో లెక్కలేదు. ప్రతిపక్ష కాంగ్రెస్ నేత మహేంద్రకర్మ రూపొందించి ఇచ్చిన సాల్వాజుడుం చట్ట వ్యతిరేక హింసా సైన్యం ద్వారా బిజెపి ప్రభుత్వం ఎన్ని దురంతాలు చేసిందో అందుకు అసహాయ సాక్షి ఈ దేశంలోని అత్యున్నత న్యాయస్థానమే. అయినా ప్రజలు అన్ని అణచివేతలను, అత్యాచారాలను విధ్వంసాన్ని, విస్థాపనలను అధిగమించారు. పడిపోతూ దెబ్బకు దెబ్బ కొడుతున్నారు. గాలింపు చర్యలకు ముహ్‌తోడ్ జవాబు ఇస్తున్నారు. ప్రజా యుద్ధంలో ఆత్మరక్షణ అంటే ఎదురు దాడి అని అర్థం చెపుతున్నారు. దుఃఖం అంటే ఆగ్రహమని, విషాదమంటే అధిగమించే మానసిక సంసిద్ధత అని తమ అమరులకు స్థూపాలు నిర్మాణం చేస్తూ, తమ పోరాటాల, త్యాగాల గానం చేస్తూ ముందుకు సాగుతున్నారు.

ఆకాశంలో సగమేమో గానీ మహిళలివ్వాళ అడవిలో 'మంచి' సగమైపోరాడుతున్నారు. ఇష్టంలేని పెళ్లిళ్ల తప్పించుకోవడానికి, ఇష్టమున్న పై వస్త్రాలు కప్పుకోవడానికి దళాల్లో చేరిన రాగోలు పోరాట క్రమంలో ప్రజావిముక్తిలోనే మహిళా విముక్తి సాధ్యమనే ఎపిటాఫ్‌లను తమ పోరాట త్యాగాల సమాధులపై రచించి అమరులవుతున్నారు. విప్లవ మహిళా గెరిల్లాలంటే మిలిటరీ యూనిఫారాలు, క్రాపులు, కిట్‌లు, భుజాన తుపాకీ మాత్రమే కాదు. నూతన మానవి రూపొందడమని అన్నింటా సమాన ప్రాతినిధ్యంతో మునుసాగుతూ నాయకత్వ స్థానాలకు వస్తున్నారు. ఈ కఠోరమైన క్రమంలో మెడమీది నాలుగవ కాడియైన పితృస్వామ్యాన్ని కూడా తొలగించుకునే పోరాటంలో రాజ్యహింసలో భాగమైపోయిన లైంగిక అత్యాచారాలను ప్రతిఘటిస్తూ, ఎన్‌కౌంటర్, మిస్సింగు హత్యలకు గురవుతూ మహిళలు తమ నెత్తుటితో నూతన ప్రజాస్వామిక విప్లవ చరిత్రను రచిస్తున్నారు. ఈ విప్లవ మార్గంలో ఎందరో జ్ఞాత, అజ్ఞాత వీరవనితలు అమరులయ్యారు. అమాయక ఆదివాసీ మహిళలూ అమరులయ్యారు.

దండకారణ్యంలోకి రాజకీయోద్యమంతో పాటే సాహిత్య, సాంస్కృతికోద్యమం ప్రవేశించింది. సాహిత్య సాంస్కృతికోద్యమ చరిత్ర రచనను కూడా చైతన్యపూర్వకంగా సాధన చేసింది. అడవిలో అన్నలకూ అక్కలకూ మధ్యలో ఉన్న 'సరిహద్దులు' చెరిపివేసింది. సాధన, మైనా వంటి రచయితలకు 1987 తర్వాత ఐ.వి. సాంబశివరావు వంటి సుశిక్షిత రచయితల మార్గదర్శకత్వం లభించింది. అమరుడు సుఖదేవ్ వంటి రచయితలు రూపొందారు. 'రాగో' వంటి బహు చర్చిత చెయి తిరిగిన నవల వెలువడింది. దండకారణ్య మహిళా ఉద్యమం, సాహిత్య, సాంస్కృతికోద్యమానికి అనురాధ గాంధీ కరదీపిక అయింది. ఇవాళ సాధన, షహీదా, మైనా, నర్మదా, మిడ్కో, నిత్యా, దమయంతి, వరలక్ష్మి, విజయ, శబరి - మైదాన ప్రాంతంలోను, ప్రధాన స్రవంతిలోనూ ఇందరు రచయితలు, ఇంత సుసంపన్నమైన శైలిలో ఇంత అప్‌డేట్‌గా రాసేవాళ్లు ఉన్నారా అన్నంతగా దండకారణ్యం నుంచి సాహిత్యం వస్తున్నది. ప్రభాత, ఝుంకార్ వంటి ఎన్నో పత్రికలు తెలుగు, హిందీ, కుయి, మరాఠీ, గోండీ, మాండియా భాషల్లో వెలువడుతున్నవి.

ఇదంతా ఒక ఎత్తు - చేతనా నాట్యమంచ్ ఒక ఎత్తు. దండకారణ్యంలో చలన పాఠశాలలు ఏర్పాటు చేసి విప్లవోద్యమం ఆదివాసులకు విద్య నేర్పే క్రమంలో అక్షరాస్యులవుతున్న వారి దగ్గరికి విప్లవ సందేశం శక్తిమంతంగా చేర్చుతున్న సాధనాలు దృశ్య శ్రవణ రూపాలే. పాటలు, వివిధ ప్రదర్శనా కళా రూపాల ద్వారా విప్లవ ప్రజానీకం దగ్గర విప్లవ సందేశం చేరుతున్నది. ప్రజల నుంచి ప్రజలకు మళ్లీ విప్లవ ఆచరణ సాంస్కృతిక ప్రచారాన్ని పొందుతున్నది. దేశంలో సాహిత్య సాంస్కృతిక సంస్థల్లో కూడా చేతనా నాట్యమంచ్‌లో ఉన్నంత సభ్యత్వం ఉండి ఉండదు. ఆదివాసీ సంప్రదాయిక కళారూపాలను విప్లవకరీంచి, విప్లవ సాహిత్యంలో, కళల్లో ఉన్న సందేశాన్ని ప్రజల కళారూపాల్లోకి, బాణీల్లోకి మార్చి చేతనా నాట్యమంచ్ భూంకాల్ సైన్యంతోపాటు ప్రజాసాంస్కృతిక సైన్యంగా కదం తొక్కుతున్నది.

1967 అక్టోబర్ 31న మొండెంఖల్‌లో శ్రీకాకుళ గిరిజన జిల్లా మహసభలకు వెళ్తున్న గిరిజనులపై చెట్టుచాటున దాక్కొని మేడిద సత్యనారాయణ కాల్పులు జరిపితే కోరన్న, మంగన్న అనే ఇద్దరు గిరిజనులు లేవిడి దగ్గర అమరులయ్యారు. ఆ సంఘటన ఆధారంగా శ్రీకాకుళ గిరిజనోద్యమాన్ని చిత్రిస్తూ సుబ్బారావు పాణిగ్రాహి జముకుల కథ రాయడమే కాదు, తన బృందంతో మైదాన ప్రాంతమంతా - బెజవాడ, తెనాలి, ఏలూరు, ఖమ్మం మొదలైన చోట్ల ప్రదర్శించి శ్రీకాకుళ పోరాటానికి ఆర్థిక, హార్దిక, సాంస్కృతిక సంఘీభావాన్ని కూడా గట్టాడు. ఆ ప్రేరణతోనే ఖమ్మంలో సుబ్బారావు పాణిగ్రాహి నగర్‌లో విప్లవ రచయితల సంఘం తన ప్రథమ మహాసభలు జరుపుకుని అప్పటికి దాదాపు సెట్‌బ్యాక్‌కు గురయిన శ్రీకాకుళ మహత్తర గిరిజన రైతాంగ పోరాటాన్ని 72లలో జననాట్యమండలి ఆవిర్భవించే దాకా తానే ఏకైక ప్రతిఘటనా స్వరమై వినిపించింది. దోపిడీ వ్యవస్థ తలకిందులుగా చేసి చూపుతున్న విముక్తి ఉద్యమాన్ని సగర్వంగా తల ఎత్తి నలుగురి ముందు ప్రదర్శించి తన సాహిత్య, సాంస్కృతిక కర్తవ్యాన్ని నిర్వహించింది.

2004లో ఛత్తీస్‌ఘడ్‌లో జనతన సర్కార్ ప్రయోగంపై దాడి చేయడానికి 'సాల్వాజుడుం' ప్రైవేటు సైనిక రచనను ప్రతిపక్ష కాంగ్రెస్, పాలక బిజెపిలు చేసి అమలు చేయడం ప్రారంభించిన తర్వాత తెలుగు నేల మీద చర్చల వాతావరణం ఏర్పడి కూడ తగినంతగా అక్కడి పోరాటం - నిర్బంధాల పై ప్రచారం జరుగలేదు.

కాని 2005 ఆగస్టులో వైఎస్ఆర్ ప్రభుత్వం మావోయిస్టు పార్టీ, దాని అనుబంధ ప్రజా సంఘాలతో పాటు చరిత్రలో మొదటిసారిగా విరసంను కూడ నిషేధించిన తర్వాత, నిర్బంధ నిషేధాల్లో విరసం మళ్లీ తన గొంతును ప్రజాస్వామిక శక్తుల సంఘీభావంతో బలంగా వినిపించడానికి పూనుకున్నది.

నిషేధం తొలగి హైదరాబాద్‌లో 2006లో మహాసభలు జరుపుకున్నరోజే ఒడిశా ప్రభుత్వం అక్కడి ప్రజాస్వామిక ప్రతిఘటనా సంస్థను, సాంస్కృతిక సంస్థను నిషేధిస్తున్నట్లు ప్రకటించింది. (ఆ నిషేధం ఇప్పటికీ కొనసాగుతున్నది) విరసం మహాసభలు ఆ నిషేధాన్ని ఖండించడంతో ప్రారంభమయ్యాయి. అదే మహాసభల్లో ఛత్తీస్‌ఘడ్‌లో రాజ్యహింసను - ప్రతిఘటనా సంస్కృతిని చిత్రించిన వరలక్ష్మి, సూర్యనారాయణల ప్రత్యక్ష పర్యటనా అనుభవాలను విరసం ఆవిష్కరించింది. ఆ తర్వాత బి.డి. దమయంతి, శబరి మున్నగువారు రచించిన ఎన్నో పుస్తకాలు వెలువడినవి. చేతనా నాట్యమంచ్ హైదరాబాద్ మొదలు దేశమంతా తిరిగి దండకారణ్యంలో జరుగుతున్న జనతన సర్కార్ ప్రయోగాన్ని, దానిపై సాల్వాజుడుం, పారా మిలిటరీ బలగాల ద్వారా మాత్రమే కాదు, మీడియా ద్వారా జరుగుతున్న ముప్పేట దాడిని ప్రదర్శించి చూపింది.

అయినా మన దగ్గర వియత్నాం మొదలు ఇరాక్ వరకు జరిగిన సామ్రాజ్యవాద దాడికి వ్యతిరేకంగా వచ్చినంతగా సంఘీభావ స్వరం రాలేదు. శ్రీకాకుళ పోరాట సాహిత్య శిశువు దండకారణ్యం విషయంలో ఆ స్వీయ విమర్శ కూడా చేసుకోవాల్సి ఉన్నది.

దండకారణ్య ప్రయోగాన్ని కాపాడుకోవడం మనల్ని మనం కాపాడుకోవడం. మన వనర్లను కాపాడుకోవడం. మన అడవి, మన నదులు, మన కొండలు, మన ఖనిజ సంపద - అన్నిటికన్నా మన కాళ్లకింద నేలను కాపాడుకోవడం. ఆ నేల మీద మన కాళ్లపై మనం నిలబడడం. మన ఆలోచనలు, భావాలు, అనుభూతులు ఏమిటో మన బొడ్డు నుంచి వచ్చి మన గొంతు నించి వినిపించే అచ్చమైన మన మాటలుగా వినిపించడం. మన ఆకాశంలో మన సూర్యుణ్ని నిలుపుకోవడం. మన అడవిలోని వెన్నెల మనమై అనుభవించడం.

బస్తర్ ఆదివాసీ రైతాంగం రుతుపవనాలు రాగానే తిండి కోసం భూములు దున్నడానికి సిద్ధపడుతుంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు - ఆ రుతుపవనాలను ఎదుర్కోవడానికి చినుకుల బులెట్లతో, రాకెట్లతో ఎదుర్కోబోతున్నారు. పిల్లలు, పెద్దలు, మహిళలు తమ చెమటతో చాలు పెడుతున్న భూములను వాళ్ల రక్తంతో తడిసే దాహం తీర్చుకోజూస్తున్నారు. జూన్ మొదటివారంలో వెయ్యి మంది సైనికుల పటాలం బస్తర్‌లోకి ప్రవేశించింది. నారాయణపూర్, బస్తర్, బిలాస్‌పూర్ జిల్లాల్లో సైనిక శిక్షణ కేంద్రాల పేరుతో సైనిక దాడులకే రంగం సిద్ధం చేసారు. ఛత్తీస్‌ఘడ్ మరో కాశ్మీరు, మరో ఈశాన్య రాష్ట్రం వలె సైనిక దాడులను ఎదుర్కోనున్నది. ఇది ఒక సవాల్.

ఇటువంటి యుద్ధకాలంలో విరసం ముప్పై ఏళ్ల దండకారణ్య విప్లవోద్యమాన్ని, సాహిత్య, సాంస్కృతికోద్యమాన్ని, మహిళా ఉద్యమాన్ని, ఒక నూతన మానవీయావిష్కరణ ప్రయోగాన్ని సమీక్షించుకుందాం రమ్మని అందరికీ ఆహ్వానం పలుకుతున్నది. ప్రజలు, ప్రజాస్వామ్యవాదులు, విప్లవాభిమానులందరికీ ఇదే మా హృదయపూర్వక ఆహ్వానం.

**- విప్లవ రచయితల సంఘం**



కరపత్రం




# యురేనియం

## కడప జిల్లా ప్రజలకు వై.ఎస్. కుటుంబం పెట్టిన శాపం

- ప్రజా సంఘాలు

యురేనియం ప్రాజెక్టు ప్రజలకు శాపం అని ఆనాడు ప్రజాసంఘాలు అన్నాయి. కాదు వరం అని వై.ఎస్. రాజశేఖరరెడ్డి ప్రభుత్వం అన్నది. ఏది నిజమో ఇప్పుడు తేటతెల్లమవుతోంది. కడపజిల్లా వేముల మండలం తుమ్మలపల్లెలో యురేనియం ప్రాజెక్టు ఏర్పాటు ప్రతిపాదనతో 2006లో యు.సి.ఐ.ఎల్ జిల్లా ప్రజల ముందుకొచ్చింది. ఈ ప్రాజెక్టు పరిధి మండలంలోని తుమ్మలపల్లె, రాచకుంటపల్లె, మబ్బుచింతలపల్లె, భూమయ్యగారిపల్లె, కెకె కొట్టాల గ్రామాలు. ఇక్కడికి రావడానికంటే ముందు నల్లగొండ జిల్లాలో అది తీవ్ర ప్రజా ప్రతిఘటనను ఎదుర్కొంది. అంతకు ముందు మేఘాలయలో కూడ దానికి అదే పరిస్థితి ఎదురయింది. అయితే అప్పటి ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి కేంద్రంలో తమ అధినేత్రి సోనియా మెప్పుపొందడానికి తన సొంత నియోజకవర్గంలో అంగబలం అధికారబలం, ఉపయోగించి యురేనియం ప్రాజెక్టును ఇక్కడికి తెప్పించాడు. (అంతకు ముందు ఆయనే ప్రతిపక్షంలో ఉండగా నల్గొండ యురేనియం ప్రాజెక్టును తీవ్రంగా వ్యతిరేకించాడు.) 2006 సెప్టెంబరు 10న జరిగిన ప్రజాభిప్రాయ సేకరణ సభ వైయస్ కుటుంబ బలప్రదర్శనకు వేదికయింది. ముఖ్యమంత్రి వైయస్ రాజశేఖరరెడ్డి ఆదేశంతో కడప యంపి వైయస్ వివేకానందరెడ్డి కనుసన్నలలో యురేనియం ప్రాజెక్టును వ్యతిరేకించడానికి వచ్చిన ప్రజలపై బైటి ప్రాంతం నుండి తెప్పించిన గూండాలు, పోలీసులు విరుచుకుపడ్డారు. ప్రతిపక్షాలను, ప్రజాసంఘాల ప్రతినిధుల్ని, పర్యావరణవేత్తలను మాట్లాడనీయకుండ నానా అల్లరి చేశారు. యురేనియం ప్రాజెక్టు వస్తే ఇంటికొక ఉద్యోగం వస్తుందని గ్రామ ప్రజలకు మాయమాటలు చెప్పి భూములు తీసుకొని నయానా భయానా కొంత మందిని తమకు అనుకూలంగా మలచుకొని ప్రజలను రెండు వర్గాలుగా చీల్చారు. ప్రజాభిప్రాయ సేకరణ రోజున పరస్పరం కొట్టుకునే వాతావరణం సృష్టించి తమ ఫ్యాక్షన్ స్వభావాన్ని చాటుకున్నారు. గ్రామ ప్రజలపైన పదుల సంఖ్యలో అక్రమ కేసులు పెట్టి వేధించారు. మహానేతలు, ప్రజాప్రతినిధులు ప్రజల అభిప్రాయాలకిచ్చిన విలువ ఇది.

ప్రజల గోడు వినడానికి కూడ ఇష్టపడని నేతలు వారికిచ్చిన హామీల గతి ఏమవుతుందో చెప్పనక్కరలేదు. ఇంటికొక ఉద్యోగం అన్నారు. రెండువేల ఎకరాలకుపైగా భూమిని స్వాధీనం చేసుకొని స్థానికుల్లో వందమందిక్కూడ ఉపాధి చూపలేదు. ఇచ్చినవి కూడ కూలి పనులే. సంవత్సరానికి రెండు లక్షల రూపాయల ఆదాయం తీసే భూములకు కూడ ఎకరానికి కేవలం లక్షా ఎనభైవేల నష్టపరిహారం ఇచ్చారు. డికెటి భూములకైతే అవి మీ సొంత భూములు కావు, ప్రభుత్వానికి చెందినవని చెప్పి 70 వేలు ఇచ్చారు. భూమిలేని రైతు కూలీలకైతే ఏ పరిహారమూ లేదు. ఉన్న వ్యవసాయ పనులు కరువైపోయి మైనింగ్‌లో కూలి పనుల కోసం పోటీ పడే పరిస్థితి.

యురేనియం ప్రాజెక్టు పనులు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో, భారీ యంత్రాలతో నడిచేవి. రెండు వేల ఎకరాల వ్యవసాయ భూమి అందించే ఉపాధితో పోలిస్తే కర్మాగారంలో వచ్చే ఉద్యోగాలు ఏపాటివి? అన్ని రకాల పనులతో కలిపి అవి వెయ్యి దాకా ఉండొచ్చు. అందులో కూడ ఎక్కువగా నైపుణ్యంతో కూడుకున్న ఉద్యోగాలుంటాయి. వాటిలో స్థానికులకు ఉద్యోగాలు దొరికే అవకాశాలు చాలా తక్కువ. మెదటి దశలో నిర్మాణ రంగంలో కూలి పనులు దొరకొచ్చుగాని ప్రాజెక్టు పూర్తి స్థాయిలో పని చేయడం మొదలైతే అవి కూడ ఉండవు.

2007లో పనులు ప్రారంభమైతే ఇప్పటికీ ఉపాధి కోసం ఎదురు చూస్తున్నారు. కనపడిన అధికార్లనందరినీ అడుగుతున్నారు. భూములు పోగొట్టుకొని, ప్రత్యామ్నాయ ఉపాధి దొరకక జనం అల్లాడుతుంటే పట్టించుకున్న నాయకుడు లేడు. మొన్నటిదాకా స్వేచ్ఛగా తిరిగిన పొలాల్లో అడ్డుగోడలు నిలిచాయి. ఏదీ అడగడానికి లేదు. ఫ్యాక్టరీ గేటులోపలికి కూడ అడుగు పెట్టనివ్వరు. లోపలేం జరుగుతోందో ఎవరికీ తెలీదు. ఇక్కడి ప్రజలు సొంత ఊరిలో పరాయి మనుష్యులైనారు. గ్రామస్తుల మాటల్లోనే చెప్పాలంటే బైటి నుండి వచ్చినవాళ్ళు వీళ్ళను రెండవ తరగతి మనుషులుగా చూస్తున్నారు.

యురేనియం ప్రాజెక్టు వలన తీవ్రమైన పర్యావరణ సమస్యలు తలెత్తుతాయని ప్రజాసంఘాలు హెచ్చరించాయి. మొట్టమొదట యురేనియం మైనింగ్ కోసం నీరు అధికంగా ఖర్చు అవుతుందని, దాని వల్ల ఇక్కడ నీటి సమస్య తలెత్తుతుందని చెప్పాయి. ప్రజలు కూడ పలు అనుమానాలు, భయాలు వ్యక్తం చేశారు. అదిప్పుడు నిజమయింది. ఈ సంవత్సరం కురిసిన వర్షాలకు, పారిన వంకలకు, నిండిన కుంటలకు మూడేళ్ళ వరకు నీటి ఎద్దడి ఉండకూడదు. కాని ఇటీవల వరుసపెట్టుకొని కొన్ని రోజుల వ్యవధిలోనే భూమయ్యగారి పల్లెలో 110 బోర్లు నీళ్ళులేక దెబ్బతిన్నాయి. రోజు రోజూ బోర్లు ఫెయిలైన వార్తలొస్తూనే ఉన్నాయి. వందల అడుగుల లోతు భూగర్భ గనుల్లో రాక్షస యంత్రాలు

పెట్టి ఏం చేస్తున్నారో ఏమో గాని ఇక్కడి భూగర్భ జలం పూర్తిగా కలుషితమైంది. బోరు నీళ్ళు నూనె జిడ్డుతో కలిసి వస్తున్నాయి. నీటిని వేడి చేస్తే పొరలు పొరలుగా తెల్లని సుద్ద వంటి పదార్థం పాత్ర అడుగునా, అంచులకు పేరుకుపోతోందని, పాత్రలకు రంధ్రాలు పడతున్నాయని గ్రామస్తులు చెప్తున్నారు. ఈ విషయం ఎన్నిసార్లు అధికారులకు ఫిర్యాదు చేసినా పట్టించుకున్నవారు లేరు. ఎన్నడూ లేనిది ప్రజలు డబ్బు పెట్టి తాగునీటిని కొనుక్కుంటున్నారు. కొనలేని వాళ్ళకు కలుషిత నీరే గతి. ఇక పాడిపశువుల గురించి చెప్పనవసరం లేదు. ఈ నీటి వల్ల మనుషుల్లో, పశువుల్లో రకరకాల అనారోగ్య సమస్యలు తలెత్తుతున్నాయి.

నిజానికి ఇవి ఆరంభం మాత్రమే. యురేనియం ముడిఖనిజం వెలికి తీసి శుద్ధి చేసే పనులు ఇంకా మొదలవ్వనే లేదు. నీటి కాలుష్యాన్ని అరికట్టలేని వాళ్ళు యురేనియం వల్ల వచ్చే అణుధార్మిక కాలుష్యాన్ని అరికడతారని నమ్మకం లేదు. అది అసాధ్యం కూడ. ఎందుకంటే అది కంటికి కనిపించదు. దానికి రంగు, రుచి, వాసన ఉండదు. గనుల్లో వెలువడే రేడాన్ వాయివు వల్ల, అణుధార్మిక ధూళి వల్ల, టెయిలింగ్ పాండ్లలో నిలువ చేసే అణుధార్మిక వ్యర్థాలవల్ల దీర్ఘకాలంలో మన శరీరంలోని కణాలు దెబ్బతిని కాన్సర్ వచ్చే ప్రమాదం ఉంది. జన్యుకణాలు దెబ్బతినడం వల్ల పుట్టే పిల్లలు అంగవైకల్యంతో పుట్టగలరు. ఇది తరతరాలు వెంటాడే దారుణ పరిస్థితి. ఇదే ముప్పై ఏళ్ళ రాజకీయ జీవితాన్నిచ్చి "మహా"నేతను చేసిన ప్రజలకు తరతరాలపాటు గుర్తుపెట్టుకునేలా రాజశేఖరరెడ్డి ఇచ్చిన "వరం".

ఇదిలా ఉండగా ప్రాజెక్టు విస్తరణ కోసం మరోసారి ప్రజాభిప్రాయ సేకరణ తంతు జరపడానికి యుసిఐఎల్ ముందుకొచ్చింది. రోజుకు మూడు వేల టన్నుల ముడి ఖనిజాన్ని వెలికితీయడానికి కట్టిన ప్లాంటును మరో 1500 టన్నులవరకు సామర్థ్యాన్ని పెంచి రోజుకు మొత్తం 4500 టన్నులు వెలికితీసేలా విస్తరించనున్నది. "ఓడ దాటాక బోడి మల్లన్న" అన్న వాళ్ళు ఇప్పుడు మళ్ళీ ప్రజల ముందుకు రావడంతో వాళ్ళను నిలదీసే అవకాశం ప్రజలకొచ్చింది. ఉద్యోగాలిచ్చి సమస్యలు పరిష్కరించేదాకా ప్రజాభిప్రాయ సేకరణ జరగనివ్వబోమని ఇప్పటికే ఎం.పి. వైయస్ జగన్మోహనరెడ్డి ప్రకటించి ఉన్నాడు. రాజకీయ సమీకరణలు మారి ఉమ్మడిగా దోచుకున్న కుటుంబం రెండు వర్గాలుగా చీలడంతో ప్రజల తరఫున మాట్లాడక తప్పని పరిస్థితి మన ఎం.పి. గారికొచ్చింది. దాంతోపాటు ఉమ్మడి పాపం చిన్నాయన మీద తోసేసే అవకాశమూ వచ్చింది. అయితే ఎం.పి. గారు చెప్తున్నట్టు అందరికీ ఉద్యోగాలొస్తాయా? ఆచరణలో అది సాధ్యమా? ఇది మరోసారి వాగ్దానాలు చేసి ప్రజల ఆగ్రహాన్ని చల్లార్చే నాటకం కావొచ్చు. లేక తాను ప్రజల పక్షాన ఉన్నానని అనిపించుకుంటే రేపు జరగబోయే వాటికి తప్పు ఇంకొకరి మీద వేసే వ్యూహం కావొచ్చు. యుపిఏ ప్రభుత్వంతో బేరసారాలకు ఇక్కడి ప్రజలను వాడుకుంటూ ఉండొచ్చు.



అయితే సమస్య ఉపాధితో పాటు ప్రజల ఆరోగ్యం, సాగు, తాగునీరు, సకల జీవరాశులకు ప్రాణప్రదమైన ప్రకృతి. వీటిని గురించి మాట్లాడే అవకాశం ఇప్పుడున్నదా? ఎంత మంది మొత్తుకున్నా యురేనియం ప్రాజెక్టు రానే వచ్చింది. జాదూగూడలో రేడియేషన్ ప్రభావం తీవ్రమై ప్రజలు కాన్సర్, జన్యుపరమైన వ్యాధులకు లోనైనాక ఉద్యమించారు. ఫలితంగా బీహార్ అసెంబ్లీ కమిటీ 1998లో టెయిలింగ్ పాండ్ చుట్టూ 5కిలోమీటర్ల పరిధి వరకు జనావాసాలను ఖాళీ చేయించాలని తీర్మానం చేసింది. ప్రజలతో అవసరం తీరిపోయింది కాబట్టి యుసిఐఎల్ ఆ విషయాన్ని పట్టించుకోలేదు. తుమ్మలపల్లె యురేనియం ప్రాజెక్టు ప్రభావం చుట్టుపక్కల ప్రజలపై పడకుండ ముందుగానే అటువంటి చర్యలు చేపడితేనన్నా గుడ్డిలో మెల్లలా ఉంటుంది. కాబట్టి నిజంగా ప్రజల పట్ల ప్రేమ ఉంటే యురేనియం ప్రాజెక్టు పరిధిలోని గ్రామ ప్రజలకు మరోచోట పునరావాసం కల్పించి భూములు పంచివ్వాలి. అసలు యురేనియం తవ్వకాలను విరమించి ప్లాంటును మూసేయడం ఉత్తమం. మన ప్రకృతిని, భవిష్యత్తు తరాలను కాపాడిన వాళ్ళమవుతాం. ఇటువంటి నిర్దిష్టమైన డిమాండ్లతో ముందుకు రాకపోతే ప్రజలు మరింతగా నష్టపోవలసి వస్తుంది.

చరిత్రలో త్రీమైల్ ఐల్యాండ్, చెర్నోబిల్ సంఘటనలు జరిగి చాలాకాలమై అణువిపత్తును ఎవరైనా మర్చిపోయినా ఇటీవల జపాన్ ఫుకుషిమాలో అణురియాక్టర్లు పేలిపోయి ప్రపంచాన్ని మరోసారి హెచ్చరించాయి. అత్యాధునిక టెక్నాలజీ ఉన్న జపాన్ కూడ రేడియేషన్‌ను అడ్డుకోలేకపోయింది. మనదేశంలో ఝార్ఖండ్ ఉదాహరణ ఉండనే ఉంది. అయినా ప్రభుత్వాలు పాఠాలు నేర్చుకోడం లేదు. కడపజిల్లాలో యురేనియం మైనింగ్ మొదలయ్యాక ప్రభుత్వానికి ప్రోత్సాహం లభించినట్లయింది. విశాఖలో కొవ్వాడ అణువిద్యుత్ కేంద్రానికి కేంద్ర ప్రభుత్వం అనుమతినిచ్చింది. ప్రజలు తిరగబడుతున్నారు. అణువిద్యుత్తుకు వ్యతిరేకంగా ప్రజల సంఘటిత ఉద్యమాలే ప్రభుత్వాలకు గుణపాఠం చెప్పగలవు. యురేనియం ప్లాంట్లు, అణువిద్యుత్ కేంద్రాలు శాశ్వతంగా మూతపడితే తప్ప ప్రకృతి, ప్రజలు సురక్షితంగా ఉండలేరు.

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం

చైతన్య మహిళా సంఘం

విప్లవ రచయితల సంఘం



నవల సీరియల్

# గుమ్మెటమోత

- పాణి

## (12)

(గత సంచిక తరువాయి...)

ఏడు గంటలవుతున్నా రావల్సిన వాళ్లంతా రాలేదు. వెంకటేశ్వర్లు సారు కూడా అప్పుడే వచ్చాడు. ఇక మొదలు పెడదామా? అంటున్నారు సంఘ పెద్దలు.

"సుధాకర్ వస్తానన్నాడుగా" చిన్నగా అన్నాడు గిరి.

ఉలిగప్ప కూడా అతని కోసమే ఎదురు చూస్తున్నాడు.

కొండ నాలుకకు మందేస్తే ఉన్న నాలుక ఊడిపోయిందనట్లుందని ఉదయం నుంచి ఒకటే దిగులు అతనికి. ఏమిట్రా ఇది! అసలుకే మోసం వచ్చే అని ఎన్నిసార్లు అనుకున్నాడో? అందరికీ ఆందోళనగానే ఉంది. ఇంత కాలం పడరాని పాట్లు పడి ఉద్యమం చేస్తే చివరికి ఇట్లయిపాయె... అని.

విశాలకు కూడా అట్లాగే ఉన్నది.

బిజినవేముల వెళ్లి వచ్చాక ఆమెకు ఏదో విజయం సాధించిన సంతృప్తిగా ఉంది. దాని మీద గిరి వాదనను కాదనలేకపోయినా తక్షణంగా మనుషులకు ఉండే అవసరాలు చాలా విలువైనవని ఆమె అభిప్రాయం. ఆ రకంగా జానయ్య సమస్య పరిష్కారం కావడం ఒక విజయమే. అంతకు మించి పంచాయితీ పెద్దలను ఒప్పించగలిగాం అనే సంబరం చాలా రోజులు ఉత్సాహం నింపింది. జంబులును కలవడం ఒక గొప్ప అనుభవం కావడంతో వీరబ్రహ్మం మీది పరిశోధనకు ఏదో నైసర్గిక ఆలంబన దొరికినట్లయింది. జనాలకు వివేకం నుంచి కలిగే అవగాహన ఎంత లోతైనదో తెలిసే కొద్ది వీరబ్రహ్మం పరిణామానికి వాస్తవిక కారణాలు తెలుస్తున్నాయి. దాంతో అప్పటిదాకా చదివిన పుస్తకాల పట్ల అసంతృప్తి కలగడం మొదలైంది. దేశీయమైన ప్రజల వివేకాన్ని, అందులోని కళా సౌందర్యాన్ని కొలవడానికి ఆధునిక పని ముట్లను వాడగలమా? అనిపించింది. అదే మాట గిరితో అన్నది.

దానికి అతను వెంటనే" అట్లని ఆధునికపూర్వ పనిముట్లను పట్టుకొని వేలాడినా ప్రయోజనం ఉండదు. అదో పెడ ధోరణి అవుతుంది. దేన్నయినా మన కాలంలో మనం ఆధునిక దృష్టితోనే చూడాలి. పాత ప్రపంచాన్ని పాత పద్ధతిలో కొలిచి అందులోని సౌందర్యానికి మురిసిపోతే మనం ఆధునికతకు వారసులం కానట్టే..." అని తేల్చేశాడు.

" నీవు మరీ ఇంతగా తుది నిర్ధారణలతో ఎలా ఉంటావో అర్థం కాదు.." అని విసుక్కుంది.

దాంతో గిరి రెచ్చిపోయాడు.

" మీలాంటి వాళ్లతో వచ్చిన తంటా ఇదే. మీరు చెప్పే అనుభవ జ్ఞానాన్ని కూడా శాస్త్రం సాయంతో పరిశీలించాలని మర్చిపోతుంటారు. లేకపోతే మనకు.. ఉలిగప్ప వాళ్ల జేజినాయనకు తేడా ఏముందో చెప్పు..." అన్నాడు.

ఆ మాటతో విశాలకు సహనం చచ్చిపోయింది. పైగా తనను జంబులు జత కట్టేయడం నచ్చలేదు.

సరిగ్గా అక్కడే గిరి పట్టుకొన్నాడు.

" పాత కాలం వాళ్లతో పోల్చగానే నీకెందుకంత ఉక్రోషం కలిగిందో చెప్పు? అంటే వాళ్ల కంటే నీవు డిఫరెంట్ అని ఎందుకనుకుంటున్నావు? నీవు ఆధునికమైన మనిషివి కాబట్టే కదా. కానీ అసంగతి మర్చిపోతుంటావు. వీరబ్రహ్మంలాంటి వాళ్లను చాలా మంది అట్లా మర్చిపోయి అంచనా వేస్తుంటారు. నీవూ మర్చిపోతే కొత్తగా చెప్పేది ఏమీ ఉండదనే నా బాధ.." అని అన్నాడు.

ఆ తర్వాత విశాల గిరినికానీ, ఉలిగప్పను కానీ కలవలేదు. ఫోన్ సమాచారం కూడా లేదు. రాక్షసి లాగా చదవడమే పనిగా పెట్టుకొంది.

ఒకసారి గిరికి అనుమానం కలిగి " ఈ పిల్ల నిన్నేమైనా కలుస్తున్నదా?" అని అడిగాడు.

"ఎందుకు...? ఏమైనా కొట్లాడుకున్నారా?"

"అబ్బే... అదేం లేదుగాని, మీ ఊరికి పోయి వచ్చాక ఏదో చర్చ లేవదీసిందిలే. నేను కొంచెం చిరాగ్గానే మాట్లాడినట్లుంది. ఏమన్నా ఫీలైందేమోనని ..." అన్నాడు.

"బలే వాడివే. మీ ఇంటికి వచ్చి తగాదా పెట్టుకుంటుందేమోగాని అలిగే రకం కాదులే. నువ్వేం భయపడాకు.." అని భరోసాగా చెప్పాడు.

"మొత్తం మీద బాగా చదివేశావ్.. " అని క్షణమాగి " అవసరమే ..." అన్నాడు అదోలా.

ఉలిగప్పకేదో స్ఫురించినా కావల్సి ఏమీ ఎరుగనట్లు "ఆమెను అంతగా చదవాల్సిన పని లేదు. ఎవరికైనా పది నిమిషాల్లో తెలిసిపోతుంది .." అన్నాడు.

" ఊ.. ఊ.. మంచిదే. ఆ సంగతి కూడా నాకు తెలియలేదు చూడు. నీకు తెలిసింది. నేను అన్నది దాని గురించే"

ఆ తర్వాత మళ్లీ జీవో 84 వచ్చాక ఉలిగప్ప నేరుగా వెళ్లి కలిస్తేగాని విశాల ఈ ప్రపంచంలోకి రాలేదు. ఆ మాట ఉలిగప్ప ఉబ్బి తబ్బిబైపోతూ చెప్పాడు. ఇక నుంచి మావాళ్లు ' దొరా ... మా కులమేందో చెప్పు' అని కలెక్టర్, ఆర్డీవో ఆఫీసుల చుట్టూ తిరిగే పని తప్పిపోయింది అన్నాడు.

"ఓయ్... రేపు ఎవరైనా ఈ ఉద్యమ చరిత్ర రాసేటట్లయితే అందులో నా పేరు ఒక చోటైనా ఉండాలి. నేనూ మీ మీటింగులకు తిరిగాను. మీ కరపత్రాలు పంచాను..." అని చిన్న పిల్లలా సంబరపడిపోయింది విశాల.

"చరిత్ర ఎవరు రాస్తారనేదాన్ని బట్టి దాని రూపు రేఖలుంటాయి. నేను రాస్తే తప్పక నీ పేరు ఎక్కడో ఒక చోట ఉంటుందని హామీ ఇస్తున్నా.." అన్నాడు ఉలిగప్ప.

"ఫరవాలేదు.. గిరి సావాస లక్షణాలు కనిపిస్తున్నాయి.." అంది.

తన మాటకు గిరికి సంబంధం ఏమిటో చప్పున బోధపడలేదు. ఈలోగా విశాలే.." ఇట్లాంటి భాష గిరిది కదా..? అందుకే అట్లా అన్నాను.

"అంటే నాకేమీ సొంత బుర్ర లేదనమాట.."

" ఛ... అదేం కాదులే..." అని సముదాయించింది.

రెండు నెలలు తిరగకుండానే జి.ఒ. 144 వచ్చింది. అప్పటి దాకా ఉన్న విజయోత్సాహం పాల పొంగులా చల్లారిపోయింది. విశాలకు కూడా అట్లాగే అనిపించింది. ఉలిగప్ప ఇప్పుడు ఎలా ఉంటాడో అనిపించింది. అతని గురించి ఆలోచిస్తుంటే పిలిచినట్లుగా వచ్చి వాలాడు. మనిషి వారం రోజుల నుంచి జ్వరపడి లంఖణాల మీద ఉన్నట్లు కనిపించాడు. ఈ లోగా సాయంకాలం సంఘం సమావేశం ఉందని తెలిసింది. గిరి ఏదో పని ఉందని కాసేపు మాట్లాడి .. ఏం చేయాలో మనవాళ్లు కూడా ఆలోచిస్తారుగా.. చూద్దాం..అని అర్జంట్ పని ఉందని, సాయంకాలం వచ్చేస్తానని వెళ్లిపోయాడు. ఉలిగప్పకు దిక్కు తోచక విశాలను వెతుక్కుంటూ వచ్చాడు. ఏడవడం ఒక్కటే తక్కువ.

విశాల కోప్పడింది.

"మన వాళ్లు జి.ఒ. 84తోనే సమస్యలన్నీ తీరిపోతాయనుకోవచ్చుగాని, నీవూ నేనూ అట్లనే అనుకుంటమా? ఏంది? తాసిల్దారు కాస్ట్ సర్టిఫికెట్ ఇవ్వగానే అంతా అయిపోయిందా? ఆ చిన్నదానికే అంతగా పోరాడాల్సి వచ్చింది. మనకు ఇంకా ఎన్ని సమస్యలు లేవూ? ఈ జి.ఒ. 144కు వ్యతిరేకంగా కూడా పోరాడాల్సిందే. అన్నీ తెలిసిన మనమే డీలా పడితే నోరు లేని జనాలకు ఏం చెప్తాం?" అని చిన్న క్లాసే తీసుకున్నది.

నిజంగానే తనకు ఆ క్లాస్ అవసరమే అనిపించింది.

లేకపోతే కన్నీళ్లు ఆగేవి కాదు.

ఉలిగప్పకు కొంచెం ధైర్యం వచ్చింది..

"సాయంకాలం మా మీటింగ్ ఉంది. నువు కూడా రా" అన్నాడు.

"నేనా?"

"నీవేకాదు. సుధాకర్ కూడా వస్తున్నాడు. బైటి కులాల నుంచి మీలాంటి వాళ్ల అండదండలు మాకు చాలా అవసరం.."

ఆ మాట చాలా ఆర్తిగా అన్నాడు ఉలిగప్ప.

విశాల అపురూపంగా అతడి చేయి పట్టుకున్నది.

ఎప్పటి నుంచో అదుపు చేసుకున్న స్పందనలన్నీ ఒక్కసారిగా ఆమెను చుట్టు ముట్టాయి. ఎన్నడూ ఎరగని తమకానికి లోనైంది. అతడి నిర్భావ దృక్కులను గమనించి ఎదురుగా కూర్చున్న కుర్చీలోంచి లేచి రెండడుగులు వేసి అతని తలపై చేయి వేసి వెంట్రుకలు సవరించింది.

ఉలిగప్ప కళ్లలో నీళ్లు తిరిగాయి.

"నేనెప్పుడూ నీతోనే ఉంటాను.." అని క్షణమాగి తనామాట అప్పుడు అట్లా అంటానని ఆమె కూడా ఊహించకపోవడంతో ఒకలాంటి విచిత్రమైన స్థితికి గురైంది. తేరుకొని " ఆ...ఇంతకూ సుధాకర్ రావడమే ఆశ్చర్యం..! " అన్నది చిన్నగా నవ్వుతూ.

ఉలిగప్ప ఆ మాటను చప్పున ఆలకించలేకపోయాడు. ఆ తర్వాత " అంతకంటే ఆశ్చర్యం ఏమంటే- పొద్దున్నే గిరికి ఫోన్ చేసి ఈ జి.ఒ. గురించి మాట్లాడడట." అన్నాడు.

నిజమా.? ఇదెలా సాధ్యమైంది అని కొన్ని క్షణాలు ఆశ్చర్యం నుంచి ఉద్విగ్న స్థితిలోకి వెళ్లిపోయింది. వెంటనే తేరుకొని... "సుధాకర్ మీద నా అంచనా నిజమైనందుకు సంతోషంగా ఉంది. ఏ కారణం వల్లో ఇద్దరికీ పడకుండాపోయిందిగాని ఇద్దరూ మంచివాళ్లే.." అన్నది.

"నాకు ఇద్దరూ ఒకటే. నాకు అర్థమైందేమంటే- ఇద్దరికీ ఇగో ప్రాబ్లం. మరెవరి విషయంలోనూ ఇట్లా ఉండరు. వాళ్ల మధ్యనే ఇది ఎందుకు తలెత్తిందో అర్థం కావడం లేదు" అన్నాడు ఉలిగప్ప.

" ఇద్దరూ మేధావులు కావడమే... కాకపోతే ఏముంది?"

"మేధావులా?" గొల్లున నవ్వాడు ఉలిగప్ప.

"కాదంటావా?" సూటిగా అడిగింది.

"అందులో అనుమానం ఏమీ లేదనుకో. నా వరకు నేను వాళ్ల నుంచి ఎంత నేర్చుకున్నానో! దాంతోపాటు చెరో కులానికి చెందినవాళ్లు మేధావులయినారు. వర్గీకరణలో ఎవరి కులాన్ని వాళ్లు సమర్థించుకుంటూ ఆర్యూ చేయడంతో పేచీ పడ్డది. వర్గీకరణ ఉద్యమంలో ఎం.ఆర్.పి.ఎస్. తర్వాత మేమే బలమైన ఫోర్స్ కదా. గిరి సుడిబడ తిరిగేటోడాయె. యాడికి పొయినా జనాన్ని కువ్వేసి మాట్లాడతాడు"

ఆ మాట విశాలకు నచ్చలేదు. " నీకు సుధాకర్ అర్థం కానట్టుంది. అతనెప్పుడూ మాలమహానాడు వాదనను సపోర్ట్ చేయలేదు. అసలు అతనంటే వాళ్లకు పడనేపడదు. సుధాకర్ మన దగ్గరేకాదు, వాళ్లతో కూడా అట్లాగే వాదిస్తాడు. కులం వాడైనా వాళ్లు తమలో భాగమనుకోరు" వివరించింది విశాల.

ఉలిగప్పకు నిజమే అనిపించింది.

లేకపోతే తనతో అంతబాగా ఎలా ఉంటాడు? ఉదయం పేపర్ చూశాక తానే గిరికి ఫోన్ చేశాడంటే ..! అందుకే ఇప్పుడు అతని కోసం గిరి కూడా ఎదురు చూస్తున్నాడు.

ఉలిగప్పలాగే గిరి కూడా ఆలోచిస్తున్నాడు. సుధాకర్ లాంటి వాళ్లు ఒక లైన్ తీసుకుంటే మంచి సపోర్టు దొరికినట్లే .. అనేది అతని ఆశ.

ఇంతలో సుధాకర్ రానే వచ్చాడు. రాగానే గిరి రెండు చేతులు పట్టుకొని " ముందుగానే ఇక్కడికి బయల్దేరా. అనుకోకుండా ఓ క్లైంట్ వచ్చాడు. లేటైపాయె.." అన్నాడు.

గిరి అందరికీ అతడ్ని పరిచయం చేశాడు. అక్కడ అందరూ సంఘ సభ్యులు, కులస్తులే ఉన్నా విశాల ఉండడంతో సుధాకర్‌కు కొంచెం తేలిక అనిపించింది. రావడమే కొంచెం బెరుగ్గా వచ్చాడు. ఊళ్లలో కుల పంచాయితీలు అతనికి గుర్తు వచ్చింది. కులం లోపలి సమస్య అయితే బైటి కులం జోక్యాన్ని అంగీకరించడం కష్టం. ఇది అట్లాంటిది కాకపోయినా కులం అనే గుర్తింపు మీద ఆధారపడి, మరో కులంతో వచ్చిన పేచీ. ఎలా రియాక్టవుతారో అనే సందేహం ఉండేది. అందుకని గిరి చెప్పినా తానూ ఒక మాట చెప్పి కూర్చోవడం బాగుంటుందనుకున్నాడు.

" మీరు కాస్ట్ సర్టిఫికెట్ తాసీల్దార్ ఇవ్వాలని ఇన్ని దినాలు పోరకాడితే ఈ పొద్దు తెలంగాణలో తప్ప రాయలసీమ, కోస్తా జిల్లాల్లో బుడగజంగాలు లేరనే కాడికి తీసుకొచ్చినారు. 'పైగా ఎస్.సి., ఎస్.టి. కమిషన్ సభ్యుడై ఉండీ దారా సాంబయ్య ఇంత పని చేసినాడు. నెల్లూరు జిల్లా నుంచి ఈ ముసలం పుట్టిందంటే దాని వెనుక ఆ జిల్లా నాయకురాలు పనబాక లక్ష్మి పాత్రను మర్చిపోనీక లేదు. అయితే వాళ్ల మాల కులస్తులుగా ఈ పని చేశారనే మాట ఎంత నిజమో ... దీనికీ ఊళ్లల్లో ఉండే మామూలు మాలోల్లకు సంబంధం లేదు. నేను వ్యక్తిగా ఏ కులంలో పుట్టినా దీన్ని వ్యతిరేకిస్తుండా. నేను మీకు కొత్త కావచ్చుగాని వీళ్లకు బాగా తెలుసు.." అని గిరి, ఉలిగప్ప దిక్కు చూశాడు.

అంతక ముందు విశాలను కూడా ఇట్లాగే గిరి పరిచయం చేయడంతో అక్కడున్న వాళ్లకు ఏ ఇబ్బంది కలగలేదు. సుధాకర్ మాట్లాడిన తీరు గిరికి బాగా నచ్చేసింది. ఆప్యాయంగా అతని భుజం చుట్టూ చేయి వేసి తన పక్క కుర్చీలోకి తీసికెళ్లాడు.

అల్లంత దూరంలో ఉన్న వెంకటేశ్వర్లు ముందుకు వంగి సుధాకర్‌తో కరచాలనం చేశాడు. ఉలిగప్ప మధ్యలోకి వచ్చి" మా వెంకటేశ్వర్లు సారు.." అని పరిచయం చేశాడు.

"నేరుగా చూడడం ఇప్పుడే గాని.. మీ పుస్తకాలన్నీ చదివాను. ఈ ఉద్యమానికి అవసరమైన సాంఘిక సాంస్కృతిక పునాది వాటిలో ఉంది. అలాంటి వర్క్ జరగకుండా ఈ ఆందోళనలకు బలం రాదు. న్యాయమైన ఉద్యమాల నుంచే ఇట్లాంటి పునరుజ్జీవన ప్రయత్నాలు జరుగుతాయి.. " అన్నాడు.

వెంకటేశ్వర్లుకు ఆ రెండు ముక్కలే బాగా నచ్చేశాయి. సుధాకర్ ప్రేమలో పడిపోయాడు. ఇంతదాకా అవతలి నుంచి ఇట్లాంటి ప్రశంసలు ఆయన విని ఎరుగడు. పరిశోధనలు కూడా అందరూ ఒప్పేసుకున్న విషయాల మీద చేస్తే ఎంత పైకి ఎత్తుతారో! ఇట్లాంటివి చేస్తే నాసి రకమని తీస్కారంగా చూస్తారు. అందుకే విశాల వీరబ్రహ్మం మీద చేస్తోందని తెలుసుకున్నాక ... ఆ అమ్మాయికి ఏ అవసరమొచ్చినా నన్ను కలవమను. చేతనైన సాయం చేస్తా... అని ఉలిగప్పతో అన్నాడు.

ఉలిగప్ప మా సారు అని ఎంత గొప్పగా చెప్పాడూ అనిపించింది... సుధాకర్‌కు. అది కేవలం గౌరవభావమే కాదు. మాకు సంబంధించిన అనే ప్రత్యేక దృష్టి అందులో ఉంది గదా... అనుకున్నాడు.

సమావేశం నడిచినంత సేపూ విశాల, సుధాకర్ శ్రద్ధగా అంతా విన్నారు. ఆమెకైతే ఎప్పటిలాగా ఈ స్థితిలో వీళ్ల సాధారణ ప్రవర్తన ఎలా ఉంటుంది? ఎట్లా మాట్లాడుతారు? అవతలి వాళ్ల గురించి ఏమనుకుంటారు? ఆలోచనారీతి ఎలా ఉంటుంది? అనే విషయాలు గమనిస్తోంది. నిజమే చాలా తీవ్రమైన గాయం ఇది. 'ఆనిగాల్లు మనల్ని తుట్టాగా బూమీమ్మద లేకుండా చేద్దామనుకుండారా? ఏంది. దండోరాలో బాగా తిరుగుతుండామని మనల్ని జనాభా లెక్కల్లో కూడా లేకుండా చేసినారు. అసలు ఉంటేగదా అవి కావాలి... ఇవి కావాలని అడగనీక. చూచ్చాసి బాగ కొర్రి పెట్టినారు... ' అని రంగారెడ్డి జిల్లా నుంచి కమిటీలో ఉండే పోరగాడు అన్నాడు. ఇంకో పెద్దాయనైతే ఈ పద్నాలుగు జిల్లాల్లో ఎంత మందిమి ఉండామో మొత్తం కట్టగట్టుకొని ముఖ్యమంత్రి ఇంటి కాడికో, వాడి జేజినాయిన ఇంటికాడికో పోయి ఇంతకూ మేం ఉన్నట్టా లేనట్టా చెప్పు. ఇన్ని వేల మందిమి నీ కంటికి అగపడతుండమా లేదా చెప్పురా లంగనాకొడకా అని అడగాలి.. అని ఆగ్రహించాడు.

గిరి సర్ది చెప్పుకొచ్చాడు. ఇది కింద జరిగింది కాదనీ, చాలా మంది పైన కుట్రతో ఈ సవరణ చేశారని వివరించాడు. మిగతా వాళ్ల ఆవేశకావేశాలకు గిరి స్థిమితంతో కూడిన ఆలోచనలకు మధ్య చాలా ఎడం ఉన్నదని సుధాకర్‌కు అర్థమవుతోంది. గిరి అంటే తనకు ఉన్న నిశ్చితాభిప్రాయాలు ఒక్కొక్కటే కరిగిపోతున్నాయి. ఎంత ఓపిక. మేధావి ఫోజు అని ఇంత కాలం తాననుకున్న మనిషిలో ఇంత ఆచరణవాదీ, వాస్తవికజీవి ఉన్నాడా అనిపించింది. ఎందుకంటే గిరి కంటే ఉద్యమంలో చాలా నలిగిన పెద్దలు, చదువుకున్న వెంకటేశ్వర్లు లాంటి వాళ్లు ఇంకా ఉన్నా వాళ్లకూ గిరికీ ఏదో తేడా ఉందనిపిస్తోంది. అతనే చెప్పాల్సినవి ఉన్నట్లు తిరిగి తిరిగి అతడి దగ్గరికే వస్తోంది. గిరికి కూడా ఆ విషయం తెలుసనిపిస్తోంది. తానేమి చేయాలో, ఏం మాట్లాడాలో, ఎందుకు మాట్లాడాలో తెలిసి మనుషులు ఉండడమే ఉద్యమాలకు బలం. లేకపోతే లంగరు ఒక దిక్కు, నావ ఒక దిక్కు అనుకునేంత అసంబద్ధంగా ఉంటుంది వ్యవహారం. దాన్ని ఊహించడం అసాధ్యం.. గిరి వ్యవహార శైలి గురించి అప్పుడప్పుడూ మెచ్చుకోలుగా విశాల కళ్లలోకి చూశాడు. మొత్తం మీద చాలా వరుస కార్యక్రమాలు రూపొందించారు. మధ్య మధ్యలో నీవేమంటావు? అని గిరి ప్రత్యేకంగా సుధాకర్‌ను అడిగాడు. దానికి తాను ఏమీ చెప్పలేదు. తాను ఆలోచిస్తున్నవన్నీ వచ్చాయి. కొన్ని ఇంకా బాగా ఆచరణలో సాధ్యాసాధ్యాలను దృష్టిలో పెట్టుకొని నిర్ణయాలవుతున్నాయి. విశాల మాత్రం అన్నిట్లో కల్పించుకొని తన అభిప్రాయాలు చెప్పింది. కొన్ని సార్లు వాదనకు కూడా దిగింది. గిరితోనే కాదు, సంఘ నాయకులతో కూడా. ఈ పిల్ల ఎక్కడైనా ఇంతేనేమో. పెంకె ఘటం. వాదనకు

చీమ తలకాయంత చోటు ఉంటే వదిలిపెట్టదు కదా? అనుకున్నాడు.

సుధాకర్ అక్కడ ఉండడమే మిగితా వాళ్లందరికీ నచ్చేసింది. విశాల చురుకుదనానికి మొదట కొంచెం ఆశ్చర్యపోయారు. తమ సంఘంలో, ఉద్యమంలో చదువుకున్న మగవాళ్లే తక్కువ ఉన్నారు. అమ్మాయిలు అసలే లేకపోవడంతో విశాల చొరవ, మాటకారితనం వాళ్లలో ఒకరిద్దిరికి ఎబ్బెట్టుగా తోచింది. ఏందీ ..ఈ పిల్లా..? అనుకున్నారు. ఆ తర్వాత ఆమె మాటల్లోని విలువ, మనసులోని తపన అర్థమయ్యాయి. గిరి, వెంకటేశ్వర్లు ఆమెకు ఇస్తున్న విలువ గమనించారు.

రాత్రి పొద్దుపోయేదాకా చర్చలు నడిచాయి. కోస్తా రాయలసీమ జిల్లాల కమిటీలను ఈ ప్రోగ్రాం మీదకి పూర్తిగా మళ్లించాలని నిర్ణయించుకున్నారు. అన్ని ప్రాంతాల్లో రాజకీయ నాయకులను కలిసి వాళ్లతో ఎస్.సి., ఎస్.టి. కమిషన్‌కు మా దగ్గర బుడగ జంగాల జనాభా ఇంత ఉందని ఉత్తరాలు రాయించాలని, ప్రకటనలు ఇప్పించాలని అనుకున్నారు. ఏ ఏ గ్రామాల్లో ఇప్పటికే జనాభా లెక్కల్లోకి ఎక్కిందీ బైటికి తీయాలనుకున్నారు. సంచారంలో ఉన్న వాళ్లను జనగణలోకి తీసుకోని ప్రాంతాలను గుర్తించి ఒక జాబితా తయారు చేయాలని అనుకున్నారు. పనిలో పనిగా ప్రభుత్వ పథకాలు ఎంత మందికి ఇచ్చిందీ తేల్చితే బాగుంటుందని విశాల పట్టుపట్టింది. దీని వల్ల రెండు పనులు అవుతాయని ఆమె వాదన. ప్రభుత్వం ఒక పథకాన్ని వర్తింపజేసిందంటే ఈ జనాలు ఉన్నట్లు ఒప్పుకున్నట్లవుతుంది. అదే సమయంలో ఆ పని ఎంత అధమ స్థాయిలో ప్రభుత్వం చేస్తున్నదో, ఎంత మందికి కనీస అవసరాలు తీర్చాల్సి ఉన్నదో బైట పెట్టినట్లవుతుంది. ఈ లెక్కలు తెలంగాణలో కూడా చేయాలా లేదా? అని చర్చ నడిచింది. తెలంగాణకు కూడా అవసరమే... అట్టడుగు వర్గాల అభివృద్దే తన ధ్యేయమని గవర్నమెంట్ బాకా ఊదుకుంటోంది గదా... నిజంగానే ఇంత వెనుకబడిన కులానికి ప్రభుత్వం ఏం చేస్తోందో అందరి ముందుకు తెచ్చినట్లవుతుందని తనే సూచించింది.

సుధాకర్‌కు ఇది కూడా బాగా నచ్చింది. అప్పుడు జోక్యం చేసుకొని ఒక మాట అన్నాడు. " మనవాళ్లు అనుకుంటే ఈ లెక్కలన్నీ నెల రోజుల్లో బైటికి వచ్చేస్తాయి. గవర్నమెంట్ ఓ పదేళ్లలో, పదిహేనేళ్లలో ఎన్ని పథకాలు తీసుకొచ్చిందీ, మనకు ఎన్ని ఇచ్చిందీ చెప్పడం వల్ల ప్రభుత్వం మీద, ముఖ్యంగా లోకల్ లీడర్ల మీద విమర్శ బలంగా పెట్టవచ్చు. అసలు ఎందుకు అన్ని చోట్లా జనాభా లెక్కల్లోకి తీసుకోలేదు? మనుషులను గుర్తించడానికి మీకున్న ప్రమాణం ఏమిటి? గుర్తించిన చోటయినా ఎందుకు మీ పథకాలు అమలు చేయడం లేదు. పైరవీలు, వొత్తిడి తీసుకరాగలిగే జనాలను మాత్రమే మనుషులుగా గుర్తిస్తారా? ఇదెక్కడి ప్రజాస్వామ్యం? ప్రజలు ఇంత చిన్న విషయాలను కూడా ఇన్నేళ్ల తర్వాత కూడా ఎందుకు అడగాల్సి వస్తోంది? అడగకపోతే ఎవ్వరికీ ఏమీ ఇవ్వరన్నమాట! అని గట్టిగా దబాయించవచ్చు.... అన్నాడు.

అందరికీ నిజమే అనిపించింది.

సుధాకర్, విశాల ఒక వైపు, ఉలిగప్ప, గిరి మరో వైపు తిరుగు ప్రయాణమయ్యారు. ఉలిగప్ప మనుసులో మరేదో మెదలుతోంది. ఏందిది? మేమిక్కడ బతికే ఉన్నామని చెప్పుకోవలసి రావడం ఎంత దుస్థితి! అదీ మనలాంటి మరో కులపెద్దలే ఈ పని చేయడం ఎంత అన్యాయం..? సిటీ బస్సులో పూర్తిగా మౌనం ఆవహించినట్లు ఉండిపోతే గిరి కదిలించాడు. పైగా సమావేశంలో చాలా పొడి పొడిగా మాట్లాడాడు. తాను చేయాల్సిన పనులను అలవాటుకొద్దీ నోట్ బుక్కులో రాసేసుకున్నాడు గాని అంతగా లీనమైనట్టనిపించలేదు.

"ఏందీ...అట్లున్నావు?" అని అడిగాడు.

దాని గురించి ఏమీ చెప్పకుండా " వర్గీకరణలో మాదిగోల్ల తర్వాత మనమే గట్టిగా నిలబడ్డామని ఈ పని చేసినట్టుంది. మనల్ని పూర్తిగా అడ్డం తొలగించుకుందామనుకున్నారు.." అన్నాడు.

గిరి ఎందుకో ఆశ్చర్యపోయాడు. ఇంతసేపూ ఆలోచిస్తున్నది ఇదన్నమాట అనుకున్నాడు. వెంటనే ఏం చెప్పాలో తోచలేదు.

ఈలోగా మళ్లీ తానే " కడాకు మనం యాడికి వచ్చినామో చూడు. అవి కావాలి... ఇవి కావాలి అనే ముచ్చట వదిలేసి మేమీడ బతికే ఉన్నామని చెప్పుకోవాల్సి వచ్చింది..." అన్నాడు.

ఆ మాట చాలా లోతుల నుంచి, బలమైన ఉద్వేగ స్థితి నుంచి వచ్చిందని తెలియడంతో గిరి సమాధానం ఏమీ చెప్పలేదు.

"నీవు అస్తిత్వం అంటుంటావే... ఇది అస్తిత్వాన్ని తుడిచేయడమే. ఆ పని మన తోటి వాళ్లు చేయడం..." అప్పుడు ఉలిగప్ప ఏ స్థితిలో ఉన్నాడంటే ఇక ఆమాట పూర్తి చేయడానికి చేతకాలేదు. దు:ఖం వచ్చేసింది. ఉదయం విశాల ఓదార్పు తర్వాత మామూలయ్యాడు గాని లోపలిదంతా కరిగిపోలేదు.

ఎందుకింత ఎమోషనల్‌గా ఆలోచిస్తున్నాడు? గిరికి అంతుపట్టలేదు. తనకీ వ్యవహారాలు అంత నచ్చవు. ఎందుకంటే ఈ స్థితికి మనిషి గురికావడం చాలా సహజమే. తాను మాత్రం ఎన్ని సార్లు ఇక్కడికి జారిపోలేదు. ఆ ఎరుక తనకు ఉంటుంది. అయితే ఆ స్థితి ఆలోచనలకు పనికి రాదని కూడా అతని నిశ్చితాభిప్రాయం. అందువల్ల కూడా ఎదుటివాళ్లు ఏ విషయాల్లో ఎప్పుడు ఎమోషనలవుతున్నారు? అనే లెక్క ఒకటి గిరికి ఉంటుంది. దాన్ని ఎక్కడి దాకా తీసుకొస్తున్నారు? దాని వల్ల ఏం జరుగుతుంది? అని గణించుకొనికాని ఆ స్థితిలో మాట్లాడడు. అవతలివాళ్లు ఉద్వేగానికి లోనయ్యారు కదా అని మనం అక్కడికే వెళ్లితే ప్రయోజనం ఏమీ ఉండదు. పైగా ఆ ఉద్వేగ భావనలకు ఊపిరి పోసినట్లవుతుందనుకుంటాడు.

దాంతో ఇప్పుడేం మాట్లాడినా లాభం లేదనుకున్నాడు. బస్సులో ఇద్దరూ పక్కపక్కనే కూర్చున్నా చెరో దిక్కు బైటికి చూస్తుండిపోయారు. మామూలుగా అయితే ఉలిగప్పతో వాదనకు రెడీ అయిపోయే గిరి మౌనంగా ఉండిపోయాడు.

హాస్టల్‌కు వెళ్లిపోయాక తీరుబడిగా మాటలు సాగుతూ ఉన్నప్పుడు ఏ ఉపోద్ఘాతమూ లేకుండా " చేసినవాళ్లకు మనసులో అదే ఉండొచ్చుగాని మనం అందరికీ అంటగట్టొద్దు. దాంతో మనకు వచ్చేదానికంటే పోయేదే ఎక్కువ. ఇప్పటికే చాలా నష్టం జరిగిపోయింది. మీ ఎస్.సి.లే తన్నుక చస్తున్నారు.. ముందు మీలో మీరు సమానత్వం తెచ్చుకోండి ... తర్వాత మా గురించి మాట్లాడుదురు అని బలిసిన కులాలు అంటున్నాయి. పైగా మనోల్లను రెచ్చగొట్టినట్లవుతుంది. మనలాంటోల్లం నలుగురు ఆలోచించేమాట చెప్పాలి.." అన్నాడు గిరి.

ఉలిగప్ప ఆలోచనలో పడ్డాడో ఏమో ఏమీ మాట్లాడలేదు. గిరి ఏదైనా చెప్తే ఆలకించడం ఆలవాటు కాబట్టి రెండు నిమిషాల తర్వాత " మనం దీన్లో సుధాకర్‌లాంటి వాళ్లను కలపకపోవాలి.." అన్నాడు. ఇంతకూ అతని గురించి గిరి ఇప్పుడేమనుకుంటున్నదీ తెలుసుకోవాలని అడిగాడు.

"అవునవును... చాలా అవసరం. సుధాకర్‌తో మనకు గొడవలేమున్నాయి? అభిప్రాయాలేవైనా కావచ్చుగాని మనిషి సిన్సియర్ కదా! . ఈ వారంలో మనం పెట్టే మీటింగ్‌లో ఆయనను కూడా మాట్లాడమని అడుగుదాం.." అన్నాడు.

రెండు రోజుల తర్వాత సుధాకర్ తానే ఫోన్ చేసి పనులు ఏమైనా కదిలాయా? అని ఆరా తీశాడు. ఎస్.సి., ఎస్.టి., కమిషన్‌కు ఇవ్వాల్సిన పేపర్ గురించి ప్రస్తావించాడు. అది ఎట్లా ఉంటే బాగుంటుందో తాను ఇతరులను అడిగి తెలుసుకున్న విషయాలు చెప్పాడు.

ఆ పని తనకు అప్పగిస్తే రాసి పెడతానన్నట్లు కూడా అతడి మాటలను బట్టి గిరికి అర్థమైంది.

అదేదో నువు చూస్తేనే బాగుంటుందేమో..అన్నాడు.

నాలుగు రోజుల్లో నేనే నిన్నూ, వెంకటేశ్వర్లు సారును కలుస్తాను.. అన్నాడు.

విశాల ఇదే ఆలోచిస్తున్నట్లుంది. రోజుకు నాలుగుసార్లు దాని గురించే మాట్లాడుతోంది. రెండ్రోజులకోసారి కలుస్తోంది. ఉలిగప్ప మిగతా పనులన్నీ పక్కన పెట్టేశాడు. ఇదే సరిపోయింది. గిరికి జిల్లాల నుంచి, ఊర్ల నుంచి ఒకటే ఫోన్లు. ఇంక మనమేం చేయలేమా? అనే ఆందోళన.

గిరికి ఒక విషయం అర్థమైపోయింది. ఇది రెండో దశ. మందిని కదిలించడంతోపాటు కొత్త ఆలోచనలు ఇప్పుడు చాలా అవసరం. ఇప్పటి దాకాజరిగినదాంట్లో-కొన్ని అపశృతులు కూడా ఉన్నాయి. వాటిని పోగొట్టడానికి ఇదే సమయం. పైగా మనుషులు మొదట్లో ఉన్నంత ఆవేశకావేశాలతో లేరు. అట్లాంటివన్నీ చల్లారిపోయాయి. ఇది మంచిదే. ఆలోచనలకు చోటు దొరుకుతుంది. అస్తిత్వాన్ని ప్రకటించుకోవడం, నిలుపుకోవడం ఇతర పీడిత అస్తిత్వాలతో తగాదాగా ఎందుకు మారాలి? జనాల్లో పేచీ ఉన్నా దాన్ని నివారించడానికి ఏమైనా కొత్త ఆలోచనలు చేయగలమా... అనేది ఇవాళ అందరిముందున్న సమస్య. అనుకోకుండా సుధాకర్ ముందుకు వచ్చాడు. విశాల మొదటి నుంచి గట్టిగా ఇటువైపు నిలబడింది. వీళ్లకు పెద్ద తలకాయల మధ్య తగిన గుర్తింపు ఉన్నా లేకపోయినా వీళ్లతో ఏదైనా చేయడానికి ప్రయత్నించవచ్చు. ఇప్పటిదాకా గొడవలకు ఏవి కారణమయ్యాయో వాటిని కొత్తగా మాట్లాడాలి. ఇప్పటికిప్పుడు ఏదో ఊడిపడకపోయినా ఎప్పటికైనా ఈ ఆలోచనలు ఉపయోగపడతాయి. లేకపోతే పై కులాల్లోని దోపిడీదారులను వదిలేసినట్టవుతుంది..

ముందు విశాలను కదిలించాడు

" బాబూ... నీ భాషలో కాకపోయినా నేనూ నా స్థాయిలో, నా పద్ధతిలో ఇదే ఆలోచిస్తున్నా. ఏం చేయమంటావు చెప్పు. దేనికైనా రెడీ.." అంది.

"ఏం లేదు. సుధాకర్‌తో మనం వివరంగా మాట్లాడాలి. మొన్న ఒక రకంగా ప్రోగ్రామే మాట్లాడుకున్నాం. వాటి వెనుక ఎందుకు చేస్తున్నాం? ఎలా చేస్తున్నాం? అనే ఆలోచన ముఖ్యం. కొన్ని కొత్త ఆలోచనలను మనమే బైటికి తీసుకరావాలి. లేకపోతే చాలా కష్టం.."

ఆ చివరి మాట చాలా బాధగా, లోలోపలి వొత్తిడి నుంచి అన్నట్లు విశాలకు తెలిసిపోయింది.

"అంత సులభమా? అని నా అనుమానం. నా మాటలు, సుధాకర్ మాటలు ఎవరు వింటారు? ఎవరి వాదనలకు వాళ్లు సరెండరయ్యారని నాకు అనిపిస్తోంది.."

"అందులో ఏ అనుమానం లేదు. మొన్న చూశావుగా... మా వాళ్లు ఎట్లా ఆలోచించేది. చాలా పెద్ద నాయకులే. కష్టపడి పనిచేస్తారు. కానీ అట్లా ఉంటారు. సుధాకరు, నీవూ వస్తారని ముందే చెప్పి గంట సేపు వాదిస్తేగాని ఒప్పుకోలేదు. మావాళ్లలో చదువుకున్నవాళ్లు తక్కువ .. వెంకటేశ్వర్లు సారులాంటి వాళ్ల మీద ఎక్కువ ఆధారపడతారు. ఆయనకు మనమంటే నమ్మకం. సారు మాట కాదనలేరు. అట్లా మన బండి నడుస్తోంది. లేకపోతేనా పంచాయితే..."

"సుధాకర్ చాలా ఓపన్ గిరీ. ఏదైనా కచ్చితంగా మాట్లాడతాడు. నీవంటే ఎందుకో పడకుండా ఉండే. నీకూ అంతే అనుకో..." విశాల మాటలు పూర్తి కాకముందే గిరి అందుకొని " నేను ఎప్పుడూ ఆయన గురించి తప్పుగా మాట్లాడలేదు. నాకు ఆయన చేసే కొన్ని ఆలోచనలతోనే పేచీ. అదే రాశా. నీతో కూడా నాకు అట్లాంటి పేచీ ఉంది. నా పద్ధతిలో నేను మాట్లాడతాను.. అయినా ఇప్పుడు వాటికంటే నాకు ఇదే ముఖ్యం" అన్నాడు.

"మీ అభిప్రాయాల్లో కొన్ని చర్చకు వదిలేయవచ్చు. కొన్ని పట్టించుకోనవసరం లేదు. అయినా ఇప్పుడు నీవు చెప్తున్న వాటితో సుధాకర్‌కు ఏ అభ్యంతరమేమీ ఉండదు. ఇట్లా మాట్లాడుకుంటే సమస్యలన్నీ తీరుతాయి.." అని సుధాకర్ తరపున తానే భరోసా ఇచ్చింది.

( ఇంకా ఉంది)



**ARUNATARA** A Literary and Cultural Telugu Monthly Journal of Revolutionary Writers' Association

• RNI Regn.No.21152/72 • Published on 03/08/2011 - 286 - May-June 2011



విప్లవ రచయితల సంఘం ఆవిర్భావ దినోత్సవ (జూలై 4) సందర్భంగా

# ముప్ఫై వసంతాల దండకారణ్య ఉద్యమానికి విప్లవ జేజేలు!

**ముప్ఫై వసంతాల దండకారణ్య సాహిత్యోద్యమంపై సదస్సు కార్యక్రమం**

**జూలై 3, 2011, ఆదివారం**

ఉదయం 10 గంటల

నుంచి సాయంత్రం 6 గంటల వరకు

**స్థలం :**

**కామ్రేడ్ ఆర్.ఎస్. రావు వేదిక**

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి,

హైదరాబాద్.

**చరిత్రలో ఆదివాసీ ఉద్యమాలు - దండకారణ్యం**

అధ్యక్షత : వరవరరావు

వక్త : డా. గుంటిరవి

**దండకారణ్య మహిళా ఉద్యమం**

అధ్యక్షత : ఎం. రత్నమాల

వక్త : షోమాసేన్

**భోజన విరామం**

(మధ్యాహ్నం 1.30 నుంచి 2.30 గంటల వరకు)

**దండకారణ్య సాహిత్య, సాంస్కృతికోద్యమం**

అధ్యక్షత : పాణి

వక్త : అల్లం రాజయ్య

**దండకారణ్యంలో ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా**

అధ్యక్షత : జి. కళ్యాణరావు

వక్త : సత్నాం

**అభివృద్ధి నమూనాల సంఘర్షణ - ప్రజలపై యుద్ధం**

అధ్యక్షత : గీతాంజలి

వక్త : ప్రొ. ఎస్. శేషయ్య

**ప్రజాకళామండలిచే**

**సాంస్కృతిక కార్యక్రమాలు ఉంటాయి**

**విప్లవ రచయితల సంఘం**

**ఆంధ్రప్రదేశ్**

నక్సల్బరీ, శ్రీకాకుళాల ప్రేరణతో, సుబ్బారావు పాణిగ్రాహి ఆదర్శంతో 1970 జూలై 4న విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. నక్సల్బరీ, శ్రీకాకుళాలు తమలో ఆవిష్కరించుకున్న మన్నె పోరాటం, అల్లూరి సీతారామరాజు త్యాగం, తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం, దొడ్డి కొమురయ్య త్యాగం వ్యక్తమయిన రోజు జూలై 4.

నక్సల్బరీ పంథాలో విప్లవోద్యమం ఒక ముందడుగు వేసి ప్రజాయుద్ధ పంథాలో ఒక యుద్ధంలో తలమునకలుగా ఉన్న తరుణంలో ఈ జూలై 3న విరసం 41వ ఆవిర్భావ సభ జరుపుకుంటున్నది. ఈ దేశంలోని వనరుల మీద కన్నుతో, ఆ వనరులను కంపెనీలకు కట్టబెట్టే దళారీ ప్రయోజనంతో, ఆ వనరులను దేశ ప్రజల కోసం కాపాడుతున్న ప్రజలపై, శక్తులపై ద్వేషంతో రాజ్యం గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరుతో ఒక యుద్ధం ప్రకటించింది. 2009 నవంబర్ నుంచి దండకారణ్యం కేంద్రంగా అటు తూర్పు భారతం నుంచి మధ్య, దక్షిణ భారతాల వరకు రాజ్యం ఈ దాడిని దురాక్రమణ స్థాయికి పెంచింది. ఒడిలో ఉన్న మనుషులను, ముఖ్యంగా ఆదివాసులను వాటి నుంచి అలీనం చేసి కబళించడానికి భారతాకాశం నిండా ఒక సైనిక చర్య డేగ రెక్కవంటి చీకటి నీడలా పరుచుకున్నది. ఇనుప ముక్కులతో, ఉక్కు గోళ్లతో, రక్త దాహంతో ఆకుపచ్చని జీవన సృజనాత్మకతను, సారాంశాన్ని విధ్వంసం చేయడానికి మానవ రహిత విమానమై ప్రకృతిని, ప్రాణులను లక్ష్యం చేసుకుని విజృంభిస్తూ దురాక్రమిస్తున్నది.

ఎందుకివ్వాళ మళ్లా నిన్న ఒక నక్సల్బరీ, ఒక శ్రీకాకుళం, ఒక వైనాడు వలె వాటి విస్తృతార్థంలో ఒక దండకారణ్యం, ఒక జార్ఖండ్, ఒక లాల్‌ఘడ్, ఒక ఆంధ్ర - ఒడిశా సరిహద్దు ప్రాంతం సంఘర్షణకు సంకేతాలయ్యాయి. ప్రతీకలయ్యాయి.

ఇది అభివృద్ధి నమూనాల మౌలిక సంఘర్షణ. పాలకవర్గాలు పై నుంచి రుద్దుతున్న అభివృద్ధి నమూనాను గడ్డి వేళ్ల స్థాయి నుంచి ప్రతిఘటిస్తూ విప్లవోద్యమ నాయకత్వంలో ప్రజలు ప్రతిపాదిస్తూ, అమలు చేస్తున్న ప్రజా ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా ఇది. ఈ పరస్పర భిన్నమైన అభివృద్ధి నమూనాల గెలుపోటముల మీద దేశ భవిష్యత్తు ఆధారపడి ఉన్నది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అనే బూటకపు ప్రజాస్వామ్యానికి, ప్రజల ప్రజాస్వామ్యమనే నూతన ప్రజాస్వామిక విప్లవానికి బరిగీసి నిలిచి ప్రారంభమైన నక్సల్బరీ పంథా వలెనే - ప్రభుత్వాలు ఎంచుకున్న అభివృద్ధి పథానికి, పోరాట శక్తులు ఎంచుకున్న అభివృద్ధి పథానికి మధ్యన ఒక సంఘర్షణా ప్రయోగంగా ముప్ఫై ఏళ్ల దండకారణ్య విప్లవోద్యమం సాగుతున్నది.

(మిగతా 89వ పేజీలో)

Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Charita Impressions, Azamabad, Hyderabad - 500 020 for Nagendra Printing Press, Vijayawada - 520 002,
Editor : Chalasani Prasad



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M154 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | naima |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |